శ్రీ ర స్తు.

శ్రీవిశ్వేశ్వరాయనమః

# కాశీమజిలీకథలు

## పండ్రెండవ భాగము

ఇది

గోదావరీతీరస్థితంబగు

రాజమహేంద్రవరంబున నివసించియున్న


మధిర-సుబ్బన్న దీక్షితకవిచే


రచియింపఁబడి వారిపుత్రుండు

మధిర కొండయ్యశాస్త్రిచే ప్రచురింపఁబడినది.


మొదటికూర్పు 1000 ప్రతులు.

పోతాప్రగడ శేషగిరిరావు పంతులుగారి శ్రీసుజనరంజనీ

ముద్రాక్షరశాలయందు 44 ఫారముల వఱకును

మిగిలినది శ్రీ లలితాముద్రాక్షరశాలయందు

ముద్రింపబడినది.

రాజమహేంద్రవరము.





1934. దీనివెల రు 1-12-0

# పీఠిక

ఆర్యులారా !

కాశీమజిలీకథలు జగత్ప్రసిద్ధమగుట వానింగూర్చి వ్రాయుట నిరవసరము. ఇవి 12 భాగములుగా విభజింపఁబడినవి. అందు 11 భాగములుమాత్రమే పౌనఃపున్యముగా ముద్రింపఁబడుచుఁ బాఠకుల కానందము గొల్పుచున్నవి.

ఈ 12 వ భాగమున, నస్మత్పితృపాదులగు కీ॥ శే॥ బ్ర॥ శ్రీ మధిర సుబ్బన్నదీక్షితకవిగారు, కథాప్రణాళికను (ప్లాటు)సంగ్రహించి చిత్తువ్రాసి తమనిర్యాణకాలమున నన్నును వారి భాగినేయుఁడగు పీసపాటి వెంకటరమణయ్యను పిలిచి రోగబాధను లక్ష్యముచేయక వారు వ్రాసినచిత్తు కథాప్రణాళికను మాచేచదివించి తదనుసారము పూర్తి చేసి ప్రకటింప నాజ్ఞాపించిరి.

తదనంతరము నస్మత్పితృష్వస్త్రీయుఁడు పీఠికాపుర సంస్థానోద్యోగి యగుటంజేసి తీరిక లేకపోయినను గార్యభారమంతయుఁ దానే వహించి మధ్యమధ్య కలిగినదైవికాంతరాయములను గణింపక కొంతకాలమునకుఁ జాలభాగము గ్రంథముపూర్తిచేసి, 344 పుటలవఱకు అచ్చొత్తింపఁ గలిగితిమి.

ఇట్లుండ దైవానుగ్రహములేక మనీయ దురదృష్టవశంబున।పీసపాటి వెంకటరమణయ్య శ్రీముఖనామసంవత్సరశ్రావణబ॥ సప్తమినాఁడు పరమపదమునొందెను

నిస్సహాయుఁడనైన నేను నావంటివాని కసాధ్యంబయినను నస్మత్పితృపాదుల కరుణావశంబున నేఁటి కీగ్రంథమును బూర్తిచేసి ప్రకటించుభాగ్యము గలిగినది.

శ్రీకాశీవిశ్వేశ్వరుఁడు కీ. శే. పీసపాటి వెంకటరమణయ్యగారి యాత్మకు శాంతినొసంగుగాతమని ప్రార్థించుచున్నాను.

ఇందు బ్రహ్మదత్తవరప్రభావంబున రిపుంజయుడను రాజేంద్రుఁడు భూలోకచక్రవర్తియై కాశీపట్టణంబు రాజధానిగాఁజేసికొని విశ్వేశ్వరాది

దేవతల భూలోకమునుండి వెడలనంపుట, విశ్వేశ్వరుని పరితాపము కాశీ పునఃప్రవేశమునకై విశ్వేశ్వరుని యత్నము కాశీ క్షేత్రమాహాత్మ్యము విశ్వేశ్వరుని మహిమంబును దెలుపు నితిహాసములతోఁ గూడి మనోహారంబుగ వర్ణింపఁబడినది. ఇది యంతయు స్కాందపురాణాంతర్గత కాశీఖండమునుండి గ్రహించి పెంచివ్రాయఁబడినది.

పుండరీకునికథ బాణకవినాఁటి సోఢ్ఢాలకవిక్సృత ఉదయసుందరీకథ నుండి కొన్ని మార్పులతో నాంధ్రీకరింపబడినది. అచటనచట తన్మయత్వంబున రచింపఁబడిన వర్ణనాతిశయమిందుఁ గానవచ్చెడి. ఐనను నీకథచదువరుల హృదయము లాకర్షింపక మానదు. మఱియు నీగ్రంథమందచటనచట హృద్యములైన పూర్వకవి కృతపద్యములు సందర్భానుసారముగాఁ బొందుపఱుపబడినవి. ఇందు మదీయాజ్ఞాన దోషంబున గలిగిన తప్పులన్నియు మన్నింప విజ్ఞులఁ బ్రార్థించుచున్నాను.

ఇట్లు విధేయుఁడు, మధిర కొండయ్య శాస్త్రి.

## కాశీమజిలీకథలు

| | |
|---|---|
| రు. 1—8—0 | 1 భాగము. పరప్రిసాదుల కథగలది. |
| 1—8—0 | 2 భాగము. అదృష్టదీపుని కథగలది. |
| 1—12—0 | 3 భాగము. మందారవల్లి కథగలది. |
| 1—12—0 | 4 భాగము. విజయభాస్కరుని కథగలది. |
| 1—8—0 | 5 భాగము. శంకరుని కథగలది. |
| 1—12—0 | 6 భాగము. భోజుని కథగలది. |
| 1—12—0 | 7 భాగము విభీషణుని కథగలది. |
| 1—12—0 | 8 భాగము. దత్తకాదుల కథగలది. |
| 1—12—0 | 9 భాగము. విక్రమార్కుని కథగలది. |
| 1—12—0 | 10 భాగము. నారదుని కథగలది. |
| 1—12—0 | 11 భాగము. ప్రహ్లాదుని కథగలది. |
| 1—12—0 | 12 భాగము పుండరీకుని కథగలది. |
| 0—12—0 | అనుబంధము (కాదంబరి) |

## గండపెండేర బిరుదాంకితులగు కవిసార్వభౌము

## శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారొసంగిన యభిప్రాయము.

ఈపండ్రెండవ సంపుటమునం దెక్కడనో కొంతభాగము గాక తక్కినదంతయును నాసహాధ్యాయి మధిర సుబ్బన్నదీక్షితకవి పుత్రుఁడు కొండయ్యశాస్త్రి చదివినాకు వినిపించినాఁడు. ఈగ్రంథమంతయు దీక్షితులే వ్రాసియుంచెనని చెప్పుటకన్న పీసపాటి వేంకటరమణయ్యయుఁ గొండయ్యశాస్త్రియుఁ గలసి యక్కడక్కడ కొంతభాగము వ్రాసి చేర్చిరని చెప్పుట సత్యదూరముకాదు. కథాసంవిధానమం దభ్యాసము తక్కువ కలవారైన వీరిద్దఱునుగలసి వ్రాసినభాగములును మనోహరముగానేపడి కవివ్రాయక మ్మతినొందెనను విచారము పాఠకులకుఁ గలుగనీయక, సమంజసముగానే కథను బోషించినవని చెప్పుట యతిశయోక్తికాదు. ఈసంపుటమందుఁ బుండరీకుని కథమిక్కిలి చక్కని యాఖ్యాయికయని పాఠకమహాశయులు గ్రహింపకపోరు. కావున నీసంపుటము లోగడ ముద్రితములైన పదునొకండు సంపుటములకు నింతయుందీసిపోవక వానికన్న మిన్నయనియే పేరుగాంచునని నాయభిప్రాయము. ఇందు గొన్నిస్థలములలో నధికముగా వర్ణనములు చేర్పఁబడినవి. అవిపామర జనులకంతగా రుచింపకపోయినను పండితుల కెంతయు నానందకందము లగునని తలంచుచున్నాను.

రాజమండ్రి.
1–1–1934

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి.



# విషయసూచిక

శ్రీరస్తు.

శుభమస్తు-అవిఘ్నమస్తు.

# కాశీమజిలీకథలు



## పండ్రెండవభాగము

### 301 వ మజిలీ.

క. శ్రీవిశ్వేశా! కాప్యన
గావాసా! వ్యోమకేశ! హైమవతీశా!
భావజనాశా! యీశా!
కైవల్యపురీప్రసిద్ధ కాశీవాసా!

దేవా! అవధరింపు మట్లు మణిసిద్ధ సిద్ధయోగీంద్రచంద్రుండు శిష్యునితో నేకోత్తరత్రిశత తమ నివాసప్రదేశంబు జేరి యందున్న నిర్మలజలాకరంబునఁ గృతస్నాతుండై విధ్యుక్తంబులఁ గ్రమంబున నిర్వర్తించి వంటఁజేసికొని భుజించి తద్భుక్తశేష మంతేవాసికిం బెట్టి యుచితస్థలంబున సుఖోపవిష్టుండై యున్న సమయంబున నగ్గోపాలుండు వానిసన్నిధిం జేరి యడుగులొత్తుచు నిట్లనియె.

గురుప్రవరా! ఈప్రాంతములయందుఁ జూడఁదగినవింత లేమి యున్నట్లు గనంబడవు. పథిశ్రమంబును నధికంబుగాఁ గలిగియుండుటచే దూర మరుగలేకపోతిని. నేఁడు కాశీప్రభావద్యోతకంబగు నితిహాసం బెద్దియేనిఁ జెప్పి నన్ను ధన్యునిం జేయుఁడని ప్రార్థించుటయు నయ్యతి పుంగవుండు మందస్మితసుందరముఖారవిందుఁ డగుచు నిట్లనియె.

వత్సా! కాశీప్రభావం బింతింతని వర్ణింప నిలింప గురునకైన శక్యముగాదు. కైలాస సత్యలోక ప్రముఖ నిఖిలపుణ్యలోకంబులకన్న మిన్నయని గాదే సర్వసుపర్వ సందోహం బీ వారణాసి ననవరత మాశ్రయించియుండు. కైలాసముకన్న నియ్యది కడుపవిత్రమనిసుమీ యా యిందుమౌళి నిజపరివారసమేతుండై యిందు నివసించి విశ్వనాథుం డనఁ బ్రసిద్ధికెక్కియుండెను. వెనుకనొకప్పుడు కొంతకాలము కాశీవాసయోగ్యత తప్పిపోవుటచే దేవతానీక మెంతతల్లడపడెనో యెఱుంగుదువా? మఱియు తత్పురమును దిరుగనాక్రమించుకొనుటకు వారెంత ప్రయత్నించిరో వింటివా? ఇప్పవిత్రప్రదేశంబున వారికెంతయభిమానమో తెలిసికొంటివా? అనియనుటయు నగ్గోపాలుండు విస్మయమందుచు నయ్యగారూ! దేవతలాపురంబు నెందులకువిడువ వలసివచ్చినది? సర్వసమర్థులగువారు నెండియునందుఁ బ్రవేశించుట కేమి యాటంకముగలిగెను? వారు నిక్కమ యలిగిరేని ముల్లోకములు భస్మములగునే! అట్టివారు సామాన్యులవలె నేమిటి కంతతల్లడిల్లిరి. ఇదినాకెంతేని వింతఁగొలుపుచున్నది. ఇందెద్దియోవిశేష ముండకపోదు. నాకావృత్తాంతమంతయుఁ దెల్లముగాఁ జెప్పుఁడని ప్రార్థించిన నమ్మణిసిద్ధుం డిట్లని చెప్పఁదొడంగెను.

## రిపుంజయునికథ

తొల్లి పద్మకల్పంబునందు స్వాయంభువు మనువుకాలంబున ధరిత్రియం దఱువదేండు లనావృష్టి నంభవించినకారణంబున నకలజంతులోకంబు నాకులంబునంది ప్రజాక్షయంబగుచున్న కతంబున యజ్ఞయాగాదికంబు లుత్సాదనమునొందెను. అధ్వరక్రియలు శెడుటవలన క్రతుభుజులకు హవిర్భాగంబులు కఱవయ్యెను. దానం జేసి మానవులకువోలె బుభుక్షాక్షోభంబు సుపర్వలోకంబునకుఁ గూడ సంభవించెను. ఇట్లు మనుజదివిజలోకంబులు వ్యాకులతం బొందుచుండుట

కంభోజాసనుండు చింతాక్రాంతుండై యీయవగ్రహంబుడిపి సకల క్షోణీచక్రంబు రక్షింప దక్షుండగువాఁ డెవ్వఁడోయని యరయు చుండెను.

త్రిలోకసంచారియగు నారదుండొకనాఁడు పితామహునిసన్నిధి కేతెంచుటయు వారిరువురకు నిట్లు సంవాదముజరిగెను.

బ్రహ్మ—వత్సా! నారద! ఈనడుమనెన్నఁడేని భూలోకమున కరిగితివా? అందలివిశేషంబులేమి? అమరలోకవర్తమానంబు లెట్లున్నవి?

నార—వనజసంభవా! ఇఱువదియేండ్లనుండి భూలోకంబు క్షామదేవతచేతఁ బీడింపఁబడుచున్న కారణంబున నందు జన్నంబులన్నమాటయే యెచ్చటను వినిపింపకున్నది. దానంజేసి స్వర్గంబున రంభాసంభోగ వాంఛా సమాగతయాయజూక పరికర వికటప్రకటానేక ముష్టియుద్ధవిశేషంబులు శూన్యంబులైన కతంబున నాకు కలహంపుటోగిరము గఱవయ్యెను. అందువలన నేనెట్లుచిక్కి బక్కవారి యుంటినో గనుంగొనుము.

ఆ. వె. వ్రేలెడేసిలోతు వెళ్లెఁ గన్నులు జూడు
పక్కులన్ని లెక్కఁ బెట్టవచ్చు
గడుపువెన్ను నంటెఁ గాళ్లీడిలంబడె
సమిధవలెను మేను సన్నమయ్యె.

బ్రహ్మ— ఔరా! నారదా! లోకవిశేషంబులం దెలుపుమన్న నీ కలహప్రియత్వంబు దేటపరచెద వేమిటికి?

నార— తండ్రీ! విశేషములకేమున్నది. పుడమిఁ బొడమిన యవగ్రహంబువలనఁ బాడిపంటలు పూర్తిగా నశించెను. మీఁదుమిక్కిలి విషూచి మశూచికాద్యనేక దారుణరోగంబు లుత్పన్నంబులై ప్రజలఁ గోటానుకోటులుగ యమసదనంబునకుఁబంపుచున్నవి. దానం

జేసి యమధర్మరాజునకు గడియమైనఁదీరిక లేక విసిగిపోవుచున్నాఁడు. వానికొలువునఁ గింకరుల సహస్రసంఖ్యాకుల నూతనముగఁ జేర్చికొన వలసివచ్చినదఁట. ఇట్లు కొంతకాల ముపేక్షించినఁ బుడమి నకాల ప్రళయము తప్పక సంభవింపఁగలదు.

బ్రహ్మ—జలాధిదేవతలు వరుణుఁడు నిందు్రండును గదా? వారేలభూమిపై వర్షములగురిపించియీయుపద్రవము నడగింపకుండిరి? వారి ప్రీతికొఱకుఁగూడ పుడమినున్న జన్నిగట్టులు హవిర్భాగముల నొసంగుచుందురుగాదా?

నార—కల్పపంచకంబును కామధేనువును సన్నిధింబడసిన వారి కితరచింత యేమియుండును? ఇదియునుంగాక పైనుండువారుక్రింది వారివిషయమై యాలోచించుట యరుదు. భూతనిర్మాత వగుటంజేసి నీకు తత్క్షేమ మరసికొనుట సహజమగును. పెంచినమొలకను దుంపఁ జూచువాఁడుండఁడుగదా? మఱియును మర్త్యులకు జరుగుచున్న యన్యాయమును గట్టిగా నిందాదుల నడిగినవా రెవ్వరు? మనమందఱము వారిపక్షమే యగుటచే వారికృత్యముదప్పని యెఱింగియును నిర్బంధించి యడుగఁజాలము. మర్త్యులపక్షమున నట్టివాఁడొక్కఁడున్నయెడల మనమెల్లరము డెల్లవోవలసియుండును.

బ్రహ్మ—కావుననే నిఖలధరణీచక్రరక్షణైక ధురంధరుండగు నొడయండుండుట యెల్లవిధములను సమంజసమని తోచుచున్నది. అట్టి వాఁడెవ్వఁడైన నున్నఁ బేర్కొనుము. వానికి భూచక్రంబెల్లఁ బట్ట ముగట్టి ప్రజలక్షేమమునకై నియోగింతము.

నార—లోకములన్నియును వట్టిపోయిన వనుకొంటివా యేమి? మీకట్టి సుభిప్రాయ మున్నయెడల మనువంశ సంభూతుండగు రిపుంజయు నిందులకుఁ బంపరాదా? వాఁడన్నివిధములఁ బుడమిఁ బాలింప సమర్థుఁడు.

బ్రహ్మ — ఔను. చక్కగా జ్ఞప్తికిఁదెచ్చితివి. ఆరిపుంజయుం డౌదార్యశౌర్యధైర్యగాంభీర్యాది సద్గుణగరిష్ఠుండగును. వానియాదల సర్వవసుంధరా భార మిడినఁ దత్ప్రభావ బలవిక్రమంబుల లోకంబు స్వస్థతం బొందఁగలదు.

నార — చండశాసనుండగు వాని కేల్బడి యొసంగినఁ జివురకు మన యందఱకుంగూడ బొమ్మగట్టునేమో యాలోచింపుఁడు.

బ్రహ్మ — సరిసరి. నేను రిపుంజయుని నైజంబెఱుంగనా? దయావినయసత్యశౌచశీలాది యుత్కృష్ట గుణగణవిరాజితుండగు నాతఁడే సర్వవిధముల సర్వంసహాభారధూర్వహుఁడు

నార — అట్లయినమీకు తోచినట్లుచేయుఁడని పలికి బ్రహ్మ యనుమతంబు వడసి యిచ్ఛాగతిం బోయెను.

పిమ్మట రిపుంజయునిఁ బుడమికిరాజుఁజేయ నిశ్చయించి విరించి మించిన యాత్రముతోఁ వానిసన్నిధికఱిగి యతనితోఁ దనయభిప్రాయము నెఱింగించి యందులకు సమ్మతింపుమనికోరెను. రిపుంజయుండును నిటలతటఘటితకరపుటుండై మృదుమధురగంభీరవాక్కుల నక్కమలాసునితో నిట్లనియెను.

దేవా! దేవరయానతి మహాప్రసాదంబని శిరసావహింతునుగాని యన్యథాతలంతునా? సిరిరా మోకాలొడ్డు వాఁడెందైనంగలఁడా? కానియొక్కటికోరుచున్నాను.

చ॥ వసుమతినే భరించి పరిపాలనమున్ బొనరించువేళ న
ప్పసము మదాజ్ఞ వేదపరిపాటి జగంబు దలంపఁగావలెన్
అసమమదీయ విక్రమవిహారమునం దెదురెందులేక న
ల్దెసలయశఃప్రభల్ బరగ దేకువనేఁ జరియింపఁగావలెన్,

మఱియును నరసురగరుడగంధర్వకిన్నర కింపురుషయక్షరాక్షససిద్ధసాధ్యవిద్యాధరాదులయొక్క బలప్రతాపసామర్థ్యంబులునాయం

దిమిడి యుండవలెను. నాయభిమతంబునకు దేవత లెవ్వరునుగూడ మారాడరాదు. ఇట్టి వరంబులు నాకు దయచేసితివేని నీయానతిం బుడమిరెుుడయుడనై యుండెదను. అనిపలికిన వానిమాటల కాకలు ములజవరాలి తొలిపట్టి యనుమతించి మించినసంతసంబున నిట్లనియె.

రిపుంజయా! నీవుకోరినవరంబులన్నియు నొసంగితిని. చతురంభోధిపరీత వసుమతీచక్రంబెల్ల నీకనుసన్నల మెలంగఁగలదు. దివిజులకు హితంబగునట్లునీవిఁక పుడమిం బరిపాలింపుము. దివిజహితంకరుండ వగు నీకిటమీద దివోదాస సమాఖ్య యొప్పియుండును. అనివచించు నవ్విరించి కతండిట్లనియె. దేవోత్తమా! మఱియొకమాటగూడఁగలదు. వినుఁడు!—

చ. సురలదిగాదొ నాకము ? వసుంధరనుండఁ బనేమివారికి క
య్యురగులకై యధోభువనముండఁగ వారును భూవిహారమున్
జరుపఁగనేల ? నాకటుల సమ్మతిగాదిఁక వారువారు స
త్వరమ ధరాతలంబు విడువన్వలయుంజుమ నాదు వేల్పుడిక్.

ఇందులకుఁగూడ నీవంగీకరింతువేని నేనీధరాభారంబు వహింపఁబూనెదను. కాదేని నాకీ నియమరహితంబగు రాజ్యంబుతో, బనిలేదు. అని నిర్భోగమాటంబునఁబలుకు వానిమాటల కాపలుకులయెకిమీఁదులికిపడుచు నిట్లనియె.

భూమియందుఁగల సర్వపుణ్యతీర్థంబులయందును బృందారకసందోహంబుతో నయ్యిందుధర ముకుందముఖ్యులు బ్రఖ్యాతిగ నివసించి యుండిరి. అందు నానందకాననం బనంబరగు కాశియందుఁ బరమానందమున నున్న నంబికానాథునిఁ దక్కుంగల దేవతాసమూహంబుతో వెడలిపొమ్మనిన నుమ్మలికంబు జెందకుందునా? ఇత్తెఱంగెల్ల నా మృత్యుంజయున కెఱింగించి వానినొప్పించుటయుత్తమని చెప్పుచు నప్పుడే వానితో వారణాసికింబోయి యాదేవోత్తమునకావృత్తాంతము

నివేదించెను. ఆమాటలవిని నిటలాక్షుండు కటకటంబడుచుఁ దామర చూలితో నిట్లనియె—

పరమేష్ఠీ! లోకహితంబుపొంటె నీవుచేసిన యేర్పాటునకు నే నెదురాడలేను గాని యీ కాశీక్షేత్రంబును విడచిపెట్టవలయునన్నమాట ములికివలె నాయెడదగాటముగ నాటుచున్నది.

సీ. ధర్మంబు కాశికా స్థానమధ్యంబున
నాల్గు పాదంబుల నడచియాడు
నర్థంబు కాశీపురాంగణంబున యందు
నానా ప్రకారమై నీనుమిగులు
గామంబు కాశికా కటకఘంటా వీథి
గర్వించు రాజ లోకంబు రేవ
మోక్షసంపదలు కాశీక్షేత్రమునయందుఁ
బ్రవ్రితంగంబులై నివ్వటిల్లుఁ

గీ. గాశి కళ్యాణమున కాదికారణంబు
కాశియణిమాది సిద్ధుల కట్టుపట్టు
కాశి జనలోక సంకల్ప కల్పవల్లి
కలుష పిశితంబు మెసవు రాకాసికాశి.

సీ. ఉర్వీధరశ్రేణు లుజ్జాతలూగంగ
నేఁడు గాడ్పులు వీచు నెన్నఁడేని
చండభానుండు పండ్రెండు మూర్తులుదాల్చి
యెసఁగి యెండలు గాయు నెన్నఁడేని
పుష్కలావర్త కాంభోధరవ్రాతంబు
లెలగోలు వర్షించు నెన్నఁడేని
భూర్భువ స్వర్లోకములు ముంచి జలరాసు
లేకోదకముజూపు నెన్నఁడేని

గీ. యెన్నఁడే నుండుగాలంబు మిన్నదిక్కు
భూతములుగ్రాలు నెన్నఁడేఁ బుట్టినిండ్ల
నపుడు వారాణసీ క్షేత్రమైదు క్రోసు
లంతమేర యుపద్రవం బందకుండు.

అట్టి కాశీక్షేత్రంబును విడచి, భాగీరథీపుణ్యస్రవంతికా నిర్మల వారిశీకర ప్రసారశీతలవాతపోతంబుల సుఖంబుమరచి యనవరతమో క్షదిదృక్షాగత భక్తసందోహ సమర్పితస్తుతిపూర్వక వందనచందనా నులేపనోపహార సముయోగతానందంబెల్లఁ బోద్రోచి, సర్వభోగం బులఁద్యజించి, యెచ్చటనో తలఁదాచుకొనవలెనన్న గష్టము గాకుండు నా? కాని లోకసంరక్షణార్థము నీవునిర్ణయించినదాసిని మేమును మ న్నింపవలయుఁ గావున నీయిచ్చవచ్చినమచ్చున నొసరింపుము. దివో దాసుని భూరాజ్యపట్టభద్రునిగాఁ జేయుము. వానికోరికవడువున నేను సపరి వారంబుగ నెందేనిఁ బోయెదంగాకయని యమ్మహాదేవుండాన తిచ్చుటయు మనంబున సంతసించి యవ్విరించి దివోదాసుని సర్వవసుం ధరా చక్రంబున కేలికఁగా నియమించి నిజనివాసంబున కఱిగె.

302 వ మజిలీ.

## —: దివోదాసుని కథ :—

అంత దివోదాసుండు మహావైభవంబున ధరారాజ్యాభిషిక్తుం డై కాశీపురంబు నిజరాజధానిఁగాఁ జేసికొని ప్రజాసంరక్షణైక దక్షుం డై యుండెను. మఱియును:—

శా. చాటించెన్ మనువంశవర్ధనుఁడు విశ్వక్షోణిఁ గ్షనందందక్షుం
టాటంకారము దుందుభిధ్వనియుఁగూడన్ వేగమై దేవతా
కోటుల్మేదిని నున్నఁదప్పగుఁజుఁడో ! కోపంబుపాపం బుపా,
త్తాటోపంబుమెయిం గుటుంబ సహితంబై చేరుఁడోనాకమున్.

క. పాతాళమునకు జనరో
వాతాశను లెచటికేని వలసినయెడఁగుఁ
భూతము లేగరాయని య
త్యాతతగతిఁ జాటిరవని నధిపతి దూతల్.

ఇవ్విధంబున భూతలంబునం గల సకలపుణ్యక్షేత్రంబుల యందుఁ జాటింపు చేయించినతోడనే బ్రహ్మాదత్తవరప్రభావంబునఁ గాశీ గయా, ప్రయాగ, జగన్నాథ, సింహాచల, పట్టిసాచల, భద్రాచల, వేంకటాచల శ్రీశైల శ్రీకూర్మ శ్రీరంగ కుంభకోణకంచికాళహస్తిరామేశ్వరాది దివ్యస్థలంబుల నధివసించియున్న సకలదేవతాసమూహంబును కుటుంబ పరివార సమేతంబుగా వెడలివచ్చి విశ్వేశ్వరా దేశంబున నెందేనిఁబోవువారై యమ్మహాదేవునిఁ గాశియందుఁ దర్శించిరి. ఆ దేవోత్తముండునుఁ దనకింక వారణాసీ నివాసయోగ్యత లేదని యెంచి తన్మూర్తితొల్లి తద్దయుం బెద్దతపంబు జేసిన మందరాచల శిఖరప్రదేశంబున నుండుటకు నిశ్చయించి వచ్చినవేలుపులమూకల కెటింగించి నందీశ్వర చండీశ్వర భృంగీశ్వరాదులు దన్నుఁబరివేష్టించియుండఁ బ్రమథగణంబులతో నంబికాసహితుఁడై యందుఁగదలెను. ఇట్లు దేవతా సమూహంబుతో విశ్వనాథుం డయ్యవిముక్త క్షేత్రంబువిడచి.

సీ. లవణ పాథోధి వేలా వేష్టితంబైన
యల్లో నేరెడుదీవి యతికరించి
యిక్షురసాబ్ధి పరీతాంచలంబైన
ప్లక్షాంఘ్రిపద్వీప పరిధిఁగడచి
హాలారసోదన్వదభి ముద్రితంబైన
శాల్మల ద్వీప భూస్థలముఁ దాటి
ఘృతపయోరాశి సంక్లిప్తావధికమైన
చంచత్కుశద్వీప జగతిఁ జేరి

గీ. ఆమ్మహాద్వీపమునకు రత్నాఢ్యమైన
మకుటమునుబోలె నొప్పారు మందరమునఁ
గనక కలధౌత మాణిక్య కందరమునఁ
గాపురమునేసె శివుఁడంబికయునుఁ దాను.

దివోదాసుని శాసనభయంబున సరీసృపకులంబెల్ల భూభాగం బున నుండఁజాలక యధోలోకంబున కేగవలసివచ్చినది. పుట్టలలోఁగు ట్టలలో దొరువులలో డొంకలలో పురవనతరుశైలంబుల మూలమూ లలనున్న కాద్రవేయసమవాయంబు సమధిక వేగంబున నొండొరుల బిలిచికొనుచు, పడగలమొగిడ్చుచు, పుచ్ఛంబులప్పళించుచుఁ జుట్టలు జుట్టుకొని తండోపతండంబులుగా భూవివరంబుల మూలంబున గసాత లంబునంబడి తమపాటు వాసుకిప్రముఖనిఖలవాతాళన శ్రేష్ఠులకెఱిం గించుకొనినవి. ధరణీతలంబున నురగులజాతులు శూన్యంబగుటచే జం తుజాలంబు నందపమృత్యుభయంబు గొంతవఱకుఁదగ్గినది.

దివోదాసుండును నాత్మీయబలపరాభావంబులఁ బర్జన్యునివర్షిం చునటుల శాసించుటయుఁనతండుక్రమంబున సర్వసస్యానుకూలముగా భూలోకంబునవర్షించుచుండెను. దానంజేసి నదనదీకేదారవాపీ కూపత టాకంబులు జలసమృద్ధింగలిగియొప్పినవి. కర్షకుల కనంతశ్రీయనంతఫలం బొసఁగుచుండెను. పశువులకు స్వేచ్ఛగా కసవులభించుటంజేసి ప్రజల కమృతముగురియుచుండెను. సంతృప్తి సంతోషసౌఖ్యములు బ్రతి యింటను దాండవమాడుచుండెను. ఇట్లు తృణకాష్ఠఁజలసమృద్ధిఁగలిగి గ్రాసవాసో వైభవంబుల కింతయుఁ గొరంతలేకుండ భూప్రజలు దివో దాసుని రాజ్యంబునఁజెలంగియుండిరి.

క. చాతుర్వర్ణ్యములోనరఁగ
ఖ్యాతింజతురాశ్రమార్హ ఘనధర్మోద్య

దీక్షితులఁ బ్రదప్పక తమతమ
నీతంబుల మెలఁగుచుండె నిత్యము బ్రీతిన్.

మఱియును జారచోర శౌమన్యపాగ్నిరుజావగ్రహాపమృత్యు భయంబులు దివోదాసునిరాజ్యమునం దెందునులేక ప్రజలకు శ్రీరామ రాజ్యంబువోలె నొప్పియుండెను. భూసురులు భాసురవేదాధ్యయనసం పన్నులై రాజునానతి నదేవతా కంబులుగ నధ్వరంబు లనేకంబు లొనర్చుచు రాజునకు రాష్ట్రమునకు ననవరతశుభోదర్కం బొదవునట్లు మెలఁగుచుండిరి. రాజులు, రాజులై నిజబలప్రతాపజ్యోత్స్నాసముద యంబులు దుర్జనహృదయనాళీకవిద్వేషణంబులుగా సజ్జనచకోరహృద యాహ్లాదకరంబులుగాఁ జరించుచుండిరి. బేరులు కుబేరుఁ బేరుతోనే ధిక్కరించుచు ధనకనకవస్తువాహన సంపన్నులై యర్థిజనకల్పకంబులై డంబుమీరియుండిరి. కృషకు లార్యసేవాతృషితులై పుడమి ముక్కారుపంటలం బండించుచు సర్వజీవ ప్రమోదకారణులై చెలఁగియుండిరి

ఇట్లు ప్రజారంజకుండై ధర్మంబు నాలుగు పాదంబుల వర్తిం చుచుండ ధరణీచక్రంబవక్రవిక్రమంబున దివోదాసుండు పరిపాలించు చు నొక్కనాఁడు పేరోలగంబుననున్న సమయంబునఁ గొందఱు వనాటు లరుదెంచి తాము తెచ్చిన వన్యవస్తుసందోహంబులఁ గాను కలుగా నాపరివృఢుని మ్రోలంబెట్టి జోహారు లొనరించుచు నిట్లు విన్నవించుకొనిరి.

ఏలికా! మేము వింధ్యారణ్యవాసులము. ఏలినవారి దాసు లము. దేవర పరిపాలనంబున నెందును బన్నగ బాధ లేకుండ నాజాతి నంతయును బాతాళంబునకుఁ ద్రోయుటం జేసి యరణ్య జీవనులమైన మేము కటికచీకటియందైనను పురుగు బాధనెఱుంగక నిర్భయముగాఁ దిరుగుచుంటిమి. కాని మొన్న మాపిన్నిగారి కన్నిగాఁడొకఁడు కట్టె లకై మిత్రులతో దూరముగానున్న మెట్టదరి కేగి యందొకమూల

నున్న పెద్దపుట్టలో నొక నాగుబాముం జూచెనఁట. వాఁడూరకొనక యాపుట్ట సతిశీఘ్రమంబునం దవ్వి యందుఁ జుట్టఁ జుట్టుకొని యున్న యాపన్నగమును గ్రన్నన తనయొద్దనున్న గొడ్డలితోఁ జావఁ గొట్టెను. పిమ్మటనది చచ్చినదని నిశ్చయించి యాకొండిక వింతగాఁ దాని తోకపట్టుకొని పైకెత్తి యాడింపసాగెనఁట. ఇట్లాడించు చుండఁగనే యాపాపజేఁడు పైకితిరిగి వానిచేతిమీఁదఁ బెద్దకాటువేసెను. దానితో వాఁడమ్మోయని యఱచుచు నేలంబడి విలవిలం దన్నుకొనుచు జీవనములఁ బాసెను. పట్టువదలిన నాగము మెల్లఁగాఁ గొండొక కలుగులో దూఱి మాయమాయెను. చేరువనున్న బాలకు లాక్రోశించుచు నిండ్లకేతెంచి యావృత్తాంతమంతయు మాకెఱింగించిరి. మేమును బడితెలు బల్లెములు మొదలగు సాధనములతో నాప్రాంతముల కరిగి యాపురువుం బట్టుకొనవలెనని యెంతప్రయత్నించినను నదికనంబడినది కాదు. బాబూ! మాపిన్నవాని పాలిటికది మృత్యువు వలెవచ్చి మాయమైనది. నీయేల్బడియందిట్టి యన్యాయ మెందును గనివిని యెఱుంగము. మేమెన్ని మంత్రతంత్రంబు లుపయోగించినను గార్యము లేకపోయినది. మాపిల్లవానిని బ్రతికించి మాకిచ్చుటకు న్యాయపరిపాలకుఁడవగు నీదియేభారము. నీయాజ్ఞయగునఱకు నాబాలకునిశవమందే యొకచోఁ బెట్టి పలువురఁ గాపుంచి వచ్చితిమి.

అని వారుచెప్పినతోడనే దివోదాసుండు క్రోధతామ్రాక్షుఁడై యాహుంకరించుచు నేమేమి! నాయాజ్ఞల దిరస్కరించి వంచనమై మేదినినుండుటయే గాక యాపాపపుఁబురుగు మానిసిబుడుతంగూడఁ గఱువ సాహసించెఁగా! పదుఁడు, పదుఁడు, నేనిదే మీవెంట వచ్చి యాచిలువ నెందున్నఁ బట్టి చిదుగఁ గొట్టి మీపట్టికిఁ దగిన ప్రతీకారమొనరించి యిచ్చెదంగాక. అని యాజేఁడు మిగులవేగముగల తత్తడినాయత్తపఱపించి దాని నెక్కి కతిపయ సేవక సమూహము వెం

టరా నమ్మన్నెకాండ్రతో నటఁగదలి క్రమంబున నమ్మహారణ్యంబు జేరెను.

పిమ్మట నందామృతబాలకకళేబర మెందున్నదో చూపుఁడని యబ్బోయల నారాజేంద్రుఁడడుగుటయు నచ్చో గాపున్నవాండ్రు చేతులు నలుపుకొనుచు దేవరా! ఏమని చెప్పుదుము. ఇంతవింత మే మెందును వినలేదు. మాచే సంరక్షింపఁబడుచున్న యాశవ మేమైనదో మాకుఁ దెలియుటలేదు. దానిచుట్టును మేమతి జాగరూకతతోఁ గాపుంటిమి. ఉన్నట్లేయుండి యదిమాయమైనది. అదియీవిధముగాఁ బోయినదని చెప్పఁ జాలకున్నాము. ఘాతుకమృగ మేదియైనఁ గొని పోయినదనుట కట్టిగుర్తులేమియును గానరావు. పైవారెవరును వచ్చిన జాడ గనంబడదు. ఇదియింద్రజాలమువలె నున్నది. అని దీనాననులై విన్నవించు నాయాటవికుల ననునయించుచు రాజేంద్రుఁ డిట్లనియె:

శబరులారా! వెఱువకుఁడు. ఇదియంతయును నురగుల కఱటితనమున వచ్చినది. మీబాలకళేబరంబును గుప్తపఱచినది గూడ నాగకులంబే కావచ్చును. తమ యవినయకృత్యంబును గప్పిపుచ్చుట కట్లుచేసియుందురు. ఏదియెట్లయిననేమి? ఆబాలఘాతకు నెందున్నను బట్టి మట్టుబెట్టి మీపట్టిని బ్రతికించి మీకిచ్చెదంగాక. మారాజ్యంబున నిట్టియక్రమంబు జరుగ నేసహింపఁజాలను. అని నుడువుచు మఱియు నిట్లనియె.

ఓరీ! ఆపాపపుచిలువ బాలునింగఱచి యెందేగెనో చూచితిరా యని యడుగుటయు వారు చేతులు మోడ్చుచు నదిగో యెదురంగనంబడు పుట్టకలుగులోనికిఁ బోవుచుండ మేము గన్నులారం జూచితి మని చెప్పిరి. అప్పుడే రాజు తద్వల్మీకంబును పరివ్వించిచూడ నం దొకమహాతపస్వి యత్యద్భుతతేజోదుర్నిరీక్ష్యుండై నిమీలితాక్షుండై సిద్ధాసనంబున నిర్వికల్పకసమాధినిష్ఠాగరిష్ఠుండై చూపట్టెను.

వానింజూచి యెల్లరువిస్మయసాధ్వసములంబొందిరి. అపుడమితేఁడు వేడుకగా నాజడదారింజూచుచు చిడిముడిపాటించుకయును లేక వాని యడుగులంబడి నమస్కరించువాఁడువలె క్రిందకువంగి చేతులుసాచి తత్పదద్వయంబు గ్రహించిమించిన తమకంబున బిఱబిఱముందునకీడ్చుచు మ్రుచ్చా! నీమాయవేషంబు లిఁకజాలింపు మనిపలుకుచు మహాక్రోధంబునఁ దచ్ఛిరంబునేలంబెట్టికొట్టెను. తోడనేయాజటిలుని రూపంబంతర్థానమై కన్నులకుమిరుమిట్లు గొలుపునత్యద్భుతతేజంబొండు వెల్వడి నిముసములో నదృశ్యమయ్యెను.

అమ్మహారాజు వెఱపిం దమకయుంబొందక నలుమూలలం బరికింపుచుండ నంబరంబున నొకవింతశకుంతంబు గోచరమయ్యెను. దాని నుపలక్షించి యాక్షితీశ్వరుండు పోకు పోకు మనియదలించుచుఁ జంద్రహాసంబు గైకొని యోగమార్గంబునఁ బైకెగసి దానిందరుముకొనిపోయెను. క్రిందనున్నవారు వానికొఱ కాదినసాంతమువఱకు నిరీక్షించియుండిరిగాని వానిజాడయేమియుఁ బొడకట్టనందునఁ బ్రిక్కనున్న తమపల్లెకుంబోయిరి. రాజసేవకులును మఱికొన్ని దినంబులందుండి యొడయని వర్తమాన మేమియుందెలియనందున నిరువుర మాత్రమందుగాపుంచి తక్కినవారెల్ల వారణాసికింబోయిప్రధానులకావృత్తాంతమంతయు నివేదించిరి. రాజుగారి క్షేమమరయఁ బెక్కండ్రుదూతల వివిధప్రాంతములకుఁ బంపించి మంత్రులు రాచకార్యములన్నియును దివోదాసునిపేరున నిర్వర్తించుచుండిరి.

310వ మజిలీ.

# అనంగమోహినికథ

నాగలోకంబున నొకభాగమునకు నాయకుండై వాసుకియను సర్పశ్రేష్ఠుండు పరిపాలించుచుండెను. అతనికి అనంగమోహినియను

పుత్రికారత్నంబుగలదు. అబ్బాలికా చూళికాభరణ రూపలావణ్యాతిశయంబుల ముల్లోకములంగల సీమంతినీరత్నంబులం దిరస్కరించుచుండెను. చక్కఁదనంబునకెల్ల నా నాగకన్యకారూపము పరమావధియని, చెప్పిన నామె యవయవసౌష్ఠవంబిట్టిదని వర్ణింప నగశక్యముం డదు. ఆమె యసామాన్యసౌందర్యవైభవంబు నాగలోకంబుననే గాక చతుర్దశభువనములయందలి యౌవనపురుషులకు హృదయాకర్షకంబై యుండెను.

ఆమోహనాంగిం జేపట్ట దేవతలుం గూడ నుత్సుకతం బొందుచుండిరి. కాని మధ్యనున్న భూలోకమునుదాటి నాగలోకమునకేగుటకు దివోదాసుని శాసన మనతిక్రమణీయమై యడ్డువచ్చెను. దానంజేసి యూర్ధ్వలోకములవారికి నధోలోకములవారికిని రాకపోకలు లేకపోయినవి. పాతాళంబున నున్న పురుషుల నందఱం ద్రోసిరాజని యారాజాస్య లోకాంతరస్థానురూపప్రియసమాగమాకాంక్షం బ్రొదు వుచ్చుచున్నది.

ఒకనాఁడబ్బిబ్బోకవతి యుచితసఖీజనంబుతోఁ బ్రాంతకేళికోద్యానమునందు విలాసవిహార మొనరించుచునప్పుడు తఱినెఱింగి రొక్క రక్కసుం డెక్కడనుండియో రయంబున నక్కడకువచ్చి యచ్చపలాక్షి నెత్తుకొని పారిపోయెను. ఆవార్త చెలికత్తెయలవలనవిని వాసుకిశోకమూర్ఛితుండై యాప్తుల యనునయవాక్యంబుల దెప్పిరిలి తనూజాతాన్వేషణంబునకై యపరిమిత సేవక సమూహంబును నతల వితల రసాతల తలాతల పాతాళాది వివిధాధోలోకంబులకుఁ బంపెను. కాని యాకోక స్తని యునికియెచ్చటను గనుపింపదయ్యెను. ఊర్ధ్వలోకంబులకేగి యందన్వేషించుటకు దివోదాసుని శాసనము పెను గొండవలె నడ్డుదవులుచున్నది. మనుజలోకంబునకు నాగలోకవాసులు బోరాదుగదా ? అదిదాటినఁగాని దివిజలోకంబుల

కడుగుటకెట్లు వీలగును. ఒకవంక పుత్రికావియోగశోకం బొకవైపు మర్త్యలోకప్రవేశాభ్యంతర ప్రకటితావిలంఘ్యశాసనభయం బొక మూలదారుణావమానజనితచింతాసముజ్జ్వలజ్వాలాభీలకీలావిలోలహృదయతాపం బిట్లు వాసుకి శోకభయవిహ్వలవేదనా దోధూయమాన మానసుండై కర్తవ్యాకర్తవ్యంబు లెఱుంగక కులముపెద్దయగు నాదిశేషునియొద్దకఱిగి యక్కథ నెఱింగించి తనతనూజాతను రక్షించుట కుపాయము చెప్పుమని మిక్కిలి దీనుఁడై ప్రార్థించెను.

అయ్యుదంతంబువిని శేషాహి నిజసహస్రఫణామండితమణిఘృణులు దెసలవ్యాపింప శిరఃకంపమొనర్చుచు నేమేమీ! మ్రుక్కడి రక్కసుండొక్కరుండుక్కుమిగిలి నాగకన్యలలాగును బలవంతముగా నెత్తుకొనిపోయెనా? ఔరా! ఎంతనిర్భయప్రవర్తనము! వాఁడత్తలో దరినిఁదప్పక మనుజలోకంబునకే కొనిపోయియుండును. శాసనభయంబున నందురగలోకవాసులు చేరరారుగదా యని యట్లొనరించియుండును. ఇందులకు తగిన ప్రతీకార మతిశీఘ్రముగాఁ జేయకున్న వాని వలన నాకన్యక కేమికీడుమూడునోగదా? ఈవృత్తాంత మంతయును నిచ్చట నివసించియున్న బలిచక్రవర్తికిని వానితలవాకిలిఁ గాచియుండుగరుడవాహానునకు నెఱింగించి వారియాదేశమువడువున వర్తింతము రమ్మనిచెప్పుచు వానివెంటఁబెట్టుకొని బలిదైత్యేంద్రు నివాసంబున కఱిగెను.

శేషవాసుకులట్లు పోయి బలిదైత్యేంద్రునగరి మొగసాలఁ గావున్నదైత్యాంతకునింగాంచి వానిపాదంబులంబడి తమయిక్కట్టు విన్నవించి రక్షింపవే యని ప్రార్థించుటయు నప్పార్థసారథి యేమియు నుత్తరంబొసఁగక హస్తవిన్యాసంబున బలికెఱింగించుకొనుఁడని సూచించెను. తదాదేశంబున వారు లోనికిం బోయి యా దానవేశ్వరుని యెదురసాగిలి మ్రొక్కుచుఁ దమయుదంతంబంతయు నెఱింగించిరయా [illegible] గాపాడుమని వేడుకొనిరి.

వారి దీనాలాపముల నాలకించి యాదానవ సార్వభౌముండు రోషవిషాదంబులు మొగంబునందోప నౌరా! ఈముక్కిడిరక్కసుల దుండుడుకు చేష్టలకంతములేకున్నదిగదా? నేనెన్నివిధముల వారిని మంచి మార్గమునఁ బెట్టఁ బ్రయత్నించుచున్నను వారుసహజంబగు దుష్టస్వభావమును విడువఁజాలకున్నారు. ఇట్టిదుండగీండ్ర కతంబుననే మత్కులంబునకంతకును నపఖ్యాతి గలుగుచున్నది. వీండ్ర నుపేక్షింపరాదు. వాసుకి పుత్రికారత్నమును బలిమిమై నపహరించిన యా పాపాత్ము నెఱింగి తగినరీతి శిక్షించెదఁగాక. అని పలుకుచుండఁగనే కొందఱు సేవకులరుదెంచి బలిచక్రవర్తికి నమస్కరించుచు నిట్లని విన్నవించిరి.

రాక్షసేశ్వరా! నేఁడు ప్రభువువారి కేళీసౌధంబున మీఁది యంతస్థునందు పైనుండి గుభేలుమనుశబ్దంబుతో నొకరాకాసిశవంబు బడినది. తత్పతనధ్వనివలన నందున్న మేమెల్లరము నిర్ఘాంతపడితిమి పిమ్మట విమర్శింప నది కుంభుఁడనుదైత్యునిశరీరమని తెలిసికొంటిమి వాఁడెట్లువచ్చి యచ్చటపడెనో మాకు వింతఁగొలుపుచుండెను. వాని శరీరంబుగత్తినఱకులు వేనవేలుగఁగలిగి రక్తసిక్తమైయుండెను. దీనిని విమర్శింప దేవరయే కర్తలని పలికి యూరకుండిరి.

ఆమాటలువిని యాదనుజవల్లభుండు మిక్కిలి యక్కజంపడుచు శేషవాసుకులతో నారక్కసి పడినచోటికి సేవకులు మార్గముచూపుచుండ బోయి వానియవయవంబులఁ బరీక్షించెను. వాని యాకారమును జూచి యెల్లరును భయవిస్మయావేశ హృదయులైరి.

కుంభుని శరీరమునందలి గాయములనుండి స్రవించురక్తధారలంగాంచి వాఁడు మృతిఁజెంది యుండలేదని తలంచుచు బలిచక్రవర్తి నరీసృప కులనాయకులతో నావిషయమే ముచ్చటించుచుండఁ గొంత సేపటికి కుంభునకుఁ జైతన్యము గలుగుచున్నట్లు కనిపించినది. ఇంక

గొంత నేపటికి వానిమూల్గులు వినంబడినవి. మఱికొంత నేపటికి నేమేమో గొణుగుకొనుచున్నట్లు తోచినది. అటుపిమ్మటఁ గొంత నేపటికి వాఁడుభీకరముగా నిలునిలు దురాత్మా! ఈదెబ్బతో నీశిరంబు పగులఁగలదని యఱచుచు లేవంబోయి క్రిందఁబడి తిరుగ గాఢమగు మూర్ఛలో మునిఁగెను. వెంటనే దైత్యేంద్రుఁడు పలువుర పరిచారకుల రప్పించి వానిని చికిత్సాలయమునకుం బంపి యందుఁ గొందఱ నుపచారములొనర్ప నియమించెను. ఆ దానవుం డెవ్వనిచేతనో తీవ్రమగు గాయములనంది మూర్ఛబడియుండె ననియును వానికి స్వస్థతగలిగినపిదప వాని వృత్తాంతము వినవచ్చుననియు,కుతూహలపడుచు శేషవాసుకులతో మఱియు నిట్లనియె,

మిత్రులారా! వీఁడు సౌభాగ్యమునఁ బడుటచే నీలోకమునకు మీఁదుగానున్న భూతలమునుండియే యిందు పడినట్లు తెల్లమగుచున్నది. పాతాళవాసులు మర్త్యలోకమున కేగ బహిష్కరింపఁ బడినప్పుడు వీఁడచ్చటి కేగుట కెద్దియో చెడ్డపనియే మూలమని తోచుచున్నది. వాసుకి తనయును రక్షింపఁడేగదా యపహరించుకొనిపోయెను. అయ్యబలను దుష్టబుద్ధియై వీఁడు మనుజలోకమునకుఁ గొనిపోయి యందు పరాభవింపఁబడి యుండిన నుండవచ్చును వీనికించుక స్పృహ గలిగినతోడనే వీనివలన విశేషము తెలియంగవచ్చును. అంతదనుక మీరిందేయుండుడని చెప్పి శేషవాసుకులఁ దనయింట నాపుజేసెను. కుంభుని వర్తమాన మెప్పటికప్పుడు వచ్చి తనకుఁ జెప్పుచుండుటకుఁ దగినవారి నియోగించి యాదైత్యేంద్రుండు మిత్రులతో నిష్టగోష్ఠీ వినోదంబులఁ గాలముఁ గడపుచు వారికించుక మనశ్శాంతిని గలుగఁజేయుచుండెను.

---

## 304 వ మజిలీ

## —: మణిగ్రీవ జలంధరుల కథ :—

లకాపురంబున గుబేరుని సన్నిహితుండైన చిత్రకేతునకు మణిగ్రీవుండను కుమారుండును గుణవతియను పుత్రికయును గలరు. మణిగ్రీవుండు చిన్ననాఁటగోలె యౌవనమోహాంకారగర్వభూయిష్ఠుండై తల్లిదండ్రులమాట వినక విలాసంబుగాఁ గాలంబు గడుపుచుండెను. వానికి జలంధరుండను నాంతరంగిక సచివుండుగలఁడు. వారిరువురు నాహార శయ్యా విహారములయందు నేకదేహ మెట్టట్ల వర్తించుచు నత్యంత మైత్రితోఁ జెలంగియుండిరి. ఇర్వురకు హేమావతియను నొక్కయచ్చరలేమ భోగభామినియై యుండెను. ఆసచివద్వయం బాయచ్చరమచ్చకంటితో ముచ్చటగా సంతతక్రీడావినోదంబులఁ బ్రొద్దుపుచ్చుచుఁ దరుచు విమానయానంబున లోకాంతరంబుల కఱిగి యందందుఁగల సుందరశైలశిఖరంబుల విలాసవిహారంబు లొనరించుచుందురు.

వారొకనాఁడు దివోదాసుని శాసనమును మన్నింపక భూలోకంబున కఱిగి యందు శీతశైలశిఖరంబునఁ గ్రీడింపసాగిరి.

సీ॥ ఒకకేలు నొకఁడు మరొక్కఁడింకొకకేలు
బట్టి ప్రేయసితోడఁ బరిఢవించి.
పూగుత్తులం దెచ్చి పొలఁతికిచ్చి యొకండు
గై నేసి యొకఁడు రాగంబుదెలిపి
ఒకఁడుకపోలంబు లొకఁడునెమ్మోమును
సపరించి యతివ కిష్టంబు సూపి
తమినొక్కఁడతివఁబెద్దగఁ గౌగలించి యిం
కొకఁడుముద్దుంగొని యుబ్బుజెంది

గీ॥ మిత్రులిద్దరు ప్రియసఖిమీఁది ప్రేమ
నెమ్మనమునంబునకు గాఢతమముగాఁగ
స్వేచ్ఛ నాహేమ భూధరసీమలందు
బహువిలాస విహారముల్ బరపిరొకట॥

మ॥ ఫలపుష్పంబుల గోసియిచ్చు నొకఁడప్పాటన్ బ్రకాశించు వృ
క్షలతాదుల్ వివరించు నొక్కఁడట సుశ్రావ్యంబుగాఁ బాడు ప
క్షుల సాధుధ్వనులెల్ల నెన్ను నొకఁడస్తోకంబుగాఁ దెల్పు ని
ర్మలకాసారవిశేషముల్ సతికి ప్రేమంబొప్ప నొక్కండటన్॥

ఇట్లు స్వచ్ఛందగతిని విహరించుచున్న సమయంబున వారికి దూరంబున వీరాలాపంబులసందడి కొంత వినంబడెను. దానికి వారు వెఱఁగందుచు దక్షిణము విమానమెక్కి యాచక్కికిం బోయిరి. అందొక చక్కనిచక్కెరబోణి భయవిహ్వల శోకరసంబులు మొగంబునం దోప దూరంబుననుండి యిరువురుపురుషుల కయ్యమీక్షించుచున్నది. ఆయన్నుమిన్నం జూచిన తోడనే మణిగ్రీవుఁడు పంచశర శరావిద్ధహృదయుండై యన్యమెఱుంగకుండెను. జలంధరుండును మోహమూర్ఛితుండయ్యెను. అయ్యచ్చర మచ్చరముతో నాయబల యంగసౌష్ఠవ మీక్షించుచుండెను.

ఇంతలో ద్వంద్వయుద్ధమొనరించు పురుషులిద్దరిలో నొకనికిఁ దీవ్రమగుగాయములు దగులుటం జేసి సొమ్మసిల్లి నేలకొఱగెను. జయశీలుండగు పురుషసింహుఁడు క్రిందఁబడినవానిని రెండుచేతులతోఁ బైకెత్తి యందున్న గుహాముఖంబున విసరివైచెను. తద్బిలము పాతాళమువఱకు వ్యాపించియున్నది. అతిజవంబున విసరఁబడుటచే వాని కళేబరంబు బిలముతోవను దిన్నగా రసాతలంబున బలిచక్రవర్తి కేళీసౌధంబునఁ బడినది.

ఇచ్చట యుద్ధమీక్షించుచున్న లోలాక్షి సత్వరము యజ్ఞయశీలునిపాదంబులంబడి పురుషప్రవరా! యుష్మద్బలప్రతాప శౌర్య సాహసంబులు వర్ణనాతీతంబులు. ఆముక్కిడిరక్కసు నవలీల నిర్జించి నన్ను రక్షించిన మీయవ్యాజకరుణాకటాక్షంబులకు నిరంతరము కృతజ్ఞురాలను. భవదీయ సుందర ముఖారవిందసందర్శన మాత్రంబుననే మదీయ మనోగత దుఃఖోపతాపంబు పటాపంచలయ్యెను. మీరూపంబు కంతువసంతజయంతాదుల నధికరించి త్రిలోక మోహజనకంబై యున్నది. అనురూపవర సమాగమాకాంక్షితురాలనై యున్న నన్నీ నక్తంచరుం డిచ్చటికి తెచ్చి నాకెంతేని యుపకార మొనర్చెను. త్రికరణంబుల మిమ్మేప్రాణేశ్వరునిఁగాఁ గోరుచున్నాను. నన్ను మీ పాదసేవకురాలిగా స్వీకరించి కృతార్థురాలిఁ జేయుఁడని ప్రార్థించుచున్న యాయన్నుమిన్న కా పురుషపుంగవుండు మందహాసభాసురముఖారవిందుఁడై యిట్లనియె.

మదవతీ! నీసౌందర్యమెంతఁ జూచినను తనివితీరనిదిగా నుండెను. నీలావణ్యము హృదయాకర్షకంబుగా నొప్పెను. నీవచోవైఖరి సుధా మధురమై చెలంగెను. నీవాలుచూపులు మారునిచేతితూపులై మనోహరములయ్యెను. ఇట్టి త్రిలోకైకసుందరి తనకుదా వరించుచుండ నంగీకరింపని మందమతి యెవ్వఁడైననుండునా? కాని నేనిపుడొక కార్యదీక్షయందున్న వాఁడను. అయ్యది నెరవేర్చి నీయభీష్టంబు దీర్పఁగలవాఁడను. అంతదనుక నిన్ను నీయాప్తులసన్నిధిఁ జేర్చెదను. వారెందున్నవారో యెఱిఁగింపుమని యనుచుండఁ గనే యొక భయంకర వ్యాఘ్రంబు బొబ్బలిడుచు వారున్న వైపునకు దుముకుచు వచ్చుచుండెను. దానిఁజూచి యాపురుషవరేణ్యుండు నేనిదే యీఘాతుకమృగంబును సంహరించి క్షణములో వచ్చెద నిందే యుండుమని పలుకుచు చంద్రహాసమును ఝుళిపించుచు

యావ్యాఘ్రిమున కెదురుగా నఱిగి దానిం దరుముకొనిపోయెను.

ఇంతలో దావుననుండి వారి సంభాషణ మాలించుచున్న యాయక్షకుమారులిరువురు నిదియెయదనని విమానము దిగివచ్చి యచ్చపలాక్షిని బలిమిమై బట్టి తమవ్యోమయానంబునంబెట్టికొని యంతరిక్షంబున కెగసి పోయిరి. వ్యాఘ్రిమును సంహరింపఁబోయిన పురుషునకుఁ హా! మనోహరా! రక్షింపుము. రక్షింపుము. వీండ్రెవ్వరో బలవంతమున నన్ను విమానమెక్కించి పైకిఁ దీసికొని పోవుచున్నారు. అను నబలారోదనధ్వని వినంబడినదేకాని యాదివ్యయానం బేవంకకుఁ బోయినదో వానికి గోచరముకాలేదు. వ్యాఘ్రిసంహారమునర్ప నతఁడెంతప్రయత్నించినను నదికొనసాగినదికాదు. చంద్రహాసమున దాని దేహమును దుత్తునియలుగా నఱకినను నది చావదయ్యెను. చివరకతండు విసుగుఁజెంది మహోద్రేకంబున దానిం గవిసి తచ్ఛిరంబూడిపడునట్లు నిజకుఠారధారచే గట్టిగాఁగొట్టెను. ఆవ్యాఘ్రిశిరంబు బంతివలె పైకెగిరి తిరుగ నిముసములోవచ్చి యాకళేబరంబున కతుకుకొనుటయును పులి యొక్కయురుకున నదృశ్యమగుటయు నొక్కసారిగజరిగెను. ఆపురుషపుంగవుండా యద్భుతదృశ్యమునకు వెఱఁగందుచు శార్దూలము శరవేగంబున దూరముగాఁ బారిపోయినకతంబున దానివెంటాడించుట యనవసరమని తలంచి యతండు తిరుగ నాభామినీరత్నమున్నచోటి కతిరయంబున నేతెంచెను. కాని వానికాప్రదేశమంతయును శూన్యమై గనంబడెను. అక్కాంతాలలామనంతలో నెడఁబాయుటకుఁ జింతించుచుఁ దన్మృదుమధురవాక్యంబుల నెన్నుచుఁ దదీయరూపలావణ్యాదులఁదలపోయుచుఁ దన్మయుఁడై కార్యమూఢుఁడై కొండొకతడవు మైమరచియుండెను. తద్విరహవేదనాదోధూయమాన మానసుండై యాపురుషపుంగవుండు స్వాంతంప్రబోధితుండై యిట్లని వితర్కించుకొనెను. ఓరా!

చేతికబ్బిన లిబ్బెను జారవిడుచువానివలె నేనే తినిగదా? అనదయై శరణంబు వేడిన యబ్బాలారత్నమును వెంగలినై కాపాడఁజాలక యాపదలపాలు నేసితిని. నాకన్న కఠినహృదయుం డెందైనను డునా? దుర్మార్గులచేఁజిక్కి యాచక్కెరబొమ్మ చేసిన యాక్రందనమువినిన ఱాయియైనను వజ్రమైనను కఱఁగును గాని నాహృదయము చలింపలేదు. ఇది యెంతదారుణమైనదో గ్రహింప జాలకున్నాను.

మ॥ అకటా! నన్నువరించినట్టి యబలన్ ప్రాంచచ్ఛుభాంగిన్ విభీ
త కురంగాక్షిఁ ద్రిలోకసుందరిని నిద్రాక్షీణ్యతన్ దుచ్ఛ లి
ట్లోకటన్ బల్మిహరింపఁగా నెఱిఁగి నేను ద్రోకమున్ మాని యూ
రక యెట్లుండఁగలాఁడ నాప్రియసతిన్ రక్షింప నేనోపనే॥

ఆనారీమణిని యంతరిక్షచరు లెవ్వరో ముచ్చిలించుకొని పోయి యుందురు. చతుర్దశభువనముల యందెందు దాచినను నెవ్వరడ్డంబైనను నాప్రాణేశ్వరిని నేవిడిపించుకొనిరాఁగలను. అట్లుచేయ లేనినాఁడు నాకు మరణమే శరణ్యము. ఆమోహనాంగి నెడఁబాసి నేనొక నిముసమైన సుఖంబున నుండఁగలనా? బ్రహ్మదత్త వరప్రభావ సంపన్నుండనగు నే నీమాత్రపుపని సాధించుకొని రాఁజాలనా? అయ్యో! కిరాతబాలకుని గతియేమి? వానిని బ్రతికించి యిచ్చెదనని యవ్వనాటులతోఁ బ్రతినఁ జేసి వచ్చితినిగదా? వాని మాట పిమ్మటఁ జూచెదంగాక. ముందీసుందరీమణి యాపదఁ దప్పింపవలయునని యోగమార్గంబున నంబరంబున కెగసి యుత్తర దిక్కుగాఁ బోయెను.

---

305వ మజిలీ.

## కుంభనికుంభులకథ

పాతాళంబున బలిచక్రవర్తి కుంభదానవునియారోగ్యమును పరిచారకులముఖంబునఁ బ్రతిదినంబును దెలిసికొనుచుండెను. వాఁడు నానాటికి స్వస్థతంబొందుచుఁ గ్రమముగా నెలదినంబులకు లేచి యిటునటుఁ దిరుగుటకు శక్తిఁ గలిగియుండెను. ఒకనాఁడు వాఁడు అనంగమోహినినిఁ దలంచుకొని యిట్లువిలపింపఁదొడంగెను. హా! మన్మనోపహారిణీ! అనంగమోహినీ! నీకొఱకు నేనెన్నెన్ని యిడుమలం బడితినే! చివరకవి యన్నియును వ్యర్థములయ్యె. ఆపాపపు దివోదాసుండు నాకొఱకచ్చటికేల దాపురించవలయును, వానిచేఁ బరాభూతుండ నగుటకే నింతయుఁ జింతింపను. నీయధర సుధారసము తనివిఁదీర నొకపారియైనను గ్రోలఁజాలనైతిఁగదా యని మిగులవగలం బొగులుచుంటిని. నీనిద్దంపుచెక్కుటద్దంబుల నెన్నఁడును ముద్దాడనైతినని పలవింపుచుంటిని. నీగాఢాశ్లేషసుఖంబున నొకనాఁడైనను నోచుకొనకుంటినని విలపించుచుంటిని. అన్నా! నావంటి మందభాగ్యుఁడుండునఁగలఁడా? అన్నిదినంబులు వివిక్తప్రదేశంబుల నొంటిగాఁ జిక్కిన చక్కెరబొమ్మను మక్కువమీర ననుభవింపఁజాలని నన్నుఁబోలు మూఢుండు ముల్లోకముల నెందేనియుండునా? ఏమనిన నేమికోపమువచ్చునో యేమిచేసిన నేమివిరక్తిగలుగునోయను భయంబున నున్నుఁడనై నిన్నారక కన్నుల కఱవుదీరఁ జూచుచుండుటయేగాని యేసాహసమును జేయఁజాలనైతిని. అయ్యయ్యో! ఇఁకనాజన్మమధ్యంబున నిన్నుఁ జూచుభాగ్యంబు నాకబ్బఁగలదా? నీతో ముచ్చటించు పుణ్యంబు నాకుతటస్థింపఁగలదా? నీతోఁ గలసిమెలసి సుఖంచు వైభవంబు నాకుపట్టఁగలదా? అన్నియును నీటిమీఁది వ్రాతలైనవి కదా!

నన్ను పరిభవించిన యారాజు భాగ్యంబు పండెనా! వాని కోఱికేనా నేను నిన్నక్కడకుఁ జేర్చినది. అబ్బా! ఈవిరహంబునకు నేనోపఁజాలను. ఆకత్తి పోటులతో ప్రాణంబులుపోయినను బాగుండు నుగదా? నేను వెండియుఁజీవించి యేమిసౌఖ్యము బడయుదును ఎవరిని సంతోషపెట్టుదు నని యీరీతిని బహుప్రకారంబుల విలపించు చున్నవానిమాటలన్నియును విని యచ్చటనున్న పరిచారకుఁడు దగ్గ రకుఁజేరి యిట్లనియె.

కుంభా! నీదేహమున నెట్లున్నది. పలవరించుచుంటివా యేమి? తినుట కేమైన పదార్థములఁ దెమ్మందువా? అని యడుగుచున్న వానిం జూచి యారక్కసుం డిట్లనియె. అయ్యా! నాకేమియు నక్క రలేదు. మీరెవ్వరు? ఈగృహమెవ్వరిది? నన్నిం దేమిటికి కుంచితిరి? ఇది యేలోకము? మీరెవ్వని యానతి నాకిందుపచారములఁ జేయు చుంటిరని యడిగిన నప్పరిచారకుండిట్లనియె.

కుంభా! ఇదియేలోకమో యెఱుంగవా? పాపము! అంతపాటు బడి బ్రతికినవానికి నీకేమిదెలియఁగలదు. జెప్పెదవినుము. ఇదిపాతా ళలోకము. నేనుబలిచక్రవర్తిగారి పరిచారకుఁడను. ఆచక్రవర్తియాజ్ఞా నుసారము నీకీచికిత్సాలయంబున నేను పరిచర్యలం జేయుచుంటిని. నీయారోగ్యమునకే యాసైరోచని యనుదినము నెదురుచూచుచుండె ను. అనిచెప్పినతోడనే కుంభుఁడు నివ్వెఱం బడుచు నేమేమీ! నేనెట్టి కేలకు పుట్టగడికేవచ్చి చేరితినా? బలిదైత్యేంద్రునకు నాయిందిట్టి యకారణ వాత్సల్యమేలకలిగినది. అనిపలుకుచుండఁగనే మఱియొక పరిచారకుఁడు పరుగుపరుగునవచ్చి దైత్యేంద్రుని యానతి యైనది. వీనిని కొల్వుకూటమునకు వేగమ తీసికొని రమ్మనుచున్నారు. శేష వాసుకి ప్రముఖు లందరు బరివేష్టించియుండఁ బ్రభువువారిప్పుడు కొల్వుదీర్చి యున్నవారని చెప్పుచు కుంభుని వెంటఁదీసికొని వైరోచనుని సన్నిధికిం బోయెను.

సభలో వాసుకింజూచినతోడనే కుంభుఁడు నిశ్చేతనుఁడయ్యె ను. దానవేంద్రుని యెదురనిలచుటకుఁ గంపించుచుండెను. తక్కిన వారిని తేరిచూచుటకు మొగము జెల్లకుండెను. అట్లు భయవిహ్వాలుం డై యున్న కుంభునిఁజూచి దానవేంద్రుండిట్లనియె. కుంభా! ఈమధ్య నీవెచ్చటికేగితివో యేమేమిచేసితివో పూసగ్రుచ్చినట్లు చెప్పవల యును. నిజమింతుక యేని దాచినచో నీమానప్రాణంబులు దక్కవని నమ్ముము. అనిగద్దించి యడుగుటయు వానికి భయోద్రేకంబున మాటయే వచ్చినదికాదు. వెండియు చక్రవర్తి వాని నుద్దేశించి మాటాడవేమి? ఈనడుమ నెవ్వఁతేని వాసుకితనూజాత ననంగమో హినిని జూచితివా? నీవట్లు మానమువహించిన వదలిపెట్టము. నీ సంగతి యంతయును నాకు తెలిసినది. నిజము జెప్పకున్న తీవ్రశిక్షలం బొందెదవని యలుకమెయి నడుగుచున్న తేనియెదుర బొంకుటకు భయంపడి యారాత్రించరుండు వానికి నమస్కరించుచు నిట్లనియె.

ప్రభువరా! తప్పుచేసితిని. మూఢుండనై యొనర్చితిని. రక్షిం చినను శిక్షించినను దేవరయేకర్తలు. సంగతినంతయు నెఱింగిన ప్రభువులసమక్షమందు నేను నిజమును దాపరికము సేసినఁ బ్రయోజన మేమిగలదు. అని తనవృత్తాంత మిట్లుసెప్పందొడంగెను.

దేవా! నేను దేవరయధికారమునకు లోఁబడిన రసాతలవాసుం డను. వికటహాసుని తనయుండను కుంభుఁడనువాఁడను. నాసోదరుఁడు నికుంభుఁడను వానితో నేనొకనాఁడు విలాసార్థ మీవాసుకి ప్రముఖ వాతాశనప్రవరులున్న వైపునకుఁబోతిని. అందుఁ గేళికోద్యానంబున నుచితసఖీపరివృతయై విహరించు వాసుకి పుత్రికారత్న మనంగమో హిని రూపలావణ్యాదులంజూచి మోహపరవశుండనైతిని. తదీయ లావణ్యశృంఖలాబద్ధుండనై ముందడుగైనఁ బోవఁజాలక యాపూవు తోటలో నొకమంజునికుంజమధ్యంబునఁ బొంచియుండి యధేచ్ఛా

విహారపరిమోదమానమానసాంభోజనైయె చెలంగియున్న యాయం గనామణి సౌందర్యలహరీతరంగపరంపరాబద్ధ నయనరాజీవద్వ యుండనై యన్యమెఱుంగకుంటిని.

ఇట్లు తదేకధ్యానాయత్తచిత్తుఁడనై యున్న నాకొకచెడుబుద్ధి బుట్టినది. ఆవిలాసవతిని బలవంతముగా నెత్తుకొనిపోయి యొక్క వివిక్తప్రదేశంబున నిష్టోపభోగంబుల నానందింపవచ్చునను నిశ్చయ ముతో నేనందు నిరీక్షించియుండి యదనెఱింగి యువ్విత్తుగా నాకె సన్నిధికేగి చెలిమికత్తె లాక్రోశించుచుండ నామదగజగామినిని బల వంతముగా నెత్తుకొనిపైకెగసి పోయితిని. ఆలలితాంగి వలలోఁజిక్కిన శకుంతశాబకమువైఖరి నాసందిటఁ జిక్కి యొక్కుమ్మడి రోదనము సేయుచున్నను విడువక కడురయంబున నేనట్లు పోవుచుండ నాసోద రుం డెక్కడ నుండి చూచుచుండెనో నాపోకఁ గనిపెట్టి వెనువెంట రాఁదొడంగెను.

వానింజూచి నేనులికిపడి నికుంభా! నీవేమిటికి నావెంటవచ్చి దవు. నిలునిలుమని పలుకుచున్న నన్నుపలక్షించి వాఁడిట్లనియె. సోదరా! ఈదర్వీకర సరోజానన నీక్షించి నప్పటినుండియు నాచిత్తం బంగజాయత్తమై యుత్తలంబడుచుండెను. నీకుఁ దెలియకుండ నిమ్మ త్తకాశిని నెత్తుకొని పోఁదలంచుచు నవ్వనంబున నొకచోఁ గన్మొరంగి యుండ నేనెఱుంగకుండ ముందుగ నీవే యాపనిఁ జేసితివి. సంతసం బయ్యెను. నీవీరాకేందు వదన మేనంగల యాభరణము లన్నియుం దీసికొని యమ్ముదితను నాకిమ్ము. మన్మనోభిలాషం దీర్చికొనియెద నని చెప్పుచున్న వాని నాక్షేపించుచు నేనిట్లంటిని.

ఔరా! నీవే నవరస రసికుండగు పురుషుండవు కాఁబోలును. నేనీ బాలామణిని మణిమండలముల కాసించి తెచ్చితి ననుకొంటి వేమి? కావలసిన నా నగలన్నియు నీకే యిచ్చివేసెదను. వానిం

బుచ్చుకొని పొమ్ము. మచ్చికమీర నిచ్చిగురాకుఁ బోడితోఁ బచ్చ
విల్తుని కేళిఁ గూడి నేసుఖించెదం గాక యని నాయభిమతంబు వాని
కెఱింగించితిని. వాఁడంతంబోక యనునయ వచనంబుల వెండియు
నాకిట్లనియె. అన్నా! మన మిరువురము సహోదరులము గదా?
అందుచే నవిభక్తులము. ఒకరు సంపాదించిన దానియందు రెండవ
వానికిఁగూడ సమాన భాగముండును. కావున నీవు తెచ్చిన యిచ్చ
కంబోటి ననుభవించుటకు నాకును దాయ భాగపు హక్కుగలదు.
న్యాయరీతిని మన మిరువుర మీనాతి నాతతఫేరిమఁ గామోపభోగం
బుల సమానముగా ననుయోగింతము కొంద మిందుల కొడంబడు మని
కోరిన వాని ననలించి యోరి మూర్ఖా! అవిభక్త సోదరులకు సం
పాద్య వస్తువులందు సమానమైన హక్కుగలదని యన్నభార్య నను
భవింపఁ దలంతువటరా! జ్యేష్ఠ సోదరునియాలి తల్లితో సమాన
మని చెప్పుట యెఱుంగవా! ఓరోరి! మాతృద్రోహి! కులపాంసనా!
యుక్తాయుక్తంబు లెఱుంగక నోటికి వచ్చినట్లెల్లఁ బ్రేలుట మాని
యవలంబొమ్మని తీక్ష్ణముగాఁ బలికి వాని నెదురుదిరిగి యొక్క
తన్నుఁ దన్నితిని. దానితో వాఁడు కొంతదూరము తిరిగిపడి మగిడి
మా వెంట నమ్ముటకుఁ బ్రయత్నించు చుండెను.

ఇట్లతఁడు నేనతిరయంబున నాయంబుజానన నెత్తుకొని పోవు
చుంటిని. ఆబాలా శిరోమణి వివశయై యున్న కతంబున నీగోడవ
యేమియు నెఱుంగదు. అట్లు నేను పోయిపోయి సప్తాధోలోకంబులం
దిరిగి తిరిగి యెందును ననుకూలమగు తావు గనంబడనందునఁ దిన్నఁ
గా భూలోకంబున కేగితిని. అందు దివోదాసుని శాసనభయంబున
సురగలోక వాసులు జేరరారని నిర్భయముగా హిమశైల శిఖరంబు
జేరితిని. అందొక సుందర దరీముఖంబున నాకంబుఁ గ్రేవను మెల్లఁగా
దింపి యుచితరీతిని ప్రాంత లతావితానంబులం దెచ్చి శయ్యఁ

గల్పించి దానిపై నామెను పరుండఁబెట్టి యామోహనాంగి లావ ణ్యామృతమును కన్నులారఁ గ్రోలుచు సన్నిధిం గూర్చుండి పుష్ప గుచ్ఛములతో నామెకు విశ్రాంతి కలుగునట్లు విసరుచుంటిని. ఇంత లో నికుంభుఁ డచ్చటికివచ్చి చేరెను. వానిం జూచినతోడనే నాకరి కాలి మంట నెత్తికెక్కినది. కన్నుల నిప్పుకణంబు లురుల వాని నీ క్షించుచు పండ్లు పటపటగీటుచు మహాక్రోధంబున నాడుగఱచి హుమ్మని లేచి వానిపైఁబడి జుట్టుపట్టుకొని బిరబిర దూరముగా నీడ్చుకొనిపోతిని.

వాఁడును నాపట్టుతప్పించుకొని చేరువనున్న దారుణ పాషా ణంబెత్తి నాపై విసరెను. అది తప్పించుకొని యొక వృక్షశాఖంబూని వానింగొట్టితిని. కొండొక దీర్ఘశాఖను బెఱికికొనివచ్చి వాఁడు నాపైఁ గవిసెను. ఇట్లు మేమిరువురము బెద్దతడవు శిలావృక్షాదిసాధనంబు లతో సమముగాఁ బోరితిమి. పిదప బాహాబాహి కచాకచి ముష్టా ముష్టి గెలుపోటములు లేక సంబంధ బాంధవ్యంబులం దలంపక యాచంపక గంధి కొఱకు నేకఫలాపేక్షా నిరూఢ మూఁడ హో రాత్రంబులు ద్వంద్వయుద్ధ మొనరించితిమి. అప్పటికి నికుంభుని సత్వంబు గొంత తఱుగుట నెఱింగి నేను విజృంభించి దంభోళి సదృ శంబగు పిడికిటితో వాని వెన్నుపై గట్టిగా గుద్దితిని. దానితో వాఁడు మొగంబున రక్తంబు గ్రక్కుచు వెన్నిచ్చి పారిపోయెను. కొంతదూరము వఱకు వానిని తరుముకొనిపోయి మూఢుఁడా! యి ప్పుడైన బుద్ధిఁగలిగి యుండుము. పో పొమ్మని పలుకుచు వెనుకకుఁ దిరిగి యనంగ మోహిని నుంచిన గుహా ముఖంబున కతిరయంబున నేతెంచితిని.

కాని యావేదండగమన యచ్చట లేదు. మూఁడు నాళ్ళ నుండియుఁ జేయుచున్న సమరము వలనఁ గలిగిన యాయాసంబంత

యు నొక్కసారి నన్నుప్పు డావేశించినది. సన్నిధిం బడసిన నిక్షేపమును గాళ్ళతోఁ దన్ను కొన్నట్లయ్యెను. అంత శ్రమపడి గంపెడాసతోఁ గొండంత కోరికతో చేసిన నాప్రయత్న మంతయు విఫలమైనదని నాహృదయము సహస్రశకలములైనది. ఏమిచేయుటకు నెందుఁబోవుటకుఁ దోచక యా బాలామణిని పరుండఁబెట్టిన సెజ్జపై మేనుఁ బడవైచి తద్విరహ వేదనా దోధూయమాన మానసుండనై కొంతతడ వొడలెఱుంగ కుంటిని. అంతవఱకు చెప్పి భావోద్రేకంబు వలనఁ గలిగిన పరితాపంబు కతంబున నొడలువివశమై క్రిందపడెను. తోడనే బలిచక్రవర్తి పరిచారకులచే వానికి శైత్యోపచారంబులు జేయించుచు తరువాతి వృత్తాంతము వాఁడు స్వస్థతంబొందిన వెనుక వినవచ్చునని నాటికాసభ జాలించెను.

306 వ మజిలీ.

మరునాఁడు యథాకాలంబునకుఁ గుంభునిఁ బిలిపించి యవ్వలి కథ జెప్పుమని బలిచక్రవర్తి యాజ్ఞాపించుటయు వాఁడిట్లు చెప్పఁ దొడంగెను.

ప్రభువరా ! నేనట్లు లతాపర్యంకంబున ననంగ మోహినీ విరహాతురుండనై పడియుండి కొండొక తడవునకు నాకు నేన యుపశమించుకొంటిని. పిమ్మట మందుఁడనై యంతఃపురంబులసుఖంబుగాఁ గాలంబు బుచ్చుచున్న యుబలం దెచ్చి యడవిపాలు జేసితిఁ గదా? యని నిందించుకొనుచు ఘాతుక మృగం బెద్దియైన వచ్చి యామెం గబళించిపోయిన దేమో యని భయంపడుచు నేద దేరి యాప్రాంతములనెందైన నరిగి యుండెనేమో యని యాసఁగొనుచు నీరీతి ననేక విధంబులఁ దలంచుచు నెట్టకే నటఁగదలి యాప్రాంత భాగంబులనతిశ్రద్ధతో వెదుక నారంభించితిని.

చూచిన పొదరిండ్లే చూచుచు నడచిన దారినే నడచుచు

ననంగమోహినీ! యని పిలుచుచుఁ గనంబడిన తరు లతా గుల్మాదుల వివిధ శకుంతసంతానంబుల నానావిధ మృగ సందోహంబుల నా మనోహారిణిం జూచితిరే యని యున్మత్తుండనై యడుగుచు నారీతి నాప్రొద్దంతయుఁ దిరిగితిరిగి వేసరి యొక విశాల శిలావేదికపై హతాశుండనై చదికిలంబడితిని.

ఇంతలోఁ బ్రాంతమందెద్దియో సందడి వినంబడినది. దాని నెఱుంగఁ గుతూహల పడుచుఁ జయ్యన లేచి యావైపునకు మెల్లఁగా నడచితిని. ముందొకచో నొక పురుషపుంగవుండు వేఱొకని డాచేత జుట్టుపట్టుకొని నిలిపి సవ్య హస్తంబునంగల కటారి నెత్తి వానితల నుత్తరింప నూహించుచుండెను. పట్టుబడ్డవాఁడు చేతులు జోడించుకొని మహారాజా! రక్షింపుము రక్షింపుము నీప్రభావం బెఱుంగక యిన్ని చిక్కులంబెట్టిన నాతప్పులన్నియును మరచిపొమ్ము. నీదాసానుదాసుం డనని ప్రార్థించుటయు నామహాపురుషుండు వానింగరుణించి యెత్తిన గత్తి దింపి జుట్టువిడచిపెట్టి యిట్లనియెను.

ఓరీ! నీవెవ్వఁడవు సర్పంబవై వనచర బాలకు నేమిటికి జంపితివి. వాని కళేబర మెందులకు గుప్తపఱచితివి. నిక్కము వక్కాణింపుము లేదేని నిన్నుక్షమించువాఁడను గాను. అని గద్దించియడిగిన వానికి రెండవ వాఁడిట్లు తనకథ చెప్పందొడంగెను.

---

## రత్నచూడుని కథ

మహారాజా! నేను నాగవంశము వాఁడను. మాపూర్వు లెవ్వరో రసాతలము విడిచి భూలోకమునకు కాపురమువచ్చిరఁట. వారందఱును వింధ్యారణ్యము శరణ్యముగాఁ జిరకాలము స్వేచ్ఛగాఁ

గాలముగడపిరి. నాతండ్రిపేరు పింగళాక్షుఁడు. వానికి విరజయను భార్యయుండుఁబదివేల పుత్రులు నందరు పుత్రికలును జన్మించిరి. వారిలో జ్యేష్ఠుఁడను నేను నాపేరు రత్నచూడుఁడందురు. మేము పుడమియందే నివసించి యున్నను నాగలోకమునందుఁ గూడ మా బందుగు లెందఱోకలరు. వారిం జూడ మే మప్పుడప్పు డాలోకంబున కేగుచుందుము. నేను చిన్ననాఁటనుండియును తల్లితండ్రులచే నతి గారాబముగాఁ బెంపఁబడితిని. నాయొడలం బుట్టుకతోడనే పుట్టిన యనర్ఘ రత్నముంబట్టి రత్నచూడుఁడని నాకన్వర్థ నామమయ్యెను. ఆరత్నప్రభలు దిగంతములఁ వ్యాపించు చుండినవట. ఒకనాఁడు నా తల్లిదండ్రులు పుత్రులతో నాగలోకంబున కేగ నందొక తపస్సిద్ధుం డు రత్నప్రభలచే మెఱయుచున్న నన్నుజూచి దగ్గరకుఁ దీసికొని ముద్దాడుచు నాతలపైనున్న రత్నము దివ్యప్రభావముగలదనియును దానినిఁ బడసిన వారికి మృత్యుభయంబు లేదనియు నేమేమో విశే షంబులు నాతల్లిదండ్రులతోఁ జెప్పెనఁట.

ఆసిద్ధుని పలుకులు విని నదిగోలె నాయందు మావారికి యనురాగము వృద్ధిబొందినది. నాగలోకంబులో మాతల్లికి దగ్గర చుట్టమైన యొకనాగవంశ శ్రేష్ఠునకు నన్నప్పగించి విద్యాబుద్ధులు సెప్పించిరి. నేనక్కడఁ బెక్కువిద్య లభ్యసించితిని. నాకుచదువుచెప్పు చున్న గురువుగారికి విద్యుత్ప్రభయను చక్కని కూతురుగలదు. దానిని మేనత్తకొడుకునకిచ్చి పెండ్లి జేసిరి. వాఁడువట్టిమూర్ఖుఁడు. రూ పమునకు దున్నపోతు. చదువుసంధ్యలుపూజ్యము. భార్యాభర్తల సంబంధ మెట్టిదో యెఱుంగఁడు. అట్టిదంపతుల కాపురము వినిన వారికిఁ జూచినవారికి హాస్యాస్పదముగా నుండును గదా? శృంగార రసము వానియందు శూన్యమని చెప్పవచ్చును. అట్టి భర్తతో భా

దానియత్త రాకాసి మాఁమ చండశాసనుఁడు. దానంజేసి యత్తింట నున్నప్పుడెప్పుడును నామెవిలాసచాతుర్యములఁ జూపుట కవకాశములేకుండెను. ఎద్దియో వంకఁబెట్టుకొని తరుచు పుట్టింట నే నివసించుచుండునది. అచ్చట దానిస్వేచ్ఛావిహారమున కాటంకము సెప్పు వారెవ్వరు! ఇరుగుపొరుగులఁగల బోజంగుల కామె తంగేటి జున్నువలె నున్నది.

నే నొకనాఁడు వారింట రాత్రిచాల సేపటివఱకుఁ బాఠములు జదువుకొనుచుంటిని. అర్ధరాత్రంబున నాజవ్వని మూల్గుచు నెద్దియో బాధ నభినయింపఁ దొడంగినది. దానితల్లి నాసన్నిధికే తెంచి ఆ మ్మాయికి గుండెలో పోటు వచ్చినది. చేరువనున్న వైద్యుని సత్వరమ తీసికొనిరమ్మని నన్ను నియోగించినది. గురుపత్ని యానతి నేనేగి యాభిషగ్వరుని క్షణములోఁ దీసికొనివచ్చితిని. వాఁడు వచ్చి యామెం బరీక్షించి యెద్దియో మందిచ్చి యారాత్రి మాటిమాటికిఁ జేయి చూచుచుండ వలయునని చెప్పి యచ్చటనే పరుండెను. కొంతసేపటికి మేమందఱము నిద్రా ముద్రితులమైతిమి. నాకుఁ దిరుగ మెలకువ వచ్చునరికి వైద్యునిసన్నిధిం గూర్చుండియావిద్యుత్ప్రభ వానితో నెద్దియో ముచ్చటించు చుండెను. దానికి నేనువిస్మయంబందుచుండ నాసుదతిమాటలిట్లువినంబడినవి.

మనోహరా! నీవీమధ్య నన్నుఁబొత్తిగా మఱచిపోతివి. నీ విరహ మేను సైరింపఁగలనా? ఈరాత్రి నీతో సుఖింపఁదలంపుకలిగి నిన్నిందురప్పించుటకై యుపాయముబన్నితిని. గుండెలోపోటనఁగా నీకర్థమైనదా? పంచశరునిపూవుముల్కులు గాటముగానెడగనాటి బాధించుచున్నవనిభావము. ఇప్పటినుండి మనకీమాటలే సాంకేతికములగుఁగాక. అనిచెప్పుచు వానినిపక్కగదిలోనికిఁ గైదండయొసంగి తీసికొనిపోయి కొంతసేపటికిఁ దిరుగవచ్చి యథాస్థానమున నే

మఱియు నెఱుఁగ నట్లు శయనించినది. కన్నులారఁ జూచి చెవులార
విని యున్న నాకు వారిచేష్టలు మిగులనాశ్చర్య విషాదములం గలి
గించినవి. తెల్లవారునరకు నామె బాధ మఱుమాయ మైనది.

మఱియొకనాఁడు నేనొంటరిగా నున్న పతనమందిరమున కాస
రోజ ముఖి వచ్చి నాతో ముచ్చటలాడఁదొడంగినది. క్రమక్రమము
గా శృంగారప్రసంగములోనికి దిగినది. పిమ్మట పరిహాసములాడఁ
గడంగినది. తుదకుఁ దనతోఁ గలియుమని సిగ్గువిడచి యడిగినది.
నేను దానిమాటలకు నూరేమియుఁ బలుకఁజాలక నిశ్చేతనుఁడనై గొం
తతడవుంటిని. మొదట నమ్మదవతి సౌందర్యంబు గాంచి నామనం
బు గొంచెము సంచలించినది. దానిస్వైరిణీ వృత్తి దలంపునకు వచ్చి
విరక్తిఁ గలిగినది. అన్నిటికన్న నెక్కుడుగ గురుపుత్రిక యన్నమాట
హృదయమునఁ బ్రతిధ్వనించఁ గంపము జనించినది. అప్పుడెట్టులో
యాపాప జనవాలిని మోసగించి యావలకుఁ బారిపోతిని.

అందులకై యీర్ష్యవహించి యామించుబోణి తల్లితో నా
మీఁద లేనిపోని నేరములెన్నేనిఁ జెప్పి నేనామెను బలాత్కరించి
నట్లు నమ్మకము బుట్టించినది. నేను భయకంపితుండనై యెవ్వరితో
దను మాటలాడలేదు. నిజమెఱింగించి గురుపుత్రికకుఁ జెడ్డపేరు దెచ్చు
ట నాకిష్టములేకుండెను. నన్నెల్లరు నిందింపఁ దొడంగిరి. గురువు
గారికిఁ గూడ యీవార్త క్రమక్రమముగావినికిడి యైనది. ఆయన
నన్నుఁజూచి బుద్ధిహీనుఁడా! నేఁడు మొదలు నాయింటికెన్నఁడును
జేరవలదు. పొమ్మని కఠినముగాఁబలికెను. నేను వానిపాదముల
మీఁదపడి క్షమింప నెంత వేడుకొన్నను దయగలుగలేదు. కోపము
ద్విగుణీకృతమైనది. అందు నన్నుఁజితుకఁగొట్టి నాశిరంబున వెలయు
చున్న రత్నమును బలవంతముగ నూడఁబెరికికొని వివశుండనై యున్న
నన్నుఁ బదుగురచే నూరిబైట పారవేయించెను.

పుట్టుకతోఁ బుట్టిన రత్నముపోయెను. గురుద్రోహము జేసితి
నను నపనిందమీఁదఁబడెను. హతభాగ్యుండనగు నేనుగొంత తడవు
నకు తెలివివచ్చి మెల్లన లేచి రత్నమూడఁదీయుటచేత గాయపడిన
శిరంబునిమురుకొనుచు నెవ్వరికింజెప్పక యవమాన సంపీడిత హృద
యుండనై భూలోకంబునకు వచ్చితిని. నాయవస్థనంతయు నాతల్లి
తండ్రి లెఱింగి మిక్కిలి విచారించిరి. శిరోరత్నము పోయినందుల
కుఁ గడుంగడు దురపిల్లిరి.

మాతండ్రి మఱియొకప్పుడు నాగలోకమున కఱిగి నాగరత్న
మిమ్మని మాగురువుగారికి నెన్నివిధములఁ బ్రతిమాలినను దానేటుం
గనని బొంకి పంపివేసెను. ఈవిషయము పరిభవము గురించి నాతం
డ్రి విన్నవించెను. ఆతండు మాగురువుగారికి భయపెట్టి నాగరత్నము
నెట్లో తెప్పించెనుకాని దాని ప్రభావంబెఱింగి పుచ్చుకొనిన యెడ
గక మఱొకప్పు డిచ్చెదనని సమాధానము చెప్పి పంపివేసెను. తర్వా
తెంత నెన్నిసారులు దాని కొఱకు వానిని ప్రార్థించినను నప్పటి కప్పు
డెద్దియో చెప్పి పంపివేయుచుండెనే గాని దాని నెప్పటికిని మాకిచ్చి
యుండలేదు. అయ్యది వాసుకి తనరాజానకు శిరోభూషణముగాఁ జేర్ప
రుపఁబడెనని తరువాతఁ దెలిసినది. ప్రభువు హరించిన వస్తువు తిరిగి
రాదని యెఱింగి దానియందు నిరాశఁజేసికొని సుఖముండకొంటిని.

రత్న మూడఁబెఱికికొనఁబడినది మొదలు నాకనవరతము తల
పోటు బాధయుండునది. వింధ్యారణ్యంబున దివ్యప్రభావ సంపన్నుఁ
డగుయోగీంద్రుఁ డుండుట తెలిసికొని మాతండ్రి వానియొద్దకు
నన్నుఁ దోడ్కొనిపోయి వాని పాదమూలంబునఁ బడవైచి రక్షింపు
మని ప్రార్థించెను. ఆయోగీంద్రుండు నాబాధ నెఱింగి తన సవ్య
హస్తము సాచి నామస్తకమునఁ బెట్టి యెద్దియో మంత్రించి యిప్పు
డెట్లున్నదని యడిగెను. వానిహస్తప్రభావమో మంత్రశక్తియో నే

నెటుంగాఁ గాని నాబాధయంతయు మాయమై పోయినది. వానిప్రభావమును స్తుతించుచు మాతండ్రి వీనిని దమశిష్యునిఁగా స్వీకరించి కొంతలగు విద్యలఁజెప్పుడని ప్రార్థించి వాని యనుమతి నన్నందుంచి నిజనివాసమునకుఁ బోయెను.

అమ్మహానుభావుని యుపదేశ విశేషంబున నాకు సమస్త విద్యలు గ్రహుంబునఁ గరతలామలకము లయ్యెను. పెక్కుయోగ విశేషంబు లాయన నాకెఱింగించెను. ఒకనాఁడా ఋషిపుంగవుని సపర్యలయం దించుక యేమరుపాటు జూపితినని నాపైఁ గనలుచు మూర్ఖుఁడా! విద్యాగర్వంబున గురుతిరస్కార మొనరించుచున్న నీవొక్క మానవునిచేతఁ బరాభూతుండవు గాఁగలవని శపించిన నేను కటకటంబడి వాని ననేకవిధంబుల శాపముగ్రహ్మరింపఁ బ్రార్థించితిని. అతం డట్టకేల కించుక శాంతించి యాశాపము నీవు వృద్ధుండవై యున్నతఱి దివోదాసుండను మానవేంద్రుని కతంబున సంభవింపఁ గలదు. అట్లు సంభవించినను వెంటనే వానికినీవు పరమాప్తుండ వగుదువని యానతిచ్చెను.

పిదపఁ గొన్నిదినంబుల కాయోగీంద్రుండు సిద్ధింబొందెను. నాతలిదండ్రులు గతించిరని యంతకుముందుగనే తెలిసినది. నాకు భోగములయందు విరక్తి బుట్టినది. జన్మభూమికి తిరిగి పోవుటకు మనంబొప్పినది కాదు. ఆ మునీంద్రు నాశ్రమంబుననే తపోవృత్తి నుంటిని. ఇట్లు పెక్కువేలేండ్లు గతించిన పిమ్మట నీవు భూరాజ్య పట్టభద్రుండవై నాగకులంబు వారెల్లరు పాతాళంబున కేగ వలయునని శాసనము చేసితివి. ధర్మబద్ధుండనై నేనును వల్మీక వివరంబులోని కేగి జన్మస్థలమండలి యనురాగంబు కతంబునను రసాతలంబున నాకు గలిగిన యవమానంబు హృదయంబున వేధించు చుండుట చే నేనచ్చటకుఁ బోఁజాలక యావల్మీక గర్భమందే తల దాచుకొని యుంటిని.

ఇట్లున్న నన్నా కిరాత బాలకుం డెట్లుకనిపెట్టెనో తెలియదు ఆపుట్ట నంతయుం దెగఁద్రవ్వి యందు యోగనిద్రనున్న నన్ను జావగొట్టెను. అంతటితో నూఱుకొనక తోఁకఁబట్టి యాడింప సాగెను. ఎంత విరక్తుఁడనైనను సహజ గుణంబులొక్కొక్కప్పుడు గనిపించుచుండును. నాజాతి స్వభావమును బట్టి యించుక యలుకబుట్టి యాబాలకుని మదీయ విషజ్వాలల పాలుజేసి ప్రాంతమందలి వేఱొక పుట్టలోనికిఁబోయి యందు విశ్రమించి యుంటిని. ఆ శబరులు నాకై వెదకుచున్నప్పుడు యోగవిద్యా ప్రభావంబున వారి కదృశ్యుండనైతిని. దేవరయేతెంచి యాపుట్ట త్రవ్వించునప్పుడు యోగీంద్రుని వలె నున్న నేమియుం దెలిసికొనఁ జాలరని యట్లు గనంబడితిని. సర్వవిద్యాప్రపూర్ణుండవగు నీయొద్ద నాచదువులు పనికివచ్చునా! నామాయ గ్రహించి మీరు నిగ్రహించినప్పుడు తేజోరూపుండనై పైకెగసి పక్షిరూపంబున పారిపోవఁజొచ్చితిని. మీరు నన్ను వెంటాడించుచుండుటఁ దెలిసికొనినప్పుడు నాకు మాగురువుగారి శాపము దలంపునకు వచ్చినది. మీరే యాదివోదాస మహారాజుగారని నిశ్చయించుకొంటిని. కావున నన్నుఁ బరాభవింప శక్యంబుగాదు. మిమ్మింతవఱకుఁ దీసికొనివచ్చి శ్రమయిచ్చినందులకు చింతించుచున్నాను. ఇదియే నా కథ మదీయ విషజ్వాలల మడిసిన శబరబాలక కళేబర మేమైనదో నేనెఱుంగను. నాగురుదేవుని పాదంబుల సాక్షిగా నేనించుకయు నెఱుంగను. నామాటలను నమ్మినను నమ్మకున్నను దేవరయే కర్తలు. నన్ను మీమిత్రునిగా నాశ్రితునిగా సేవకునిగా నిఁక మీద భావించి రక్షింపఁ గోరుచున్నాను. మీశాసనము నాకు వర్తింపకుండుటకు సమ్మతింపఁ బ్రార్థించుచున్నాను. భూలోకంబున నుండుటకు నాకనుజ్ఞ నొసంగ వేడుకొనుచున్నాను. సర్వదా మీకు హితమునే తలంచుచు తపోవృత్తినై యావింధ్యారణ్యము నాశ్రయించి యుండగల

వాఁడనని యతిదీనుఁడై పలుకుచున్న వానిమాటల కాపుడమిఱేఁడ యుండలరి యభయహస్తమిచ్చి యప్పుడే పంపివేసెను.

అని యెఱింగించు వఱకు వేళ యతిక్రమించుటయు నబ్బలి దానవేంద్రుం డప్పటికి గొల్వుచాలించి తరువాతి వృత్తాంతము మఱునాఁడు కుంభుని వలన నిట్లు తెలిసికొన సాగెను.

107వ మజిలీ

# కుంభ నికుంభులకథ

దానవేశ్వరుని యనుమతంబునఁ గుంభదానవుం డిట్లనియె. దానవకుల సార్వభౌమా! రత్నచూడుం డఱిగిన వెనుక దివోదాస మహారాజు చేరువనున్న కాసారతీరంబునకుఁ బోయెను. ఆతడు నాగలోకమువారు భూమిపై నుండరాదని శాసించిన పుడమిఱేఁడయ్యుం డని యెఱింగిన కతంబున నాయెడల భీతి జనించినది. నన్ను జూచి యతండు శిక్షించునేమో? యను భయంబున మఱియొక మారు మూలదారిని పాఱిపోతిని.

నేనట్లొకమార్గంబున భయోద్రేకంబునఁ బోవుచుండ ముందొకచో నాకసంగమోహినీ నికుంభులు దృగ్గోచరమైరి. నికుంభుఁడామె పాదంబులంబడి ప్రతిమాలుచుండ నావేదండయాన ఛీ! మూర్ఖుఁడా! అవలఁబొమ్మని యదలించుచున్నది. ఆదృశ్యము గోచరమైనతోడనే నాకెక్కడలేని కోపమువచ్చినది. ఒక్కపరుగున వానిండాసి నికుంభా తిరుగవచ్చితివా? ఎన్నిచెప్పినను నీ దూగడము మాన కుంటివి. ఈ సారి గాచికొనుము నీ మదము సదమదము జేసెద నని మహాక్రోధముతో వానిపై నురికితిని.

నన్ను జూచుటతోడనే వాఁడు తోకతెగిన పిట్టవలె వెనుకకు జూడకుండ కాలికొలఁది పాఱిపోయెను. వానిని వెంబడించి పోయిన నక్కాంతాలలామ నెడబాయ వలసి వచ్చునేమో యను భయం

బున నేనచ్చటనే నిలచితిని. అయ్యంగనామణి నన్నుఁ జూచి విభ్రాంత యయ్యెను. మే మిరువుర మామె నాసించి తిరుగుచున్న సంగతి పాప మామె యెఱుఁగనే యెఱుఁగదు. మఱియును మే మన్నదమ్ము లిద్దర మొక్క పోలిక నుండుటచేత నామెకు వింత దోచి యుండవచ్చును. అప్పుడు నే నామె కిట్లంటిని.

సారంగనయనా! ఏల నీ కీ రిచ్చపాటు వాఁడు నాతమ్ముఁడు. నేను నిన్నిందుఁ దీసికొని వచ్చుట యెఱింగి నీపై యాసఁ గొని వాఁడు మనల వెన్నంటి వచ్చెను. ఇదివఱకు నాచేత నొకసారి పరాభూతుఁడై యిప్పుడు సిగ్గు లేక మరల వచ్చినాఁడు. ఇంకొక మారు నీ సమీపమును జేరిన యెడల వానిని తుదముట్టింపక మానను మానవతీశిరోమణీ! ఆ సెజ్జనుండి లేచి యెచ్చటికి కేగితివి. నీకొఱ కీయరణ్యమంతయును వెదకు చుంటిని. అబ్బా! నీ వియోగంబునకు నే నెంత పరితపించితి నను కొంటివి? ఇప్పటి కైనను కనిపించి నాకు నేత్రోత్సవం బొనరించితి వదియె చాలును. ఇంతవఱకు నేపడిన శ్రమ యంతయును నిన్ను జూచుటతోడనే మటుమాయ మయ్యెను నాపై నింత కఠినముం బూనఁదగునా! నిన్నిచ్చటకు బలవంతముగాఁ దీసికొని వచ్చి శ్రమ పెట్టితి నని నాపై కినుక వహింపకుము. ఎంత శ్రమ పెట్టితినో యంత సుఖపెట్టుటకు నేను సిద్ధముగా నుంటిని.

మ॥ పొలతీ! నీకు వశంవదుండ నయితిన్ బూజింతు ని న్నెప్పుడున్
దలపైఁ దాల్చెద నీదు శాసనము నిత్యం బేను నీ కన్నున
న్నల వర్తించెద ప్రాణపంచకముకన్నన్ మిన్నగాఁ జూచిని
న్నలరన్ జేసెద నేలుకోఁగదవె మా దృత్ప్రీతి నన్నింకిటన్॥

మదవతీ! మదనుఁ డదయుఁడై పదను టడిదంబుల నాపై నేయుచున్నాఁడు. నీ కటాక్షరసప్రసారం బించుక బరపి నా హృదయ తాపంబు జల్లార్పుము. అని మిక్కిలి దీనుఁడనై ప్రతిమాలు కొంటిని.

అప్పుడా బిబ్బోకవతి తోకత్రొక్కిన త్రాచువలె గస్సు మని లేచి నన్ననేక దుర్భాష లాడుచు ఛీఛీ!! మూర్ఖుఁడా! బుద్ధి గలిగి ప్రవర్తింపుము. నోటికి వచ్చిన ట్లెల్ల వదరుట మాని యవులం బొమ్ము అని వామపాదం బెత్తి గట్టిగా నన్ను తన్నినది. ఆ తాపుతో నా కెక్కడలేని క్రోధావమానంబులు బుట్టినవి. ఆమెతో తీక్ష్ణంబుగా నేమీ నెమ్మదిగా బలుకుచుంటి నని నోటికి వచ్చినట్లెల్ల దూషించు చుంటివి. నీకొక నిముసము వ్యవధి నొసంగితిని ఆలోచించు కొనుము. వృధాగా గష్టములఁ బడక నాకోరిక తీర్పుము. లేదేని ని న్నిందు బలాత్కరింపక మానను. అప్పుడు నీ కెవ్వ రడ్డము వత్తురో జూచెదం గాక యని పలుకు నాపలుకుల కా కలికితలమిన్న బొమలు ముడివైచుచు నీచుఁడా! నే నిం దేకాకినై నీకుఁ జిక్కియుంటి నని యిచ్చవచ్చినట్లు కారు లరచుచున్నావు రా! సర్వవ్యాపకుండైన పరమేశ్వరుండు నీ దుందుడుకు చేష్టల గమకించుచునే యున్నాఁడని యెఱుంగుము నీ బీరములు వానియెదురఁ బనికిరావు. పో, పొమ్మని గద్దించి పలికినది.

అప్పుడు నే నహంకరించుచు పాపినీ! మంచి మాటల నే నెంత బ్రతిమాలుకొనుచున్నను మీఁదుమిగులుచుంటివిగదా! నిన్నుఁ గాపాడఁ గలవారి నెవ్వరినో వైశమ రమ్మను మని బలుకుచు నా నారీశిరోమణి శిరోజంబులం బట్టికొని నేను చెప్పినట్లు వినెదవా లేదా యని యదలించుచుండఁగా నామె పెద్దయెలుంగున హా! పరమేశ్వరా! రక్షింపు రక్షింపు మని యాక్రోశించుచు నేల కొఱగినది. అప్పుడు తచ్ఛిరోరత్నము నాచేతిలోఁ జిక్కినది.

అంతలో నో భీరులోకమా! భయపడకుము భయపడకుము నిన్ను రక్షించుటకు పరమేశ్వరుండు న న్నిందు బంపినాఁడని పలుకుచు నొక్క పరుగున దివోదాసుండు మేమున్న దెసకు వచ్చెను.

వానిం జూచిన తోడనే నేను భయవిహ్వలుండనై పారిపోఁ దొడంగితిని కాని యా ధీరుండు పది యడుగులలో వచ్చి నన్ను కలసికొని చం ద్రహాసముతో నొక్క పోటు పొడిచెను. అప్పుడు నేను విధిలేక వా నితో ద్వంద్వయుద్ధంబునకుఁ గడంగితిని. అనంగమోహినియు విస్మ యముతో దూరమున నుండి మా యిరువుర కయ్య మీక్షించుచుం డెను. నే న మ్మహారాజుతోఁ బెద్ద యుద్ధము జేసితిని. ఆ వీరోత్తము నితో నట్లు పెనంగుటకుఁ నా కెక్కడి బలము వచ్చినదో నాకే వింత దోచినది. నాచేతియందున్న యనంగమోహిని శిరోరత్న మా సం దడిలో జారి పడినది. దాని నమ్మహారాజు సంగ్రహించి నిజోత్తరీ యంబునఁ బదిలపరచెను. రత్నము పోయినది మొదలు నాసత్వము క్షీణింప సాగెను. ఆ రాజు తన కుఠారధారచే నా మేని పై నెన్ని నఱకులు బెట్టెనో చెప్పఁజాలను. ఆపాదమస్తకము వాని కత్తిపోటు తగలని ప్రదేశము లేదు. శరీరమునుండి నెత్తురు వెల్లువమై ప్రవ హింపఁ దొడంగినది. నన్నాతఁ డెత్తి గుహాముఖంబున విసరివేయుట గాంచె మెఱుంగుదును. పిదప నే మైనదో నే నెఱుంగను. నాకు తెలివి వచ్చుసరికి మీ చికిత్సాలయంబున నుంటిని. ఇచ్చటి కెట్లు వచ్చితినో యచ్చట వా రేమైరో నే నెఱుంగ నని తన కథ యంత యును జెప్పి యూరకుండెను.

వాని యుదంత మంతయును విని యచ్చట నున్న వా రెల్ల విస్మయ మందిరి. బలిచక్రవర్తి కుంభుఁ డొనరించిన యపరాధ మిం కను విమర్శింపవలసియున్నది. ఇప్పటికి వీనిని బందిగంబున నుంపుఁ డని వానిఁ బంపివేసి శేష వాసుకులతో నిట్లనియె. హితులారా! వీని వలన ననంగమోహిని తన శీలమును రక్షించుకొనుచు కుశలముగా నున్నట్లు తెలిసినది గదా! మఱియును సద్గుణగరిష్ఠుండగు దివోదాస ధారుణీచక్రవర్తి సంరక్షణంబున నామె యున్నదని గూడ తెలియు

చున్నది. ఆమెకింక నేమియును భయం బుండబోదు. మీరు నిశ్చింతతో నుండవచ్చును. కొలదికాలంబుననే యా రాజన్యుం డామె నిచ్చుటకు బంపఁగలఁడని వారి ననునయించి నిజనివాసంబులకు నంపివేసెను. అని చెప్పి మణిసిద్ధుఁడు తదనంతరవృత్తాంత మవ్వలి మజిలీయం దిట్లు చెప్పందొడఁగెను.

308 వ మజిలీ

# గుణవతికథ

గోపా ! వినుమట్లు దివోదాసుండు యోగమార్గంబున దివంబున కెగసి దైవవశంబునఁ దిన్నగా నలకాపుర బాహ్యోద్యానవన సమీపంబునకుఁ బోయిచేరెను. ఆయుద్యానవన రామణీయకమునకు మిగుల వెఱఁగందుచు నచ్చటి విశేషంబులం జూడ నుత్సుకతం జెంది యాయుపవనా భ్యంతరంబున కఱిగి యందందుఁగల వింతలం జూచుచు విహరింపుచుండెను.

లయగ్రాహి.

కాంతిఁగల యందపు కుడుంగముల యందతి పసందుగను బొందికవహింపన్। ముందుఁ గనువిందుగ నమందగతిఁ బెంపెసఁగు సుందర లతానిచయ మందోలయు నా యిం।దిందిరములెల్ల మధువుం దనిసి మైకమున సందడియొనర్పఁబలుచందముల నేత్రా।నందముగ గ్రిందుకొని కెందలిరుపందిళుల డెందమలరంగ నతఁడందు విహరించెన్॥

సీ. అచ్చంపు నెలఱాల నమరి పచ్చలమెట్లఁ
గొమరు మీఱెడు కేళికుళులఁ గాంచి
మగమానికపుఁ గాంతు లగణి తంబుగ దిక్కు
లకుఁ జిమ్ము దివ్యవేదికలఁ జూచి

కుప్పకుప్పలుగాఁగఁ గప్పురంబును విప్పు
తుల లేని యనఁటి బోదుల నెఱింగి
పూల మొక్కలకెల్ల జాలుగా నీర్గల్లు
జలయంత్ర సువిశేషముల గ్రహించి
గీ. ద్రాక్షపందిళ్ళ సౌరు బెద్దగ నుతించి
పచ్చికబయళ్ళ సౌఖ్యంబుఁ బ్రస్తుతించి
పోకమ్రాకుల శృంగారమును దలంచి
మించి యుద్యానమున విహరించె నతఁడు.

ఇట్లయ్యుపవన విశేషంబులం దిలకించుచుఁ బోయిపోయి ముందటఁ గొంద ఱలినీలవేణుల విన్నాణంపు బలుకుల రొద విని యాప్రాంత మందలి యొక పూపొదరింటఁ బొంచియుండ వారి సంభాషణ మిట్లు వానికి వినంబడెను.

గుణవతి — సఖీ! చిత్రలేఖా! అనుకూల వాల్లభ్యంబు గోరి భజింపుచున్న నాయందు స్వయంప్రభాదేవి కింకను ననుగ్రహంబు రాలేదేమి! ఈదేవి భక్తకల్పకంబందురు గదా?

చిత్ర — నెచ్చెలీ! ఏల నీకీతొందరపాటు. స్వప్నగతయై నీకా లోకేశ్వరి చెప్పిన మాటలు మరచితివా యేమి? అనురూపవరునిం బొందుటకు నీకమ్మవారు పెట్టిన మితి నేఁటితోనే కదా తీరుచున్నది. ఎప్పటి కెట్లు సంభవింపఁ గలదో యెవ్వరు చెప్పగలరు.

గుణ — అమ్మవారు చెప్పిన మాట యనిన జ్ఞప్తికి వచ్చుచున్నది నాకొక దివ్యప్రభావ సంపన్నుఁడగు పుడమి యొడయండు మగండగునని యాదేవి యానతిచ్చెనదేమి! ఇది నిక్కవమగునా? రుగ్జరామరణ భయ వశంవదులగు మనుజులకును మనకును సంబంధ మెట్లుసరిపోవును?

చిత్ర — బాలామణీ! మనుజులలో రూపలావణ్య బలప్రభా

వైశ్వర్యంబుల దివిజులఁ దలఁదన్ను వారెందఱు లేరు! పురూరవ చక్రవర్తి చరిత్రమే యిందులకు నిదర్శనము. అచ్చరలలో నందఱ కన్న చక్కనిదని యెన్నికఁగన్న యూర్వశి వాని కిల్లాలై యుండ లేదా?

గుణ—ఎక్కడి మనుజలోకము ఎక్కడి యక్షభువనము ఎన్నఁడో యూర్వశీ ప్రభృతుల కట్టియవకాశము గలిగినదని యందఱకు నట్టి సంఘటనము గలుగునా? నాకదేమి దైవయోగమో గాని యమ్మవారి మాటలు వినినదిగోలె నిన్ని దివిజ లోకములుండఁగా మర్త్యలోకముననే బుద్ధి మరలవలయునా!

చిత్ర—నిక్కముగ నట్లుండుటకు దైవబలమే కారణము. అమ్మవారి మాటల కన్యథాత్వ మెట్లు సంభవింపఁగలదు. నీయదృష్టము మంచిది అనతికాలముననే ధారుణీరాజ్యైక ధురంధరుండగు వానికి పట్టమహిషివై యనన్య సామాన్యభోగ భాగ్యంబుల నలరారఁ గలవు.

గుణ— అట్టి మహాభాగ్యం బొదవినప్పుడు గదా యనుకొనవలయును. నాతండ్రి చిత్రకేతుండు నన్నొక స్వజాతి పురుషున కంటగట్ట వలయునని పట్టుబట్టియున్నవాఁడు గదా? నాకోరిక యెట్లీడేరఁగలదో తెలియకున్నది.

చిత్ర—నీ వేమనుకొన్నను నరేకాని నీతండ్రి వట్టిమూర్ఖుఁడు. కాకిముక్కునకు దొండపండును గట్టినట్లుగా సర్వకళాపరిపూర్ణవగు నిన్నొక విద్యావైభవ శూన్యుండగు యక్ష కుమారునకు కట్టిపెట్ట నిట్టట్టనరాని ప్రయత్నముల జేయుచున్నాఁడు. వాని మాటల విని నీ వెన్నఁడును మోసపోకుము.పిదప చింతించిన లాభముండదు.

గుణ—అయ్యో! నాతండ్రిమాటల విని మాయమ్మయు నన్నిందుల కొడంబడుమని నిర్బంధించుచున్నది. ఈగండ మెట్లు దాటఁగలనో గదా?

చిత్రి—నీతల్లి దండ్రులు సెప్పుచున్న యతుకుల కలంక ముగు నీతండ్రీమధ్య నొక చిత్రము జేసెనఁట వింటివా?

గుణ—నా కేమియుం దెలియదు చెప్పుము.

చిత్రి—త్రిలోక దుర్లభంబగు నీదు సౌందర్య వాగురా బద్ధ హృదయ రాజీవుండై నీవే తనకు భార్య గావలయునని కోరుచు భైరవీ దేవిం గూర్చి యామూర్ఖుం డనేక క్షుద్రోపాసనల నొనర్చు చున్నాఁడట. ఆవ్రత సమాప్తి త్వరలో జరుగఁగలదఁట.

గుణ—(నవ్వుచు) నా మనం బొల్లనప్పుడు మంత్ర తంత్రంబు లుపకరించునా యేమి? దేవతోపాసనలు విధినియోగమును దప్పింపఁ గలవా?

చిత్ర—దేవతోపాసనలు దైవవిధి నెన్నఁటికిని దప్పింపఁ జాలవు. ఇందువలన వానికి లాభము కలుగు మాట ముందెటులున్నను నేఁడు వాని యకార్య కరణంబులు జగంబునకుఁ దెల్లమయ్యెను.

గుణ—అదెట్లు.

చిత్రి—వినుము తద్వ్రత సమాప్తమునకు నెన్నఁడు నొరులఁ గఱచి యెఱుంగని వృద్ధ సర్పవిషంబునఁ దనువు బాసిన మనుజబా లక ప్రేతంబును దెచ్చి తచ్ఛిరోజముల వింజామరలుగ కపాలవుం జిప్పలు దీపపుం బ్రమిదెలుగ మేనిక్రొవ్వు తైలంబుగా నాంత్రంబులు వర్తులుగ నేర్పరచి యాభైరవీ దేవి నారాధించి యా శవాక్షిగోళం బులతో నీరాజన మెత్తి తదీయ హృదయ పిండంబు నైవేద్యము పెట్టి యావ్రత దీక్ష పూర్తి సేయవలయునఁట.

గుణ—అబ్బా! నీవు చెప్పుచున్న పూజావిధానము వినిన హృదయగ్రంథి విడిపోవుచున్నది గదా? ఎట్టిదారుణము ఎట్టియనుచిత కార్యము! ఎట్టి రాక్షసకృత్యము!!

చిత్రి—అట్టి నరబాలక కుణపంబునకై వాఁడెన్ని యోపాట్లు

వడి యెట్టకేల కీనడుమ నెట్టులో యొక దానిం దెచ్చి ప్రతిసమాప్త దివసంబు వచ్చువఱకు నొక తైల ద్రోణియందుంచి కాపాడుచుండె నఁట. ఈరహస్యము వానియన్నభార్య నాతో నేదియో ప్రస్తావన మీఁద నిన్ననే చెప్పినది.

గుణ—ఛీ! వాని చర్య లిఁక నాయొద్దఁ జెప్పకుము. వానిఁ దలంచినవారికిఁ గూడ. పాపము లంటఁగలవు. వాఁడిట్టి వాఁడు గను కనే నాజననీ జనకు లెంత జెప్పినను వానిం జేపట్టుటకు నామనంబున నేవగింపు గలిగినది నా విముఖత్వ మెఱింగి యీ తుచ్ఛుఁ డిట్టి యకార్యంబులకుం గడంగెఁ గావలయును. ప్రాణము లైన విసర్జింతును గాని యీనీచునిఁ గలనైన నొల్లను.

అట్లు వారు సంభాషించుకొనుట విని దివోదాస ధారుణీం ద్రుండు నివ్వెఱం బడుచు నౌరా! ఆయుత్తుఁడే గావలయు నాఁడర ణ్యంబున సర్పదష్టుండై మృతినందిన శబర బాలకుని ప్రేతము నప హరించిన వాఁడు ఇందలి నిక్కువం బెఱింగి యాకళేబరము నెట్లయి నను గ్రహించి యందు ప్రాణప్రతిష్ట జేయించవలె నని నామనంబు తత్తరం పడుచున్నది. మఱియు నీయతులకన్యకా లలామ యంగసౌ ష్ఠవంబును సుగుణసంపదయును గాంచినప్పటినుండియును మన్మనం బు పంచశర శరావిద్ధ మగుచుండెను. ఈబాలికామణికి భూభర్త యే ప్రాణేశ్వరుండగునని యమ్మవారు చెప్పినట్లు వింటినిగదా ! ఈ మెం జేపట్టుట కొఱకే పరమేశ్వరుండు నన్నిందు జేర్చియుండవ చ్చును. ఈమోహనాంగి కూడ మనుజుని భర్తగాఁ బడయుట కువ్వి ళ్లూరుచున్నది. ఆహా! ఈశ్వర సంకల్ప మతివిచిత్రమైనదిగదా?

క. ఏది దుష్కర మది సుకరం
బేది దుర్లభ మదియె సులభ మెద్ది దురాపం

బదె నంపాప్యము దేహికిఁ
గుదురుగ నా యీశ్వరాజ్ఞఁ గూడిన యెడలన్.
గీ. తలవని తలంపుగా నెందుఁ గలుగుచుండు
శుభము లశుభంబు లనునవి చోద్యముగను
వాని కరయంగఁ గర్త యెవ్వాఁడు లేఁడు
సర్వ మీశ్వరాయత్తమై జరుగుచుండు.

అని యారాజేంద్రుండిట్లువితర్కించుకొనుచున్న సమయం బున నాయతఁడు కన్యక లిరువురును విమానమునెక్కి నిజనివాసంబున కఱిగిరి. వారిపోక నెఱింగి దివోదాసుండు హతాశుఁడై యువ్వనంబు విడచివచ్చి ముందు దానొనర్పఁ దగిన కృత్య మెఱుంగక మంద మంద గమనంబున నెచ్చటికోఁ బోయెను.

309 వ మజిలీ.

## హేమావతికథ

స్వర్గలోకమందు మహేంద్రుని మోల సుధర్మ సభాభ్యం తరంబున నిత్యము నాట్య మొనరించు నచ్చరలలో తిలోత్తమ యను దానికి గూర్మి చెలికత్తెయగు హేమావతి రూప యౌవన విలాస విశేషంబుల ననవద్యయై యొప్పి యుండెను. వెనుక తారకాసురుండు స్వర్గంబు మీఁదకు దాడివెడలి దేవతలఁ గాందిశీకుల నొనర్చి నప్పుడు రక్కసు లుక్కుమిగిలి తత్పురంబు బ్రవేశించి యథేచ్ఛగఁ గొల్ల పెట్టిరి. ఆయదనునఁ గామాంధుఁడగు రాత్రిం చరాధముం డొకఁడు హేమావతినిఁ బట్టుకొని భోగలాలసుఁడై హిమశైల శిఖరంబునకు దీసికొని పోయి యందామెను బలాత్కరింపఁ జూచెను.

వాని బారినుండి యెట్లయినను దప్పించుకొన నెంచి యామిం చుబోఁణి యనురాగముట్టి పడునట్లు మంచిమాటల నిట్లనియె. సుంద రుఁడా? నీయందముగాంచి నప్పటినుండియును నీవే నామనోహరుండ

వని దలంచుచుంటిని. పిరికిపందలగు బృందారక బృందముల నిర్జించి యవలీలగ స్వర్గంబు నాక్రమింపఁ గలిగిన మీకు మేమెల్లరము వశం వదుల మైతిమి. ఇట్టి మమ్మిచ్చవచ్చి నట్లుని యోగించుటకు మీకు సర్వ స్వాతంత్ర్యము గలదు. దీనికై క్రమపడి యింతదూరము రావలయునా? నీయట్టి నరసుఁడు లభించుటచే నేను నిక్కము ధన్యు రాల నైతిని. నా ప్రాణధనంబులు భవ దధీనము లైనవి. అమరావ తీనగరంబున నాకుఁ గల దివ్యమందిరంబు సర్వవస్తుసమృద్ధమై యొప్పి యున్నది. నేటి నుండియు నీవే దానికి నాయకుఁడవైతివి. మహా రణ్యామధ్యంబున మనముండఁ బనిలేదు. మదీయ విలాస సౌధంబు నకుఁ బోవుదము రమ్ము. అందు నీయభీష్టము దీర్చుకొనవచ్చు నని పలుకుచున్న యాయువ్వి మిన్న మాటల కంగీకరింపక యాశైలశిఖ రంబునఁ దనతోఁ గలియక తీరదని యారక్కసుండు నిర్బంధింపఁ దొడంగెను.

ఇంతలో నాప్రాంతముల విహరించుచున్న యక్షకుమారులు మణిగ్రీవ జలంధరులు దైవికముగా నచ్చటికే తెంచుటయు హేమా వతికి ధైర్యముగలిగి యొక్కపరుగున వారియండఁ జేరి రక్షింపుఁడని వేడుకొనెను. వారామె కభయ ప్రదానమొసఁగుచున్న యవసరమున నా నిశాచరుండు వారి సన్నిధికేతెంచి తీక్ష్ణముగా నిట్లనియె.

ఓరోరి దుర్మదాంధులారా! పాపశంక లేక పరనారినిఁ జేరఁ దీయుటకు మీరొనర్చు ప్రయత్నములు నాముందు సాగనేరవని తెలుసుకొనుఁడు. ఇది నాభార్య. నవయౌవనముచేఁ జెన్నుమీరి యున్న మీరూపములకు వశంవదయై యిప్పుడీ కులట మీసన్నిధి కేతెం చినది. దీనిని సత్వరము విడిచిపెట్టకున్న నా యాగ్రహమునకు పాత్రు లగుదురు.

మణిగ్రీవుడు—(నవ్వుచు) ఏమీ! ఈమె నీభార్యయా? నీవీమె

కుఁ దగినభర్త వే? మీదాంపత్యము చాల ముచ్చటఁగొలుపుచున్నది.

రక్కసుఁడు—అట్లనుచుంటివేమి? నే నీమెకుఁ దగననియా నీ యభిప్రాయము.

మణి—కాదు. కాదు. ఆమె సౌందర్యమునకుఁ దగిన యందగాఁడవు నీవొక్కఁడవే మిమ్ముఁ గూర్చినవారి నభినందింప వలసి యున్నది.

హేమా—నేను వీని భార్యనుగాను. నన్నీ దురాత్ముండు బలాత్కారముగా నపహరించి యిచ్చటికిఁ దెచ్చి తన్గలయ రమ్మని నిర్బంధించు చున్నాఁడు. ఇంతలో దైవము మిమ్మిందుఁ బంపెను. అనాథను. రక్షింపుఁడు. రక్షింపుఁడు.

జలంధరుఁడు—సుందరీ! భయపడకుము. మాకంఠముల జీవము లున్నంతవఱకు నీరక్కసుండు నీ నీడనైనఁ ద్రొక్కఁజాలఁడని యెఱుంగుము.

మణి—(రాక్షసునితో) ముచ్చవై యిమ్మచ్చకంటిం గొని వచ్చి భార్యయని బొంకెద వేమిరా?

రక్క—మే మిచ్చటకు వచ్చిన పిమ్మటనే యీమె నాకు భార్యయైనది. ఈమె సర్వస్వమునకు నన్నే నాయకునిఁగా నింతకు ముందే నిర్ణయించి మీరు గనంబడిన తోడనే యిట్లు బొంకుచున్నది. స్త్రీ చిత్తము క్షణక్షణమునకు మారుచుండు ననుట కిది తార్కాణము. ఎట్లయిన నీమె నేవిడువను. దేవతల నిర్జించి వారి స్థానమును మేమాక్రమించుకొంటిమి. పరాక్రమోపార్జిత యగు నీ సీమంతిని నాస్వత్వమైనది. దీనిని విడువుఁడు. లేదేని మిమ్ముఁ దగురీతిని శిక్షింపక మానను. అని యీరీతి వారికి వాదోపవాదములు జరిగి క్రమముగా ద్వంద్వయుద్ధమునకుఁ గడంగిరి. వారిపోరు ఘోరమై హేమావతికి భయవిషాద జనకమయ్యెను. ఎంత బలము గలవానికైన నిరు

పురతో పోరుట కష్టముగదా? ఇరువురు యువకుమారులు నవవయ స్కులు. బలపరాక్రమోపేతులు. మీదు మిక్కిలి రణ విద్యా విశా రదులు. ఇన్నిటికన్న నెక్కుడుగ హేమావతికిఁ బ్రియమొనర్చి యామె మెప్పువడయుటయే తమజీవిత పరమావధి యని తలంచిన యా యౌవనపురుషుల తెంపరితనమే యారాత్రించరుని నిర్వీర్యునిఁ జేసినది. కొంతసేపటికి మణిగ్రీవ జలంధరు లారక్కసుఁ బరిమార్చి హేమావతిని సమీపించిరి. వారి విక్రమ విహారము గన్నులారఁ జూచిన యాయచ్చర కాయువకుమారులయందు నిరుపమానమైన యనురాగము గల్గి సంతోషాతిశయంబున నిరువుర నొక్కసారిగఁ గౌఁగలించుకొన్నది. ఆ దృఢాశ్లేష విశేషంబున నయ్యిరువురు పురు షులు సాత్వికానంద పరవశులైరి. అయ్యోషామణి గలియ నిరువు రకు బుద్ధి బుట్టినది. మోహమూర్ఛితులై యాసచినద్వయం బొక్కిం త తడవు నిశ్చేష్టితులైరి. హేమావతివైపు దృష్టులఁ బరగించుచు నొకరి నొకరు జూచుకొనుచుఁ దమ యాంతర్యముల వ్యక్తీకరింపఁ జాలక యున్మాదుల క్రియఁ బ్రవర్తింపఁ దొడంగిరి.

హేమావతి కాయిరువురు సుందర పురుషులయందును సమానానురాగము మనంబునఁ గలిగియున్నకతంబున వారిపై విలాసదృష్టులఁ బరగించుచు మందహాసంబు మొగంబునకు నగయై మెరయ నిట్లనియె.

సుందరపురుషులారా! మీరు నేఁడీరక్కసునిఁబరిమార్చి నాకెంతేని మే లొనర్చితిరి. మీకు నేను సర్వదా కృతజ్ఞురాలను. మీరు చేసిన యుపకారమునకుఁ బ్రతిగ నా హృదయమునే మీ కర్పించుచున్నదా నను. నేను అమరావతీ పురంబున నుండు దేవవేశ్యను, మీ వయోరూప విలాసములకుఁ బూర్తిగా వశ్యురాల నైతిని. అమరనగరంబెల్ల నేఁడు రక్కసులచే నాక్రమింపఁబడియున్నది. నే నందేగినఁ దిరుగ నెట్టి

యాపదలకుఁ బాల్పడవలసివచ్చునో తెలియదు. కావునఁ గొంతకాల ము నన్ను మీరే సంరక్షింపవలయునని ప్రార్థించు నాయోషామణి పలుకుల కలరుచు మణిగ్రీవుం డిట్లనియె.—

మదవతీ! మే మిరువురము యక్షవంశ సంజాతులము. నేను చిత్రకేతుని తనూజుండను. ఈతఁడు నాప్రాణమిత్రుఁడు. జలంధ రుం డనువాఁడు. అలకాపురమే మాకాపురము. మాకు దేహములు భిన్నము లైనను ప్రాణము లొక్కటి యనియే గ్రహింపుము. మా యిరువురకు నీవు సమానోపభోగ్యవై యుండుటకు మాకుఁ బరమస మ్మతము. మఱియును నీవు యథేచ్ఛగ మా క్రీడాసౌధంబున నివసిం చియుండ వచ్చును. అందు నీ కేలోపము రాకుండఁ జూచుచుకొను చుందుము. మాకన్నులలోఁ బెట్టుకొని నిన్ను కాపాడు కొనఁగలమ ని చెప్పెను.

జలంధరుఁ డందుల కాహ్లాదించెను. అనన్య సామాన్యరూప లావణ్యంబుల నొప్పియున్న యొప్పులకుప్ప తమ్ము వరించుటచే ధ న్యుల మైతిమని తమభాగధేయమును బ్రశంసించు కొనెను. మణిగ్రీ వునకుఁ దన యందుఁ గల వాత్సల్యమునకు వానినిఁ బెద్దగ నగ్గించె ను. పిమ్మట నయ్యప్సరోభామినితో నామిత్రులిరువురును బెద్దతడవ గ్గిరి కూటముల విలాస విహార మొనరించి మించిన యానందమున నద్దివసాంతమునకు నిజ నివాసంబునకు కఱిగి హేమావతిని రహస్య ముగా నొక క్రీడాసౌధంబున నుంచి సంతత మామెతో నిష్టోపభో గంబులఁ జెలంగుచుండిరి. హేమగిరి శిఖరంబునఁ దమకుఁ బ్రథమ సమావేశ మగుటచే నా ప్రాంతములయందు వారి కెక్కుడభిమా నము గలదు. అక్కారణంబున వారు హేమావతితో నందు విహా రించుట కెప్పుడును ముచ్చటపడుచుందురు. ఇట్లు కొంతకాల మరిగిన పిమ్మట నింద్రాదులు నారాయణుని యనుగ్రహంబునఁ బగతురనిర్జిం

చి యమరావతిని నిష్కంటకంబుగఁ బరిపాలించుచుండుట యెఱింగి హేమావతి తననిలయంబున కఱిగినది. మణిగ్రీవ జలంధరులు నిత్యమును స్వర్గపురంబునకుఁ బ్రచ్ఛన్నముగఁ బోయి హేమావతీ నిలయంబున నామెతోఁ గ్రీడావినోదంబులఁ గొంత తడవుండి తిరిగి వచ్చుచుందురు. వారువిమానమునెక్కి యప్పు డప్పుడు విలాసముగా నందందు విహరించుట కూడఁ గలదు.

ఇట్లు పెద్దకాలము గతించినపిమ్మట నొకనాఁడు వ్యోమయానంబున నొక సీమంతినీ రత్నమునుదెచ్చి మణిగ్రీవజలంధరులు హేమావతీ సౌధాభ్యంతరమందిరంబునఁ బెట్టిరి. ఇట్లొనర్చుట హేమావతికి మనంబున నిష్టములేకున్నను నామిత్రుల ప్రోద్బలంబు కతంబున మిన్నకున్నది. పిమ్మట మణిగ్రీవుండు మెల్లఁగా నయ్యబల నన్నిధిం జేరి మోహావేశంబున నిట్లనియె.—

నారీశిరోమణీ! త్రిలోకమోహజనకంబైనసీ సౌందర్యంబు గన్నులారఁగాంచి క్రొన్నన విలుకాని యడిదంపు పోటులసహింపఁజాలక నేనీసాహసమునకుం బూనుకొంటిని. ఇందులకు నన్నన్యథా తలంపక కటాక్షరసప్రసారంబున నన్నాదరించి యేలుకొనుము. నీకనుసన్నల మెలంగఁ గలవాఁడను. నేనుమణిగ్రీవుండను. యక్షకుమారుండను. కుబేరుని సంతతివాఁడను. సర్వభోగభాగ్య సంపన్నుఁడను. నన్నుఁజేపట్టిన నీవు మితిలేనిసుఖంబులఁ బొందఁగలవు. ఇందులకు నీవు సమ్మతించి భవదీయ సుధామధురాధర రసంబిచ్చి నన్నుఁగృతార్థుంజేయుము. అని యింకనేమేమో మదనోన్మాదుండై వచించుచున్న వానికా యోషిల్లలామ శోకావమానజనిత క్రోధానల తీవ్రంబున ననేక నిష్ఠురములాడుచు మఱియు నిట్లనియె.

ఓరీ! బాలిశా! నీతులువ తనంబెల్ల నీచేష్టలవలననే తెల్లమగుచుండెను. నీవు దేవయోని సంభూతుండవైనను కుచ్ఛిత కార్యాచరణం

బునకు వెనుదీయని వాఁడవై నికృష్టుండవైతివి. పరనారీ సమాపహరణ మహాపాతకంబునకుఁ గడగిన నీవు క్రూరరాక్షసాధముండవు. నిన్ను జూచి నీతో సంభాషించినవారికిఁగూడ నీకిల్బిషము లంటఁగలవు. పో, పొమ్ము, అని కఠినముగాఁ బలుకుచున్న యామెపలుకులు ములుకులై మర్మచ్ఛేదంబొనర్ప నతండాగ్రహంబున నిట్లనియె.

ఏమేమీ!! నీవిందునాకు ధర్మోపన్యాసముఁ గొనరించుచుంటివా! దేశకాల పాత్రంబులెఱింగి మాటలాడకున్న యవమానముఱాఁగలదు. నీవునాయాధీనమైతివి. వంటయింటికుందేలెందుఁ బోఁగలదు. మచ్చిక నేఁజెప్పుమాటల కిచ్చగించినమేలయ్యెడిని. లేకున్న నిన్నిందు బలాత్కరించి నాయభీష్టము దీర్చుకొందును. నన్ను నీవిందంగీకరించినచో ననన్య సామాన్య దివ్యభోగంబుల సుఖింపఁగలవు. లేకున్న ముందునీవేమగుదువో నీవ యలోచించుకొనుము. ఇందులకు నీకొక్కగడియ యవకాశమొసంగితి ననియూరకుండెను.

వానిని నిష్ఠురములాడిన లాభము లేదనియెంచి యామించుబోణి కపటంబున వంచించుటయే కర్తవ్యమని నిశ్చయించి కించిత్స్మితాస్యభాస్వరమై ప్రియంబుట్టిపడునట్లు వానితో నిట్లనియె. యదువంశప్రదీపకా! తావకీన రూపయౌవనవిశేషంబులంజూచి యేచిగురుఁబోఁణి పంచశరుని తాపంబుబొందకుండును? అదృష్టవశంబున నీయట్టి దివ్యపురుషసమాగమంబు లభింపఁ గాదనుటకు నేనంత తెలియని దాననాయేమి? నీ నిశ్చయంబెంతవఱకుఁ గలదో యెఱుంగుట కట్లు విరసోక్తులాడితిని గాని మఱొకటికాదు. అందులకు నీవుమనంబునఁ గలఁతనొందఁ బనిలేదు. నేనెట్టులైన నీదాననైతిని. అయినను నాకొక్క నియమముగలదు. నే నేకభర్తృలాలస నగుటచేత నన్యపురుషు నెవ్వనిని జూడనొల్లను. నేడు మనతో విమానముమీఁద నేతెంచిన భవదన్యు డెవఁడు. వానికి నాయందభిలాషయున్నట్లు వానిచూపుల

వలననే తెల్లమైనది. నామనంబు నీయందే దృఢబద్ధమైనది. వాని నిఁక నెన్నఁడు నాయెదుటకు రానీయవలదు. ఇందులకు నీవు బాసఁ జేయవలయుననియూరకుండెను.

ఆమాటలవిని యాయువకుమారుం డమందానంద కందళిత హృదయారవిందుఁడై మన్మనోపహారిణీ! నీనియమంబు నాకెంతేని సంతసము గొల్పుచున్నది. వాఁడు నాపరిచారకుఁడు. వానిలెక్కనీకేమియునులేదు. నిన్ను పోతుటీగయుం జొరని శుద్ధాంతంబున బువ్వులలోఁ బెట్టి కాపాడఁగలను. నీవితరశంకలన్నియును విడువుము. అనిపలుకుచుండఁగనే యవ్వులనుండి జలంధరుండు తలుపుఁదట్టుచు మిత్రమా! మణిగ్రీవా! ఎంత సేపునీవందుందువు. ఈపాటి కీవలకురమ్ము. నీవంతైనడిగదా. ఇఁక నాముద్దుగుమ్మతోఁ గలసియానందించువంతు నాకిమ్ము. సత్వరము రమ్మనిపలుకుటయును మణిగ్రీవుం డదరిపడి వానినలుక మెయి గద్దించుచునిట్లనియె.

ఓరీ! తుచ్ఛుఁడా! నేనుమంచితనంబున మిత్రునివలె నాదరించుచుండ నీకెంతకండకావరమెక్కినది. నాప్రాణేశ్వరితోఁగలియుటకు నీకు నాతోవంతుకావలెనటరా! మిత్రద్రోహీ! ఇంకొక్కసారి యిట్టియవాచ్యములాడితివేని నీనాలుక వేయిచీలికలుగాఁగలదు. జాగ్రత. పో, పొమ్మనియదలించిన విని జలంధరుండు నివ్వెఱపడి యొకింత తడవేమియు మాటరాకయుండి వెండియునిట్లనియె. మణిగ్రీవా! ఇప్పుడు వచించిన బెడిదంపుమాటలునీనోటవెల్వడినవేనా! నీకాపూవుఁబోణిప్రాణేశ్వరియా! మనమిర్వురముభూలోకమున నామెంజూచి మోహించిబలిమిమై యిందుఁ దెచ్చుకొన్న సంగతిమరచితివా యేమి! ఆమెయందు నీకెట్టిస్వాతంత్రముగలదో నాకును నట్లేయుండునుగదా! ముందుగా నీవామెతోఁగలసికొనుటకు నేనుసమ్మతించిన మాత్రమున నామెకు నీవే సర్వాధికారివగుదువా యేమి? హేమావతియెట్ల

ట్ల మనయిరువుర కీమె సమానోపభోగ్యయగునుగాని యన్యముగాదు. పెక్కుమాటలుడిగి యీపాటికీవలకు రమ్ము. నన్నందుఁబోనిమ్ము. ఇందు వేరొకవైఖరి నీవుపరివర్తించిన మననేస్తములు నిలువనేరవు. సత్వరమ రమ్మని పిలుచుచుండ మణిగ్రీవుండు కటకటంబడుచు నిట్లనియె.

జలంధరా! నీయవాచ్యములకు మేరలేకున్నది. మననేస్తము లింక మీద నిలువనేరవనియా యంటివి తథాస్తు ఈక్షణము మొదలు మనకొకరితో నొకరికి సంబంధములేదు. ఇంక నధికప్రసంగము సేయక యవ్వలంబొమ్ము. ఈముద్దుగుమ్మ నీమొద్దుమోముం జూడ నేవగించుకొనుచున్నది. ఆపలుకులువిని జలంధరుండు నాదిమొద్దుమొగమును నీది రాకాచంద్రబింబమునా? నీయందమునకు నీవ విఱ్ఱవీగవలెను. ఆయెలనాగ నందువిడచి నీవిందుండి నిముసములో లేచిపోవలెను. లేకున్న యవ్వలకీడ్చించెదను. అని యనుటతోడనే మణిగ్రీవుండు మండిపడుచుఁ దటాలునఁ దలుపుతీసికొని యీవలకువచ్చి జలంధరుని జుట్టుపట్టి వంచి వీపుమీద రెండు గ్రుద్దులు వేసెను. జలంధరుఁడు వానిపై దిరుగఁబడి పాదప్రహారణంబులఁ బ్రత్యుత్తరమిచ్చెను. ఆయదనున ననంగమోహిని తన్మందిర కవాటము లోన బిగించుకొనియెను.

ఇట్లా పురుషులిర్వురుఁ దమ పూర్వప్రమైత్రిం దలంపక యన్యోన్య విజిగీషేచ్ఛా మనీషులై ముష్టియుద్ధంబొనరించుచుండ హేమావతి చరచర నచ్చటికివచ్చి వారిని గాదులుచ్చరించుచు మ్రుచ్చులారా! మీమూలమున నాకుఁగూడ నవమానము రాఁగలదు. మీపోరు విధం బెవ్వరేని విన్న నాగుట్టు దేవేంద్రునికిఁగూడఁ దెలియఁగలదు. ఇఁక మీనీచసహవాసము నాకుచాలును. తత్క్షణము నాగృహమునుండి యవ్వలంబొండు. లేకున్న బలవంతముగ గెంటింప

వలసివచ్చును. మఱియొక యుచితస్థలంబునకుఁబోయిన నొకరిబలము లొకరు తెలిసికొనవచ్చును. అనిపలుకుచుండఁగనే మణిగ్రీవుండు జలంధరుని నాంత్రములూడునట్లు గట్టిగాఁగొట్టెను. వాఁడా దెబ్బతో వ్యాకులకుఁ బైటకుఁ బారిపోయెను. వానిం దఱుముకొని మణిగ్రీవుం డేగెను. హేమావతి వారుతిరిగిరాకుండునట్లు కట్టుదిట్టములుచేసెను.

310 వ మజిలీ

# అనంగమోహినికథ

మణిగ్రీవజలంధురు లరిగిన యనంతరంబు హేమావతి యనంగమోహినియున్న గదియొద్దకువచ్చి అమ్మా! ఆముష్కరు లిక్కడ లేరు. తలుపుదీయుము వారిమైత్రి నేటితోతీరినది. స్త్రీమూలకమగు విరోధము మాటలతోఁ దీరునదికాదు. అందెవ్వఁడో యొకఁడు మడి యువఱకు నదివృద్ధిఁబొందుచునేయుండును. తలుపుతీయుము. నీకు వచ్చిన భయమేమియునులేదు. అని పలుకుచుండగనే యనంగమో హిని కవాటము తెఱచుకొని యీవలకువచ్చి హేమావతి పాద మూలమునఁ బడినది.

హేమావతి యామెను లేవనెత్తి యనునయించుచుఁ బుత్రీ! భయపడకుము. నీకా తుంటరులవలన నేయాపదయును రాకుండ నేనుగాపాడెదను. శోకంబపనయించుకొనుము. నన్నన్యురాలిఁగాఁ దలంపకుము. నీకోపినంత సహాయము చేయుటకు సంసిద్ధురాలనై యుంటిని. అనన్యసామాన్యరూపలావణ్యంబుల నలరారు నీవుశుద్ధాంతంబున నుండక యాహిమవత్పర్వతప్రాంతారణ్యంబుల కెట్లువచ్చితివి? నీతలిదండ్రులెవ్వరు? నీనివాసంబెయ్యది? నీవృత్తాంతమును వినఁ గుతూహలపడుచున్నదానను. గోప్యముగాదేని చెప్పుమనుటయు నాయన్నులమిన్న యొకింతధైర్యముదెచ్చుకొని యిట్లనియె.

అమ్మా! నికృష్టురాలనగు నాయుదంతంబుఁజెప్పి నీకుఁగూడ విచారమునుదెచ్చిపెట్టుట కిష్టములేకున్నది. అయినను నీవింతయాదరంబున నడుగుచుండఁ జెప్పకుండుట సమంజసముగాదు. నేనునాగలోకవాసుండగు వాసుకియను సరీసృపపరివృఢుని తనూజాతను. అనంగమోహినియనుదానను. నన్ను నాతల్లిదండ్రులు చిన్ననాఁటఁగోలె నల్లారుముద్దుగఁ బోషించుచు సమస్తవిద్యలనుపాధ్యాయులచేత మాయింటియొద్దనే నాకు నేర్పించిరి. అసమానవయోరూపకళాచాతుర్యంబుల నలరారు నాకుఁదగినవరుని సమకూర్పవలెనని నాతండ్రి విశ్వప్రయత్నములఁ జేయుచు నాగలోకమునందెందును నాకనురూపుఁడైన పురుషుండులభింపక యావిచారంబున నిరంతరముఁ గృశించుచుండెను.

ఒకనాఁడునేను చెలికత్తెలతో గృహనిష్కుటప్రదేశంబున విలాసముగా విహరించుచుండుటఁ గనిపెట్టి యొకరాత్రించరుండు నన్నపహరించి పైకెగసెను. ఇంతవఱకే నేనెఱుంగుదును. శోకభయవిహ్వాలనై యుండుటచేత వాఁడు నన్నెచ్చోటకుఁగొంపోయెనో చెప్పఁజాలనుగాని నాకుఁ దెలివివచ్చునరికి నేనొకపర్వతశిఖరంబున గుహాముఖంబున లతలచేఁ గల్పింపఁబడిన శయ్యయందుంటిని. అచ్చట నేనొంటిగానుండుటకు భయంపడుచు నాశయ్యనుండి మెల్లగాలేచి నలుమూలలు బరికింపఁదొడంగితిని. ప్రాంతమం దిరువురురక్కసులుక్కమెయిఁ గయ్యమాడుచుండుటఁ బరికించి యక్కడనున్న నేమికీడుమూడునోయని యొకమారు మూలదారింబడి పారిపోతిని.

అట్లు పోయిపోయి యెదుర నిర్మలజలాశయంబుగని యందలి జలంబుల నాపోవఁద్రావి యాప్రాంతశీతలతరుచ్ఛాయలబడలికలువాయ విశ్రమించితిని. ఇంతలో నాకెక్కడలేనినిద్ర వచ్చినందున నచ్చటనేహస్తోపధానంబుగఁ బండుకొని గాఢముగనిద్రఁబోతిని. కొంతసేపటికి నాకొకస్వప్నమిట్లువచ్చినది.

నాగలోకంబున ననుంగుకత్తెలు బలువురుపరివేష్టించిరా విహారార్థమై యాప్రాంతముల కొకయశ్వశకటంబునెక్కి యరిగితిని. ఆ బండికిం గట్టిన యశ్వము చోదకుని యాజ్ఞానువర్తిగాక బండినెక్కడికో తీసికొనిపోయి యొకచోనిలచినది. అప్పుడుబండివాఁడు క్రిందకు దిగి యశ్వమును ప్రాంతమందున్న సరస్తీరంబున నీరుద్రావించుటకుఁ దీసికొనిపోయెను. మేమును బండిదిగి యింతలో నూరకయుండనేలనని యాప్రాంతవిశేషములఁజూడ నొకమార్గమునఁబట్టి కొంతదూరమరిగితిమి. ఎదుర కనకమయగోపురప్రాకారములతో నొప్పు దేవతాయతనంబొండు నేత్రపర్వంబొనర్చుటయు మేమతికుతూహలంబున నచ్చటి కరిగితిమి. అదియొకయమ్మవారి యాలయము. అందెవ్వరును లేరు. కవాటములు తెఱచియేయుండుటచే మేమునిరాటంకముగా నాదేవి యాలయంబు బ్రవేశించి ముమ్మారువలఁగొని యమ్మవారిని సందర్శింప గర్భాలయమున కరిగితిమి. అందుసహస్రసంఖ్యాకములగు దీపములు వెలుఁగుచున్నవి. దివ్యధూపవాసనలు దిశలవ్యాపించుచున్నవి. నానాజాతిపుష్పపరిమళమిళద్గంధవహాంకూరములు హృదయంగమమై యొప్పుచుండెను. ఆదేవినప్పుడే యెవ్వరోయర్చించినరీతిని యందున్న ధూపదీపమాల్యాలంకారములు తెలుపుచున్నవి. ఆ యమ్మవారిపీఠముముందు పాతాళేశ్వరియని చెక్కఁబడిన సువర్ణాక్షరములు దీపకాంతులచే ధగద్ధగాయమానముగ వెలుఁగుచుండెను. ఆదేవింజూచి భక్తిపురస్సరంబుగా ననేకవిధంబులస్తుతియించి చేతులు జోడించి లోకైకజననీ! నేఁడునీదివ్యదర్శనముంజేసి చరితార్థురాలనైతిని. నాజననంబుపావనంబయ్యెను. అనురూపవరుని సమకూర్చి నాకు సంతోషమాపాదింపుము. నీపాదభక్తి నెన్నఁడును నెడబాయని బుద్ధి నాకుఁ గలిగింపుము. అనివేడుకొనుచున్న నాకమ్మవారు దరహాసితముఖాంబుజయై పుత్రీ! నీయదృష్టముమంచిది. అనతికాలంబుననే

యొక్క దివ్యప్రభావసంపన్నుఁడగు పురుషుని పాణింబట్టి యనంత సుఖంబులం బడయఁగలవు. నీకుసంభవించు నిక్కట్టులన్నియు నాతఁడే తీర్పఁగలఁడు. నీశిరోభూషణమందలి రత్నము మృతసంజీవినియను నామముగలది. మరణించినవారు దాని స్పర్శలేశమాత్రంబుననే బ్రతుకఁగలరు. అనిచెప్పుచు నొకయద్భుతఫలంబునాకిచ్చి యీఫలంబును వెంటనేభుజింపుము. దీనింటినినవారికి క్షుత్పిపాసలుండవని యానతిచ్చినది.

అప్పుడు నేను నిరతిశయానందహృదయసరోజాతనై యాభువనేశ్వరిపాదపద్మంబులకు సాష్టాంగమొనరించియున్నతరి నాచెలికత్తియలందున్న పెద్దగంటమ్రోగింపఁదొడంగెను. ఆధ్వనిచేతనో మరెందువలననో నాకునిద్రాభంగమైనది. అంతమేల్కొని యిటునటు పరికింప నాప్రక్కలో నమ్మవారిచ్చినఫలముగనంబడినది. దానికి వెఱఁగందుచు నేననిక్కముగా నమ్మవారిగుడికిఁబోతినాయని వితర్కించుకొనుచు దేవీవచనంబువడువున నీపండుదినినఁ దప్పేమని యాలోచించుచు నాక్షణమ దానింగోసి యాహ్యాయనంబుగభక్షించి దానిరుచి విశేషంబునకు మిక్కిలి యద్భుతమందితిని.

పండుదిననదిమొదలు నాకు క్షుత్పిపాసలునశించి మేనికి నూతనోత్సాహ మంకురించినది. ఆప్రదేశమును మూడుదినములవఱకు విడువక యందేనివసించి నిద్రబోయినప్పుడెప్పుడైన నట్టి వింతకల వచ్చునేమోయను నాసతోఁబ్రొద్దులుపుచ్చితిని కాని నాకట్టికల తిరుగనెన్నఁడును రాలేదు. నాలుగవదినంబున నాస్థలమువిడచి ముందునకుఁగొంత దూరమరిగితిని. ఆనాఁడుసూర్యాస్తమయసమయంబున నొక నరవననుసరించి పోవుచుండఁ గొండపైనుండి యెద్దియోదొర్లి వచ్చుచున్నట్లు కనంబడినది. నేనించుకవిమర్శించిచూచుచుండ నొకరాకాసి శవము క్రిందఁబడినది.

ఆశరీరము పతనవేగంబునఁ దుత్తునియలైనది. దానిం దిలకించి దయఁదలంచి మచ్ఛిరోరత్న ప్రభావం బమ్మవారివలన వినియున్న కతంబున నప్పుడే యారత్నమును దలనుండితీసి వాని మేనంతయుఁ దగిలించి నాసాపుటంబుసన్నిధి నించుక సేపుంచితిని. ఇంతలో నక్కళేబరంబునఁ జైతన్యముగలిగినట్లు తోచినది. విస్మయముతో నేనట్లె చూచుచుండ నారక్కసుండు స్వస్థతంగాంచి కన్నులుదెరచి యెదుర నున్న నన్నుజూచి దరహసితముఖుండై దిగ్గునలేచెను. వాఁడు పునర్జీవితుండగుటకు నేనుసంతసించుచు నమ్మవారిమాటల కానందించుచు మదీయశిరోరత్న ప్రభావంబున కుబ్బుచు నారాత్రించరుని వృత్తాంత మెఱుంగఁగోరి వానినడిగిన నాతో వాఁడిట్లనియె.

తరుణీశిరోమణీ! నేను నికుంభుఁడనువాఁడను. కుంభునిసోదరుండను. మేమిరువురము రసాతలనివాసులమే, నీరూపలావణ్యాదులఁ జూచి వలచి మేమిరువురము నిన్నపహరించుకొనివచ్చి యిందుఁజేర్చితిమి. నీనిమిత్తమే మాకిరువురకు నీప్రాంతమందు పెద్దయుద్ధముజరిగినది. చివుర నేనునిర్జింపఁబడి పలాయితుఁడనైతిని. నిన్ను బొందునాస యంతరించుటచే విరక్తుండనై సోదరునివలనబడిన పరాభవంబు హృదయంబెరియుచుండ జీవనముపై నాసవిడచి యీకొండనెక్కి భృగుపాతంబునఁ జావఁదలంచి క్రిందకురికితిని. అచ్చటిదారుణ శిలాభిఘాతంబున నిముసములో స్మృతితప్పినది, తరువాతనేమైనదో నాకు తెలియదు. తెలివివచ్చి చూచుసరికి భవదీయ దివ్యరూపంబు నా కన్నులయెదుట సాక్షాత్కరించినది. భృగుపాతంబునఁబడిన శ్రమంబంతయును నిన్నుఁజూచుటతోడనే పోయెను. నాకిప్పుడు నూతనశక్తి గలిగినది. దైవమే నన్నునీసన్నిధికిం దెచ్చిపడవేసెను. భగ్నమనోరథుండనగు నాకునిన్నుజూచునప్పటినుండియు హృదయక్షేత్రంబున నూత్నయాశాంకూరములు ప్రభవించుచున్నవి. అనియేమేమో మద

నోన్నాందంబునఁ జేరిలుచున్న వానిఁ దిరస్కరించి యావలంబోమ్మని నేననుచుండఁ గుంభుఁడక్కడి కెక్కడనుండి యోవచ్చెను.

వానింజూచి నికుంభుఁడు కాలికొలఁది పారిపోయెను. అందు కుంభుఁడు నన్ను బలాత్కరింపఁబోవ నొకదివ్యప్రభావ సంపన్నుఁడగు పురుషశ్రేష్ఠుం డక్కడకువచ్చి కుంభుని బరిమార్చి నన్నుఁగాపాడెను. ఆనూత్న పురుషుని రూప రేఖవిలాసాదుల వీక్షించిన నిర్దుష్టమగు మన్మనంబు సంచలించెను. అమ్మవారి మాటలు దలంపునకు వచ్చెను. అతఁడే నాపతియని నిరూపించుకొని నాయభిప్రాయ మమ్మహాపురుషున కెఱింగించితిని. ఇంతలో వ్యాఘ్రనెపంబున నతఁడు దొలఁగిచన నేనొంటిగానందుంటిని. అయ్యెడ నెఱేఁగి యీతుచ్ఛులిర్వురునువచ్చి నన్ను బట్టుకొని బలవంతముగా విమానమెక్కించి నీతోఁగూడ నిక్కడకుఁ దీసికొనివచ్చిరి. మీఁద యుదంతంబంతయు నీవెఱింగినదే. అని తనకథ నామూలచూడముగా వక్కాణించి యనంగమోహిని వేడినిట్టూర్పుల నిగుడించుచు వెండియునిట్లనియె.

తల్లీ! నాయుల్లమున హత్తియున్న యాపురుషప్రవరుం డెవ్వరో నేనెఱుంగను. ఏలోకమువాఁడో నాకుఁ దెలియదు. నన్నాయరణ్యంబునఁ గానక నాకై యెంతపలవించుచున్నాఁడో గ్రహింపఁజాలను. అతనినే నేను త్రికరణములచేతనుఁ బతిఁగావరించితిని. వానినే నా కీశ్వరుండొడయనిగా సృజించెను. వానిం గాక నింకొకనిఁ గంతుఁవ సంతజయంతాదుల రూపంబున నిర్జించినవానినైన నేనొల్లను. ఇదియే నానిశ్చయము. ఆపురుషోత్తముని నేనెట్లుచేరఁగలనో నీవ యాలోచించి నన్గాపాడుము. ఇదియే నీవునాకుఁ జేయఁదగిన మహోపకారం బని వేడుకొనుటయు హేమావతి యామెకిట్లనియె.

అబలారత్నమా! నీయుదంతంబు వినినప్పటినుండియును నాకు నీయందు జాలిగలుగుచున్నది. నీతండ్రి జగద్విఖ్యాత యశోవిరాజి

తుండు. అట్టివానికిఁ బట్టివై పుట్టినను నీకిట్టి యిక్కట్టులు తప్పవయ్యె ను. ప్రారబ్ధంబెవ్వానికైన ననుభవింపక తప్పదుగదా? మఱియును నీవు వరించిన పురుషుఁ డెవ్వఁడో యెఱుంగక వానిసన్నిధికి నిన్నేర్పఁ గలుగుటెట్లు? ఇప్పుడు నిన్ను నీతండ్రిసన్నిధికిం బంపెద నంగీకరింతు వా యనియడుగుటయు ననంగమోహిని యందుఁ జేరినపిమ్మటఁ జూచుకొనవచ్చునని యెంచి యందుల కంగీకరించుచు నిట్లనియె.

అమ్మా! భూలోకమునుదాటి నాగలోకమేగుటకు వీలులేదు గదా? దివోదాసుని శాసనమతిక్రమింపవచ్చునా? యనియడిగిన నయ్యచ్చర మందస్మితయగుచు తరుణీమణీ! రసాతలమునుండి దివిజ లోకంబున కెట్లువచ్చితివో యట్లె యిందుండి యందుఁబోరాదా? ఆపదలయందు శాసనము లాగఁగలవా? భయములేదని పలికిన నక్క లికి యందులకు సమ్మతించినది. అప్పుడే హేమావతి తనచెలికత్తె య లిరువుర కనంగమోహిని నప్పగించి యామెను దివ్యయానంబున రసాతలంబునకుఁ గొనిపోయి వాసుకికప్పగించిరండని నియోగించినది.

అనంగమోహిని ముప్పిరిగొను సంతసముతో హేమావతి యనుజ్ఞఁగైకొని యాచెలికత్తియలతో విమానశాలవైపు నడచు చుండెను. అప్పుడెచ్చటనుండియో యొకభీకరాకారముగల వ్యక్తి యువ్వెత్తుగవచ్చి యనంగమోహినిని సందిటఁబట్టుకొని రివ్వున బై కెగిరిపోయెను. హేమావతి చెలికత్తెలమ్మా! రక్కసుఁడు. రక్క సుఁడు. అనంగమోహిని నెత్తుకొనిపోయినాఁడని యాక్రోశించుచుఁ బోయి యావార్త హేమావతికెఱింగించిరి. అనంగమోహినికివచ్చిన కష్టపరంపరల కామెమిక్కిలి విచారించినది. ఈవృత్తాంతము నలువు రకుఁ దెలిసిన దనగుట్టు క్రమముగా బట్టబయలగునను భీతిచే యెవ్వరి కిం దెలియనీయక కప్పిపుచ్చెను. అప్సరోయువతులఁ దిరస్కరించు రూపలావణ్యంబుల నొప్పియున్న యనంగమోహిని యెట్లయిననమర

లోకమునుండి యవ్వుల కేగుటకు హేమావతి మనంబున సంతసించెను.

రక్కసుండొక్కడే తెంచి యెవరినో వేలుపుముద్దరాలి నపహరించుకొనిపోయెనను వార్త యెట్టులో స్వర్గపురవీధులయందెల్లెడల వ్యాపించి క్రమముగా శచీకళత్రునికిఁ గూడఁ దెలిసినది. స్వర్గమందలి వారెవ్వరును దప్పిపోలేదని తెలిసికొని యావార్త ప్రమాదజనితంబని యూహించి యూరకుండిరి.

## 311 వ మజిలీ

అలకాపుర సమీపప్రదేశ మొక్కనిముషములో మహాసంగ్రామరంగస్థలముగా మారినది. యక్షలోకంబంతయును సంవర్తసమయసముద్భూత ప్రచండజంఝామారుతవిలోలకల్లోలమాలా వికీర్ణమహార్ణవంబు తెఱంగున భయంకరంబయ్యెను. మణిగ్రీవజలంధరుల కలహము మొదట ద్వంద్వయుద్ధములోనికి దిగినది. ఈవార్త పురములోనివారికిఁ దెలిసి పలువురా యుద్ధరంగమున కేతెంచి యతిదారుణముగాఁ బోరుచున్న వారింగాంచి యెవరిపక్షమువారు వారివైపు జేరి కయ్యమొనర్పసాగిరి. అద్వంద్వయుద్ధమే సంకులసమరమయ్యెను. ఈయుదంతంబు పిన్నలనుండి పెద్దలవఱకుఁ బ్రాకినది. యక్షులలో రెండుపక్షములేర్పడి చివరకయ్యది దారుణసంగ్రామముగా మారినది. ఆసంగ్రామ రంగమునందు కత్తులసవరించువారును బల్లెములనెత్తువారును వింటినారులసరిజేయువారును బాణపుంఖంబులకు నెఱకలంగట్టువారును పరశువులంబట్టువారును భిండివాలంబులఁగదల్చువారును పట్టిసంబులఁబరికించువారును తోమరంబులఁ జేఁబూనువారును, గదలఁద్రిప్పువారును, గలిగి యయ్యది మహాసంరంభ దుర్నిరీక్ష్యమైయొప్పెను.

అంతకుపూర్వ మత్యంతమైత్రితోఁ దిరుగువారిప్పు డిట్టు దారుణసంగ్రామంబునకు గడంగుట కేమిహేతువో యిందిరువాగుల

వారెవ్వరికిని దెలియదు. అంతకంతకా సాంపరాయక మతిభీభత్స మగుచుండెనేగాని ప్రశాంత మెుందు సూచనలేమియుఁ గనంబడుట లేదు. చిత్రకేతుండును సబాంధవమిత్రబృందముగాఁ గోడుకుపక్ష మున కేగి యీసుమెయి బ్రత్యర్థులతోఁ బోరాడుచుండెను. ఆసమయం బునఁ గుబేరనలకూబరులు దేవసభకు స్వర్గంబున కేగి యుండుటచేఁ దమపురంబునజరుగుచున్న యీయుద్ధవిషయమేమియు నెఱుఁగనే యెఱుఁగరు.

అలకాపురం బట్లు యుద్ధనిమగ్నమై యున్నకతంబున వీధు లెల్ల శూన్యములైనవి. పురుషుఁడైనవాఁ డొక్కరుఁడును నగరమం దులేఁడు. సౌధోపరిభాగములయం దచ్చటచ్చట స్త్రీలుమాత్రము గనిపించుచుండిరి. అట్టిసమయంబున మనదివోదాసుండు పాదచారి యై రాజమార్గంబునఁ బోవుచుఁ గ్రమంబునఁ జిత్రకేతుని ప్రాసాద సమీపమునకు వచ్చి యాప్రాంతములయందు కింకర్తవ్యతామూఢుం డై యిటునటుదిరుగుచుండెను.

తత్ప్రాసాదోపరిభాగమున నుండి దూరమందుజరుగుచున్న యుద్ధమునుగమనించుచున్న గుణవతిదృష్టులుదటాలున వీధియందున్న దివోదాసునిపైఁ బ్రసరించెను. వానిరూపలావణ్యజాలంబుల నామద గజయాన నేత్రరాజీవంబులు జిక్కుపడినవి. అందులకుసందడించుచు నయ్యిందువదన చిత్రలేఖను చేరఁబిలచి మోహావేశంబున నిట్లనియె.

నెచ్చెలీ! ఈయుద్ధసమయంబున నొంటిగా, వీధింజరించుచున్న యాపురుష శ్రేష్ఠుందిలకించితివా? ఈభాగ్యశాలి విమర్శింప మానవుఁడువలెఁ దోచుచున్నది. భూలోకమునుండియిచ్చటి కెట్లువచ్చెనో గదా? ఆహా! వీనియంగసౌందర్యము త్రిభువనాసేచనకంబుగనున్నది.

శా. ఔరా! మైజిగి! హైసరే! నడలయొయ్యారం! బాహా! మోముసిం
గారం! బద్దిర! తళ్కులీను నిడువాల్గన్దోయి యందంబు! మ

జ్జారే! నెన్నడు రొప్పిదంబు! భళిరే! చక్కందనంబెల్లనీ
తీరౌరూపము దాల్చెఁ గావలయుఁ బ్రీతిన్ జూడుమా నెచ్చెలీ.

శా. ఏమే! చూఁతివే నిదానముగ రాకేందుస్ఫురద్వక్త్రునిన్
నామాటల్ నిజమంచుఁ దోచెనుగదా! న్యాయంబు గాఁపినినా
కామున్ గేలినతోఁటఁ బోల్పఁదగునా కళ్యాణరూపంబునన్
నామీఁదన్ దయఁజూపి తెల్పఁగదె? యున్నట్లెల్లఁ దెల్లంబుగా.

ప్రియంవద. స్వయంప్రభాదేవియే పినినిప్పట్టున నాకొఱకై తీసి కొనివచ్చినసఖి తోడనున్నది. ఈతఁడే సేనాపతి త్రికరణంబుల నీతనినే కాంతునిఁగా వరించితిని. నీవు వేగ మాయనఘుని సన్నిధి కేగి వాని నాయంతఃపురంబునకుఁ దోడ్కొనిరమ్ము. పొమ్ము అనితొందరఁబెట్టుటయు నా చిత్రలేఖ విస్మయం బభినయించుచు నిట్లనియెఁ

ప్రాణసఖీ! వానికులగోత్రనామశీలంబు లెఱుంగక చూచినంత మాత్రముననే పతిగా వరించు టుచితంబొను లెందైనఁగలరా? నీవింత మాత్రముం బొండ మేలగునా? నిన్ను వంచింప నిట్టేరాత్రించరుఁ డైనమాయవేషముఁబూని వచ్చియుండిన నేమిజేయుదువు? యౌవనప్రాదుర్భావజనితమహామోహాతిరేకంబున నాయపరిచితుని నంతఃపురంబునకుఁదోడితెమ్మనుట ప్రమాదముగాదా? అని మందలించు చెలికత్తియ కమ్మదవతి యిట్లనియె.

చిత్రలేఖా! నీమాటలేమియును నాహృదయంబునకుఁ బ్రియంబులు గాఁజాలవు. ఆతఁడుతప్పక స్వయంప్రభాదేవియనుగ్రహంబుననే యిందువిచ్చేసెను. నిర్దుష్టమగుమన్మనంబే యిందులకుఁ బ్రమాణము. నాయభిప్రాయమునకుఁ బ్రతికూలముగా నీవేమియు నింకఁజెప్పవలదు. నేనుచెప్పినట్లు నీవువినవేని నాప్రాణములు మేననిల్వవని నిక్కముగ నమ్ముము. సత్వరము నామనోహరునిసమీపమున కేగి యెట్లయిన వానినిందుదోడ్కొనిరమ్ము. ఈపాటియుపకారము నాకు

జేయుము. నీమేలెన్నఁడును మరువ ననిబ్రతిమాలుచున్న గుణవతి కేదు రాడనోడి యవ్వలనున్న యానూత్న పురుషుని వృత్తాంత మరసివచ్చెదంగాక యని చిత్రలేఖ యప్పుడే క్రిందకుఁబోయినది.

అప్పటికి దివోదాసుండావీధి దాటి యదృశ్యుండయ్యెను. చిత్రలేఖ వానినన్వేషించుచు నాచుట్టుపట్టులం దరుగాడుచుండెను. ఇంతలో నాప్రాంతమందొకఁడు దానియాక్రందనధ్వని వినంబడుటయు నా చిత్రలేఖ విభ్రాంతయై యెట్టెటని యాలకింపుచుండ నొకవైపునుండి వెలువకుము. వెలువకుమని పెద్దగాఁ గేకలువేయుచు పురుషుఁడొకఁడు పైకెగయుటయుఁ గనిపట్టెను. వానింజూచి గుణవతిచే వరింపఁబడిన వాఁడే యని నిశ్చయించి యాత్రిశంకుని వానిపోకఁ బరీక్షించుచుండెను.

ఆపురుషుండట్లు పైకెగసిపోయి యొకయుబల నెత్తుకొనిపోవుచున్న రక్కసిమొత్తక్కలినిం గవిసి నిలు. నిలుమని యదలించెను. వాఁడీ పురుషునిఁ జూచి చకితుఁడై ముందుఁబోవుటమాని తిన్నగాఁ గుణవతి యున్న సౌధంబుమీఁద వ్రాలెను. దివోదాసుండును వాని వెంటాడి యాసౌధోపరిభాగంబు జేరి యారక్కసుని జుట్టుపట్టుకొని నిలువఁబెట్టెను. వానిసందిటనున్న పూవుఁబోణి యావలఁబడి భయోద్రేకంబున నందొకగదిలోనికిఁ బారిపోయెను. ఆయద్భుతదృశ్యంబున కందున్న యోషిజ్జనంబెల్ల భయవివశలై యంతర్గృహంబుల కేగిరి.

ఆరక్కసుండట్లు దివోదాసునిచేఁజిక్కి చేయునదిలేక చేతులు జోడించి నమస్కరించుచు రక్షింపుము. రక్షింపుమని ప్రార్థించెను.

దివో—(మహాక్రోధముతో) తుచ్ఛుఁడా! నీవెవ్వఁడవు? ఆ నారీశిరోమణి నేమిటికట్లపహరించుకొనిపోవు చుంటివి? ఆమె యెవ్వతె? నిజము చెప్పుము. లేకున్నను తుక్కుతాకతీవ్రధారాభిఘాతింబున నీకంఠంబూడిపడఁగలదని కత్తిపైకెత్తెను.

రక్క—పురుషపుంగవా! నీబలపరాక్రమంబుల నేనెఱుంగు దును. హిమవత్పర్వతప్రాంతములఁ నాఁడు నాయన్నయగు కుంభుని నీవునిర్జించుట నేనుకన్నులారఁజూచితిని. నీవెత్తినకత్తిని క్రిందకుదింపు వఱకు భయోద్రేకంబున నానోటమాట వెల్వడకున్నది. ఆపన్నుఁ డనై ప్రార్థించుచుంటిని. ఇంచుకశాంతివహింపుము. నాపైననుగ్ర హముఁజూపుము శరణాగతత్రాణుండవుగమ్మ. అని డగ్గుత్తికతోఁ బ్రార్థించెను.

దివోదాసుఁడు—ఓరీ! నాచేత నాఁడు నిర్జింపఁబడినవాఁడు నీ కన్నయగునా? అప్పుడు నీవెందుండిచూచితివి? ఇచ్చటికేలవచ్చితివి నీయుదంతంబింతేని దాపక వైళముచెప్పుము.

రక్కసుఁడు—మహాత్మా! నేనురసాతలవాసుఁడను. కుంభ నికుంభులమను మేమిర్వుర మన్నదమ్ములము. వాసుకితనూజాతయగు ననంగమోహినింగాంచి మేమిరువురము మోహించి యెట్లయిన నామెం గవయు నాసతోఁ దిరుగుచుంటిమి. రసాతలమునుండి యామెను మేమే యపహరించి భూలోకమునకుం దెచ్చితిమి. హిమవ త్పర్వతసన్నికర్షమం దామెను బలాత్కరించుచున్న మాయన్నను మీరునిర్జించు నప్పుడు నేనొకప్రాంతభూరుహముమాటున నుండి చూచుచుంటిని. పిమ్మట వ్యాఘ్రవేషంబున మీరేగుటయు నంతలో నిరువురు యక్షులామోహనాంగిని బట్టుకొని విమానమునంబెట్టు కొనిపోవుటయుంగూడఁజూచితిని. ఆచిగురుఁబోఁడిపైఁ గలయాసంజేసి నేనావిమానముపోయినదారినే యంబరంబునకెగసి ప్రచ్ఛన్నముగా బోతిని.

ఆవిమానము స్వర్గమందు హేమావతి గృహారామమందు నిలచినది. అనంగమోహినిందీసికొనియందున్నవారు తత్సౌధములో నికిఁ బోయిరి. నేనాయుద్యానమందున్నమంజునికుంజమంజరుల నడు

గియుండి వారిచర్యలన్నియుఁ గనిపెట్టుచుంటిని. పిమ్మటఁ గొంతసే
పటికాప్రాసాదంబునందు వాక్కలహము వినంబడుటయు నేనొరుతె
ఱుంగకుండ తత్సౌధోపరిభాగంబునకెగసి యందొకరహస్యప్రదేశంబు
నంబొంచియుండి వారిమాటలాలకించితిని. అందొకఁడు మహాగ్రీవుండును
రెండవాఁడు జలంధరుండును. వారాయనంగమోహినికొఱకు తగవు
లాడుకొనుచు తుదకందుండి యవ్వలంబోయిరి. పిమ్మట నిరువురు
చెలికత్తెలసహాయమున ననంగమోహిని విమానశాలవైపు బోవు
చుండుటఁగ్రహించి మించినతమకంబున నయ్యబలను బట్టుకొని పై
కెగసిపారిపోతిని.

అట్లతిజవంబునం బోవుచుండ నాకుముందొక దివ్యయానము
గనంబడినది. దేవతలెవ్వరైన నందెక్కి నన్నుఁబట్టుకొనుదలంపున
వచ్చుచుండిరేమో యనుభయంబున వెనుకకుఁ దిరిగి పెద్దదూరమరిగి
తిరిగి తిరిగి యిప్పటికి దైవోపహతుండనై పులిం దప్పి సింహముఁ జేరినట్లు
వచ్చి నీకుఁజిక్కితిని. ఆబాలామణికొఱకు నేనెంతపరితపించితిని. నాయం
దానాతి కిసుమంతైన ననురాగములేదు. అట్టి ప్రేమములేని భామినికై
వలవంతఁబడుట మిక్కిలి యవివేకమని నాకిప్పటికి దోచినది. ఇఁక
బుద్ధివచ్చినది నేనెన్నఁడు నిట్టిపనికిఁబూనను. ఈతప్పు సైరించి నన్ను
క్షమింపఁ బ్రార్థించుచున్నాను. అని దీనముగ వేడుకొనుచున్న
యానికుంభుని వృత్తాంతమంతయును విని యాభూపాలుని హృదయంబున విస్మ
యపరితాపంబులు మొగంబునఁ గనుపింప నిట్లనియె.

ఓరీ! నీవిప్పుడు ప్రస్తావించుకొనిన యా మచ్చకంటి యల్ల
నాఁడు హిమవన్నగపార్శ్వంబున నాతోఁ గొంతముచ్చటించిన మించు
బోణియేనా? యనియడుగుటయు వాఁడు దేవా! ఆవృత్తాంతముగూడ
నేనెఱుంగకపోలేదు. ఈమెయే నాఁడు మిమ్ముఁ బ్రాణేశ్వరునిఁగా
గోరిననారీశిరోమణి. అగ్నిశోధితమగు సువర్ణంబువలె నీబాల వన్నె

కెక్కినది. ఎన్నెన్ని సిలుగులంబడినను తనశీలము గాపాడుకొనఁగల్గినది. ఎచ్చటెచ్చటకుఁ ద్రిప్పఁబడినను జివురకు మీరున్న ప్రాంతమునకే వచ్చిచేరినది. మీయిరువురం గలుపుటకు దైవసంకల్పమైయుండ వచ్చును. ఇట్టిదాని కెవ్వరేమిప్రతిబంధకము గల్పించినను నిష్ఫల మగును. నేనా నారీమణి నిఁకఁ గలనైనఁ జెడుతలంపునఁ జూడనని ప్ర మాణముజేయుచున్నాను. ఇంతటినుండి యామె నాకుతల్లివంటిది. దేవరకొఱకే సరసిజగర్భుఁడావిరిబోణిని నిర్మించెను. నాకిఁక నాగ లోకంబునకుఁ బోవ సెలవొసంగి యీయంగనామణిని బత్నిగా స్వీక రించి స్వర్గసుఖంబులఁ బొందుఁడు. అనిపలుకుచున్న వానితో నావు డమియొడయఁడు దయామేదురహృదయారవిందుఁడై గంభీరవచనం బుల నిట్లనియె.

ఏయంగనామణి యాక్రోశంబువిని తదన్వేషణంబునకై భూ లోకమునుండి యీలోకంబునకే తెంచితినో యాతరుణీమణిని మంచి తనంబుచేతఁ గాకున్నను నీవునాసన్నిధిం జేర్చి నాకు గొంతశ్రమ తగ్గించితివి. ఈయుపకారంబునకుఁ బ్రతిగా నీతప్పులన్నియును సైరిం చి క్షమించివిడచిపుచ్చుచున్నాను. పొమ్ము పశ్చాత్తాపంబుబొందుట వలన బ్రతికిపోతివి. ఇఁకనెన్నఁడునిట్టి యకార్యకరణంబులకుఁ బూన కుఁ మని చెప్పి వానినప్పుడే పంపివేసెను. వాఁడును మృత్యుముఖం బునుండి యీవలంబడినట్లెంచుచు నిజవాసంబునకుఁ బోయెను.

ఈసంవాద క్రమంబంతయు నాలించుచున్న యనంగమో హిని తటాలునఁ దలుపుదీసికొని యీవలకువచ్చి మనోహరా! రక్షిం పుము. రక్షింపుమని దివోదాసునిపాదములంబడి తాఁబడినయిడుమ లందలచికొని వెక్కివెక్కి యేడువఁ దొడంగినది. ఆరాజేంద్రుఁడామెను లేవనెత్తి యక్కునంజేర్చుకొని యశ్రుజలంబుల నిజోత్తరీయంబునఁ దుడుచుచు గాఢానురాగంబున ముంగురులు సవరించుచుఁ బ్రీతి

పూర్వకముగ మోమునివురుచు మోహాతిరేకంబునఁ జెక్కులు ముద్దుంగొనుచు నామె శోకమంతయును దృటిలో మఱవుజెందునట్లు సుధాధారలొలుకు పలుకుల ననునయించుచు మఱియు నిట్లనియె.

హృదయేశ్వరీ! ఎన్నెన్ని బన్నములఁ బెట్టినను దైవమునకు మనయందిప్పటి కనుగ్రహంబు కలిగినది. గతించినదానికి వగవకుము. ఇఁకనిన్ను నాయరచేతులందు బెట్టుకొని సంరక్షించుకొందును. నీకే భయమును లేదు. మనంబున స్వస్థతంబొందుమని యూరడించుచున్న మనోహరున కేమియును మాటలవలనఁ బ్రత్యుత్తరమొసంగఁజాలక వానిహృదయంబున శిరంబు మోపి దృఢాశ్లేషమొనరించుటయే సమాధానముగా మెలంగెను.

ఇంతలో వారియుదంతమంతయును బరీక్షించుచున్న గుణవతియును నామెచెలికత్తియలును వారిసన్నిధికే తెంచిరి. వారిఁగాంచి యనంగమోహినియును దివోదాసుండును నివ్వెఱంబడుచు నొకరి నొకరు విడచి యించుకలొలగియుండిరి.

అప్పుడుగుణవతిపనికత్తియలచే వారికుచితాసనంబులం దెప్పించి వేయించినది. అందరు సుఖాసీనులైనపిదప వారివృత్తాంతము నామూలచూడముగాఁదెలిసికొని గుణవతి యద్భుతమందుచు ననంగమోహిని సౌశీల్యముంబొగడుచు దివోదాసుని బలపరాక్రమముల కానందించుచుఁ గొంతపొద్దుపుచ్చినది. చిత్రలేఖయు నింతలోనచ్చటికివచ్చి వారివృత్తాంతమెఱింగి యక్కజపడుచుండెను.

పిమ్మట దివోదాసుం డానారీమణుల గుర్తుపట్టి శబరబాలకశరీరమొందున్నదో వారివలననెఱుంగఁగోరి యమ్ముద్దుగుమ్మలతో నల్లన నిట్లనియె. బాలికామణులారా! ఈపురబాహ్యోద్యానమందు విలాసవిహారమొనరించు మిమ్మిదివఱకొకసారిచూచినట్లు తలంచుచున్నాను. అప్పుడు మీరొకనరబాలక ప్రేతంబును గూర్చి కొంతముచ్చ

టించుకొంటిరిగదా? ఆవృత్తాంతము నేనెఱుంగవచ్చునా యని యడిగెను.

అప్పుడుగుణవతిప్రభృతులు ఆశ్చర్యముసూచించిరి.

చిత్రి—అవును అప్పుడు మీరెచ్చనుంటిరి.

దివో—అచ్చటిపూపొదరింటిచాటుననుండి మీసంభాషణ మాలించుచుంటిని.

చిత్ర—(నవ్వుచు) పురుషప్రవరా! ఆడువారము. కేళికోద్యాన వనాభ్యంతరమున విలాసముగా విహరించుచుండ పురుషులు పొంచియుండవచ్చునా? అంతియకాకుండ సంభాషణమువినవచ్చునా? విచ్చలవిడి యాడువాండ్రువిహరించుచున్నప్పు డెన్నిపరిశంసలువచ్చుచుండును. అవియన్నియును మగవారు వినఁదిపురుట సమంజసమేనా?

దివో—లోకాంతరమందుండి నూతనముగా వచ్చినవారి కెవరిపరిసంగములైన వినకున్న నందలి వృత్తాంతములెట్లు తెలియఁగలవు. ఇదియునుఁగాక యపురూపపు రూపయౌవనవిలాసయగు మీసఖీమణి లావణ్యతేజః పుంజమెదుటఁ బ్రకాశించుచుఁ గన్నులకుఁమిరుమిట్లు గొలుపుచుండ ముందువెనుకలరయ శక్యమగునా?

చిత్రి—దేవా? తమతప్పుగప్పిపుచ్చి యెదురనున్నవారి యందు దానినారోపించుట లోకస్వభావముగదా? ఇందు తప్పుమానెచ్చెలియందున్నదో మీయందున్నదో మీయిరువురను సమముగానిలఁబెట్టి విమర్శింపవలసియున్నదనిపలికెను.

అనంగమోహిని—మందస్మితసుందర ముఖారవిందంబు పైకెత్తి యారాజేంద్రునిపై శృంగారవిలోకనంబులఁ బరగించుచుఁ దప్పకయట్లు విమర్శింపవలసినదేయని యొత్తి పలికినది. తప్పెప్పుడు నాడువారిదేయగుఁగాని మగవారికి తప్పేలేదూఱకుండుమని చిత్రిలేఖతో మందమందాక్షయగుచు గుణవతిమందలించినది. ఇంటికివచ్చిన యతి

ధిని యుచితరీతిని సత్కరింపక యిట్లువిరసోక్తులాడుట పాడిగాదని తక్కినవారు పలికిరి.

ఇంతలో నొకపరిచారిక పరుగుపరుగునవచ్చి యమ్మనేజెల్ల! ఎంతదారుణసంగ్రామ మెంతలోఁ జల్లారెను! కుబేరనలకూబరు లిప్పట్టున రాకున్న నీయక్షకులంబంతయు నీయకారణ సంగరమువలన నిర్మూలము గావలసినదేగదా! దైవానుగ్రహంబున యక్షులందఱు యుద్ధవిముఖులై నిజనివాసంబుల కేతెంచుచున్నవారని చెప్పెను.

చిత్రి—యుద్ధకారణమేమో యిప్పటికైనఁదెలిసినదా?

పరి—ఏమియునుదెలియలేదు. కుబేరనలకూబరులు స్వర్గపురంబునుండి విమానముమీఁద నిజనివాసమున కేతెంచి యీదారుణ సంగ్రామంబు జూచి యాదండకఱిగి యందున్నవీరవరేణ్యులఁ బేరుపేరునఁబిలచి యుద్ధకారణమడిగిరఁట! ఎవరికివారే మేమెఱుఁగమన్నవారేగాని దీనిమూలమిదియని చెప్పినవాఁడొక్కఁడును గనంబడలేదఁట. దానికి వారువెఱఁగుపడుచు మఱియు విమర్శింప మీయన్నమణిగ్రీవుండును జలంధరుండును నందులకు మూలమని తెలిసినదఁట. వారిరువురఁబిలచి యెంతయడిగినను సరియైన సమాధానము చెప్పలేదఁట.

దివ్యో—మణిగ్రీవుఁడు మీగుణవతిసోదరుఁడా? జలంధరునితో వానికిఁగలిగిన కలహకారణము నేఁజెప్పఁగలను.

అనం—(చెప్పవలదని కనుసన్నఁ జేయును.)

చిత్ర—(ఆనన్న గ్రహించి రాజుతో) దేవా! ఆసంగతి చెప్పుట కనంగమోహినికిష్టము లేనట్లున్నది. పోనిండు. మనకిప్పుడాప్రశంస యేమిటికి?

దివ్యో—ఆసంగతి మఱొకప్పుడు సవిస్తరముగాఁ జెప్పెదను. దీనికేమిగాని నాఁడు మీరు ప్రసంగించిన నరబాలక కళేబరమేమైనది. జాతిధర్మమనుసరించి నాకు తద్వృత్తాంతము వినఁ గుతూహలముగా

నున్నది. అనియడుగుటయుఁ జిత్రలేఖ దరహసిత వదనయై యిట్లనియె. ధాత్రీశ్వరా! మీపరాభవంబమానుషంబు. మీ బలపరాక్రమధైర్యసాహసాదియుత్కృష్టగుణంబులు లోకాతీతములు. మీకడ మాఁగహాస్యంబులు దాగునా? యని యావృత్తాంతమంతయుం జెప్పి యాయక్షుఁడో నరించు ప్రతదివసంబు నేటితోఁదీరుటచే నీరాత్రియే యీపురంబున కుత్తరముగఁ గ్రోశద్వయ దూరంబున నున్న భైరవీదేవియాలయంబున నాకళేబరముతో నమ్మవారి యర్చన జరుగఁ గలదని కూడఁ జెప్పెను.

ఆనరబాలక కళేబర వృత్తాంతము నెఱుంగుటకా నృప కంఠీరవుండు మనంబున సంతసించుచు ప్రకాశముగా చిత్రలేఖ కిట్లనియె-

దివా—చిత్రలేఖా! మీనెచ్చెలి యావ్రతమొనర్చువానినిఁ బరిణయమగుట కిష్టపడుచున్నదా? అదియంతయును వృథాశ్రమ కాదుగదా?

చిత్ర—(నవ్వుచు) వృథాశ్రమ కాకేమున్నది. వానిపేరుచ్చరించిన నీసరోజానన యేవగించుకొనును.

దివా—అట్లయిన మఱెవ్వని గృతార్థుం జేయుటకీమె తలంచుచున్నది?

గుణ—(సిగ్గునఁ దలవంచుకొనును.)

చిత్ర—కొలఁదిదినములలో వచ్చుపంచమీశుక్రవారమునాఁడు స్వయంవరముజాటించిరిగదా! అందుఁ దనయిచ్చవచ్చిన పురుషుని వరింపఁగలదు.

గుణ—(కోపముతో) అధికప్రసంగముచేయకుము.

చిత్ర:—నీకంతకోపమెందుకమ్మా! (అని రాజుమొగంబై) ఆస్వయంవరమహోత్సవంబున సకలబంధుసమక్షమందు నార్యపుత్రునే పతిగా వరింపవచ్చునుగదా?

గుణ—(చిరునగవుతోఁ దలవాల్చియూరకుండును.)

ఒకతె—చెలీ! ఆర్యపుత్రుఁడనఁగానెవ్వరు?

చిత్ర—ఎవ్వరా! ఎవరితో మాటలాడుచుంటివో వారు. తెలిసినదా?

దివో—(సంతోషముతో) దివిజభామిని మానవుని వరించుటయెట్లు? ఇదియుంగాక యనంగమోహినికి నాహృదయ మిదివరకే యర్పింపబడినదికదా? సతులకు సవతిసన్నిధానము సహజంబుగ నీర్ష్యను గలిగించునని చెప్పుదురు.

గుణ—(చిత్రలేఖతో) సాపత్నిగలదను శంక నాకెన్నఁడును లేదని యార్యపుత్రుని కెఱింగింపవమ్మా! మఱియును స్వయంప్రభాదేవి వరంబుపొందె నాకు మనుజుఁడే భర్తయగునుగదా.

దివో—(నవ్వుచు) ఇందుల కనంగమోహిని యభిప్రాయ మెట్లుండునో?

అనం—ఆర్యపుత్రునకు దేవభామినీ సహవాసము గలుగుటకు నేను హృదయపూర్వకముగ సమ్మతించుచున్నాను.

(అందఱునుహర్షమును సూచింతురు)

ఇట్లు యిష్టగోష్ఠీవినోదంబుల నయ్యంతఃపురాంగనలతో నద్దివసాంతము వఱకు ముచ్చటించుచు ననంగమోహిని. నందే యుంచి డివోదాసుండు చంద్రాయుధసహాయుండై యెద్దియో కార్యభారమున నెచ్చటికోపోయెను.

## 312 వ మజిలీ.

# అరిందముని కథ

నాఁటిసాయంకాలము భైరవీదేవియాలయ ప్రాంగణమున నొక యతికుమారుఁ డరిందముఁడనువాఁడొక పరిచారకునిచేత పెట్టె నొకదానినిఁ బట్టించుకొనివచ్చి యందుఁబెట్టించి వానిఁబంపివేసెను. పిదప

నతం డామందసమునొకపక్కకుఁ ద్రోసి యా దేవీవిగ్రహముముందుఁ జక్కఁగా నలికి చిత్రిచిత్రములగు ముగ్గులంబెట్టి వలయువస్తుసంచయమునెల్ల నాయత్తము జేసికొని యిఁక నుపాసనకుఁ గడంగవచ్చునని యనుకొనుచుఁ జేరువనున్న కాసారంబునకు స్నానార్థమరిగెను.

వానిపోకడఁ గనిపెట్టి యు దేవీవిగ్రహము వెనుకనున్న యొక వ్యక్తి యీవలకువచ్చి యాపెట్టెలో నేమున్నదోయని దానిమూతను పైకెత్తిచూచెను. అందుఁ దైలావలిప్తసర్వాంగముగానున్న యొక మృతబాలక కళేబరము గనంబడినది. అదియెయ్యదియో తైలము తోఁ దడపఁబడియుండుటచే నించుకైనను రూపముమారక యప్పుడే ప్రాణములఁ బాసినట్లుండెను. దానిం జూచినతోడనే యావ్యక్తికి హృదయంబున నపరిమితోత్సాహ మంకురించినది. ఆవ్యక్తియెవ్వరుఁ మనదివోదాసమహారాజుగారే! గుణవతి యంతఃపురంబునఁ జిత్ర లేఖవలన నరిందముని ప్రయత్నము సర్వము నెఱింగి యాశబరబాలక శవంబునెట్లయిన సంగ్రహింపనెంచి యాభైరవీదేవి యాలయంబునకు ముందుగాఁబోయి యాశక్తివిగ్రహము వెనుకఁ డాగియుండెను.

ఆమందసములోనున్న శవమును జూచినతోడనే వాఁడు బ్రతికినట్లుగానే సంతసించెను. ఎవ్వానిని బ్రతికించుటకుఁ బ్రతినఁదాల్చి సర్వరాజ్యభోగములఁ ద్యజించి తిరుగుచుండెనో యెవ్వాని దేహాన్వేషణంబు నిమిత్తముగా లోకాంతరములకఱిగెనో యట్టి శబర బాలకుని శరీరముగా దానిని నిరూపించి మరల నమ్మందసమునెప్పటి యట్లభద్రపరచి తనపూన్కె నెరవేర్ప నయ్యమ్మవారిని భక్తిపురస్సరముగా నిట్లు సన్నుతించెను.

చ. కడుపునఁబెట్టికొంచుఁ ద్రిజగంబులఁబోషణ సేయుతల్లి, వీ
వుడుగక జీవహింసలను నోర్చెదవో యొక్కొ! ప్రితంబుపేర ని
ల్లెడపక ప్రాణహత్య లొనరించుదురాత్ములు నీకుభక్తులే?
పడయఁగలారెవారలుశుభంబుల నేవిధినైన నమ్మరో!

చ. ధరణికివచ్చి నానియతిఁ దప్పొటిగాక వనాటబాలకున్
బొరిఁగొనివాని దేహమునుముచ్చువలెన్ గొనివచ్చియిచ్చటన్
కరముదురాశఁగుచ్చితపు గార్యమొనర్పఁగనున్న యత్కుము
ష్కరునివధింతు నేఁగడఁగి శాంకరి! నాపయినల్గఁబోకుమా.

అని దండప్రణామంబులాచరించి యారాజమార్తాండుం డుయధాప్రకార మాశక్తి విగ్రహమునూటునకుఁబోయి యందువేచి యుండెను.

ఇంతలో నరిందముండు స్నానము మొదలుగాఁగలధర్మంబుల నిర్వర్తించుకొని యయ్యమ్మవారియాలయంబులోనికేతెంచి యందు ధౌతవస్త్రధరుఁడై నియమయుక్తుఁడై శక్తిస్తోత్రంబులఁ బఠించుచుఁ దానలంకరించిన పట్టులో నమ్మవారివిగ్రహమున కభిముఖముగాఁ గూర్చుండి లఘువుగా దేవినర్చించి యామెను ద్దేశించియిట్లనియె.

తల్లీ! శాంభవీ! భవత్ప్రీతికై నేను దలపెట్టిన యీవ్రతము నేఁటితోఁ బూర్తిఁజేయుచున్నాను. నేనుకోరిన గుణవతి నన్నుఁబతిఁగా నంగీకరింపఁజేయుటకు నీవేకర్తవు. ఈవ్రతసమాప్తంబున కవసరమగు నరకళేబరమును సంపాదించుటకు నేనుపడిన శ్రమకైనను నాపై నీ కనుగ్రము కలుగవలెను. ఎన్నఁడును జీవహింసయొనర్పని వృద్ధసర్ప మొండైననుండునా? అట్టిదాని నెట్లో పుణ్యవశంబునఁ గనుంగొనఁ గలిగితిని. అయ్యది పరమనిష్ఠాగరిష్ఠమై వల్మీకగర్భమందు యోగ నిద్రలోనున్నది. దానినోరు తెఱుంగుటయెట్లు! అదియొకరిఁగరచి చంపుటయెట్లు? కామరూపంబున నేనొక శబరబాలకుఁడనై నయ్యర ణ్యంబునఁ బశుల మేపుకొనుచుండు వనాటబాలకులతోఁగలసి వారి తో మైత్రిఁ జేసితిని.

ఒకనాఁడొక్క బాలకునిఁ జేరఁదీసి యావల్మీకగర్భమందలి సర్పమును జూపించి యాపుట్టఁద్రవ్వి దానింజంపఁ బ్రోత్సహించితిని.

వాఁడును చేతనున్న గండ్రగొడ్డలితో నావల్మీకవిచ్ఛేదనంబొనరించి యానాగమునుజి దుకఁగొట్టెను. అదిచావలేదని నేనెఱింగియును వాని తోకఁబట్టితెచ్చి మిత్రులకుఁ జూపింపుమని వానికిఁబురికొల్పితిని. ఇట్లు చెప్పుట యాబాలకునెట్లయిన నాపాముగరచి చంపవలెనను నుద్దేశ్య ముతోనేగాని మఱొకటికాదు. అవెంగలీఁడు నామాటఁబాటి సేయుచు దానితోకఁబట్టి యీవలకీడ్చి యాటలాడసాగెను. నేనుతలంచినట్లు తోడనే యాపాపఱేఁడు కినుకఁబూని నిజాభీలవిషజ్వాలల వానినిజంపి యవులంబోయెను.

అవ్వార్త విని యందున్న శబరులెల్లవచ్చి చూచి యాక్రోశిం చుచుఁ దమయేలిక కొయుదంతమెఱింగింపఁబోయి యందుఁ గొందఱఁ గాపుంచిరి. నేనును వారిలోనొకఁడనై యుండి యెరులెఱుంగకుండ నాబాలకునిశరీరమును గగనమార్గమున నపహరించుకొని యిల్లుఁజేరి యిప్పటివఱకుఁ దైలద్రోణియందుఁబెట్టి కాపాడితిని. నేఁడద్దానిని నీకర్పించి నిన్ను మెప్పించి నాయభీష్టమును దీర్చికొందును.

చ. అనుపమమైన నీదు కరుణామృత శీకరసత్ప్రసారము
వ్వనికిలభింపఁగాఁగలదొ వాఁడెకదా కడుధన్యుఁడెన్నఁగా
మనమునభక్తిఁనిన్గొలిచి మాటికభీష్టములందనట్టిఁడెం
దునుగనరాఁడు నన్ను పరితోషితచిత్తనొనర్పుమీశ్వరీ.

అని యాభైరవీదేవికి భక్తియుక్తుఁడై ప్రణమిల్లుచు నిఁకఁ దక్కినకృత్యమునెరవేర్చి కృతకృత్యుఁడ నయ్యెదంగాక యనిలేచి చంద్రహాసముఁ గరమునఁబూని యందున్న పెట్టెదాపునకేగి మూత నెత్తి వంగి యందున్నశవమును బైటకుఁదీయ నుంకించుచుండెను.

ఇంతలోఁ బ్రళయకాలవలాహకంబుకై వడి దివోదాసుండు క్రోధాతిరేకంబున హాయమ్మని గర్జించుచు నయ్యమ్మవారిచాటున నుండి ముందునకురికి యాయతిని జుట్టుపట్టుకొని యీవలకీడ్చి భైర

పీ దేవిపాదమూలమునఁ బడవైచి నిజకుఠారధారచే నా కుచ్ఛితుని యుత్తమాంగము నుత్తరించి తద్రుధిరధారలచే నాదేవి పాదంబులఁ గడిగి వానిహృదయపిండంబుఁ బెకలించి యాశక్తికి నైవేద్యమర్పింప నెంచెను.

కాని, వానియభిమత మీడేరినదికాదు. ఎన్నిసారులు వాని తలనరుకఁబడినను నెప్పటికప్పుడది మొండెమునకుఁ జేరుచుండెను. ఇట్లా రాజేంద్రుండాయతుఁ ధూర్తుని సంహరింపజాలక నిర్విణ్ణుఁడై యూర కుండెను. యతికుమారుండు విగత జీవుఁడుగాకున్నను దలవని తలంపుగాఁ దనకందుగలిగిన విపత్తువలన గుండెచెదరి నిష్ప్రాణుఁడై యా యమ్మవారి పాదమూలమునఁబడియుండెను.

ఆరాజసింహుఁడు యతియుండుమృతుండయ్యెనని దలంచి యా దేవి యెదుర వినయ వినమితగాత్రుఁడై చేతులుజోడించి నిలువఁబడి యనేకవిధముల స్తుతియించెను. భైరవీదేవి వానిస్తోత్రంబుల కలరి ప్రత్యక్షమై యిచ్చవచ్చిన వరంబొండు కోరుకొనుమని యానతి చ్చెను. అమ్మహారాజు భయభక్తి పురస్సరముగఁ దల్లీ! ఈయతికుమార మారణంబున నాకే దురితమును గలుగకుండ వరంబిమ్మని కోరుకొనెను.

వాని కోరికకు భైరవీదేవి సంతసించి యిట్లనియె. కుమారా! నీయుదంతమంతయు నంతర్దృష్టిఁ దెలిసికొంటిని. నీపరోపకార పారీణతకే నెంతయును సంతసించితిని. నీధర్మబుద్ధి నీనిర్మల ప్రవర్తనము నీవినయవివేక విశ్వాసంబులు నీసాహసౌదార్యసంపత్తి నీబలపరాక్రమంబులు వర్ణనార్హంబులు. నీవొనరించిన కృత్యము లెన్నఁడును ధర్మబద్ధములై యుండును. ఈయతియుఁడు కపటచిత్తుఁడు. యుక్తాయుక్తపరిజ్ఞానశూన్యుండు. క్రూరకార్యాచరణ పరాయణుండు. వీఁడుజచ్చిన యతికులమునకుఁ గళంకము లేకుండఁ బోయెడిని.

వీనికై నీవుచింతింప నక్కఱలేదని పలుకు నమ్మహాదేవికి మహా రాజువెండియు నిట్లనియె.

జననీ! వంచనఁజేసి యీయతఁడు పుడమికేతెంచి యమాయకుండగు నీశరబాలకుని నొకనాగముచేఁగఱపించి యసువులఁ బాయఁజేసెను. ఈబాలకుని బ్రతికించి యిచ్చెదనని వీనియాప్తుల సన్నిధి నేను బాసఁజేసివచ్చితిని. నామాటపొలివోకుండ వీనిఁ బున ర్జీవితుంజేసి నన్నుఁ గృతార్థునిఁజేయుమని ప్రార్థించుటయు నాదేవి దరహాసితముఖసరోజయై యిట్లనియె.

వత్సా! ఈవనాటబాలకుని బ్రతికించుటకు నాయనుగ్రహము ను గోరనవసరములేదు. నీవేవీనింబ్రతి కించుకొనఁగలవు పొమ్మని యానతిచ్చి యాయమ్మవారంతర్హితురాలయ్యెను. ఆమెమాటలకమ్మ దినీశుండక్కజంపడుచు నాశబరబాలకశవముగల మందసముగైకొని యందున్న కాసారతీరంబున కేగి యొడ్డున నాపెట్టెనుబెట్టి యానీరంబుల శుచిస్నానమొనరింప నందుదిగెను. అమ్మహారాజు నందానందమ్ము బున నఘమర్షణస్నానంబొనరించి తీరంబున కేతెంచిచూడ యందు మందసము గనుపింపదయ్యెను. దానికతండువెఱఁగందుచుఁ గొంత తడవా పెట్టెకొఱకు నలుమూలలు విమర్శింపఁ దొడంగెను. కాని దానిజాడ తెలిసినదికాదు. అదియెట్లుపోయినదో యతఁడునిరూ పింపఁజాలకహతాశుఁడై యొక్కచోఁ జతికిలంబడెను. తానింతకు పడిన శ్రమయంతయును వృథయయ్యెనని విచారపడఁ దొడంగెను. యతఁడులోకంబునఁ దాను నిక్కముగ మోసగింపఁబడితినని తలం చుచు క్రోధావమాననిరాశావిషాదంబులు మొగంబున నొక్కసారి గనుపింప నట్టెలేచి నిలువంబడి యెద్దియో దుష్కరకార్యమొనర్ప నమకట్టి యటఁగదలి చరచర నయ్యమ్మవారి యాలయునకుఁ దిరుగ వచ్చెను.

ఆదేవీ విగ్రహమునకెదురుగానిలచి అంబా! నేనొనర్చిన పని యంతయును నిష్ఫలమైనది. ఈయుత్కృపురంబున నాకుకలిగినయవమానమును సహింపఁజాలక నీమ్రోలఁ బ్రాణవిసర్జనంబొనరింపవచ్చితిని. చేసినప్రతిజ్ఞ నెరవేర్చుకొనఁజాలని నాజీవనము నిరర్థకమైనది. ఒక్క పసిబాలునిఁ బునర్జీవితునిఁజేసి యొసంగఁ జాలనైతిని. ఇఁకనాజన్మ యేమిటికి? ఇదే మదీయ యుత్తమాంగమును నీకర్పించుచున్నాను. అని నిజకుఠారధారచేఁ గుత్తుక నుత్తరించుకొని క్రిందంబడెను. కాని తోడనే వానితల యథారీతిఁ గాయంబున నతుకుకొన జీవములఁ బాయఁడయ్యెను. అందులకబ్బురపడుచు లేచి దృఢసంకల్పుఁడై తిరుగ సరిజూచి కంఠమునరకుకొనెను. వెంటనే యూడిపడినవాని యుత్తమాంగము జిటికెలో యథాప్రకారమతుకుకొనెను. తలఁదిరుగఁ దరిగికొనెను. అది వెంటనే యతుకుకొనెను. ఇట్లనేకసారులు కంఠము నుత్తరించుకొనుటయు నదివెంటనేయతుకు కొనుటయు జరిగెనేగాని వానికేయపాయమును రాదయ్యెను.

అమ్మహారాజిట్లు విఫలమరణప్రయత్నుఁడై యలసి యయ్యమ్మవారికభిముఖముగా నిలచి చేతులుజోడించి జననీ! నేనెంతప్రయత్నించినను నాకుమరణము సంభవింపదయ్యెను. నేనుజచ్చుట నీయభిమతంబుగాదని తలంచుచున్నాను. అకృతకార్యుఁడనగు నాకు బ్రాణధారణమునందసహ్యము గలిగినది.

చ॥ పులిఁబొలియింపగాఁ దెగకపోయె నదేమొహిమాద్రిసీమలన్
తలదెగదయ్యె యక్షునకు దానినినేనిట్టఁ ద్రుంపఁబూనినన్।
పొలియుటకేఁ బ్రియత్నపడఁ బోయినసద్దియు వ్యర్థమయ్యె నిం।
దులకు మదీయబాహుబల దోషముకాక మతేమిమాయయో!।

తల్లీ! నే నిందేమిచేయవలెనో యానతిచ్చి నన్ను ధన్యునిం జేయుము. నీయాదేశంబువడువున బ్రవర్తింపఁగలవాఁడనని పలికి

యామె యాజ్ఞకు వేచియుండెను. అప్పుడద్దేవి యశరీరవాక్కుల
నిట్లని బదులుసెప్పెను.

వత్సా! అతిసాహసము నెప్పుడును బూనకుము. మరణము
గోరినంతనే వచ్చునదికాదు. ఆపదలు కాపురముసేయవని చెప్పు పెద్ద
లమాటల నెన్నఁడును వినలేదా! కష్టసుఖములలో నేదియెప్పుడు వచ్చి
నను దేహికి యనుభవింపక తప్పదు. కొలది దినములలోనే నీకు
సర్వసౌఖ్యములు లభింపఁగలవు. నికుంభుని నిర్జించునప్పుడు నీకులభిం
చిన మణిభూషణ మనంగమోహినిది. అది నీయుత్తరీయంబున నుండుట
నీవుమరచియుండవచ్చును. దానినెచ్చటను విడువక భద్రముగాఁగాపా
డుము. నీకేయాపదయును వాటిల్లదని పలికి యూరకుండెను.

ఆపలుకులకచ్చెరువుపడుచు నిజోత్తరీయమునఁగట్టఁబడిన యమ్మ
ణిభూషణమును బైకిఁదీసి కన్నుల నద్దుకొని తిరుగఁ బూర్వపురీతిని
భద్రపరచెను. ఇంతలోనందు బడియున్న యరిందమునకు చైతన్యము
గలిగెను. కొంతతడవునకు వాఁడునిదురఁబోయిమేల్కొన్నవానివలె
లేచియెదురనున్న యారాజేంద్రుని జూచి చకితుఁడయ్యెను. దివోదా
సుండును వాఁడు బునర్జీవితుండగుటకు నివ్వెరంబడుచు నందులకయ్యమ్మ
వారి యనుగ్రహమే కారణమని తలంచి యామెమహిమ ననేకవిధం
బుల నంతరంగంబునఁ గొనియాడుచుండెను.

అరిందముని స్వభావమంతయును మారిపోయెను. వెనుక నెంత
దుష్టచిత్తుఁడో యిప్పుడంత మంచిబుద్ధిఁగలవాఁడయ్యెను. తానొనర్చిన
కుచ్చిత చేష్టితములెల్లఁ దలంచి తనకుదానే యేవగించుకొనసాగెను.
దివోదాసుని జూచినతోడనే భయభక్తివిశ్వాసంబులు వానిమనంబున
నొక్కసారిపుట్టెను. ఆరాజమార్తాండునకు నమస్కరించుచు వాఁడిట్ల
నియె. ఆర్యా! మీరెవ్వరోనాకుఁదెలియదు. ఈభైరవీదేవి యాలయం
బున నేనొకఘాతుకకార్యంబునకుఁ గడంగఁబోవుతరి నెవ్వరో నన్బట్టి

దేవీపాదమూలంబునఁ బడవేయుటమాత్ర మెఱుంగుదును. పిమ్మట నేమిజరిగినదో నేనెఱుంగను. నేనొనర్చిన తప్పునకు పశ్చాత్తాపంబును బొందుచుంటిని. మీరెవ్వరు? ఇందేమిటికివచ్చితిరి? మీయుదంతంబు సర్వంబునెఱింగించి నన్ను గృతార్థుని జేయుఁడని వినయముగాఁ బ్రార్థించుటయు దివోదాసుఁడు తనకథ సంగ్రహముగా వానికిఁజెప్పి వానినయ్యమ్మవారి ప్రోలఁజంపఁబూనినది తానేయనికూడ వెల్లడించి మఱియునిట్లనియె యతిఘనంగవా! ఈయమ్మవారిమహిమ మిగులస్తోత్రపాత్రముగానున్నది. ప్రాణములఁబాయనెంచి యనేకసారులు దలఁదరిగికొన్నను నాకుమరణము సంభవింపలేదు. నీకుఁగూడ పెక్కుసారులు ఖడ్గప్రహారములుఁదగిలినను నాపదగలుగదయ్యె. ఈలోకైకమాతనికటంబును జేర మరణదేవత భీతిఁజెందవచ్చును. ఈలోకేశ్వరికి [illegible]వహింపగిట్టదనుటకిది నిదర్శనముగాదా! ఈమెసన్నిధానమునఁ బశువిశసనంబాచరించి కోర్కులం బడయ నెంచుట యవివేకమని తెల్లమగుచుండలేదా! అనియనేకప్రకారంబుల నాభైరవీదేవిని గొనియాడెను.

అప్పుడా దేవి వెండియు నశరీరవాక్కుల నిట్లనియె. రాజేంద్రా! నీయొద్దఁగల యనంగమోహినీ శిరోరత్నమే యరిందమునకు సంజీవనమయ్యెను. ఇయ్యది మృతసంజీవనియనెడి యనర్ఘరత్నము. రత్నచూడుఁడను నాగోత్తముని శిరంబునఁ బుట్టుకతోడనే పుట్టి యనంతరము వానికి వశమై యనంగమోహినికి శిరోభూషణమైనది. ఈమణిశ్రేష్ఠము నీయొద్దనుండుటచేతనే నీచేఁగొనిపోఁబడిన మందనములోని శబరబాలకుఁడుగూడ బునర్జీవితుండై పైకివచ్చి యాపెట్టెంబట్టుకొని భయోద్రేకంబునఁ బారిపోయెను. నాఁడు హిమవన్నగంబున వ్యాఘ్రము నీచేఁజిక్కుండుటకు నిమ్మణియే కారణము. ఇప్పుడు నీకు మరణముగలుగకుండుటకుఁగూడ నారత్నప్రభావమే మూలమని వేరుగఁజెప్పఁబనిలేదుగదా?

ఈయరిందముఁడు నీకిఁక మీఁద మిత్రుఁడై సేవకుఁడై సహచరుఁడై మెలంగఁగలవాఁడు. శబరబాలకు నన్వేషించుటలో మీకుఁ గొంతశ్రమగలుగఁగలదు కాని శీఘ్రకాలములోనే సౌఖ్యములఁ బడయఁగలరని మిన్నకుండెను. ఆపలుకుల నాలకించి వారిరువురును సంతోషాశ్చర్యములఁ బొందిరి. దేవి యానతిపడువున వారొకరికష్టసుఖముల నొకరు సహాయులగుచుఁ బ్రాణమిత్రులై యుండుటకు బాసఁ జేసికొని యాభైరవీదేవికి నమస్కరించి యందుండి శబరబాలకు నన్వేషించుటకు వెడలిపోయిరి.

313 వ మజిలీ.

# శబరబాలకుని కథ.

దివోదాసుఁడు మొదట భైరవీదేవియాలయమునులో సరింవముఁడు స్నానార్థమరిగినప్పుడు శబరబాలకశవమున్న మంచసము మూఁతఁ బైకెత్తి విమర్శించినప్పుడే వానియొద్దఁగల మృతసంజీవనీరత్నప్రభావము తత్పేటికాంతరమునఁ బ్రవేశించెను. పిమ్మటనతండా పెట్టెంబట్టుకొని కాసారతీరంబున కేగుచున్నప్పుడే శబరబాలకునకు చైతన్యము లభించెను. సరోవరతీరంబునఁ బెట్టెనుబెట్టి దివోదాసుఁడు స్నానమునకరుగునప్పటి కాబాలకునకుఁ బూర్తిగాఁ దెలివివచ్చినది. పిమ్మటఁ దైలద్రోణియందుండుట కూపిరాడక పీఁపుతో దానిమూఁత బైకెత్తి యీవలంబడెను. వానికంతయు నంధకారబంధురముగాఁ దోఁచెను. ఆపెట్టెయందుఁ దన్నెవ్వఁడో బంధించి యచ్చటకుఁ జంపునుద్దేశముతోఁ దెచ్చినట్లు వాఁడు తలంచెను. అచ్చటనున్నఁ దనకుఁ బ్రాణాపాయము రాఁగలదని నిశ్చయించి యందొక నిముసమైన నుండ వెఱచి యామందసమును నెత్తిపైఁ బెట్టికొని యతిజవంబున నొకదారింబట్టి పారిపోయెను.

ప్రాణభీతిచే వాఁడట్లుపోయిపోయి యలసటగలుగుటచేత ముందేగఁజాలక యందొకచోఁ బెట్టెను దింపి దానిపైఁగూర్చుని యాయపరిచితప్రదేశంబున తనయసహాయత్వమునకుఁ జింతించుచుండెను. అప్పటికి వెలుఁగువచ్చినది. దిక్కులు విస్పష్టముగఁగన్పట్టుచుండెను. ఆప్రదేశమంతయు వానికివింతగఁ దోచుచుండెను. ఇంతలో నిరువురు పురుషులు వాఁడున్నచోటికి వచ్చుచున్నట్లుగనంబడెను. వారింగాంచి నతోడనే శబరునకు మేను కంపమొందసాగెను. వారే నిక్కముగఁ దన్ను జంపఁదలంచినవారని భీతిఁజెందుచుండెను. ఎచ్చటికైన వారికిఁ జిక్కకుండఁ బారిపోవనుంకించుచుండెను. కాని వానికది సాధ్యపడ లేదు. ఆపురుషులు పరుగుపరుగున వానిసన్నిధి కేతెంచిచెరియొక్క రెక్కయును గట్టిగాఁ బట్టుకొని నిలఁబెట్టిరి.

వానియొద్దంగల మందసమును గాంచివాఁడొక చోరుఁడని సంశయించి వారట్లుజేసిరి. ఆయమాయక బాలకుండు వారిచేఁబట్టువడి భయోద్రేకంబున వివశుఁడయ్యెను. వారడిగిన ప్రశ్నకొక్కదానికిని వాఁడు బ్రత్యుత్తరం బొసంగకుండుటచే వారిసంశయము వృద్ధియయ్యెను. వానియొడల నంటియున్న తైలముగాంచి వారిరువురు వానిదొంగయని నిశ్చయించిరి. పెట్టె నెచ్చటమ్రుచ్చిలించితివో నిక్కముజెప్పెదవా లేదాయనినిర్బంధింపఁదొడంగిరి. వారేమన్ననువివశుఁడై యున్నందున మారుమాటాడలేదు. కొండొకవడికా బాలకుండు వారిచేతులలోనుండి క్రిందకొరిగెను. చేష్టలుదక్కియున్న వానినందుఁ బరుండఁబెట్టి యాపురుషులు మందసమును బరీక్షించిరి. అందే వస్తువయునులేక తైలావళి ప్తమైయుండుటకు నివ్వెరంబడుచు వారిట్లు వితర్కించుకొనిరి.

ఒకఁడు—సోదరా! జలంధరా! ఇదేమిచిత్రము! ఈపెట్టెలో నలుమూలలఁ దైలమిట్లుపూయఁబడియున్న దేమి?

జలం—మణిగ్రీవా! ఈచోరునియొడలఁగూడ నిట్టితైలమే యుండుటఁదిలకింపలేదా? వీఁడద్దియో ఘాతుక కార్యాచరణపరాయణుండై యిచటికివచ్చి మనచేఁబట్టుపడెను.

మణి—వీఁడతిభీరుఁడువలెఁదోచుచున్నది. పట్టుబడినంతనే చైతన్యము బాసినవాఁడెట్లు దొంగతనము చేయఁగలఁడు?

జలం—ఇట్లుండుటఁగూడ దొంగవేనమేకావచ్చును. మనలమాయఁజేయుట కిట్టిపన్నుగడ వేయుచుండెనేమో?

మణి—వీఁడుమనుజుఁడువలెఁగన్పించుచుండె నీలోకమునకెట్లు రాఁగలిగెనోగదా!

జలం—ఏరాక్షసాధముఁడో యిట్టివేషమున యక్షుల భాగ్యమపహరింప నిందే తెంచి యుండును. వీనిని విడువరాదు.

మణి—సోదరా! వీనియాకారముజూడ నాకట్లుదోచుటలేదు.

జలం—మనుజుఁడుగానీ మనుజాశనుఁడుగానీ. ఈలోకమునఁ నుండఁదగినవాఁడుగాఁడు. సత్వరమ వీనినిందుండి లేవఁగొట్టవలయును.

అని వారిరువు రాశబరబాలకు నెత్తి యాపెట్టెలోఁబెట్టి మూఁతవైచిరి. జలంధరుఁడు విమానశాలకతిగి యొకదివ్యయానముదెచ్చెను. ఆపెట్టెనుదానిలోఁబెట్టుకొని యాయక్షులిర్వురును భూలోకంబునకేగి శీతశైలంబున నొకమహారణ్యమధ్యంబున నామందసమును బడవైచి నిజలోకంబునకేగిరి.

పిమ్మటఁగొంతసేపటికి శబరునకు స్మృతివచ్చినది. తిరుగఁదాను మందసములోనుండుటకుభయపడుచుదానిమూఁతనువీఁపుతోఁద్రోసి యావలకువచ్చెను. అప్పుడొక మహారణ్యమధ్యంబునఁ దానుండుట గ్రహించి యేమిచేయుటకుందోచక కొండొకతడవు విభ్రాంతుఁడై యిటునటుఁ బరికించుచుండెను. తనమేనంగల తైలమునుజూచి యసహ్యించుకొనుచు నాపెట్టెనెత్తికొని యెచ్చటనైన జలాశరంబునకో

డలుగడిగికొనుటకుఁగొంతదూరమరిగెను. అందొకపర్వతధారంగాంచి దేహమునంటియున్న డైలంబుబోవునట్లు స్నానమొనరించి మందసము నుగూడనానీరంబులచేఁగడిగి యాపోవనీటిందాపి యందున్న కంద మూలాదుల నాకలి నడంచుకొని కొంతసేపటవిశ్రమించెను.

ఆయరణ్యమంతయును భయంకర దుష్టసత్వసమన్వితంబగు టచే మాటిమాటికి వానికి సింహశార్దూలాది వన్యమృగంబుల భీకరా రవములు వినంబడుచుండెను. ఇంతలో రెండుసింహములు చెలగాటము లాడుచుఁ గ్రమముగా వాఁడున్నచోటికివచ్చెను. వానింగాంచి యెటుపోవుటకును దోచక భయవిహ్వలుఁడై తటాలున దగ్గరనున్న పెట్టె మూఁతనెత్తి యందుదూరియుండెను. మనుజుని సవగ్రహించి యాదుష్టమృగంబులు దిన్నఁగా మందసముదాపునకువచ్చి యందున్నవానిఁ బట్టఁబెట్టుకొనవలయునని ప్రయత్నించినవి. వాఁడు పెట్టెలోనిమిడి పైమూఁతయూడకుండ గట్టిగా నదిమిపట్టుకొనియుండుటచేత నామృగములాపెట్టె నిటునటుఁగాళ్లతో దొర్లించినను వాని కేయపాయము ను గలుగలేదు. ఆపెట్టెయును దృఢదారుఖండములతో లెస్సగా సమకూర్పఁబడియుండుటచే నెట్టిదెబ్బతగిలినను జెక్కు చెదరకుండెను. అమృగములు చేయునదిలేక కొంతసేపటికి వచ్చినదారిని దుముకుచుఁ బోయినవి. మృత్యుముఖంబునుండి యీవలఁబడినట్లు తలంచుచు నా శబరబాలఁకుఁడు దనకట్టి సందిగ్ధసమయంబునఁ బ్రమాదరహితంబగు నుపాయమును దోపింపఁజేసి యాయాపదఁ దప్పించిన పరమేశ్వరుని మనంబున స్తుతించుచు నాపెట్టెవెడలివచ్చి దానింబట్టుకొని యొక దారింబడి నడువసాగెను. ఎదురనెచ్చటనైన దుష్టమృగములు దార సిల్లినపుడు వెనుకటివలెనే పెట్టెయందు దూరియుండి యవివెడలిపో యినపిమ్మట నడకసాగించుచుండెను. ఇట్లునిర్భయముగా సాయంసమ యమగువఱకు నాయరణ్యమందుఁ దిరుగుచుండెను కాని యెప్పటికిని

దానియంతము వానికి దొరికినది కాదు. తిరిగినచోటనే తిరుగుచు నెక్కి నమెట్టలే యెక్కుచుఁ జూచినప్రదేశము నే చూచుచు నేమిచేయుట కుం దోచక విభ్రాంతుఁడగుచుండెను. అంతఁ గొంతసేపటికి చీఁకటి దెసలనాక్రమింప సాగెను. కందమూలంబులఁదిని యాకటిచిచ్చుఁ జల్లార్చుకొని యాపెట్టనే శరణ్యముగ నెంచి యొకవిశాలతరుమూలం బున నారాత్రిగడుపనెంచి యందుఁ జేరెను. మృగభీతిచేబయలఁ బరుం డనోడి యాపెట్టెలోనే శయనించెను. ఆమందసము దగినంత వైశా ల్యముగలిగి నలువైపుల గవాక్షములవలె రంధ్రములుండుటచే వాని కొక చిన్న శయనమందిరము వలెనొప్పియుండెను. ఎంతనిర్భయము గా వాఁడందు శయనించినను నుక్కుచేవాని కించుకేని యారాత్రి నిద్రపట్టలేదు.

అర్థరాత్రిమగు సమయమున నాశాఖాగ్రమునుండి సంగీత ధ్వని వానికి వినఁబడఁజొచ్చెను. దానికబ్బురంపడుచు బైటకేతెంచి శాత్కారణమరయుటకు భయముగలిగి తెల్లవారువఱకు పెట్టెలోనే యుండి యాగానమాధురి నాశబరబాలకుం డనుభవింపుచుండెను. సంగీతమేమో యెఱుంగని యాకిరాతునకుఁగూడ నాగానమువలన నపరిమితానందము గలిగి వానియవస్థనంతయును మఱవఁజేసెను. తెల్లవారుసరి కాగానము ముగిసినది. పెట్టెసందులలోనుండి వెలుఁ గు లోనికిఁ బ్రసరించుచుండెను. వివిధశకుంతసంతానసంకులనిస్వనం బు వలన నాప్రభాతం బతిమనోహరమయ్యెను. వాఁడప్పుడు పెట్టె నుండి బైటకేతెంచి రాత్రిసంగీతముపాడినగాయకుని కొఱకై యా చెట్టుకొమ్మలన్నియును బరిశీలింపఁదొడంగెను. కాని యందెవ్వరి జాడయును గనుపింపలేదు. అవృక్షము నాశ్రయించి పిశాచమెద్దియైన నట్లుగానమొనర్చెనేమో యని వానికి మనంబున భయము బుట్టెను. ఆప్రదేశమున నుండుట యనర్థదాయకమని తలంచుచు

నప్పుడే పెట్టెలో నటఁగదలి మఱియొక దారింబట్టిపోయెను. ఆదివసాం
తమువఱకుఁ దిరిగి రాత్రియొక తరుమూలమునఁ జేరి యథాప్రకారము
మందసమున దూరియుండెను. వెనుకటిరీతినే యర్ధరాత్రిము మొద
లు తెల్లవారు వఱకు దివ్యగానము వానికి వినంబడుచుండెను. మఱు
నాఁడు వేఱొకవైపునకుఁబోయి రాత్రియగుసరి కింకొకవృక్షమూల
మునఁ బెట్టెలోఁబరుండెను. అచ్చటఁగూడ వానికి సంగీతధ్వని విన
వచ్చెను. నాల్గవదివసంబున వేఱొకదిక్కునకుఁబోయి యారాత్రి
మఱొక్కపాదపముక్రింద మందసమున శయనించెను. అచ్చటసైత
ము గీతనాదము వానికి శ్రవణానందముగ వినంబడెను. ఇట్లునాలుగు
దిక్కులంగూడ దివ్యగానము శాఖాగ్రములనుండి వినంబడుచు ని
శాంతమునకంతయు శాంతమగుచుండుట శాశబరబాలకుండు భయ
విస్మయావేశహృదయుఁడై దానిమూలమిదియని గ్రహింపఁజాలక
యైదవదినంబున నొకమారుమూలదారింబట్టి పోవుచుండెను. అప్రి
శాంతప్రభాతంబున శీతలవాశపోతంబులు మేనికి సుఖంబుగూర్చు
చుండెను. ఇంతలో నొకగండనుండి వేదండంబొండు ప్రచండవేగఁ
బున ఘీంకరించుచు వానియండకు రాఁదొడంగెను. ఆధ్వనితోడనే
వానికిప్రాణము లెగిరిపోయినట్లయ్యెను. జీవితాశచే నెట్లో యాపెట్టె
లోదూరి మూఁతబిగించుకొనెను. అయడవియేనుఁగు తిన్నఁగా మంద
నముదాపునకువచ్చి తొండముసాచి దానింబట్టుకొని యతిరయంబున
నెచ్చటికోపోవుచుండెను. పెట్టెసందునుండి చూచుచున్న యాబాలు
నకు జీవితాశపూర్తిగావదలినది. నాఁడే తన జీవితపరమావధియని
తలంచుచుండెను. ఆవేదండ శుండాదండంబునుండి తప్పించుకొనఁ
గల్గుట కల్లయని నిశ్చయించుకొనెను. ఆపెట్టెమూఁతయెప్పుడు విడి
పోవునో యెచ్చటక్రిందఁబడి చూర్ణీభూతగాత్రుండనగుదునో యని
యడుగడుగునకు భయపడుచుండెను. ఇంతలో నయ్యనేకపముఖ్యం

బోక లోయలో దిగి నడచుచుఁ గ్రమంబున నొకవిశాలప్రదేశంబునఁగల కమలాకరతీరంబు శేరి యాప్పెట్టెనందుఁ బడవైచి యాకొలనిలోనికి దిగి తొండంబున నీరంబులం బూరించిప్పై కెగఁజిమ్ముచుఁ బద్మకాండంబుల మూలములతో నూడఁబెరుకుచుఁ బెద్దతడవందు జలవిహారమొనరించి తనివిఁజెంది జలమువెడలివచ్చి యయ్యరణ్యంబునఁబడి నిముసములో నదృశ్యమయ్యెను.

ఇంతలో నల్వురుజవ్వనులు ముచ్చటలాడుకొనుచు నప్పద్మాకరంబున కేతెంచి మించిన యానందంబున నంబరంబులఁదీరంబునం బెట్టి యొండొరులచేతులంబట్టుకొని యాసరోవరంబున దిగి యథేచ్ఛగా జలవిహారము సేయఁ దొడంగిరి. ఆలేఁజవరాండ్రు సమాన వయోరూపవిలాస చాతుర్యములం గలిగి యొండొరులపై జలంబు జల్లుకొనుచుఁ బందెములువైచికొని యాడులాడుచు నొకరినొకరు పరిహాసములాడుకొనుచు నీరెగఁజిమ్ముచు నరచేతులతోఁ దపతపతట్టుచు నెదురనున్న వారిపై నీరుధారగాఁబడునట్లు ముష్టినిష్పీడనంబు లొనరించుచుఁ బెద్దతడవందు జలక్రీడా వినోదంబులఁ బొద్దుపుచ్చిరి.

మందసములో నుండి శబరబాలకుండు దత్క్రీడావిశేషంబులఁ జూచుచుండెను. ఆసీమంతినీరత్నములయంగసౌష్టవంబునకు విస్మయమందుచుండెను. వారియపురూపరూపలావణ్యముల కద్భుతమందుచుండెను. పిమ్మటఁ గొంతసేపటి కాయంగనామణులు జలక్రీడలుచాలించి తీరంబున కేతెంచి పుట్టములంగట్టికొని పటురయంబున నందొక మార్గమునుబట్టిపోయిరి. వారరిగినతరువాత శబరబాలకుండు మందసము వెలువడి యాయన్నుమిన్నలరిగినదారినే వారినరయు దలంపునఁ బోయెను. ఇట్లు కొంతదూరమేగువఱకు ముందు వానికొక దేవాలయము దృగ్గోచరమయ్యెను. సువర్ణ మణిమయ గోపుర ప్రాకారాదులచే నద్దేవతాయతనము గన్నులకు మిరుమిట్లు గొలుపు

చుండెను. మహారణ్యమధ్యంబున నట్టి దివ్యాలయముండుట కచ్చెరు వుపడుచుఁ దొందరగా వాఁడు ముందరికిఁ ద్రుటిలో దానిని సమీపింపఁగలిగెను.

ఆగుడితలుపులు తీసియున్న కతంబునలోనికి నిరాటంకముగఁబోయెను. ప్రాకారమధ్యంబుననున్న శుద్ధస్వర్ణవినిర్మితంబగు దేవతాగారము నుజూచిభయవినయవిస్మయములతోఁ బ్రదక్షిణములొనరించి తెంపున గర్భాగారముం బ్రవేశించెను. అందుదివ్యప్రభావంబునఁ దేజరిల్లుచున్న యంబికా విగ్రహము గనంబడినది. మణిదీపికలచే నాగర్భాలయమంతయు విస్పష్టముగఁగనంబడుచున్నది. మన వనాటబాలకుండు మందసమును నేలఁబెట్టి యాయమ్మవారి కభిముఖుండై చేతులుజోడించుకొని యచ్చంపుభక్తి నా దేవిని బెద్దగాస్తుతించుచు నాపదల కాకరంబగు నయ్యరణ్యమునుండి దాను శీఘ్రమ యవులంబడుటకు వెరవు జూపుమని కోరుకొనెను. ఇంతలోఁ బ్రాంతమందు సంగీతధ్వని వినంబడినది. ఇదివరలోఁదానువిన్న గానము దిరుగనందువినంబడుటచేఁ జకితుఁడై యందుండుటకు వెఱచి మందసముగైకొని పరుగుపరుగునఁ బాణిద్వారమున నావలకుఁబోయెను. అచ్చటమిగుల రమణీయమగునుద్యానము నేత్రపర్వమొనర్చెను. అందొకవైపునకుఁబోవ ముందటిసుందరమగు మందిరమొండు గనంబడినది. దానిదాపున నున్న పుష్పవనమునందు యథేచ్ఛగా సంగీతముపాడుకొనుచు నల్వురు సుందరాంగులు, పుష్పాపచయంబొనరించుచుండిరి. వారి సంగీతము దానిదివరకు నాలుగురాత్రిలు విన్న గానము పోలికగానేఁ యుండెను. వారిరూపాకారములు దానంతకుముందు గాసారతీరంబునఁ జూచిన యోషిల్లలామల తీరునే తోపింపఁ జేయుచుండెను. అప్పుడు శబరబాలకునకు ముందేగుటకు వెనుకకుఁదిరుగుటకు మనంబొప్పదయ్యెను. రాత్రులయందువృక్షాగ్రముల నివసించి మహారణ్యమధ్యంబున

గానమొనరించుట పిశాచలక్షణమని నమ్మి ముందేగిన స్త్రీరూపమున
నున్న నాభూతములు దన్ను విఱచుకొని తినునేమోయను భయంబు
గలిగె. అనన్యరూపలావణ్యంబుల డంబు మీరియున్న యాయన్నుమి
న్నల వారి విలాసవిశేషంబులఁ గన్నులారఁ జూడకుండ వెనుకకుఁ
దిరిగి పోవుటకు మనంబొప్పకుండెను. ఇట్లు కొంతతడవేమిచేయుట
కుం దోపక యతండచ్చటనే నిలువంబడి యాచేడియల చేష్టితంబుల
గమకింపుచుండెను.

ఇంతలోఁ బువ్వులఁగోయుటఁ జాలించి యామించుఁబోణులు
దేవీపూజాసమయంబయ్యెనని పటురయంబున నాగుడికై పున కేతెంచు
చుఁ బేటికాహస్తుఁడై మార్గమందు నిలువఁబడి తదేకదృష్టిగాఁ
దమ్మీక్షించుచున్న యాయమాయకపు బాలకునిఁగాంచి విస్మయా
వేశహృదయలై యిట్లు వితర్కించుకొనిరి.

హేమలత — సఖీ! విద్యున్మాలా! మానవులకుఁ జేర రాని యీ
కాంచనశిఖరాగ్రమున నున్న యంబికాయతనమున కీనర బాలకుండె
ట్లు రాఁగలిగెనే!

విద్యున్మాల — పేటికాహస్తుఁడై మనలఁ దదేకదృష్టింగాంచు
చున్న వీఁడెద్దియో పాపఁపుటూహతో నున్నట్లు తోఁచుచున్నది.

తటిత్ప్రభ — పాపఁపుటూహలేకున్న మందసముంగొని రాఁ
గతంబేమియుండును. ఇచ్చోటఁగల యనర్ఘమణుల ముచ్చిలించి
యమ్మందసమునింపుకొని పోవలయునను తలంపున వీఁడిచ్చటి కెట్లో
చేరఁగలిగియుండును.

మదనమంజరి — సఖులారా! వీనిచూపులందిలకింప మన
రూపంబుల నాశించి యున్నట్లు దోఁచుచున్నదిగదా?

హేమ — (మందహాసముతో) తనయందమునకు మనలఁబోలు
రూపవతులు గావలయుఁ గాఁబోలును.

తటి—రూపము నాశించువానికి మందనమేటికే?

విద్యు—మనుజబాలకునకు సౌరనారీ సహవాస యోగ్యత యెట్లు గలుగును.

హేమ—మనయందఱకుఁగూడ మనుష్యుఁడేయొడయఁడగునని యమ్మవారియాజ్ఞయైనదిగదా?

మదన—అమ్మవారియాజ్ఞయయ్యేనని యాకురుపిని వరింతమందువాయేమి?

హేమ—వీఁడుగాకున్నను మఱియొక్కఁడైన మనుజుఁడే మనకుఁ బతికావలసియున్నఁడని నాయభిప్రాయము.

విద్యు—మనముసర్వ్వరము గూడ ననుకూలుఁడగుపతినొక్కనినే వరించుటకు నియమము జేసికొంటి మెఱుంగుదురా?

మదన—ఆనియమమెన్నఁడును నప్పఁగూడదు. మనలో నెవ్వతెయైన నొకనిని వరించియున్నప్పుడు తక్కినవారికిఁ గూడ వాఁడే యొడయఁడగును. ఈయువకునందు మనలో నెవతెకైన ననురాగముగలిగియుండినఁ జెప్పవచ్చును.

అందఱును—ఛీ! ఛీ! (అని అసహ్యించుకొందురు)

మదన—భక్తులపాలిటిపారిజాతమన నొప్పు నియ్యమ్మవారు యోగ్యుఁడగు పురుషసింహుఁడు మనకు భర్త కావలయునని దలంచునుగాని యిట్టి నీచునిఁ గట్టిపెట్టవలయునని జూడదుగదా?

తటి—అడవులంబడి తిరుగు కిరాతజాతివాఁడని వీనింజూచినఁ దెలియుటలేదా? ఇట్టివానికై మీరింత తర్కించుకొనుటఁజూడ నాకు నవ్వువచ్చుచున్నది. వీఁడు తప్పక యిందలి రత్నముల నపహరింప వచ్చినవాఁడుగాని మఱియొకటికాదు.

విద్యు—మనమదనమంజరి వీనియందు లేనిరసికత నిరూపించినదిగాని నీవుచెప్పినదే నిజము. వానిచూపులయందు మూఢత్వము దేటపడుచుండెనేగాని విలాస విశేషమింతయును లేదు.

తటి—ఏదియెట్లున్నను వీఁడిక్కడకురాఁగలుగుట వింతగా నున్నది.

హేమ—సఖులారా! శాంభవీదేవి నర్చించుటకు కాలమతి క్రమించుచున్నది. ముందాపని నిర్వర్తించుకొని వచ్చినపిదప వీనివిష యమై యాలోచించుకొనవచ్చును. ఇంతలో వీఁడెక్కడకుఁబోఁగలఁడు.

ఇట్లువారుసంభాషించుకొని యమ్మవారి నర్చించుటకతిజవం బున నాగుడిలోనికిఁ బోయిరి. శబరబాలకుండు వారింజూచినప్పటి నుండియు నివ్వెరపాటున మైమఱచియుండెను. అట్టియద్భుతలావణ్య ముగల యలివేణుల నెన్నఁడును గనివినియెఱుఁగని కారణమున వా నికి వారిదర్శనము వింతఁగొల్పుటయబ్బురముగాదు. అయంగనామ ణులు గుడిలోనికిఁ బోయినతోడనే వాఁడును వెనుకకుఁ దిరిగి గుడి యొద్దకువచ్చి వెనుకటిద్వారమునఁ గాక మఱొకదానివెంట నాయా లయమును బ్రవేశించెను.

314 వ మజిలీ.

## —:దేవతాస్త్రీలకథ:—

హిమవన్నగంబునఁ గాంచనకూట మను శిఖరము మిగుల నెత్తైనది. దానిని మనుష్యులెవ్వరును జూచి యెఱుంగరు సరే కదా యట్టిశిఖరమున్నదని యైన నెవ్వరును వినియుండలేదు. పూర్వకాలం బొకయక్షుఁడు సంతాన మపేక్షించి యందు శాంభవీదేవికి స్వర్ణమయ దేవాయతనంబుగట్టించి నవరత్నములతో నిత్యమునర్చించుచుఁ గొం తకాలమునకుఁ దన యభీష్టము బడయఁ గలిగెను. ఆయక్షునిచేఁ బూజ సేయఁబడిన రత్నములతో నా యాలయ ప్రదేశమంతయు నిండిపోయెను. పిదపఁ గొంతకాలమునకు నల్వురు దేవతాస్త్రీలా యాలయంబున కేతెంచి రత్నరాసులెల్లఁ బోగు సేసి యందొక భాగంబున భద్రపరచిరి. కొన్ని యనర్ఘరత్నముల గర్భాగారము

నందును నితరముఖ్యప్రదేశములయందును నందముగా నమరించి యా యమ్మవారిని నిత్యమును బూజించుచుండిరి. ఆగుడివెనుక నొక రమణీయోపవనంబు నిర్మించి యందు పూజార్థంబులగు వివిధకుసుమజాతులఁ బెంచుచుండిరి. ప్రతిదినము మూడువేళలయందును జేరువనున్న తద్మాకరంబున జలకములాడి వచ్చి యా యుద్యానవనమున నున్న పుష్పములఁ గోసి తెచ్చి యా యమ్మవారి నధికభక్తితోఁ బూజించుచుండిరి. రాత్రి పొద్దుపోవువఱకు నా దేవీమండపమున భజనకీర్తనలం బాడుచుఁ బిమ్మట నల్వురు దలయొకదారిం బోయి యుదయమున కక్కడ చేరుకొనుచుందురు. ఇట్లు కొన్ని యేండ్లు గడచిన పిమ్మట నొకనాఁటి యుదయమున వారతిభక్తి నయ్యమ్మవారిం బూజించి తమయిక్కట్టుఁ బాపి శీఘ్రమ యనుకూలవాల్లభ్యంబు గలుగునట్లనుగ్రహింపుమని ప్రార్థించిరి.

భక్తసులభ యగు నా యంబికాదేవి వారికిఁ బ్రత్యక్షమై బిడ్డలారా! మీయాపద కొలఁది దినంబులలోఁ దీరఁగలదు. మీకు దివ్యప్రభావసంపన్నుఁడగు నరకంఠీరవుండు రొుడయుం డగును. అనతికాలంబుననే మీకు సర్వభద్రములు చేకూరఁ గలవు. ఇచ్చటఁ గల రత్నరాసుల కన్నిఁటికిని మిమ్ము జేపట్టు పురుషుఁడే యధికారి యగును. భర్తృసమాగమం బగువఱకు మీరిచ్చటనే యుండవలయు నని పలికి యంతర్హితురా లయ్యెను.

ఆ దేవి పలుకులకు వారెల్లఁ గులుకుచుఁ దమ నలువురకు నొక్కఁడే పతి యని నిశ్చయించుకొని యందొకతె యెవ్వనినైనఁ బతిగా వరించినచోఁ దక్కినవారు గూడ వానినే విభునిగా గ్రహింపవలయు నని వారప్పుడే బాసఁ జేసికొనిరి.

పిమ్మటఁ గొన్ని దినంబుల కొకనాఁడు వారు రాత్రి చాలగడచువఱకు నా దేవీమండపమునఁ గీర్తనలం బాడుకొనుచుండ నందు ము

వ్వురుమాత్రిమే వాడుకపరికార మెచ్చటకోఁ బోయిరి. హేమ లతయను నచ్చర యచ్చటనే యుండి యుదయ మగునరికి తక్కిన వారిం గలుసుకొనెను. మరునాటిరాత్రి యిరువురు మాత్రమే వెడలి పోయిరి. హేమలతతోఁ దటిత్ప్రభ యారాత్రి శివ మామండపము మీఁదనే గడిపెను. మూఁడవనాఁ డొక్కతె మాత్రమే యరిగినది. విద్యున్మాలయను నచ్చరలేమ కూడ యందుండిపోయెను. నాలుగవ దినంబున మదనమంజరికూడ తెల్లవారుదనుక నమ్మండపమునందే తక్కినచెలికత్తెలతోఁ గాలక్షేప మొనరింపఁ గలిగెను.

వాడుకపరికార మర్ధరాత్రమునఁ దలయొకదారింబోక యచ్చటనే యుండఁ గల్గుటకు వా రానందించుచుఁ దమ శాప మేమహాను భావునివలననో తీరెనని యుబ్బుచు నాబిబ్బోకవతు లాదివసంబున నత్యుత్సాహంబుతోఁ దటాకంబున జలకము లాడి నయ్యమ్మవారిని బూజించుటకుఁ బుష్పములంగొని వచ్చుచు దారిలోఁ జేటికావహస్తుం డగు మనుష్యయువకుం జూచి శంకించి పూజానమయ మతిక్రమించు నను భయంబున వాని విమర్శింపకుండ నమ్మవారి యాలయము నకుఁ బోయిరి.

అందా సుందరీమణులు శాంభవీదేవిని యథావిధిఁ బూజించి భక్తితత్పరలై చేతులు జోడించుకొని యమ్మవారి యెదుర నిలచి యిట్లు స్తుతించిరి.

మ. జననీ! నీదయచేత నిప్పటికి మాశాపాతిదోషం బడ
 లనడంగెన్., నశియించె బాధలు. మహోల్లాసంబు సేకూరె. ని
 న్ననయంబున్మదినమ్మి గొల్చిన ఫలం బబ్బెంగ మమ్మింకిటన్
 అనురూపుండగు ప్రాణనాయకునితో నమ్మా!వడిన్ గూర్పుమా.

చ. మనుజుఁడె మీవిభుండగు ఙమా! యని నీవిటఁ బ్రేమనానతి
 చ్చినవిధమెల్ల మాహృదయసీమల గాటము గాఁగ నాటియుం

కాను గద యట్టిఁ డెన్నఁడు ఘటించు నొకో యనియాత్రమందుమా
ఘనములు నూరడింపఁగల మాటలఁ దెల్పఁగదమ్మ యమ్మరో!

ఇంతలో నయ్యమ్మవారి విగ్రహము వెనుకనుండి యొకసుంద రపురుష ప్రవరుండు బటురయంబున ముందుకు వచ్చి యాయచ్చర మచ్చెకంటులతో నిట్లయె.

ఉ. కుసుమకోమలాంగ విభవోజ్వలులార! మనంబులం దిఁకన్
గాసిలనేల! మీకోలఁకి గావలయున్ జుమ యమ్మవారు న
న్నీసదనంబు జేర్చికొనిరెన్. వినుతింపఁగనొప్పఁగాదె వి
శ్వాసముతోడ నీకొననిశంబును భక్తసురద్రుమంబుగాన్.

చ. నరుఁడనెగాదు నేను నరనాథుఁడ దివ్యబలప్రతాపభా
స్వరుఁడ మిముఁన్ గ్రహింప మది సమ్మతినందితి మీరుభక్తి నీ
శ్వరి కొనరింపఁ గల్గిన సపర్యలు సత్ఫల మందఁ గల్గె ను
ర్వర ననమాన సౌఖ్యముల భాసిలఁగాఁగల రింక మీదటన్.

ఆ పలుకుల కాకలికితలమిన్న లలరుచు నాని యాగమనం బున కక్కజంపడుచు నాపురుషుని రూపరేఖావిలాసంబులకు వింత పడుచు నమ్మవారి భక్తవత్సలత్వంబును వినుతించుచుఁ దమభాగ ధేయము ఫలించెనని సంతసించుచు శృంగారవిలోకనంబుల నాసుం దరాంగుని పైఁ బరగించుచుఁ గొండొకవడి లజ్జావనతవదనలై యే మియుం బలుకఁజాల కుండిరి.

అంత నాపురుషశ్రేష్టుండు విలాసదృష్టుల నాయోషామణుల పైఁ బరపుచు మందహాసంబు మొగంబునకు నూత్నవికాసం బొనఁ గూర్ప మృదుమధురభాషణంబుల నామత్తకాశినుల చిత్తంబులు నిజాయత్తము లగునట్లు జేసికొనెను. పిమ్మట వా రిట్లు సంభాషించు కొనిరి.—

పురుషుఁడు—కాంతామణులారా! మీయుదంతం బంతయు

వినవలయు నని నాయంతరంగం బుత్సహించుచున్నది. మీరెవరు? ఈ నిర్జనారణ్యమధ్యంబున కెట్లు రాఁగలిగితిరి. శాపదోషంబు దీరి పోయెనని యంటిరి. అదెట్లు సంభవించి దోలంగెను?

మదనమంజరి—పురుషపవరా! మీకువలె మాకుఁగూడ మీవృత్తాంతం బెఱుంగఁ దలంపు గలిగియున్నది. మనుష్యసంచారానర్హంబగు నీ కాంచనశిఖరమునకు మీరెట్లు రాఁగలిగితిరో మాకు వింత గొల్పుచున్నది. వినదగుదుమేని తొలుత మీయుదంతం బెఱింగించి మమ్ము గృతార్థులం జేయుఁ డని పార్థించుచున్నాను.

పురు—నాయుదంత మెఱింగించి యే మిమ్మడుగుటధర్మము. నేను ధరణీచక్రం బేకఛత్రింబుగాఁ బరిపాలించు దివోదాసుఁడను పార్థివేంద్రుండను. శబరబాలక ప్రేతాన్వేషణ నెపంబున యమలోకంబున కేగి యందు వాఁడు సజీవుఁడయి వెడలిపోవుట విని వానిని వెనకకొనుచు దిరిగితిరిగి నేటికిచ్చటి కేతెంచి మిమ్ముం గంటినని తన వృత్తాంతమంతయుఁ గ్లుప్తముగా వారి కెఱిఁగించి వారియుదంతంబు దెలిసికొనఁగోరెను.

విద్యు—(జనాంతికముగా) సఖీ! తటిత్ప్రభా! ఆర్యపుత్రుని ప్రభావం బనూనమంబుగను నాశ్చర్యకరముగను నున్నది. మన యుదంతం బెఱింగినవీనికి మనయం దనురాగము గొఱంతపడునేమో యని భీతిఁ గలుగుచున్నది.

తటి—ఈయనఘుఁడు దనహృదయంబున మన కిది వఱకే యవకాశ మొసంగి యున్న కతంబున నట్టి సంశయమునకుఁ బని లేదు. ఇదియునుంగాక పురుషులు నూతనప్రియు లగుట సీమద్దోషంబుల నెన్నఁజాలరు గదా.

హేమలత—సఖులారా! మనోహరునకు మనకథ నెఱింపక కాలయాపన మొనరించెద రేమిటికి.

విద్యు—మనయందఱిలోను మాటపొందికఁ గల మదనమంజరి నిందులకు నియోగింతము.

తటి—సఖి! మదనమంజరీ! ప్రాణేశ్వరునకు విసుగు బుట్టకుండ మన యుదంతంబెల్ల వేగ మెఱింగించి వాని మన్ననలకుఁ బాత్రురాలవు గమ్ము.

మద—(దివోదాసునితో) ఆర్యపుత్రా! మేము నలువురము ను స్వర్గలోకమందుండు దేవకన్యలము. సంగీతవిద్య మేము తుంబురు నొద్దఁ బరిశ్రమ జేసితిమి. అప్పటినుండియును మాకు చెలిమి యెక్కువయై క్రమముగా నాహార శయ్యా విహారాదుల యందొక్క నిముసమైన నొకరి నొకరు విడచియుండఁ జాలక యేకదేహ మట్లు మెలంగుచుంటిమి. మా గురువర్యుని యుపదేశవిశేషంబున గానవిద్యయందనవద్య పాండిత్యము మాకబ్బి దివిజలోకములందు మిగులఁ బ్రఖ్యాతిఁ గాంచి యుంటిమి. మాసంగీతవిద్యాప్రౌఢిమకు మెచ్చి బిడౌజుండు మా కనేక యోగ్యతా పత్రికల నొసంగి యుండెను. ఒకప్పుడు మాగురువు తుంబురునకును నారదునకును సంగీత విద్యావిషయమై వివాదము సంప్రాప్తమయ్యెను. వారితారతమ్యము విమర్శించి యా విద్యయం దధికు లెవ్వరో నిర్ధారణ చేయుటకు పాకశాసనుని వారు గోరుకొనిరి. గానకళాకౌశల్యమునఁ బేరుకెక్కియున్న మమ్ము నలువురను సహాయసంఘముగ నేర్పరచుకొని దేవేంద్రుండు సుధర్మాభవనంబున గొప్ప సంగీతసభఁ జేసెను. అందుఁ దుంబురనారదులు దమ విద్యావైశద్యమును బ్రదర్శించిరి. అందు గాయకోత్తముఁడు నారదుండనియును వైణికశ్రేష్టుండు దుంబురుండనియును శాస్త్రానుభవ మిరువురకు సమాన మనియును మే మేకాభిప్రాయ మొసంగితిమి. దేవతావల్లభుండును మాయభిప్రాయముతో నేకీభవించి జంత్రగాత్రములయందు గాత్రమే సర్వలోకప్రమోదావ

హాంబని యుపన్యసించుచు గాయకశ్రేష్ఠుఁడగు నారదునకు దివ్య రత్నహార మొండు బహుమానంబుగ నొసంగి మిగుల గౌరవించెను.

దేవసభామధ్యంబునఁ దన కవమానము గలుగుటకు మేము మూల మని తుంబురుఁడు మాపై నాగ్రహము సూపుచుఁ బుత్రికల రీతి నాదరించి సంగీతవిద్యఁ బూర్తిగ మీకు నేర్పినందులకు నాకుఁ దగిన యుపకారమే చేసితిరి. ఇట్లు గురుఁడనగు నన్ను తిరస్కార మొనర్చుటయే గాకుండ మదీయ గాత్రవైరూప్యముం గూడఁ బ్రక టింప సాహసించిన మీదోషమునకునిష్కృతి లేదు. మీరు దేవభూమి నుండ నర్హురాండ్రుగారు. భూలోకంబున బ్రహ్మరాక్షసులై వృక్షా గ్రములనుండిమహారణ్య మధ్యమందుఁబలయొక దిక్కునను సంగీతము బాడుకొనుచుఁగాలము బుచ్చుచుందురు గాక యని మమ్మతితీవ్రముగా శపించెను. అన్యాయము! అక్రమము!! అతిదారుణము!!! అని యా దేవసభ యంతయు గగ్గోలువెట్టఁదొడంగెను.

అప్పుడు మేము విచారభారంబునఁ గొంతతడ వొడలెఱుంగక పడియుండి పిదప మాకు శాపాంతము గూడఁ బ్రసాదింపు మని తుంబురు ననేకవిధములఁ బ్రార్థించితిమి. అతఁ డెట్టకేల కించుక శాంతించి మీసంగీతము నితఁడు లెప్పుడు విందురో యప్పుడె బ్రహ్మ రాక్షసత్వంబు దీరఁగలదు. కాని మీ కెన్నఁడును దేవలోకప్రవేశా ర్హతమాత్రము గలుగనేరదని పలుకుచుఁ బటురయంబున నవ్వలకుం బోయెను.

అప్పుడు మేము చేయునది లేక వెక్కివెక్కి యేడ్చుచుఁ జేతు లు మోడ్చుకొని యన్నముచిసూదను మ్రోల వ్రాలి యేలికా! నిష్కారణము మే మిందు గురుశాపసంతప్తులమై యధోగతిపాలు కావలసినదేనా! మంచియో చెడ్డయో నిష్కపటముగఁ బలుకుట యిందుదోసమని యెఱుంగమైతిమి. మూడులోకములకును బ్రభుఁడ

వగు నీవు మమ్ము బెద్దజేసి యిక్కార్యమునకు నియోగించుటచేఁ గాదనఁజాలక పూనుకొనినందుల కింత ముప్పు సంభవించెను. దివ్య సుఖంబు లెల్ల స్వప్నప్రాయమైపోవ రుగ్జరామరణభయనిలయంబగు మనుజలోకంబున నివసింపఁ జాలము. అబలలమగు మమ్ము బిశాచ రూపములం బూని మహారణ్యమధ్యమందుఁ దిరుగఁ బొమ్మనుట మీకెల్లఁ నొప్పిదంబుగ నున్నదా? సర్వసమర్థులగు మీరెల్ల రిట్లుపేక్షించుచుండ మాకింక దిక్కెవ్వరు. రక్షింపుఁడు రక్షింపుఁ డని వేడుకొంటిమి.

మా దీనాలాపముల కాశచీకళత్రుండు గటకటంబడుచు బిడ్డలారా! మీకబ్బిన యావిపత్తున కంతకును నేనే నిక్కముగఁ గారణ మైతిని. అమోఘమగు తుంబురుని శాపమును గాదను శక్తి నాకు లేకపో యినందులకు మిగుల వగచుచున్నాను. సామర్థ్యంబున కతనికిఁదీసిపో వని వాఁడును బ్రహ్మమానసపుత్రుండగుటనెక్కుడు ప్రభావము గలవాఁడును నగు నీ నారదమునిచంద్రుఁడే యిందులకుఁ బ్రతీకార మూహించుగాక యని వాసివైపు జూపుల్లు బరపుటయును నార దుండు ముందుకేతెంచి మించిన యుత్సాహముతో నావృత్రారి కిట్లనియె.

త్రిలోకనాయకా! నిండు సభలో మీరు నన్ను బెద్దగా శ్లాఘిం చి గౌరవించినందుల కీర్ష్యాగ్రహావేశహృదయుండై మంచిచెడ్డలెఱుం గక తుంబురుండు నిష్కారణక్రుద్ధుఁడై యమాయకురాండ్రగు నీజవరాం డ్ర నాపదలపాలు జేసెను. కానిమ్ము. శాపాంతమగువఱకు బ్రహ్మరా క్షసత్వము వీరికి దినమునకు యామద్వయము మాత్రమే యుండఁగ లదు. అదియును నర్ధరాత్రమునుండియే ప్రారంభమగుచుండును. ఉద యమునుండి శాపదోషము దగులువఱకు వీరునల్వురు నొక్కచోటనె యుండి యుల్లాసముగాఁ గాలము గడుపఁ గలవారలు. శీతశైలంబునఁ

గల కాంచనశిఖరము గడు పవిత్రమైనది. అందున్న శాంభవీదేవి యాలయమే వీరికి నిలయమై సర్వభోగభాగ్యంబుల సమకూర్పఁగలదు. ఆశిఖరము జేరువఱకు వీరికి శాపదోషంబంట నేరదు. పుడమియందున్నను స్వర్గసుఖంబుల మరపించు సంతోషైశ్వర్యముల నందఁగలరని మమ్ము ననుగ్రహించెను. అందున్నవా రెల్లరును వాని మాటల కానందించిరి. దేవేంద్రుండు సభ నంతటితో ముగించి యంతర్గృహంబున కేగెను.

పిమ్మట మేము వాడిన మోములతోఁ గందిన హృదయంబులతో నా దేవసభాభవనము వెడలివచ్చి చేసినయవజ్ఞతకు వగచుచు స్వర్గలోకము నతికష్టమునవిడచి యిక్కాంచనశిఖరంబున కేతెంచితిమి. ఈ శాంభవీదేవిని దర్శించి దినమంతయును నీమెసన్నిధానమందుఁ గడపితిమి. నాటి రాత్రి రెండుయామము లగునప్పటికి మమ్ముఁగురుశాపమలమికొని పూర్వపు విజ్ఞాన మంతయు విస్మృతి గలుగఁ జేసినది. వెంటనే తలయొక దిక్కునకుఁ బోయి యిచ్చటకుఁగ్రోశద్వయ పరిమాణమున నున్న మహారణ్యములో శాఖాగ్రముల నాశ్రయించికొని యుండి తెల్లవారువఱకు సంగీతకాలక్షేపము జేసితిమి. ఉదయ మగువఱకే మాశాపదోషంబు దీరుటచేఁదిరుగ నిచ్చటి కేతెంచి యమ్మవారిని దర్శింపఁ గల్గితిమి. ఇట్లేయమ్మహారణ్యంబునఁబ్రతిదినము నర్ధరాత్రిమునుండిగాసకశాపైదుష్యము బ్రకటించుచుఁ బిదపఁ బూర్వపురూపములంబూని యీయమ్మవారి నతిభక్తిశ్రద్ధలతోఁ బూజించుచుఁ బెక్కుసంవత్సరములు గడపితిమి. పిశాచరూపంబుల నున్నప్పుడు మాకు గానవిద్యమాత్రము స్ఫురణయందుండి సర్వదాప్రకటింపఁబడుచుండునది. శాపమావహించుచే తడవుగ మమ్మిందుండి యేమహాశక్తి వృక్షాగ్రములఁ దృటిలో జేర్చుచుండెనో వచింపఁ జాలనుగాని యుదయమున నటనుండి యీప్రదేశమున కేతెంచుట మా కతికష్టతమ

ముగ నుండునది. ఈశాంభవీదేవి భక్తులోకైకకల్పకంబు. నిత్యము నీమె యారాధన మీరూపమున మాకులభించుటంజేసి చరితార్థులమైతిమి. ఈదేవి మాప్రార్థనల కలరి మమ్మెల్లప్పుడును గాపాడుచుండెను. ఈ మె యనుగ్రహాతిరేకంబుననే మాకు సర్వసౌఖ్యములు లభింపఁగలవ ని యాసించియున్నాము. నాలుగు దినంబుల నుండి శాపదోషం బాకరొకరిఁగాఁ గ్రమంబున నిన్నటితో మానల్వురకు నేపుణ్యాత్ము లమూలంబున నో విడచిపోయినది. నేఁడిందు దేవరదర్శనం బబ్బుట చే మేమింతయును ధన్యాత్ములమైతిమి. ఇందుమిగులవెలగల రత్న ములు గుప్పతిప్పలై యున్నవి. మమ్ము బరిణయం బాడు పురుషసిం హుఁడే యీయైశ్వర్యమున కంతకు నధికారి యని యమ్మవారు సె లవొసంగెను. మేము నల్వురము నొక్కనికే యిల్లాండ్రముగా నుం డుటకు నియమము సేసి కొంటిమి. కావున మమ్మెల్లరను భార్యలఁ గా స్వీకరించి కుబేరునితోఁ బ్రతియనఁదగు రీతి నిందలి భాగ్యం బెల్ల ననుభవింపుమని పలికి యూరకుండెను.

అప్పలుకుల కప్పుడమియెడ యందు మహాశ్చర్యానందకం దళిత హృదయారవిందుఁడై యావేదండయానల నల్వురను బరిణ యంబగుట కంగీకరించెను. కాని శబరబాలకుని వానియాప్తులనన్ని ధిం జేర్చువఱకును దానుబెండ్లి యాడకుండుటకు నియమము జేసికొని యుంటిననియుఁ బిదపఁ గసప్తభార్యలుగ వారిని స్వీకరింతు ననియు ను వారిమనంబులు నొవ్వకుండఁ దగినరీతిని సమాధానము జెప్పెను. అందులకు దేవకాంతలు గూడ సంతోషముతో నంగీకరించిరి. అప్పుడు మదనమంజరి దివోదాసునితో వెండియు నిట్లనియె.

పాహిదేశ్వరా! పిశాచరూపంబుల నరణ్యమధ్యమందు మేము చేసిన సంగీతధ్వని నొరులు వినకున్న మాకు శాపావసానము గలిగి యుండ నేరదు గదా! మనుష్యసంచారశూన్యంబగు నిభ్భయంకరార

ణ్యంబునకు మా యిక్కట్టు దొలఁగింప నేమహాత్ముఁ డేతెంచెనో గ్రహింపఁజాల కున్నాము. ఆప్రాంతములయం దెన్నఁడును మాకెవ్వరును గనిపించియుండలేదని దృఢముగాఁ జెప్పఁగలము. కాని యింతకు ముందు మేమీయమ్మవారి యర్చన కేతెంచునప్పు డిందున్న యుపవనంబున నొకమనుష్యబాలకునిఁ జేటికాహస్తుని మాత్రము జూచి పూజాసమయాతిక్రమణమునకు వెరచి వానిని విమర్శింపకుండ నిం డేతెంచితిమి. ఆబాలకుఁడె ట్లిచ్చటకు రాఁగలిగెనో వాఁడెవ్వఁడో తెలిసికొనవలసియున్నదని పలుకుటయు నా ధాత్రీకళత్రుండు ససంభ్రమంబుగా ని ట్లనియె.

ప్రియురాలా! యతఁలోకంబునుండి మాశబరబాలకుండు మందసముం గైకొని యెందోపారిపోయెనని నాకో భైరవీదేవి యానతిచ్చియుండెను. వాఁడిచ్చటకు నచ్చియుండెనేమో విమర్శింపవలయును. వైళము నీవిప్పుడు చెప్పినవాఁడున్నచోటు చూపించుమని తొందరపెట్టుటయు నాయోషిల్లలామ మేము జూచినవానికి మీరు వచించిన శబరబాలక లక్షణంబులుండుట నిక్కమని పలుకుచు నప్పు డే తక్కినవారితో నద్ది వోదాసుని బాణిద్వారంబున నుద్యానమునకుఁ గొనిపోయెను. కాని యాబాలకుండు వారికిఁ గనంబడలేదు. వాఁడం దెందేని ముందున్నవాఁడేమో యని యాప్రాంతమంతయును వెదకిరి గాని వానిజాడ యెందును గనంబడినది కాదు.

ఇంతలోఁ బ్రాంతమందున్న మందిరమునందుండి యెవ్వరో బాధచే మూల్గుచున్నట్లు వినంబడుటయు వారందఱు నిర్వేరపడుచు సత్వరమ యందుఁబ్రవేశించి నలుమూలలు విమర్శింపఁదొడంగిరి. అం దేమియు వారికిఁ గనఁబడలేదు. కాని యామూల్గు వారికి మిక్కిలి దాపుననే వినవచ్చుచుండెను. ఆధ్వని ననుకరించి వెదకుచుండ వారికొకయంతర్గృహమందుఁ గ్రిందనుండి యదివినఁబడుచుం

డుటఁ దోఁచెను. ఆగదినంతయును దివోదాసుండతిశ్రద్ధతో విమర్శించి నొకవైపునఁ గ్రిందిభాగమునఁ జిన్నతలుపు గోచరమయ్యెను. దానిని తెరచుటకు వానికి సాధనము గనిపింపలేదు. బుద్ధిమంతుండగు నతం డది యొక గుప్తద్వారమని గ్రహించి దానికీలెచ్చటనుండునో యె ఱుంగ నందందుఁ బరీక్షింప నాగదిగోడమూలఁ జిన్నమీట యొకటి దృగ్గోచరమయ్యెను. దానిని చేతితో నదుముటయు నాగుప్తద్వార ము వివృతమగుటయు నొక్కసారి జరిగెను. అదిచూచి దేవకాంతలు భయాశ్చర్యస్వాంతలైరి. దివోదాసమహారాజు మహాసాహసముతో నందున్న సోపానమార్గంబునఁ గ్రిందకు దిగెను. తోడనే యాతలుపు మూసుకొని పోయెను. అది మొదట నెప్పగిదిఁ దెరువఁబడినదో దేవ కాంతలు గ్రహించియుండలేదు. కావున దానిని మరలఁదెరచుటకు వా రనేకసాధనము లుపయోగించి చూచిరి గాని యేమియును గార్యము లేకపోయినది. పెక్కుసంవత్సరములనుండి వారందుఁ దిరుగుచున్నను నమ్మందిరంబున నిట్టి గుప్తద్వారమున్నదని యెఱుంగరు. శాంభవీ దేవి యాలయనిర్మాణ సమయంబుననే యమ్మందిరము గూడఁగట్ట బడినది. ఆగుప్తమార్గము నేద్దియో యుద్దేశ్యముతోనే మొదట యు క్తిపూర్వకముగ నిర్మించియుండవచ్చును. ఆదేవకాంతలు రాజేంద్రుని రాకకై యాద్వారముచెంత నెంతవేచియుండినను వానిజాడ తెలిసినది కాదు. పిమ్మట వారు దేవీపూజకై యాలయమున కరిగిరి.

315 వ మజిలీ.

## మణిగ్రీవ జలంధరుల కథ

యక్షపురంబున మణిగ్రీవ జలంధరులకుఁ గుబేరుని మూల మున మైత్రి కుదిరినది. వారి వైరభావం బంతయును బోయి క్రమ క్రమముగాఁ దొంటి యాంతరంగికస్నేహ మలవడ నెప్పటియట్లు

మెలంగఁదొడంగిరి. చేతి కబ్బిన యనంగమోహినిని యవివేకుల మై యనుభవింపఁజాలక పోతిమని మాటిమాటికిని బశ్చాత్తాప మందు చుండిరి. హేమావతి తమ్మాడిన నిష్ఠురములకు దానియం దీర్ష్యవహిం చి తిరుగ నెన్నఁడును దానింటికి వారరిగియుండలేదు. ఆయచ్చరకును నామిత్రద్వయమునందు విరక్తి బుట్టి వారి నెన్నఁడును దలంచియుండ లేదు. దానంజేసి వారికి స్వర్గలోకప్రయాణావసరము దరుచు కలుగ దయ్యెను.

ఒకనాఁ డామిత్రు లిద్వరును వాడుకప్రకారము విహారార్థమై కొండొకదూరమరిగి వచ్చుచుండగా నరిందముండు వారికి దారిలోఁ దారసిల్లెను. వారికిట్లు సంవాదము జరిగెను.

మణి—మిత్రమా! ఈమధ్య నీవు బొత్తిగా మాకుఁ గనిపిం చుట మానివేసితివేమి? నీవెద్దియో వ్రతదీక్షయందున్నావని వింటిని. అయ్యది పూర్తి యయ్యెనా?

అరింద—మణిగ్రీవా! నావ్రత మంతయును గొలఁదిదినముల క్రిందటనే పూర్తి యైనది. కాని యావ్రతఫలము మాత్రము శూన్య మయినది.

జలం—అదెట్లు? గుణవతిని బరిణయ మగుటయే యావ్రత ఫలం బని దెలిసినది. నీకామె నిచ్చుటకుఁ జిత్రకేతున కభ్యంతర మేమియును లేదుగదా?

మణి—ఈ సంబంధమునకు మాతల్లిదండ్రు లిదివరకే యిష్ట పడిరి.

జలం—ఇఁక గావలసిన దేమున్నది. భైరవీదేవి వీనియందుఁ బ్రసన్నత వహించియున్నదనవచ్చును గదా. చేసినపూజ వ్యర్థ మెన్న టికినిగానేరదు.

అరిం—ఎవరి కిష్టమున్న నే మాయెను. గుణవతికి, నాయం

దినుమంత్రైనను గోరిక లేదు.

మణి—తల్లిదండ్రుల యనుమతంబు నెన్నఁడును నావలో దరి యతిక్రమింపదు.

అరిం—అట్లయిన నీ పంచమీశుక్రవారమునాఁడు స్వయం వరముఁ బ్రకటించుట యెట్లు జరిగెను.

మణి—అయ్యది లోకవిడంబనార్థమని గ్రహింపవలెను.

అరిం—నీ వేమి చెప్పినను గుణవతి నన్ను వరింప దను సం గతిమాత్రము నాకుఁ బూర్తిగఁ దెలియును. అట్టి యిష్టములేని వని తం బెండ్లియాడఁ దలంచుట మిగుల నవివేకమని నేనిప్పుడు నిక్క ముగఁ దలంచుచున్నాను.

జలం—(నవ్వుచు) మామిత్రున కింతలో నింత మనఃపరివర్త నము గలుగుట మిగుల నబ్బురము గానే యున్నది.

మణి—(అరిందమునితో) నీమాటలు విన నామెయందు నీకు విరక్తి గలిగినట్లు దోచుచున్నది గదా? ఇంతకు మించిన సుందరాంగి నీకు లభింపఁగలదా! ఊరక మనస్సంకులముం బొందక స్వయంవర మున కేతెమ్ము. నిన్నే యామె మాతల్లిదండ్రుల యాదేశంబు వలను వరింపఁగలదు.

అరిం—ఆమె హృదయంబున నింతకు వేఱొక పురుషపుంగ వుని వరించియే యున్నది. అయ్యది నాకు పరమసమ్మతము. కావున నేనామెను గలనైన నిఁక దలంపఁబో నని యెఱుంగుము.

మణి—ఆమె వరించి యున్న పురుషుఁ డెవ్వరు?

అరిం—దివ్యబల ప్రభావ ప్రతాప తేజో విరాజితుం డగు దివోదాస ధారుణీచక్రవర్తియే యామె మనోహరుండని నమ్ముము.

మణి జల—(ఆశ్చర్యమును సూచింతురు.)

జలం—ఆమహారాజు నీమె వరించుట యెట్లు గలిగెను. అతఁ

డు మనుష్యుఁడును నీవు యక్షకన్యకయును గదా? లోకాంతరమం దున్నవాని నీవు యెట్లెఱింగెను.

అరిం—ఆమహారాజిప్పు డీలోకమునందే యుండెను. శబర బాలికా న్వేషణంబు నెపంబున నతం డిందు యోగమార్గంబున విచ్చేసెను. అని యాకథ నంతయును సంక్షేపముగఁ గొంతకొంత వారికిఁ జెప్పెను.

మణి—ఉత్కృష్టమగు యక్షవంశమందుఁ బుట్టిన గుణవతి నొకమనుష్యమాత్రున కిచ్చుటకు నే నంగీకరింపఁజాలను. ఆ మానవ నాథు నిందుండి యేదోమాయోపాయంబున నావలకు సాగనంపు వఱకు నామనంబున నూఱట గలుగ నేరదు. మిత్రమా! జలంధరా! ఇందులకు నీ వేమందువు.

జలం—ఇందులకు నాకు పరమసమ్మతము. యక్షకన్యక మనుష్యమాత్రున కిల్లా లగుట మనలోకమున కంతకును దలవంపులుగా నుండును.

మణి—(అరిందమునితో) మిత్రమా! నీవిప్పుడు దివోదాసుని పని మీదఁ బోవుచుంటివి గదా? ఇట్లుచేయుట నీకుఁ దగని పని యని యెందులకుఁ దోచలేదు. నీ వా నరనాయకుని సేవకుఁడవా యేమి? నీవు పూనినకార్యము నుండి విరమించి ముందు మాయుద్యమమునకు సహాయ మొనర్పుము.

అరిం—అయ్యో! మీ యవివేకమునకు మేర లేకున్నది. భైరవీదేవి స్వయముగా న న్నాథాత్రీశశత్రున కప్పగించినది. అమ్మహారాజు బలపరాక్రమపరిభావంబుల దివ్యులఁ దలఁదన్నువాఁడని యాయమ్మవారే సెలవిచ్చి యుండెను. అట్టివానితో శత్రుత్వంబు వినాశహేతువగును గదా? మీ యూహాలు నాకించుకయును రుచింపవు. మీ యవివేకంబునకుఁ బిమ్మట మీరే పశ్చాత్తప్తు లగుదురు.

మీ తో నే నేకీభవింపఁ జాలను. మీదారిని మీరింక పొండు. శబర బాలకుని వెదకుట యందు నేను మసలరాదు.

మణి—ఇప్పు డారా జెక్కడ నుండెను?

అరిం—శబరబాలకు నన్వేషించుట కాయనఘుండు తూర్పు దిక్కునకు స్వయముగాఁ బోయి నన్నీపడమటివైపునకు వానిజాడ లెఱుంగఁ బంపెను.

జలం—శబర బాలకుఁ డీలోకమునుండి వెడలిపోయిన యుదంత మెఱుంగరు కాఁబోలును. మీ ప్రయత్న మంతయు నిందు వ్యర్థమే యగును.

అరిం—వాని వృత్తాంతము నీ కెట్లు తెలిసెను.

జలం—నాలుగుదినములక్రిందటఁ బ్రాతఃకాలమున భైరవీదేవి యాలయమునకు గోశదూరంబునఁ బేటికావలంబకుం డగు మనుజబాలకుండు మాకంటఁ బడెను. ఆపెట్టెలోపలను వానిశరీరమందును నెద్దియో తైల ముండుట జూచి మేము వానిని చోరునిగా నంశయించి యా పెట్టె యందు వానిని బంధించి భూలోకంబున హిమశైలముమీఁదఁ బడవైచి వచ్చితిమి. వాఁడీ సరి కాపేటికాంతరమునందో లేక యేయడవిమృగంబు వాతనో బడి మృతినొంది యుండును. ఓపిక గలదేని వాని కొఱకు మీరు యమలోకమునకుఁ బోయిన నందు వాఁడు గనంబడఁ గలఁడు.

మణి—ఈసంగతి నీయజమానుని తో మనవిచేసి సత్వరము వానిని నరకలోకంబునకుఁ దోడ్కొని పొమ్ము. అనిపరిహాసమాడెను.

ఆమాటల నమ్మి యరిందముండు ముందేగుట మాని యా వృత్తాంతము దహోదానునితోఁ జెప్పవలయునని వెనుకకు మరలెను. మణిగ్రీవజలంధరులును వానితో నడచుచుండిరి. వారు మువ్వురు నట్లుకొంత దూర మరుదెంచువఱకు వారికి ముందు గుణవతి లీలోద్యా

నంబు గోచర మయ్యెను. అందు గుణవతి యనంగమోహినితోఁ గాత్యాయనీవ్రత మొనరించుచుండెను. నాఁడు దివోదాసుఁడు దను సన్నిధినుండి యెచ్చటికో పోయి తిరిగి రాకుండుటకు భయమందుచు శీఘ్రము యాతని నిరపాయునిఁగాఁ దమసన్నిధిం జేర్చుటకుఁ గాత్యాయనిం బ్రార్థించుచు నావ్రతమును జేయుచుండిరి. నాఁడువ్రతసమాప్తి మొనరించి యోషిజ్జనంబునకుఁ బసపును గుంకుమనుబంచిపెట్టు చుండిరి.

ఆసందడి నాలకించి మణిగ్రీవుండు జలంధరుని నిష్కుటద్వారమున నిలిపి తాను లోనికిఁ బోయెను. అరిందముని మనంబు దివోదాసునియందె లగ్నమై యుండుటచేఁ నతఁడందు నిలువక యెచ్చటికో పోయెను. మణిగ్రీవుఁడు దిన్నఁగా గుణవతి మందిరమున కఱిగెను. అందు గుణవతియు ననంగమోహినియు వేలుపుఁబేరటాండ్రను బూజించుచుఁ వానికిఁ గనంబడిరి. అనంగమోహినిని జూచుటతోడనే యతండు విభ్రాంతుఁ డయ్యెను. కొంతసేపటివఱకు నందలివా రెవ్వరును వీని రాక గమనించి యుండలేదు. పిమ్మట యనంగమోహిని వానిం జూచి భయవివశయై యొక్కపరుగున నభ్యంతరమందిరంబునకుఁ బారిపోయి యందుఁ దలుపు బిగించుకొని యుండెను. మణిగ్రీవుని రాక యచ్చటనున్న ముచ్చకంటు లెల్లఁ దెలిసికొని చెట్టొకపిట్టలై యందుండి వెడలిపోయిరి. గుణవతి యిరువురు చెలికత్తెలతో నందు మిగిలియున్నది. ఆమె సోదరున కెదురుపోయి తోడ్కొనివచ్చి యుచితాసనంబునఁ గూర్చుండఁబెట్టి మిగుల నక్కటికముతో నిట్లనియె.

సోదరా! ఆడువాండ్రు విహరించు నీకేళికోద్యానమునకు నేఁడిట్లేల వచ్చితివి? నిన్ను జూచి యిందలి స్త్రీజనం బెల్ల యెట్లు పలాయనులైరో చూచితివా? నీ రాకవలన మాయుత్సవమునకుఁ గూడిరాని యంతరాయము గలిగినది. ఈయుదంతంబు పెద్దలెఱింగిన నీ

పైఁ గినియ కుందురా?

మణి—సోదరీమణీ! నేను నీతోఁ గొంత యత్యవసరముగా ముచ్చటింపవలసి యుండుటచే ననమయమైనను నేడిందు రావలసి వచ్చినది. ఇందులకు నాపైఁ గినియకుందువు గాక.

గుణ—(ఆతురతతో) నేఁడు విశేషము లేమి గలిగినవి? నీయా గమనకారణంబు సత్వరమ జెప్పుము.

మణి—నేను వచ్చినపని పిమ్మటఁ జెప్పెదను గాని ముందుగ నే నడుగు మాటకు సదుత్తరము నీ వొసంగ వలయును. నే నిందే తెంచువఱకు నీసన్నిధి నున్న పొన్నికొమ్మ యెవ్వతె? నన్ను జూచిన తోడనే యాచేడియ లోనికిఁ బారిపోయె నేమిటికి? ఆముద్దులగుమ్మ కు నీసన్నికర్షంబున నంత స్వతంత్రమెట్లు గలిగెను?

గుణ— పరనారీమణుల పరిసంగముతో నీ కించుకయు నిమి త్తము లేదు. ఆ యన్నులమిన్న నాకు మిగుల నాంతరంగికురాలు. కొన్ని దినంబుల నుండి నాతోఁ గలసి మెలసి యున్నది. పరపురు షుఁని గాంచినతోడనే తొలంగిపోవుట శీలవతీలక్షణమని యెఱుం గవా?

మణి—ఆమె యాకారలక్షణములఁ బరికింప సురవనిత కాద ని తోచుచున్నది. దివ్యకామినులఁ దిరస్కరించు సోయగముగల లల నామణి యిందుండుటకు వెఱఁగందుచు నామె వృత్తాంత మెఱుంగఁ గోరితి నిందు తప్పేమియున్నది.

గుణ—ఆమె యెట్టిదైనను నీకు తోఁడఁబుట్టువు వంటిది. కావు న నామె విషయమై నాసన్నిధానమున నేమియును బ్రస్తావింపకుందు వుగాక.

మణి—ఈమెను నేనిదివఱ కెచ్చటనో చూచినట్లుండెను. ఈ యోషారత్నము మనుష్యలోకమునుండియే యిచ్చటకు వచ్చెనుగదా?

గుణ—ఆమె విషయమగు ప్రసంగము గట్టిపెట్టుమన్న మాన కుంటివేమి? ఈమె భూలోకచక్రవర్తియగు దివోదాస రాజమార్తాండుని యర్ధాంగలక్ష్మి. కారణాంతరమున నిప్పుడు నాయంతఃపురమున నివసించియుండెను.

మణి— ఏమీ? ఈమెను నే నెఱుఁగననుకొంటివా? మనుష్యలోకమునుండి యీదివ్యలోకమున కీనారీమణిఁ దెచ్చినవాఁడను నేనుగాదా? నా కామెతోఁ బూర్వపరిచయము లేదనుకొనుచుంటివి కాఁబోలును. నాతో నిట్లు మర్మముగా మాటలాడుటఁదగునా? లోనికేగి యా మెలనాగతో నేనించుక ముచ్చటించుట కనుమతింపుము.

గుణ—మూర్ఖుఁడా! అధికప్రసంగము జేయకుము, ఆయంగనామణి రూపమున కాసించి యిట్లసంబద్ధము లాడుచున్న నిన్నేమి చేయించెదనో చూడుము. పొమ్ము. ఆమె నీడనైన స్పృశించుటకు నీకర్హత లేదని గ్రహింపుము.

మణి—ఆమె నీడనే గాదు తద్గాత్రమున్నే యింతకుముందు స్పృశించియుంటి నని యెఱింగిన నిట్లు వచించియుండవు గదా? ఆమె నన్నే మనోహరుఁగా నిరూపించుకొనిన మాట వినినచో నిట్లు కఠినముగాఁ బల్కనేరవు గదా?

గుణ—ఛీ! ఛీ!! నోరు మూసికొనుము అచ్ఛమగు యక్షకులంబున కంతకును మచ్చఁదెచ్చుచున్న నీనీచప్రవర్తనంబున కింకనైనబుద్ధితెచ్చుకొనుము. ఒక్క మహాసాధ్వి నిట్లు కారులుచ్చరించు నీ నాలుకను వేయిచీలికలుగాఁ గోయించినను దోసము లేదు.

మణి—సోదరి వని యెంత శాంతము వహించుచున్నను బెచ్చుపెఱిగి యిచ్చకొలది మాటలాడుచుంటివి! నీసత్ప్రవర్తన మెఱుఁగని వారియొద్దఁ జెప్పుము. యక్షకులస్త్రీలు మనుష్యుని భర్తగాఁ బొందఁగోరుట కులధర్మమే కాఁబోలును! ఆ దివోదాసుని రూ

పమున శాసించి వానిని దగులొల్కని వచ్చిన యొకపాపజాతి నాతి నింటం బెట్టుకొని యున్న నీవు నా కిందు ధర్మోపదేశ మొనర్పం జూచుచుంటివా! చాలు. చాలు. తల్లిదండ్రులు యోగ్యుడని సమ్మతించిన యతికుమారుని భర్తగాం బడయనెంచక తుచ్ఛమనుష్యజాతివానిని భర్తగాగోరుచున్న నీవునాకునీతులు గరపుచుంటివా! నీవును నేనును దక్కవజాతియందే భార్యాభర్తల వరించుచుంటిమి గావున నిం దొకరి తప్పొకరెంచుకొననగత్యము లేదు. నాతో నిక వివాదమునకుం బూనక యానారీమణిని నాకిమ్ము. నీవు కోరిన దివోదాసునితో నిన్గూర్చుటకు నేను బ్రయత్నించెదను. లేదేని నేనీ మదగజగామినిని బలవంతముగా నీసన్నిధినుండి కొనిపోవుటయేగాక దివోదాసుండు నీకెప్పటికినిలభింపకుండం జేయుటకుం గూడ నేనుసర్వసిద్ధముగా నుంటినని నమ్ముము. అట్లుబెట్టిదముగా మాట్లాడుచున్న మణిగ్రీవునితో గుణవతి యేమియును సమాధానము జెప్పలేకపోయినది. తన గుట్టు వీం డెట్లెఱుంగం గలిగె నని యామె మనమునందుం బెక్కువిధముల నూహింపసాగెను. అనంగమోహినియందలి మోహాతిరేకంబున నామెం బడయనినాండు వీండు దనకొర్కె కెట్టి భంగముగలుగం జేయునో యని యామె భయ మందం దొడంగెను. తనసోదరునివలన నాకు కేమైనం గష్టముగలిగెన్నని దివోదాసుం డదియెఱింగి తనశీలమును సంశయించు నేమోయని యాందోళనము బడం జొచ్చెను. ఇట్లు భయాశ్చర్యవిషాదంబులా వేదండయాన మనంబున నుత్తలపాటు గలుగంజేయ నొకింతతడ వాడ లెఱుంగకుండెను.

ఆయదనున మణిగ్రీవుండు లోనికింబోయి యనంగమోహిని యున్న గది తలుపు దట్టెను. వారిసంభాషణమంతయును లోననుండి వినుచున్న యామెలనాగ యంతకుముందే భయోద్రేకంబున వివశయై పడియుండెను. మణిగ్రీవుండెంత పిలిచినను దలుపుదీయంబడలేదు.

దానికతండు విసుగుఁ జెందుచు నెట్లయిననామెను బట్టుకొనవలయునను బూనికతోఁ గుడ్యోపరిభాగమునకెక్కి యాగదిలోనికి దుమికెను. తత్పతనవేగంబున ననంగమోహినికిఁ దెలివివచ్చి మణిగ్రీవుని నందుఁ జూచి కాతరస్వరంబున నమ్మోయని యొకబొబ్బ పెట్టి తిరుగ గాఢమగు మూర్ఛలో మునిఁగిపోయెను.

అప్పుడు మణిగ్రీవుండు దలుపుదీసి యతిసాహసంబున నష్టుదవతి నెత్తుకొని యీవలకు వచ్చి తొందరగా ముందుఁ బోవుచుండెను. గుణవతి వానిపోకడఁగనిపెట్టి చెలికత్తెల సహాయముతోఁ దెంపున నడ్డు దవిలెను. మణిగ్రీవుండు దనకడ్డువచ్చిన మచ్చకంటుల హస్తప్రహారముల వివశులంజేసి నిముషములో జలంధరుని సమీపించి మిత్రమా! చేతఁజిక్కి దాఁటిపోయిన చిలుక తిరుగఁబట్టుపడినది. అవివేకులమై యపుడు గాలఁదన్నుకొనిపోయిన భాగ్యలక్ష్మి నేఁడు గ్రిమ్మర మనవశమైనది. ఇపుడైనను మనమిదీనిని జాగ్రత్తగాఁ గాపాడుకొనవలయును. అని వచించుచు నుద్యానమందిరమున జరిగిన వృత్తాంతమంతయును వాని కెఱింగించి యీమెకుఁ దెలివిగలుగులోపల నొకవివిక్తప్రదేశంబునకుఁ జేర్పఁదగును గావున నతిశీఘ్రముగ విమానమును గొనిరమ్మని వానినంపెను. జలంధరుండును విస్మయసంతోషాశ్చర్యములతో సత్వరము యొకదివ్యయానమును విమానశాలనుండి కొని తెచ్చి మణిగ్రీవునకు సంతోషమును గలుగఁజేసెను.

పిమ్మట నొడలెఱుంగక పడియున్న యాసన్నుతాంగిని విమానముపైఁ బెట్టుకొని వారిరువురును భూలోకమునకుఁ బోయి యందు జనసంచారానర్హంబగు శీతనగాగ్రంబున నొక సుందరకందరాంతరమునఁ బ్రవేశించిరి. యక్షలోకంబున గుణవతికిని నామెచెలికత్తెలకును మణిగ్రీవుండటిగిన కొంతసేపటికి తెలివివచ్చినది. అనంగమోహినిని దనసోదరుండు బలాత్కారముగాఁ గొనిపోవుటకు గుణ

వతి మిగుల విచారించెను. ఈయుదంతము నితరులతోఁ జెప్పినఁ దన
గుట్టు బట్టబయలగునేమోయను భీతిచేత దాఁగఁ దేల్గుట్టినచందమున
నెవరికినిదెలియనీయక నిజనివాసంబున కేగి లోలోన గుందుచుండెను.

316 వ మజిలీ

## —: యంత్రబిలముకథ :—

దివోదాసుండు గుప్తసోపానమార్గమునం బడి కొంతదూర
మరుగునప్పటి కంతకుముందందుగల చీఁకటి క్రమక్రమముగా నంత
రించుచు నత్యద్భుతమగు తేజోరాశి గోచరమయ్యెను. ఆయనఘుఁడు
దానున్న దొకవిశాల బిలాధ్వమని గ్రహించి దానియంతమెఱింగి
యందలి వింతలఁ దెలిసికొనఁ దలంపు మిగుల నతిసాహసమున ముం
దునకుఁ బోవుచుండెను. ఆబిలమున కిరుప్రక్కల నచ్చటనుండియే
యనర్ఘరత్నములు స్థాపింపఁబడియుండుటచేఁ బట్టపగలువలె నాప్ర
దేశమంతయును దేదీప్యమానముగ వెలుఁగుచుండెను. అట్లతండు
గొంతదూరమరుగునప్పటికి ముందబ్బిలమార్గంబున కడ్డముగానున్న
యినుపబోనును బోలుయంత్రమునం దొకవ్యక్తి చిక్కుకొని కష్టపడు
చుండుట కనంబడెను. ఆదృశ్యమున కతండద్భుతమందుచు నతిజవం
బున నాయంత్రమును సమీపించెను. కోఱలవలె నినుపనారసము లనే
కముగాఁ బైనుండియుఁగ్రిందనుండియు నావ్యక్తిని గట్టిగా నొక్కివేసె
ను. వానిసందునంబడి యావ్యక్తి కొట్టుకొనుచు బాధచేబిట్టుమూల్గు
చుండెను. ఆధ్వని యాబిలమంతయును మాఱుఁ మ్రోగుచుండెను.
అందుఁజిక్కుకొనియున్న యాదైవోపహతుం డెవ్వఁడో తెలిసికొను
టకు వాని యుత్తమాంగ మాయంత్రమున నావలవైపుగా నదుమఁ
బడియుండుటచే వీలు గలిగినదికాదు. ఆయినుపనారసములన్నియును
వాని దేహమున నట్లు తీవ్రముగ నాటుకొనియున్నను నొక్కరక్తబిం

దుపైనను గ్రిందఁ బడుటలేదు. అందుబడిన నేజీవియైనను నిమిషము లోఁ బ్రాణములఁ బాయవలసినదేగాని యావ్యక్తి కేమికారణముననో చైతన్యము దప్పలేదు.

దివోదాసుండు వాని నాయంత్రము నుండి తప్పింపవలయునని యెంతప్రయత్నించినను సాధ్యపడలేదు. చేతులతో బలముగా నా నారసములఁ బైకెత్తఁ జూచెను. అడుగుననున్న వానిని గ్రిందకుఁ ద్రోయ నుంకించెను. పాదములతోఁ దన్నిపట్టి గట్టిగా యీవలకు లాగఁ దొడంగెను. ఇట్లెన్ని యుపాయములఁ బ్రయోగించినను నన్నియును వ్యర్థమయ్యెను. ఆనారసము లించుకయును జలింపలేదు. ఏమిచేయుటకుఁ దోచక యారాజేంద్రుం డచ్చట చతికిలంబడి యొకింతతడవేమిచేయుటకుఁ దోచకుండెను.

పిమ్మట నెద్దియో స్మరణకువచ్చినట్లు తటాలున లేచి యా ప్రాంతముల నతిశ్రద్ధగా వెదుక సాగెను. ఆ యంత్రము మార్గ మంతయును నాక్రమించి యుండుటచే దానిని దాటుట కుపాయము దోచుటలేదు. నారసముల సందులనుండి మణిదీప్తికల వలన నాబిలమింకను జాలదూరము వ్యాపించియున్నట్లు స్పష్టపడుచుండుటచే నెట్లయినను నాయడ్డమునుదాటి ముందుండువింతలఁ జూడ వలయునని వానికుత్సాహ మధిక మగు చుండెను. అంతకుముందు దాటివచ్చిన ద్వారమువలెనే యీయంత్రమును గూడ నెద్దియైన మీటచే నమరింపఁ బడియున్నదేమో యని యా భూపాలుండు మిగుల నోపికతో నందందు విమర్శింపఁ దొడంగెను. ఆబిలముచుట్టును గల కుడ్యము లతిస్నిగ్ధములై యుండుటచేఁ జేతులతో నెంతతడవి చూచినను నెచ్చటనొక్కినను వానికట్టి సాధనమేమియును దొరకలేదు. చివరకందు దీపములవలె వెలుఁగుచున్నరత్నములనొక్కొకటిగఁ గదలింపసాగెను. అందొకరత్నమించుక

చలించినట్లు తోచి దానిని గట్టిగనొక్కెను. తోడనే యాయంత్రస మీపంబునం జిన్నతలుపు తెరచుకొనుటచే మార్గమేర్పడెను.

దాని కతండచ్చెరువందుచు నాద్వారము వెంట రెండవప్రక్క కుంబోయి యాయంత్రమున నున్న వ్యక్తిని దప్పింపవచ్చునేమో చూచెదంగాక యని యందుం బ్రవేశించెను. తోడనే యాగుప్త మార్గము మూతపడెను. ముందుం బోయిచూడ వానికా యంత్రము గాని యందున్న వ్యక్తిగాని కనుపించలేదు. బిలమార్గము దిన్నంగా మణిప్రదీపములచే విస్పష్టముగం దెలియంబడుచుండెను. ఆమార్గమున న తివేగముగాం నడచుచుండం జివురకొక విశాల రమణీయ ప్రదేశంబున కుం జేరుకొనెను. పిదప నతండు వెనుకకుం దిరిగి చూడం దానింతకుం జనుదెంచిన బిలమార్గ మెందున్నదో యించుకయును గుర్తు తెలియలే దు. నలుమూలలయందును మిగుల నున్నతములగు పర్వతపంక్తులు నందందుంగల వృక్షశ్రేణులును మాత్రము గోచర మగుచుండెను.

## హేమసౌధముకథ.

దివోదాసుండు విస్మయముతో ముందుం గొంత దూరమరుగ నచ్చట నొక నిర్మల సరోవరంబుతీరంబున నున్న హేమసౌధం బొండు వానికి నేత్రపర్వ మొనర్చెను. అతిజవంబున నడచుచు నా పుడమిరేడు డయ్యదు దృటిలో దానిని సమీపించెను. ఆసుందర హ ర్మ్యము నిర్మలభర్మమయమై యనర్ఘరత్నఖచితప్రదేశప్రదీప్తమై య నేక యున్నతాంతరవిరాజితమై యత్యంత శోభాయమానమై య లరారుచుండెను. అట్టిసౌధాభ్యంతరంబున నేమివింతలు గలవో లో నికేగి చూచుటకుం గుతూహలపడుచు రాజేంద్రుం డా సౌధద్వా రప్రదేశమున కేతెంచెను. ఆద్వారము యినుపతలుపులతో లె స్సగా బిగింపం బడియున్నది. దానిముందు భయంకరరూపంబుల నొప్పుచున్న రెండుసింహము లభిముఖముగా నిలువంబడియుండి యొక

దానిమీఁద నింకొకటి దుముక నుంకించుచున్నట్లు గనుపించుచుండెను.

వానిం జూచినతోడనే దివోదాసున కించుక వెరపుగలిగెను. కాని యంతలో ధైర్యము దెచ్చుకొని మొలనున్న కటారి నొఱలో నుండి యూడఁబెరికి బాహుబలం బూతగా నాహర్యక్షముల తలలు వరుసగ నరికివేసెను. తోడనే సంవర్తసమయ సముద్భూతప్రచండవాతో ద్ధూత జీమూతవ్రాతసమ్మేళ నోద్ధితానూన గర్జాసదృశంబగు మహాధ్వానంబు వెడలి దిక్కులం బిక్కటిల్లఁజేసెను. ఆభయంకర నిస్వనంబునకు దద్దరిల్లుచు రాజేంద్రుఁడు గనులుమూసి తెరచున ప్పటి కామృగముల యంగములన్నియును విడిపోయియున్నవి. సౌధ ద్వారము వివృతమగుటచేలోపలనుండి కనులకు మిరుమిట్లు గొల్పు తేజఃపుంజ మేతెంచిబయలాక్రమించియుండెను. తానిదివఱకుఁదలలు నరికినవి కృత్రిమపంచాస్యములని తెలిసికొని యాభూమీంద్రుం డద్భుతమందుచు నవి యీసౌధద్వారము దెఱచుట కేర్పరుపఁబడిన సాధనములని గ్రహించెను. జీవకళతో నొప్పి యుండు నట్లామృగ ముల నిర్మించినవాని పనితనమును బెద్దగానగ్గించెను.

అట్లు వివృతమైయున్న ద్వారమున నాసౌధములోనికి దివోదాసుండు ప్రవేశించుటే తడవుగ నాద్వారకవాటము పెద్దధ్వనితోఁ దిరుగ మూసికొని పోయెను. హర్యక్షములును దమతమస్థానము లందుఁ బూర్వపురీతిని నిలువఁ బడియుండెను. ఆసౌధమున మొదటి యంతస్తునందుఁ బది విశాలములగు గదులుగలవు. అవియన్నియును దలుపులు దెరువఁబడియేయున్నవి. అందుఁ దొమ్మిది గదులయందు దివ్యమాణిక్యములు రాసులుగా నుండెను. పదియవగదిలో మీఁదియం తస్తునకుఁబోవుటకు సోపానము లమర్పఁబడియున్నవి. దివోదాసుఁ డామెట్లవెంబడిని పైభాగమునకుఁ బోయెను. అందుఁ గూడఁ బదిగ దులేగలవు. తొమ్మిది గదులనిండ ననర్ఘరత్నములుండి తక్కినదాని

తో నొట్లుండెను. ఆరత్నరాసులం జూచి యారాజమార్తాండుఁడు నివ్వెరంబడుచు మూడవ యంతస్తున కేగెను. అందు ముందు మిగుల విశాలమగు ముంగిలియును దానికిరువ్రక్కల రెండేసిగదులును గలవు. ఆముంగిలియంతకును జిత్రచిత్రవర్ణములుగల రత్నకంబళ మొకటి పరువఁ బడి యున్నది. గదులయందాణిముత్తెముల ప్రోవులుండెను. ఆసౌధంబున కింకను రెండంతస్తులు గలవు గాని యందుఁబోవుటకు సోపానములు గోచరించుటలేదు. వానియందుఁగలవింతలఁగూడఁ జూడవలయునను నుత్సాహముతో నారాజేంద్రుఁడందుఁ బోవుటకు వెరవాలోచించుచుండెను. నలుమూలలు బరికించి యందొక వైపున గోడలో నమరింపఁబడియున్న తలుపును గనిపెట్టఁగలిగెను. దానికీవలఁజిన్నబీగము వేయఁ బడియున్నది. అదిబిగించుటయు నూడఁదీయుటయునుగూడ నక్షరసాంకేతికమునుబట్టి యేర్పడి యుండుట చేత దానిఁ దీయు విధము నెఱుంగ నతండించుక యోజింపవలసివచ్చెను. ఆబీగమునందక్షరములతోనున్న చక్రములు నాలుగమరింపఁబడి యుండి చేతితోఁ ద్రిప్పిన నటునిటు దిరుగాడుచుండెను. ఆయక్షరములతో నెద్దియో యొకసాంకేతికపదమును గూర్చినగాని యాతాళమూడి రాదని యతఁడు గ్రహించి యట్టి పదమెద్దియగునోయని యూహించుకొనుచు నాయక్షరములఁ బరిశీలించుచుండెను. వానిలో "దృష్ట" అనుద్వ్యక్షరములు వరుస గదులందుండుటఁజూచి దైవికముగా వానికి, అదృష్టము, అనుపదము స్ఫురించెను. అట్లునాలుగరల యక్షరములనుఁ గూర్చి బీగమును లాగఁగా నది యూడివచ్చెను. బీగమూడుటకేర్పరచిన సాంకేతికపదము దనకప్పుడు స్ఫురించినందులకు డెందమున నానందమందుచు నారాజచంద్రుఁడు కవాటమును దెరచి చూచెను.

అందు సోపానమార్గము గోచరించెను. వెంటనే పైయంతస్తు

అంతఃసోపానమార్గము గోచరించెను. వెంటనే పైయంతస్తున
కతఁడవలీలఁ బోఁగలిగెను. ఆనాల్గవయంతరువునఁ జూడఁ దగినవింత
లేమియును గనంబడలేదు. పైభాగమునకు బోవుటకుఁ సోపాన
ములును లేవు. కాని యొకగోడమూలఁ గించిదున్నత పీఠమున శక్తివి
గ్రహమొకటి ప్రతిష్ఠింపఁబడియున్నది. ఆవిగ్రహమట్లు మూలనుం
డుటకు శంకించుచు దానిసన్నిధి కేగి విమర్శించి యదియు నొకయం
త్రవిశేషమేయని గ్రహించెను. దానికీలెఱుంగుట కతఁడెంతఁ బ్ర
యత్నించినను వ్యర్థమయ్యెను. ఆవిగ్రహమున కెదురుగా నిర్విణ్ణుఁ
డై యతఁడు చదికిలంబడి ఱెప్పవేయకుండ దానిని జూచుచుండెను.
ఆయమ్మవారి కంఠభాగమున నెద్దియో గీలమరియున్నట్లు తోఁచు
టంజేసి యాతండు త్వరితగతి లేచి తత్కంఠమును రెండుచేతులతో
నొక్కిపెట్టెను. తోడనేయావిగ్రహము నోరువివృతమై సొరంగిమేర్ప
డెను. ఆయవకాశమునఁ జేయిలోనికిఁ బోనిచ్చి పరీక్షింప నందుని
న్న చక్రము చేతికిఁదగిలెను. దానినిఁ ద్రిప్పగా నచ్చటి కుడ్యభాగ
ము రెండుమూరలు వెడల్పునఁ బైకెగసిపోయెను. అచ్చట నొక యి
నుపనిచ్చెన క్రిందికి వ్రేలాడుచుఁ గనంబడెను. అదియే మీఁదియం
తస్తునకుఁ బోవ సాధనమని గ్రహించి దానినెక్కి యాభూపతి
యైదవయంతస్తునకుఁ జేరుకొనెను. అతఁడుమెట్లపై కెక్కుచుండఁగా
మీఁదినుండి కుడ్యభాగము దిగజారుచుఁ గ్రమంబున నామార్గమునుఁ
బూర్వపురీతినిఁ గప్పివేసెను.

ఆసౌధమున నమరింపఁబడియున్న యంత్రముల శిల్పినైపు
ణ్యమున కతఁడబ్బురపడుచు నాతుదియంతస్తునందింక నేమైన విం
తలుండవచ్చునని తలంచుచు మిగుల శ్రద్ధగావిమర్శింపుచుండెను.
అందుఁ బ్రాంగణమునందలి కుడ్యములన్నియును నున్నతములగు
దర్పణములచే నలంకరింపఁబడియుండుటచేఁ దనప్రతిబింబము నా
యద్దములయం దన్నివైపులను జూచియచ్చట నితరులెవ్వరోయుం

డిరని మొదట భ్రమపడి కొంతసేపటికిఁ దనప్రమాదమును దెలిసికొని నిర్భయముగ నందుఁదిరుగుచుండెను. అందొక గదియందు స్ఫటికశిలా వికల్పితమగు గోడమీఁద సువర్ణాక్షరములు మణిదీపికలచేత మిగులఁ బ్రకాశించుచుండెను. వానింజదువ నిట్లున్నది.

చ॥ పుడమిని గాంచనాఖ్య హిమభూధర సచ్ఛిఖరంబునుండి యే
ర్పడిన బిలంబు మార్గమున వచ్చి యిటన్ గల రత్నసంతతుల్
వడిఁ గొనిపోయి శాంభవిని భక్తిదలిర్పఁగఁ బూజసేయు వాఁ
డెడపక యత్నుఁడొక్కఁ డతఁడే బిలకర్తయు సౌధభర్తయున్.

ఉ. ఇట్టియనర్ఘరత్నముల నెక్కడనుండి గ్రహించి తెచ్చి యి
ప్పట్టునఁ జేర్చియత్నుఁడు ధ్రువంబగు భాగ్యమునెట్లు పొందెనో
గుట్టెఱుఁగంగ గోరుటదికూడదు గావున నారహస్య మి
ట్టిట్టిదటంచుఁ దెల్పఁబనియింతయు లేదు గదా తలంపఁగన్

గీ॥ తివిరియత్నుండు శాంభవీ దేవి నచటఁ
దేజమలరంగ రత్నాలఁ బూజసేసి
యిష్టకామ్యంబులను బొంది యేగె నైజ
లోకమునకు సంమోదాతిరేకుఁ డగుచు.

మ॥ నిజజన్మస్థలమందుఁ బ్రేమమిగులన్ నిర్ణిద్ర తేజుండు య
త్నుఁడు దగ్లేగుచు నిందుఁగాంచిన మహైశ్వర్యంబుగొంపోక యి
ట్లజుఁడై నన్ గనతేని చోట నిట మాద్య ద్రీతి రక్షింప న
క్కజమౌ యంత్రములెన్నియేని నతఁడే గల్పించెఁబొల్పొప్పగన్

శా. ఈయంత్రంబులఁ జిక్కకిందుఁగల గుట్టెల్లన్ మహాభాగ్య ప
ర్యాయంబొప్పఁగ నెవ్వఁడే నెఱుఁగునో యాపుణ్యుఁడేదీనికిన్
న్యాయాంబైన ప్రభుండు గాఁగలఁ డిఁకన్ యత్నపరివీరుండు నా
త్మీయస్వామ్యము దీనియందు విడచున్ మేలెంచిమున్మాటికిన్

క॥ పాయక బిలమధ్యంబున
నాయసమై యెసఁగు కోసు నద్భుతరీతిన్

దీయఁగఁ దగు సాధనమును
నీవైనఁ దవ తుంతరువుననే తెలియఁదగున్.

ఉ॥ ఇక్కడనే సారంగమునకేఁగఁగ దగ్గరదారియుండె నిం
కెక్కడనుండి బోనుదరికేగిన దానిని బుచ్చుసాధనం
బొక్కటియున్ లభింపదు. మహోత్తమ పూరుషుఁడెవ్వఁడేనియీ
చిక్కునిఁగీలెఱింగిన భృశంబు శుభంబు లతండు బొందెడిన్.

మ॥ బిలమార్గంబున వచ్చియున్న యతఁడే భీతిన్ విలోకింపఁగాఁ
గలఁడీసౌధము నన్యుఁడెవ్వనికి నెక్కాలంబునన్ గాని యీ
విలసన్మందిరభాగ మేమియును బృథ్వి న్గానఁగారాదు. క
న్నుల కీదేశము సాంద్ర కాననగతి న్దోపట్టు నెప్పట్టునన్.

అనియున్న లిపిని బలుమారు చదువుకొని యాంతరంగమున నుప్పొంగుచు నాధాత్రి బిడౌజుండు బిలమార్గంబునఁ గల యినుప బోనును దర్శించు సాధనము నెఱుంగుటకై యందు విమర్శింపఁ దొడంగెను. కాని వాని కేమియును గనంబడలేదు. బిలమును చేరుటకుం దుండి కలదన్న చేరువదారి నైనఁ గాంచవచ్చునేమోయని దానికొఱకు వెదకెను.

అందింకొక గదియందు సుందరమగు బల్లయొకటి యమరింపఁబడియున్నది. దానిమీఁద విల్లును నంబులపొదియును గలవు. ఆగదియందే యొకమూల గోడనంటి కృత్రిమ పతత్రి గోచరించుచుండెను. ఆగోడమీఁద నిట్లువ్రాయఁబడియున్నది.

చ॥ ఇటఁగల వింటనారి నమరించి యుదంచ దిషువ్రయోగ సం
ఘటనముచేతఁ గట్టెదుటఁ గన్పడు కృత్రిమ పక్షిశీర్షమున్
దటుకునఁ ద్రెళ్లనేసినఁ గనంబడు బెస్విపరంబు బోనుఁ జే
రుటకదెమార్గ మచ్చట నెఱుంగఁగవచ్చును మీఁదికృత్యమున్.

అనియున్న లిపిఁ బఠించి యందుబల్లపైఁ గల కోదండంబు

గ్రహించి గుణంబుసారించి మార్గణంబు దొడిగి యామాయావిహా యసంబు శిరంబు గురిఁజూచి యేసెను. తోడనే యాయంత్రవికిరంబు తలదెగి క్రిందపడెను. సమీపమున నున్న గోడబారెడు వెడల్పునఁ గ్రిందకుజారుట గమకించి యందేగి చూడ విశాలమగు సొరంగము జూపట్టెను. దిగుటకు సోపానములేర్పడి యుండుటచే యారాజోత్తముండు బటురయంబున నందుండి క్రిందకు నడచెను. ఆ సొరంగము మేడగోడలోనే యత్యద్భుతముగ నేర్పరింపఁబడియున్నది. దాని వెంబడిఁ గ్రిందకు దిగి ముందుఁ బరికింప మణిదీపికలచేఁ బ్రకాశించు బిలమార్గము జూపట్టెను. దానిం బ్రవేశించి కొంతదిదూరమరుగు వఱకే వెనుకఁ దాఁ జూచినయినుపబోను చేరఁగలిగెను. అందుఁ జిక్కుకొనియున్న దురదృష్టపు వ్యక్తియట్లే యుండెను. కాని యిప్పుడు మూల్గుటమాత్రము మానివేసెను ఆవ్యక్తి యుత్తమాంగము దనవైపుగనే యుండెను గాని యది యధోముఖమై యానారసముల మధ్యనిమిడియుండుటచేఁ బోల్చుటకు వాని కిప్పటికిని వీలుకలిగినదికాదు.

ఆబోను నెడలించుసాధనము నెఱుంగఁ గుతూహలముతో నాప్రాంతముల విమర్శింప నందొకవంక నినుపగొలుసు వ్రేలాడుచుండెను. దానిని బట్టిలాగఁగా నాబోను త్రుటిలో మాయమయ్యెను. అందున్న పురుషుఁడువిస్మృతుఁడై దివోదానునిపాదములసన్నిధిఁబడియుండెను. ఆపురుషుఁడెవ్వఁడోయని జూచుచుండ వానికిఁజైతన్యము గలిగి యొక్కయుదుటునలేచి నిలువంబడిన వానిం జూచి యారాజేంద్రుం డాశ్చర్య విషాదమేదుర హృదయారవిందుఁడయ్యెను. ఆమందభాగ్యుఁడగు పురుషుఁడెవ్వఁడు? దివోదాసుని సహచరుండగు నరిందముఁడు. అతండు యక్షలోకమునుండి యీగుప్తమార్గమున కేతెంచి బోనులోఁదగుల్కొనుట రాజేంద్రునకు వింతగాఁ దోచెను. వానికట్టికష్

ముగలుగుటకుమిక్కిలి విచారించెను. ఎట్టకేలకు వానికే యాపదయు ను లేకుండుటకు సంతసించెను.

ఆయక్షకుమారుండును దివోదాసునిం జూచియాశ్చర్యమందెను. వారిరువురునుగొండొకవడి నివ్వెరపాటుంబొంది యొకరినొకరు బల్కరింపఁ జాలక చూపులతోనే తమహృదయానురాగముల వెలిబుచ్చుచుండిరి. అప్పుడు దివోదాసుండు నిజహృదయోద్వేగంబడంచుకొని యరిందమునితో మందస్వరంబున నిట్లనియె

మిత్రమా! నేఁడు నేనెంతయును ధన్యుండను. ప్రాణస్నేహితు నియాపదఁ దప్పించివానితో ముచ్చటించుభాగ్యము నాకొదవెను. ఇందున్న బోనులోచిక్కుకొని యాబాధచే నీవొనర్చిన యాక్రందన ధ్వనియే మనకు మహోపకారమొనరించెను. నేనీబిలము జొచ్చుటకదియే కారణమై యఖండైశ్వర్యములభింపఁ జేసెను. నీయాపద దాటింపఁగలుగుటకుఁగూడ నదియే మూలమగునుగదా. యక్షలోకంబునుండి యిచ్చటి కెట్లువచ్చితివి? ఈబోనులో నెప్పగిదిఁజిక్కుకొంటివి? నీయుదంతము సాంతముగా వినఁ గుతూహలమగుచున్నదని యడుగుచున్న యమ్మహారాజున కరిందముండు పునఃపునస్సాష్టాంగదండ ప్రణామంబులాచరించుచు వినయముతో నిట్లనియె.

మహారాజా! భైరవీదేవియాలయమునుండి శబరబాలకాన్వేషణంబునకుఁ బశ్చిమ దిశనున్న దివ్యభవనంబులెల్లఁదిరిగియెచ్చటను వాని యునికి నెఱుంగఁజాలకఁ గ్రమంబున వెనుకకు వచ్చుచు నలకాపురము సమీపంబున మణిగ్రీవ జలంధరులఁ గలసికొని వారివలన శబరబాలకుని వృత్తాంతము గొంతయెఱింగి యావార్త మీకు నివేదింపవలయునను గుతూహలముతో మిమ్మన్వేషించుచు తూర్పువైపుననున్న దివ్యపురంబులన్నియును వెదకితినిగాని యెందును మిమ్ముగనుగొనలేకపోతిని. 'హిమవన్నగము మీఁద శబర

బాలకుని బడవైచి వచ్చితిమని మణిగ్రీవజలంధరులు నాతోఁజెప్పి యుండుటచేత నచ్చటి కేగి వానినైనఁ గనుగొని వచ్చుట యుచితమని తలంచి యొకదివ్యయానంబెక్కి భూలోకమున కేగితిని. అందు శీతశైల శిఖరంబున నందందు విమర్శించుచు నొకదండదేవతాలయముం జూచి విమానము నాప్రాంతములకుఁ బోనిచ్చి యాయాలయమునకు వెనుకనున్న పూలతోటలో దిగితిని. అందుఁగలమందిరమును జూచి దానియందేమైన వింతలు గనంబడవచ్చునని తలంచి లోనఁ బ్రవేశించి గదులన్నియును విమర్శింపుచుండ నొకదానియందు గోడలో మీటయొకటి యమరించియుండుట గ్రహించి దానిని నొక్కితిని. తోడనే ప్రాంతమందున్న గుప్తద్వారము వివృతమై యందు క్రిందకు సోపానమార్గము గోచరించుటయు నదియేమోచూడవలెనను నుత్సాహముతో దానిలోఁ బ్రవేశించి ముంధేగితిని. బిలమార్గమంతయును మణిదీపికలచే స్పష్టముగాఁగనంబడుచుండెను. నేనిచ్చటి కేతెంచినప్పుడిందుబోనులేదు.అదియెచ్చటనుండివచ్చి నన్ను గబళించెనోయెఱుంగఁగానిబిలమార్గంబుననడచుచున్న నన్నుద్రుటిలోఁబడఁగొట్టినొక్కివేసినది. ఆపదలయందుఁగాపాడఁగలదని మీరునాకిచ్చిన రత్నము మచ్ఛన్నిధి నుండుటచే నేనీబోనులో నదుమఁబడినను,జీవించియుండుట తటస్థించెను. అందుఁజిక్కిన వెంటనే నేను వివశుండనైతినిగాని తిరుగ నతిశీఘ్రముగనే నాకుస్మృతి వచ్చినది. అయినుపనారసములు నాయొడలిలో గాటముగ నాటుకొని యున్నవి. కాలుసేతులు గదలించుటకుఁ గూడ శక్తిలేక పోయినది. నోటమాట వెల్వడకుండెను. అప్రయత్నముగ మూల్గుమాత్రము బుట్టినది. నేనందెట్టి బాధ ననుభవించితినో నాకించుకయును దెలియదు. కొంత సేపటికి మూల్గుటకు కూడ నాకోపిక లేకపోయినది. పిదప నేమియునుఎఱుంగను. ఆబోనున నమరింపఁబడిన నారసములు మృత్యువే

వశా దంష్ట్రలనఁ జెల్లును. అందుండి యెట్లీవలఁబడితినో యాభాగ్య
హైనకో తెలియుకున్నది. ఇట్టి భయంకరమైన యంత్రము నేనిప్ప
టను గనివినియెఱుంగను. దీనిని బుచ్చుటకు భవదీయ బలప్రతాప
ప్రభావంబులుగాక కారణమితరము గానేరదు. మీదివ్యరత్నము నా
కిప్పటికి రెండుగండములు దాటించినది. దీని యత్యద్భుత ప్రభావ
ము వర్ణింప బ్రహ్మాదులకైనఁదరముగాదని సంతోషాతిరేకంబునఁ జె
క్కురీతులఁ బ్రస్తుతింపఁ దొడంగెను. ఇట్లు వారిరువురును బరస్పర స
మావేశమునకు ముదంబందుచు నబ్బిలము దాటి యవ్వలంబోయిన
నపాయము లేకుండునని దలంచుచుండ దివోదాసున కందొక లిపి
గనంబడుటయు దాని నతండిట్లు చదివెను

ఉ. ఆపద సంభవించును జుమా! యిఁక ముందడుగైనఁ బోయినన్
ప్రాపుగ నిచ్చటే కల దుపాయ మొకండు బిలంబు దాట. సం
తాపము బొందనేమిటికి? తథ్యము బోనిట హేమసౌధ ని
క్షేపము రక్షణంబునకె కేవలమున్ సృజయింపఁగాఁ బడెన్.

అంత దివోదాసుఁడాలిపి నందు రచించిన వారిని సంస్తుతించు
చు బిలనిర్గమనోపాయము నకై యందు మరియు విమర్శింపుచుండ
నొకదండ దివ్యగానరవంబొకింత వినంబడుటయు దానికబ్బురంపడుచు
నాధ్వని యేతెంచిన వైపున నతిశ్రద్ధగాఁ బరీక్షింపఁదొడంగెను. లిపి
యందిచ్చటనే బిలముదాటుట కుపాయము గలదని యుండుటచే నది
యున్నచోట వెదకుచు నొక్కొక్క యక్షరమును చేతితో దడుము
చుండెను. "కలదుపాయమొకండుబిలంబుదాట" అనియున్నచోటు
చేతితో నదుమగా నాభాగము లోనికిఁబోయెను. వెంటనే చేరువనున్న
గుప్తద్వారము వివృతమయ్యెను.

దానింగాంచి వారిరువురును విస్మయమందుచు నందు సత్వరమ
ప్రవేశించిరి. తోడనే యాగుప్తద్వారము మూఁతబడెను. దివోదాసుండు

యక్షునితో నిపుడొక గదియం దుండెను. శాంభవీ దేవతాలయము వెనుకనున్న యుపవనము వారికి దృగ్గోచరమయ్యెను. ఇదివఱకు దాను బిలంబు బ్రవేశించిన గుప్తద్వారము వారిపుడున్నగది ప్రక్క గది లో నున్నదని గ్రహించి యాశ్చర్య మందుచు నామందిరమువెడలి వచ్చిరి. ముందు దేవీగీతములఁ బాడుకొనుచుఁ బుష్పావచయంబొనరిం చుచున్న దేవతాస్త్రీలు నేత్రపర్వ మొనర్చిరి. వారింగాంచి యాభూ పాలుం డమందానందభరితాంతరంగుడై సత్వరము, యక్షునితో వారి సన్నికర్షమున కేగెను. దివోదాసుండట్లు నిరపాయుఁడై తిరుగఁ దమకన్నులంబడుటచే నాచకోరాక్షు లత్యంత సంతోష స్వాంతలైరి. గుప్తద్వారమున బిలములోఁ బ్రవేశించి నదిమొదలు జరిగినవృత్తాంతమంతయు నారాజేంద్రుని వలన విని యద్భుతమందిరి. ఇంతలో దేవినర్చించుటకు వేళయగుటయు నామదగజయానలు సంభ్రమించుచు నమ్మవారి పూజావిధానములఁదీర్చి యిపుడేరాఁగ లమని పలికి పూజాద్రవ్యములంగొని యతిత్వరితగమనంబుల నాయా లయంబున కఱిగిరి. దివోదాసుండును వారేతెంచువఱకు నూఱకుండ నేల నని యక్షునితో నాప్రాంతములయందలి వింతలంజూడఁబోయెను.

317 వ మజిలీ

# శైలకందరముకథ

మణిగ్రీవజలంధరులు విమానము మీద ననంగమోహినిని బెట్టుకొని యక్షలోకమునుండి తిన్నగాబుడమికేతెంచి హిమశైల శిఖరంబున నొక రమణీయప్రదేశంబును జేరిరి. అందు దివ్యయాన ము నిలిపి యప్పటికిని దెల్వితప్పియున్న యా యలినీలాలక నొక కంద రాంతరమున కెత్తుకొనిపోయి యందు లతాపల్లవంబులచే నమరింపఁ బడిన శయ్యయందుఁ బరుండఁబెట్టిరి. అకాంత స్మృతివచ్చులోపల నా

ప్రాంతమందున్న స్వాదు ఫలంబులఁ గొన్ని దెచ్చి యుంచుట సముం జసమని తలంచి వారిరువురిలో నొకఁడటఁగాపుండుటకును రెండవ వాఁడు ఫలాన్వేషణంబునకుఁబోవుటకును నిశ్చయించుకొనిరి. మణి గ్రీవుఁడందుండెను. జలంధరుండు విమానమెక్కి యాప్రాంతముల యందు ఫలములకై తిరుగుచుండెను. ఇంతలో ననంగమోహినికి తెలివివచ్చి గుహాముఖంబుననున్న మణిగ్రీవునిజూచి చకితురాలయ్యె ను. కుచ్ఛితకార్యాచరణపరాయణుండగు నాయతకుల కలంకుని బారినుండి తప్పించుకొనుట కుపాయము జూపింపుమని పరమేశ్వరుని ప్రార్థించుచు మణిగ్రీవుడెఱుంగకుండ మెల్లగా నాశయ్యనుండి లేచి తెంపున నాగుహాలోఁ గొంతదూరము లోనికిఁ బోయి నిముసములో మాయమయ్యెను.

కొంతసేపటికి మణిగ్రీవుండా వేదండయానకు దెలివివచ్చిన దేమో యని తిరిగిచూడ నాశయ్య యందామె వానికిఁ గనంబడ లేదు. అందుల కులుకుచు నతండతిరయంబున, లేచి యచ్చటికేగి పరి కించెను. అందామెఁ యెందును జూపట్టకుండుటకు మనంబున భయ విషాదవిస్మయంబులం బొందుచు నాగహ్వారాంతమునకుఁ బారి పోయినదని నిశ్చయించి యామెను వెదుక లోనికిఁబోయెను. అంధ కారబంధురంబై కరంబు భయానకంబగు నగ్గుహాంతరంబున వాని కేమియుం గనఁబడలేదు. అనంగమోహిని తప్పక యందెందో దాగి యుండెనని నమ్ముచు నెట్లయిన నామెను బట్టుకొనవలె నను పట్టుద లతో నాతెయందుఁగల మోహాతిరేకంబున నొడలెఱుంగక యతి సాహసమున ముందునకు తడవికొనుచు నడచుచుండెను. ఆగుహ క్రమక్రమముగా సంకుచితమై నడచుటకువీలులేకపోవుటయు నతండు గొంతదూరము ప్రాకుచుఁ బోయెను. చివురకందుఁగూర్చుండుటకుఁ గూడతావులేకపోయెను. ఆగుహాగర్భంబున బోరగిలఁ బరుండి ముం

దేగఁ బాలక చేతులతో నటుమూలలఁ దడవుచు ననంగమోహినీ యని పిలుచుచు నామూలమున నీవును నీకొఱకై నేనును నీదారుణ గహ్వరంబున నంతరించవలసిన దేనా యని విలపించుచు యుత్కృష్ట యతివంశమునఁ బుట్టి యిట్టియకార్యకరణంబునకుఁ గడంగిన నాకుఁ దగిన యనుభవమైనదని నిందించుకొనుచుఁ గొంతతడ వొడలెఱుంగక పడియుండెను.

ఫలములకై పోయిన జలంధరుండు గుహాముఖంబున కేతెంచి యందుమణిగ్రీవుఁడు గాని యనంగమోహినిగాని కనంబడకుండుటకు విస్మయమందుచు మణిగ్రీవుండు నిక్కముగఁ దన్నుమాయఁజేసి యా సరోజాననఁ దీసికొనియెందో పోయెనని నిశ్చయించి వాని ననేక విధంబుల నిందించుచు నమ్మదవతితోఁ గలియుభాగ్యము దనకు లేకపోయెనని వగచుచుఁ దానిఁక నందుండఁ బ్రయోజనము లేదని తలంచి నిస్పృహుండై నిజలోకంబునకు మరలిపోవనెంచి యంతలో వారినయ్యరణ్యంబున వెదకి కనుఁగొనవలయునను నూహ జనింప దివ్యయానంబెక్కి వారికొఱకై యాప్రాంతముల యందుఁ దిరుగుచుండెను.

అట్లువిమర్శించుచుండ ముందొకచోటఁ బేటికావహస్తుండగు శబర బాలకుండు వానికిగోచరమయ్యెను. వానింజూచి మొదట యనంగమోహినిని గైకొనిపోవుమణిగ్రీవుండని తలంచి పటురయంబున వాఁడున్న చోటకు జలంధరుఁడు విమానమునుఁబోనిచ్చెను. కానియందున్నవాఁడు యతిలోకమునుండి భూలోకమునకు వెనుకదాముగొని తెచ్చిన వానిఁ గానిరూపించి విమానమును దిగి వాని సమీపమునకుఁబోయి యోరీ! నీ వింకను జీవములఁబడసియే యుంటివా? మేమప్పుడు నిన్నుపైనుండి విసరివేయక విమానమెక్కించి యిచ్చుటకుఁ దీసికొనివచ్చుట మాదే తప్పు. ఇఁక నేటితో నీజీవితావధి తీరినదని పలుకుచు భయకంపితుండై

రొందిగియున్న యాశబరబాలకుని బట్టి యాపెట్టెయందుఁ దిరుగఁబెట్టి యంతరిక్షమునకు విమానముమీదఁ దీసికొనిపోయి యాపెట్టెలో వానిని గ్రిందకుఁ ద్రోసివేసెను. పిమ్మట జలంధరుం డనంగమోహి నీ మణిగ్రీవులు దనకింతలోఁ గనంబడుట దుర్లభమని తలంచుచు మనంబున విరక్తి బూని యాదారినే నిజనివాసంబునకుఁబోయెను.

మణిగ్రీవుండు శైలకందరాంతరంబున నట్లు వివశుఁడై పడి యుండి కొండొకవడి కొడలెత్తింగి తనభంగపాటున కడలుచు నాగు హనుండి బైటపడు నుపాయము దెలిసికొనఁ జాలక యందు తహతహం పడుచుండెను. అచ్చటినుండి వెనుకకుఁ దిరిగిపోవలె నన్నను నది సాధ్యముగాఁ గనంబడుటలేదు. ఆ గుహాబిల మధ్యంబునఁ దనకుఁ జావు దప్పదని నిశ్చయించుకొని యెట్లయినను నవకాశ మున్నంతవఱకు ముందునకు జరుగుటయే ధీరలక్షణమని తలంచి భోరతో నతికష్టము మీద రెండుబారలమేరఁ బ్రాకఁగలిగెను. అచ్చట నాబిలము గొంచెము విశాలముగా నుండుటచే ముందేగుటకు వాని కించుక ప్రోత్సాహకరముగానుండెను. మఱికొంత దూరమట్లే ప్రాకుచుఁ బోవనాసారంగము గ్రమక్రమముగాఁ బెద్దదగుచుఁ గొంతవఱకు వంగి నడచుటకును బిదప నిలువఁబడి ముందేగుటకును నను కూలమయ్యెను. అబిలము ననుసరించి ముందేగుచుండ నెదుర వానికి వెలుఁగు గనంబడెను. దానింజూచి యాయక్షకుమారుండు ముదమందుచు ననంగమోహిని యామార్గముననే పోయియుండునని తలంచి యామెను ముందు గనుంగొనవచ్చునను నాశతో నతిరయంబున నడచుచుఁ గొండొకవడి కాబిలంబు నిర్గమించి యొక కాసారతీరంబును జేరుకొనఁగల్గెను.

ఆసరోవర సమీపంబున రమణీయ సైకతస్థలంబున నొక తరుణీమణి కూర్చుని యుండుటఁ దిలకించి మణిగ్రీవుఁడామె యనంగ

మోహిని యను నాళితో సమందగమనంబున సన్నిధి కేగెను. తావ
లచిన లలనామణి యొంటరిగ నట్టిరమణీయ ప్రదేశంబున లభింపఁ
గల్గెనను నుత్సాహముతో నేతెంచిన యాయతుకుమారునకు తోడనే
మిగుల నాశాభంగము సంభవించెను. తలవనితలంపుగా వానికచ్చట
గుణవతి ప్రత్యక్షమయ్యెను. తనసోదరి యందుఁ గనంబడిన వెంటనే
వానికి వచింప నలవిగానంత మనోవైకల్యముగలిగెను. అమాంత మా
నుపైఁ బడి మడియింప వలయునను నంతటి పాపచింత హృదయం
బునఁ బుట్టెను. ఆయోషామణి యావలమోమై యుండి యెవ్వరికొ
ఱకో నిరీక్షించుచుండుటచేత మణిగ్రీవుని యాగమనం బామె మొ
దట గ్రహించియుండలేదు. ఇంతలో నామె చెలికత్తెయగు చిత్రలేఖ
యచ్చటికివచ్చి యచ్చిగురాకుఁబోణికి వెనుకఁ గ్రోధారుణ దుర్నిరీక్ష్య
వదనుఁడై నిలువఁబడియున్న మణిగ్రీవునిఁ దిలకించి కించిద్భయ వి
స్మయావేశ హృదయాంబుజాతయై యొడలు కంపమొందుచుండఁ దీ
వ్రగమనంబున వారిని సమీపించి గుణవతినుద్దేశించి నెచ్చెలీ! నీవె
నుకనున్న సోదరుం దిలకింపలేదా! జ్యేష్ఠసోదరుఁడు తండ్రితో స
మానుఁడని యెఱింగి యుచితరీతిని సన్మానింప వలయుననుట దెలి
యదా యనిమందలించు చున్నట్లామె నుద్బోధించెను.

ఆమాటల కులికిపడి లేచి గుణవతి చేరువనున్న యన్నగారిం
జూచి "యనంగమోహిని నెందుదోడ్కొనిపోతి" వని గద్దించియడిగె
ను. అనంగమోహినిపేరు వినినతోడనే వాని యాగ్రహమంతయు
నంతరించెను. దృఢపరీభవ వ్యథాకలిత హృదయుఁడై గద్గదస్వరం
బున నామె యేమైనదో తెలియదని యతఁడు బదులుచెప్పె
ను. ఆమాటవిని గుణవతి దండతాడిత భుజంగము వడువున మండి
పడుచు నిట్లనియె.

నీచుఁడా! సహోదరినగు నామాటయైనఁ బాటింపక యవినీ

తుఁడవై యబలలమగు మమ్ముఁగొట్టి యాచకోరాక్షిని బలిమిమై మ్రుచ్చులించుకొని పోయి యిప్పుడేమియు నెఱుంగనని చెప్పుట నీ దుష్టస్వభావమును స్పష్టపరచుచుండెనుగదా! ఆనారీశిరోమణి నెందుఁ దోడ్కొనిపోతివి? ఏమిచేసితివి? నిక్కమువచింపుము లేకున్నఁ బెద్దలయొద్ద నీకు బుద్ధిజెప్పింపఁగలనని కసరుచున్న చెలియలితో మణిగ్రీవుం డను నయ పూర్వకముగా నిట్లనియె.

సోదరీ! నాపై నేమిటికిఁ గినుకఁ జూపెదవు. నేనిప్పుడు నీతో సత్యమునే పలుకుచుంటిని. మూఢుండనై యావేదండయానను దోడ్కొనివచ్చి యిమ్మహారణ్యమధ్యమునం దామె నెడఁబాసితిని. జలంధరుఁ డేమయ్యెనో తెలిసికొనఁజాలనైతి నని తనవృత్తాంత మామూలచూడముగా వక్కాణించి మఱియునిట్లనియె. ఆనవ సుమకోమలాంగి యీదారినేవచ్చి నీకిందునిక్కముగఁ గనంబడియుండును. ఆమెనాకుఁ జిక్కకుండుటకీ చిత్రలేఖ సహాయంబున నీ వెచ్చటనో మరుగుపరచి యుందువు. సహజన్ముండనగు నాపైఁగనికరముగలిగి యాచిలుకలకొలికిని నాకొసంగి నన్ను రక్షింపుము. ఆసుందరాంగియునికి నెఱుఁగకున్న నాహృదయంబు మదన దావానలంబున వ్రియ్యలగుట నిక్కవమగును. నామనోపహారిణిని నాకొసంగి పుణ్యము గట్టుకొనుమని బ్రతిమాలుకొనుచున్న మణిగ్రీవునకు గుణవతి యిట్లనియె.

ఓరీ! ఆసాధ్వీలలామపై నీకుఁగల మరులు మరలించుకొనుము ఆమె నీకు సహోదరివంటిదని యెఱుంగుము. ఆమెను నీవెట్టిబలాత్కారము నేసినను మహాపాతక హేతువని నమ్ముము. ఆమగువ నెచ్చటనో దాచియుంచి యిట్లపూర్వపు గథయొకటి గల్పించుచుంటివని సంశయింపవలసి వచ్చుచున్నది. లేకున్నగుహలో శయనించి యున్నయామెయది తన్ముఖంబునఁ గావున్న నిన్నువంచించి యెచ్చటకుఁబోఁ

గలదు. నీమాటలు సత్యదూరములనుట నిశ్చయము. వీఁడుమిక్కిలి మేమామెను మఱుఁగుపరచియుంటిమని యెదురువాదుమోపుట నీయ బద్ధ నాటకమునకు సూచనముగా నున్నది. వివేకము గలవాఁడవై న నిప్పుడైన నాసన్నిధినుండి నీవెత్తుకొనిపోయిన మత్తకాశినిని వైశమ నాకప్పగించి పొమ్ము. లేకున్న మీఁద నేమగునో నీవ యాలోచించుకొమ్మని పలుకుచున్న యక్కలికి తలమిన్న కాయజు కుమారుండు వెండియునిట్లనియె.

సోదరీ! నేనెంతఁజెప్పినను నమ్మకున్న నేమిచేయఁగలవాఁడను. తాతపాదుని యాన నేనిందేమియు నసత్యమాడలేదు. నన్ను మోస పుచ్చుటకు నీవేయామె నెచ్చటనో దాచియుంచి నాతో బూటకము లాడుచుంటివని నమ్ముచున్నాను. ఈమహారణ్య మధ్యంబు నకు మీరేతెంచుటయును నిందునీవొక్కతెవుండి చిత్రలేఖ నెచ్చ టకో పంపియుండుటయును సంశయింపఁ దగిన విషయములుగావా? నన్నింక వేదనలంబెట్టుట మాని యామానినీ శిరోరత్నమును వేగఁ జూపింపుము. నీమేలెన్నఁడును మరచిపోనని పలుకుచున్న యన్న కాయన్నులమిన్న యిట్లనియె.

అయ్యో! మేమా యోషామణి నిచ్చటఁజూచియుండలేదని చెప్పుచున్నను నీవు నమ్మవేమిపాపము! మమ్మునిర్జించి బలాత్కార ముగా నీవామెను తీసికొని పోయిన పిమ్మట నిప్పటి వఱకు మాకామెజాడ యేమియును దెలియదు. నీవేగిన పిదప బెదరుగదురు హృదయములతో మేము మొదట నాయంతఃపురంబున కఱిగి యనంగమోహిని నెడఁబాయుటకు వాపోవుచు నీవలన నా మెకెట్టి కష్టము సంభవించుచుండెనో యని యడలుచు నేమి సేయుట కుం దోచక కొంత తడవు నిర్విణ్ణులమై యుంటిమి. ఆసాధ్వీలలాము నెట్లయినను గనుంగొని నీబారినుండి తప్పింపవలయుననుదృఢ నిశ్చ

యములోఁ బిదప విమానమెక్కి యాచిత్రరేఖ సహాయమున మీ కొఱకందందు వెదకుచుఁ గ్రమంబున నీహిమ శైలశిఖరంబున కేతెంచితిని. ఇందురమణీయమగు నీకాసారతీరంబున నించుక విశ్రమింపఁ దలంపుమిగులుటచే నేనిందుండి చిత్రలేఖ నీప్రాంతముల మీజాడ యేమైనఁ దెలియునేమో చూచిరమ్మని విమానముమీఁదఁ బంపించి యామెరాక నిరీక్షించియుంటిని. ఇంతలో నీవును జిత్రలేఖయును నేకకాలముననే యిచ్చటనాకుఁ దిరుగఁ గనంబడిరి. అనంగమోహిని జాడయేమైనఁ జిత్రలేఖ యెఱింగి వచ్చెనేమో యామెయే చెప్పవల యునని యూఱకుండెను. అప్పుడు చిత్రలేఖ గుణవతితో నిట్లనియె.

ప్రియసఖీ! నీయానతివడువున దివ్యయానంబెక్కి యనంగ మోహిని కొఱకీప్రాంతములయం దతి శ్రద్ధతో వెదకుచుండగా నొకవైపునుండి విమానముమీఁద మిగులవేగముగాఁ బోవుచుండిన జలంధరుండు నాకెదురయ్యెను. తొందరగాఁ బోవుచుండుటచే నతఁడు నన్ను గమనించి యున్నట్లు తోఁచదు. నేను వాని నీక్షించి యనంగమోహిని యుగంతము నతండెఱింగి యుండవచ్చునని ప్రచ్ఛన్నముగా వాని విమానము వెనుక మదీయ దివ్యయానమును గొంతదూరము పోనిచ్చితిని. మణిగ్రీవుఁడు లేకుండ జలంధరుఁడట్లొంటరిగాఁ బోవుచుండుట నాకెంతేని వింతగాఁ దోఁచెను. అనంగమోహినిమూలమున వారిద్దరికేమైనఁ దిరుగ కలహము సంభవించెనేమో యని సంశయించితిని. వాని దివ్యయానము దిన్నఁగా నాకసంబున నుత్తరపు దిక్కుగాఁ బోవుచుండుటచేత నతఁడు యక్షలోకమునకే యరుగుచున్నాఁడని నిశ్చయించి నేను వెనుకకు మరలివచ్చితిని. వాని విమానముమీఁద నెద్దియో యున్నట్లు గనంబడినది కాని నేను దానికిఁ జాల దూరమున నుండుటచే నదియేమైనదియును గుర్తింపఁ జాలనైతిని. అతఁడెచ్చటనుండి వచ్చుచుండెనో యావిమానము

సందుఁ గల వస్తువేమో విమర్శింపవలసియున్నది. ఈవృత్తాంతము నీకెఱింగించుటకే నేనిందు వెంటనే తిరిగి వచ్చియిచ్చట మణిగ్రీవుని నీసమీపమునఁ జూచితి నని యూరకుండెను. ఆమాటలవిని మణిగ్రీవుం డిట్లనియె.

చిత్రలేఖా! జలంధరునియొద్దఁ గలవస్తువెట్లుండెను. నాసన్నిధినుండి ఫలమూలాదులంగొని వచ్చుటకే గదా యతఁడువిమానము మీఁద నరిగియుండెను. అందున్నది వివిధవన్యఫలాదుల పోవుతేమో యని తలంపఁ గూడదాయని యడుగుటయుఁ జిత్రలేఖ తలఁద్రిప్పుచు నట్టిదేమియును గావని మాత్రము నేనురూఢిగాఁ జెప్పఁగలను. అందున్న వస్తువించుక దీర్ఘముగా నుండి వానిపాదసమీపమున నడ్డముగాఁ బడియుండెనని బదులుచెప్పినది. అప్పుడుమణిగ్రీవుండు హృదయోద్వేగంబున నొడలు గంపమొంద గుణవతితో నిట్లనియె.

చూచితివా! జలంధరుని మిత్రద్రోహము! నేనిచ్చటికిఁ జేరిన మార్గముననే యామానినీరత్నమే తెంచియుండుట వాఁడు విమానము మీఁదనుండి తిలకించి సన్నిధికేతెంచి యామెను బలాత్కరించి యుండును. వానిని మొదటినుండియును దిరస్కరించుచున్న యాయన్నులమిన్న వానినొల్లక భయోద్రేకంబున మేను మఱంగక పడియుండును. అప్పట్టున వాఁడామెను విమానమునఁబరుండఁబెట్టుకొని యెచ్చటికో యెత్తుకొని పోయి యుండును. ఇది నిశ్చయము. ఆమిత్రఘ్నుఁ డెందున్నను వెదకిపట్టుకొని వానిని మట్టుపెట్టువఱకు నామనంబునకు శాంతియుండనేరదు. వాఁడామెను యక్షలోకమునకుఁ దీసికొనిపోయి యుండఁడు. ఎచ్చటనో వివిక్త ప్రదేశంబునకుఁ గొనిపోయి యందుఁ దనకోర్కెఁ దీర్చుకొనఁ జూచుచుండును. కావున నేనిప్పుడే మీరెక్కివచ్చిన విమానముమీఁద (బోయివాని నరసి యనంగమోహినిని విడిపించుకొని

వచ్చెదను. అంతదనుక మీరిచ్చటనే యుండుడనిచెప్పి వారినొప్పించి యప్పుడేయందున్న విమానమెక్కి మిగులవేగముగాఁ బైశగిరిపో యెను.

గుణవతి చిత్రలేఖతో నందెంత సేపువేచి యుండినను నెవ్వరి జాడయును గనుపింపలేదు. పిమ్మట చిత్రలేఖ చేయూతఁగొనియచ్చ టినుండి యాయరణ్యంబున ముందుఁగొంత దూరమేగెను. అచ్చట వారికొక నూతన మార్గము గనంబడెను. దాని ననుసరించి యాసా యం సమయంబు వఱకును వారాయరణ్యమధ్యంబునఁ దిరుగుచుండి రి. అప్పుడు వారికెదుర నిర్వురు పురుషులు వచ్చుచున్నట్లు గోచరిం చెను. వారిని మణిగ్రీవ జలంధరులని తలంచుచు నతివేగమున స మీపించి చూడగా నందొకఁడరిందముండును రెండవవాఁడు దివోదాన ధారుణీంద్రుఁడును నగుటకు గుణవతిమిగుల నబ్బురపడుచు దృటిలో నిజహృదయాధినాథుని పాదపంకేరుహంబులపైఁ బ్రాల వ్రాలి యుండెను. ఆకస్మికముగా నయ్యరణ్యమధ్యంబున నాయతుకులకన్య కలఁ గాంచి యాపురుషు లిర్వురును నివ్వెరంబొంది కొంతతడవేమి యు మాటలాడఁజాలకుండిరి.

పిమ్మట దివోదాసుండు గుణవతిని చేతులతోఁ బైకెత్తి యు క్కునంజేర్చుకొని మిగుల నాదరించెను. చిత్రలేఖవలన వారివృత్తాం తమంతయును విని విస్మయావేశ హృదయసరోజుండై యిట్లనియె. ఓరా! అనంగమోహిని కాపదలమీద నాపదలు గలుగుచుండెను. గదా! ఆదుష్టచిత్తుని బారిఁబడి యాకాంతామణి యెంతవలవంతఁ బొందుచుండెనో యూహింప శక్యముగాకున్నది. కార్యాంతర వ్య గ్రహృదయుండనై యామెను మీయంతఃపురమున నాడు విడచి నే నరుగవలసి వచ్చినది. విధి నియోగమును మీరువారెందును తేరు. నాటినుండి యిప్పటివఱకు నిమునమేని విశ్రాంతి లేకుండఁ దిరుగు

చుంటిని. కాని తలపెట్టినపని మాత్రము పూర్తిగాకున్నది. మీ రు నాకు ప్రసంగించుకొనిన మనుజబాలక ప్రేతాన్వేషణంబునకే నేను నాకలోకంబున కేతెంచి యుండుటచే దాని నమ్మవారి యాలయము నందు సంగ్రహించి యందుఁ బ్రాణప్రతిష్ఠఁజేయనెంచి యనంగ మోహినిని మీయింటనుంచి వెడలిపోతిని. అందు దేవియనుగ్రహం బును నీసన్మిత్రలాభమును బొందితిని. శబరబాలకుఁడు బ్రాణములం బడసి యెచ్చటికో పోయెనని యమ్మవారివలన వింటినని యాభైరవి యాలయంబున జరిగినవృత్తాంతమెల్లఁ దెలుపుచు మఱియు నిట్లనియె. ఆయాలయమునుండి శబరబాలకాన్వేషణంబునకు మేమిరువురమును దలయొకదిక్కునకుఁ బోతిమి. నేను తూర్పుదిక్కుగాఁ బోయినాలు గుదివసంబు లహోరాత్రంబులు వానికొఱకు వెదకి వెదకి యెచ్చ టను వానిజాడ నెఱుంగక మొదటఁ జేసికొన్న నియమము వడువున నరిందమునిఁ గలసికొనుటకుఁ దిరుగ భైరవీదేవి యాలయమునొద్దకు వచ్చితిని. అరిందముఁ డక్కడ నాకుఁ గనుపింపలేదు. అందులకు నే నుసంశయించుచుండఁగా మణిగ్రీవుఁడు విమానమెక్కి యాచక్కి కేతెం చెను. నన్ను జూచియతండుదిన్నఁగా నేనున్న చోటికివచ్చెను. వెనుక హి మశైలారణ్యమందుఁ గుంభునితో ద్వంద్వయుద్ధ మొనర్చునప్పుడు నన్నాతఁడు జూచియుండుటచే గుర్తుపట్టి మిగుల నమ్రతతో నాతో సంభాషించుచుఁ దనయుదంతంబెఱింగించి క్రమంబున మదీయవృ త్తాంతము దెలిసికొని యబ్బురింపడుచు నిట్లనియె.

ఓహో దానధారుణీదేవేంద్రా! మీసాహసౌదార్య విక్రమ క్రమం బత్యద్భుతంబు. దేవతలు సైతము భవదీయాజ్ఞానువర్తులై ప్ర వర్తింపవలసి వచ్చుటచే మీప్రభావం బమానుషంబుగదా! అనంగ మోహినియును గుణవతియును మిమ్ముఁవరించియుండుట వింతగాదు. జలంధరుని ప్రోద్బలంబున నే నింత కన్నెని యనుచితకార్యంబు లొన

రించితిని. అనంగమోహినీ రూపమోహితుండనై మదనోన్మాదం
బున నాకొను గష్టముల పాలు జేయుటయే కాక భవాదృశులకుఁ
గూడ మిగులనాయాసము గలుగఁ జేసితిని. నాయవినయంబున కిప్ప
టికి నిక్కముగఁ బశ్చాత్తాపము బొందుచుంటిని. అనంగమోహిని
యందలి వాంఛ నాకు పూర్తిగఁ దొలఁగిపోయెను. నాకిప్పటినుండి
యామె తోడఁబుట్టువు వంటిది.

ఇఁక మీఁద నరిందముండువలె నేనును మీకు మిత్రుఁడనై
యాత్మబాంధవుఁడనై మెలంగఁగలవాఁడను. మీయాజ్ఞ జవదాటనని
త్రికరణంబుల బాసఁ జేయుచున్నాను. నన్ను విశ్వసించి యనంగ
మోహినీ సమాన్వేషణంబునకు నియోగింపుఁడు. జలంధరుఁ డొన
రించిన పాపకృత్యమునకు వానిని బట్టుకొని యుచితరీతి దండించు
టకు నామనంబు తొందరపడుచున్నది. చిత్రలేఖాద్వితీయగ గుణ
వతిని హిమగిరి శిఖరంబున నిప్పుడే విడిచివచ్చితిని. ముందుగ జలం
ధరుని నలకాపురంబున వెదకి యందుఁ గనంబడనియెడల వాఁడె
చ్చట దాగి యున్నను బోయి పట్టుకొను తలంపు నాకంతరిక్షమున
కేగినప్పుడు పుట్టుటచేఁ దిన్నఁగా నిచ్చటి కిప్పుడే తెంచితిని. ఇంకను
నేను పురంబులోని కేగి యుండలేదని చెప్పుచుండఁగనే జలంధరుం డ
చ్చటికివచ్చి మమ్ముఁ జూచి యక్కజపడఁదొడంగెను. వానిని దిల
కించినతోడనే మణిగ్రీవుండు మండిపడుచు నోరీ! మిత్రద్రోహీ! కపట
క్రియారంభ సంరంభుఁడవై యారంభోరువుం దోడ్కొనివచ్చి యెం
దు దాచితివి? నన్ను మాయఁజేసి తెచ్చినంతమాత్రముననే యామె
నీకు దక్కఁగనుకొంటివా యేమి? అనంగమోహిని యెందున్నదో
నిజము చెప్పుము లేకున్న నీదుర్మార్గప్రవర్తనకు ఫలంబిప్పుడే పొం
దఁగలవని తీవ్రముగాఁ బలుకుచున్న వానిమాటల కచ్చెరువొందుచు
జలంధరుం డిట్లనియె.

మిత్రమా! నిజమెఱుంగక నన్నిట్లు నిష్ఠురము లాడఁదగునా? అనంగమోహినీ వృత్తాంతము నీకన్న నే నెక్కుడెఱుంగుదునా! మి మ్మిరువుర నగ్గిరి కందరమున విడచి నేను ఫలాన్వేషణంబున కేగియుండ లేదా? నేనచ్చటికిఁ దిరుగవచ్చునరికి మీరిరువురు నందు నాకుఁ గనఁబడిరా? నన్ను మోసపుచ్చి యచ్చపలాక్షిని నీవెచ్చటికో తీసి కొనిపోతివనిఁదలంచి మనంబున నాకంబుగ్రవప్పై విరక్తిఁబుట్ట నెట్ట కేల కిప్పట్టునకుఁ దిరిగివచ్చియున్న నాపై నిందలమోపుట న్యాయ మగునా? అనంగమోహిని యేమైనదో నేనెఱుంగను. నీవా కంద రము విడచి యెచ్చటికేగి యిప్పుడిక్కడకు వచ్చియుంటివో గ్రహిం పఁజాలను. నీయుదంతము నాకు వింతఁ గొలుపుచున్నదను జలంధరుని మాటల నాక్షేపించుచు వాణిగ్రీవుఁడు వెండియు నిట్లనియె.

ఓరీ! నీగడుసుమాటల నిఁకఁ గట్టిపెట్టుము. నీయుక్తులకు మో సపోవు వా రెవరిందు లేరు. హిమవంతమునుండి నీవిచ్చటకు విరక్తుండ వై తిరిగివచ్చియుంటివని చెప్పుచుంటివే? అప్పుడు విమానముమీఁదనీపా దములమ్రోల నడ్డముగాఁ బరుండఁబెట్టఁ బడియున్న వ్యక్తి నెవ్వ రును జూడలే దనుకొనుచుంటివి కాఁబోలును. మిత్రద్రోహివై నీవా యళికుంతల నందుఁ బెట్టుకొని యంతరిక్షమున కేగియుండుట నేను గ్రహింపఁ గల్గితినని నీకిప్పటికైన నమ్మకము గలుగుటలేదా! నాతో నిఁక వ్యర్థవాదమునకుఁ బూనక యాకనకగాత్రిని వైళమ మాకప్ప గింపుము. లేదేని నీమానప్రాణంబులు దక్కవని నిక్కముగ నమ్ము మని గద్దించి పలుకుచున్న వానికి జలంధరుండిట్లనియె.

మిత్రమా! విమానము మీఁద నే నంబరంబునకుఁ గొనిపోయి నది యనంగమోహినీ స్వరూపమని భ్రమించుటంజేసి నీవిట్లు నాపైఁ గినుకఁ జూపుచుంటివి. కాని యందున్నదొక మనుష్యబాలకునిఁ బం ధించియుంచిన మందసమని యెఱింగిన నీభ్రమ నివారణ కాఁగలదని

పలికినతోడనే నే నదరిపడి యావృత్తాంతము సాంతముగాఁ జెప్పు
మని యడిగితిని. మణిగ్రీవుండును దాని నెఱుంగఁ గుతూహలపడెను.
అప్పుడు జలంధరుండు జరిగినవృత్తాంతమెల్ల మాకుఁ దెలియఁజేసెను.
వానిమాటలు మణిగ్రీవుఁడును నేనును విశ్వసించితిమి. అప్పుడు నేను
జలంధరునితో వెండియు నిట్లంటిని.

చెలికాఁడా! ఒకవిషయము నెరుంగఁగోరిన మఱియొక యుదం
తము నీవలన మాకుఁ దెలిసెను. ఈవృత్తాంత మెఱుంగుటకే నే ని
ట్లు లోకాంతరంబులఁ గ్రుమ్మరుచుంటిని. అందున్న శబరబాలకుని
వానియాప్తుల సన్నిధిఁ జేర్చుటకు నేను శపథముచేసియుంటిని.
ఆపెట్టెలోఁ బెట్టి నీవు వానిని దివంబునుండి క్రిందకుఁ బడఁద్రోసి
తివి. వాఁడెచ్చట పడెనో యేమయ్యెనో కనుంగొనవలయును. మఱి
యు ననంగమోహిని యాకందరాంతరమున నే మయ్యెనో తెలిసి
కొనవలయును. ఇదియునుంగాక గుణవతి కాననాంతరంబున దిక్కె
వ్వరునులేక యెంత యడలుచున్నదో గదా? ఆమెక్షేమము సరసి
సురక్షితమగు తావునకుఁ జేర్పవలయును. ఈమూఁడు కార్యములును
మనకు ముఖ్యములేయగుటం జేసి మనము మువ్వురము నిందులకుఁ
బూనుకొనవలయునని వారికి నచ్చునట్లుపన్యసించితిని. నామాటలకుఁ
వారిర్వురును సమ్మతించిరి. నాయందు వారికెంతేని భక్తివిశ్వాస
ములు గుదిరినవి. నాయాజ్ఞ నిసుమంతేని మీఱక నమ్మకముగా మె
లంగుటకు బాసఁజేసిరి. అప్పుడు నేను మణిగ్రీవుని మానిమిత్తము బం
పి జలంధరుని శబరబాలకాన్వేషణంబునకు నియమించి నే ననంగ
మోహినిని వెదకుటకుఁ బూనుకొంటిని. మేముమువ్వురమును విమాన
మెక్కి యనంగమోహిని మాయమైన హిమగిరి కందరమున కేగి
తిమి. అందు నేను దిగి తక్కినవారిని వారిపనిమీఁదఁ బంపివేసితిని.
వారిజాడ నాకు మఱల నిప్పటివఱకుఁ దెలియలేదు. నేను నగ్గుహాంత

రమున కేగి విమర్శింపుచుఁ బోవుచుంటిని. కాని యనంగమోహిని యునికి నాకెచ్చటను గనంబడలేదు. చీఁకటిలో న గుహాబిలంబునఁ బడి పోవఁబోవఁ జివురకు నేనొక దేవతాలయప్రాంగణంబునకుఁ జేరు కొంటిని. ఆదివ్యాలయములోనికిఁ బోయి యందున్న శాంభవీదేవిని స్తుతించుచుండ నచ్చటికెవ్వరో వచ్చుచున్న సందడియగుటయు నచ్చట నేమిజరుగునో చూడవచ్చునని గొబ్బున నాదేవీవిగ్రహము వెనుకకుఁ బోయి యందుఁ బొంచియుంటిని.

ఇంతలో నల్వురు దేవకాంతలచ్చటికివచ్చిభక్తితత్పరలై యా యమ్మవారి నర్చించి యనుకూలవాల్లభ్యంబు దయసేయుమని ప్రార్థించుటయు వారియెదుటకుఁ దానరిగి వారిచే వరింపఁబడుటయుఁ బిమ్మట యంత్రబిలమునందుఁ జొచ్చి హేమసౌధవిశేషములగ్రహించుటయుఁ దరువాత నరిందముని యాపదఁ దప్పించి వానితోఁ దిరుగఁ బైకివచ్చుటయును మొదలగు వృత్తాంతమంతయును వారికెఱింగించి మఱియు నిట్లనియె.

అట్లు నేనరిందమునితో భూవివరంబు వెల్వడి వచ్చిన యనంతరము దేవకన్యకలు దేవీపూజకై యాలయంబునకఱిగిరి. వారివెనుక మేమును నాగుడిలోని కేగఁదలచి వేఱొక ద్వారంబునఁబ్రవేశించితిమి. కాని యామార్గమున మాకెచ్చటను వెనుకఁ జూచిన యాలయము గనంబడలేదు. ఆదారి క్రమంబున మమ్మీయరణ్యంబునకుఁ దీసికొనివచ్చినది. ఇచ్చట మీరుగనంబడుటచే మాయాగమనంబువ్యర్థముగాలేదని పలికి యాయువతికాంతలకు సంతోషముగలుగఁజేసెను.

ఇంతలోఁ జీఁకటిపడినది. వారలిష్టముమీఁద నొకమార్గము నంబడి కొంతదూరమరిగిరి. కాని ముందీక నడచుటకుశక్యముగా లేదు. అచ్చటనొకవిశాల వృక్షమూలంబున నారాత్రిగడపి యుదయమున నచ్చటనుండి బయలుదేరి వారుముందుఁ గొంతదూరమరి

గిరి. అచ్చట వారొకసుందరసరోవరంబు నేత్రపర్వమొనర్చెను.
దానిపరిసరంబున నిర్వురుపురుషులు దిరుగుచుండుట జూచి వారిని
మణిగ్రీవజలంధరులుగా నిరూపించి దివోదాసుండు తక్కినవారితో
నం దేగెను. మణిగ్రీవజలంధరులు వీరిని జూచి మిగులనానందమును
బొందిరి. విమానయానంబున శబరబాలకుని నిమిత్తమై యరిగిన
జలంధరుండు తనపూన్కియంతయును విఫలమైనదని నుడివి యిప్పుడే
యిచ్చటికే తెంచి మణిగ్రీవుని గలసికొంటినని తానొనర్చినప్రయత్న
ములన్నియునుదివోదాసున కెఱింగించెను. మణిగ్రీవుండును గుణవ
తికొఱకై యరణ్యమధ్యమందా రాత్రి యంతయును దాఁబడిన
యిడుమల నామహారాజున కెఱింగించెను.

పిమ్మట దివోదాసుండు శబరబాలకుండు దొరకువఱకుఁదాను
నిజరాజధానిని జేరవీలులేదని చెప్పుచు గుణవతిని చెలికత్తియతో ది
వ్యయానంబున నలకాపురంబునకుఁ దీసికొనిపొమ్మని మణిగ్రీవునితోఁ
జెప్పెను. అందులకు గుణవతి మొదటసమ్మతించినది కాదు. శబరబాల
కుని వానియాప్తుల సన్నిధిఁ జేర్చిన వెంటనే నేను నీకొఱకుయక్ష
లోకంబున కేతెంతునని నమ్మకముగలుగునట్లు దివోదాసుఁడు వచిం
చుటచేత నామె యెట్టకేల కంగీకరించినది. అప్పుడు మణిగ్రీవుండు గుణ
వతిని జిత్రలేఖను విమానమెక్కించుకొని జలంధరుండు వెంటరా నల
కాపురంబున కేగెను. దివోదాసుండును నరిందముని దనవెంటనుంచు
కొని శబరబాలకాన్వేషణంబున కరుగఁదలచి యందుఁ గనంబడిన
యొకమార్గము ననుసరించి ముందుఁబోయెను.

## రత్నచూడుని కథ

### 318 వ మజిలీ.

వింధ్యారణ్యంబున రత్నచూడుఁడు మానిసత్తముఁడనఁ బ్రసిద్ధి
కెక్కియుండెను. దివోదాసునిచేఁ బుడమి నుండుట కనుమతిఁ

బడసియున్నకతంబున నా నాగోత్తముఁడు నిర్భయముగా నందొక యుచితస్థలంబునఁ దపంబొనరించుచుఁ గాలముబుచ్చుచుండెను. దివోదాసుని బలవిక్రమ ప్రభావంబులు దలంపునకు వచ్చినప్పుడెల్ల నతండుమిగుల నక్కజంపడుచు వానిని దైవసమునిఁగా నెన్నుచుం డును. ఆరాజేంద్రుని సుగుణగణంబులఁ బలుమారు ప్రస్తుతింపుచుం డెను. తనకతండొనరించిన యుపకారంబునకుఁ బ్రతి యెన్నఁడైనఁ జేసి వానియందుఁదనకుఁ గల కృతజ్ఞతను వెల్లడింపవలయునని యతండు సమయమును బ్రతీక్షించియుండెను.

ఇట్లుండఁ గొన్నిదినంబుల కొక సంధ్యాసమయంబున నా నాగకులప్రదీపకుండు ప్రాంతసరోవరంబునకుఁ బోయి వచ్చుచుండ నంతరితముసుండి యెద్దియో నీటిలోఁ బడిన ధ్వనియగుటయు నతం డదరిపడి వెనుకకుఁ దిరిగిచూడ నాపద్మాకరంబున నొకమందనము మునుఁగుచుఁ దేలుచు గోచరమయ్యెను. రత్నచూడుఁ డాప్పెట్టెను న మీాపించి దానిని బట్టుకొని తీరంబునకుఁజేర్చి మూఁతఁబైకెత్తిచూడ నందొక మనుష్యబాలకుఁడు కంఠగతప్రాణుఁడై యుండుట పొడక ట్టెను. తోడనే యతం డాబాలకు నందుండి పైకిఁదీసి వానికి వివిధోప చారంబు లొనర్చుచుండఁ గొండొకవడికి స్మృతివచ్చినది. పిమ్మట నా బాలకుండు ముందున్న మునివల్లభుంజూచి భయాశ్చర్య స్వాంతు డై యేమియుఁ బలుకఁజాలక వడకుచు నిలువంబడియుండెను.

రత్నచూడుఁ డాబాలకున కుదుటుగరపుచు నిజపర్ణశాలాభ్యం తరంబునకుఁ దోడ్కొనిపోయి కందమూలాదుల వానిని బరితృప్తునిఁ జేసెను. పిమ్మట వానివృత్తాంతమెఱింగి యురగరూపంబునఁ దనచే వెనుకఁ బ్రాణములుహరింపఁబడిన వనాటబాలకునిగా వాని నిరూ పించి వాఁడెట్లు పునర్జీవితుండయ్యెనో తెలిసికొన నుత్సుకతం బొం దుచు నిజయోగవిద్యాప్రభావంబున జరిగిన వృత్తాంతమంతయును గ్ర

హించి మందహాసభాసురవదన పంకేరుహుండగుచు నల్లన వాని కిట్లనియె.

బాలకా! నీవు కడుపుణ్యాత్ముండవు. మనుష్యదుర్లభంబగు దివ్యలోకమున కేగివచ్చితివి. స్వప్నప్రాయముగఁ బాముకాటువలనఁ జచ్చిపునర్జీవులగుట యదృష్టహేతువని చెప్పుదురు. దేవతలనందఱు నాంతఁబెట్టిన దివోదాస ధాత్రీకళత్రుండు నీకొఱకై పడరాని యిడుమలంబడుచున్నాఁడన నింక నీసుకృతవిశేషమునకు నిదర్శన మేమి కావలయును! తొలుత నెవ్వాని యాభీలవిషజ్వాలలంబడి మడిసితివో యానాగశ్రేష్ఠుని శిరోమణి ప్రభావంబుననే పిదపఁజీవించితివి. నీకిఁక మీఁద నేయాపదయుం గలుగఁబోదు. అనతికాలంబుననే మీబంధుగులం గలసికొందువు. నీకొఱకై వెదకుచున్న దివోదాసుఁడు శీతశైలాగ్రమున నున్న శాంభవీదేవియాలయంబున నిప్పుడున్నవాఁడు. నిన్నుమదీయ యోగప్రభావంబున నిప్పుడే వానిసన్నిధికిం దోడ్కొనిపోయెదఁ గనులుమూసుకొమ్మని పలుకుచు నాశబరబాలకుని మందసముతోఁగూడ నాదేవభవనంబునకుఁ ద్రుటిలోఁ దీసికొనిపోయెను.

అచ్చట దివోదాసుఁడు దేవీమండపముమీఁద నుపవిష్టుఁడై యుండి యరిందమునితో నేద్దియో ముచ్చటించుచుండెను. మణిగ్రీవజలంధరులతో గుణవతి నలకాపురంబునకుఁ బుత్తెంచినపిమ్మట నమ్మహారాజు యతఁసచివునితో బయలుదేరి యరణ్యమందొక మార్గమునననుసరించి నడచుచుఁ గ్రమంబున శాంభవీదేవి యాలయమునకప్పుడే వచ్చిచేరెను. అందుండు దివ్యకాంతల యుదంతమెఱింగిరమ్మని యరిందమునితోఁ బలుకుచున్నతరుణమందే శబరబాలకునితో రత్నచూడుఁ డచ్చటికివచ్చెను.

దివోదాసుండు రత్నచూడుని పోలికగ్రహింపఁజాలక కేవల

మొక తాపసోత్తముఁ డచ్చటఁ దనకుఁ బ్రత్యక్షమయ్యెనని తలంచు చు భయభక్తి వినయంబులు మనంబున నొక్కసారి జనింప దిగ్గునలేచి వాని పాదములకు సాష్టాంగపడెను. అరిందముండు పేటికాహస్తుఁడై యున్న శబరబాలకుని జూచినతోడనే గుర్తింపఁగలిగెను. ప్రీతసంర క్షణమునకై తనచేఁదొల్లికల్పింపఁబడిన మందనమును గాంచి విస్మ యమందెను. ఎవ్వని నన్వేషించుటకు దివ్యభువనంబులన్నియును దిరిగియుంటిరో యెవ్వని క్షేమమునకై దివోదాసమహారాజు మిగుల నాత్రమందుచుండెనో యెవ్వనిమూలముగా సర్వసౌఖ్యముల నాయ సఘుండు పరిత్యజించి యడవులపాలయ్యెనో యట్టి శబరబాలకుని గట్టెదుటంగాంచి యరిందముఁడు మహానందంబున "వీఁడుగో మన శబరబాలకుఁ"డని యొక్కకేకఁబెట్టి వానినన్నిధికుటికి నిజకరద్వయం బునఁ నాబాలకుని మూఁపులం బట్టి యూఁపఁదొడంగెను.

రత్నచూడుఁడు దివోదాసునిలేవనెత్తి తనకు వానియందుఁగల గాఢానురాగంబు దెల్లంబగునట్లు శిరంబునిమురుచు నిట్లనియె. మహా రాజచంద్రమా! నీయుదారస్వభావమున కేనెంతయును సంతసించి తిని. జడదారిరూపంబున నున్న నాకు నీవిందుఁ బ్రణమిల్లుట సమం జసమే కాని నేనందుల కర్హుండనుగాను సుమా! భవదీయ బలప్ర తాపప్రభావంబులచే మొదట నిర్జింపఁబడి క్రిమ్మర ననుగ్రహింపఁ బడిన యొకపాపజాతి పురుషుండు నీకెట్లు వందనీయుఁడగును. నేను నీకు మిత్రుఁడను. ఆశ్రితుఁడను. సేవకుఁడను. రత్నచూడుఁడనునాగ వంశమువాఁడను. నీయనుగ్రహము మూలముననే నేనీభూతలంబున నివసించుచున్నాను. సర్వదా నీకు హితంబునే తలంచుచు మునివృ త్తిని వింధ్యారణ్యప్రదేశంబున నున్నవాఁడనని తనవృత్తాంతము తెలిగించి శబరబాలకుని వాని యెదుటఁబెట్టెను.

అప్పుడు దివోదాసుండు మిగులఁ బ్రీతుండగుచు రత్నచూడు

నకిట్లనియె. మిత్రమా! నీభావనైర్మల్యము ప్రశంసాపాత్రమైయున్నది. శబరబాలకాన్వేషణంబునకై తహతహం పడుచున్న నాహృదయమునకు నేఁడు నీవు సంతోషమొనఁగూర్చితివి. వానికొఱకై మేము పడుచున్న యిబ్బందియంతయును నీయాగమనంబుమాత్రముననే తీరిపోయెను. నీకు నేనొనర్చిన మే లత్యల్పమైనను నాకు నీవిందొనరించిన ప్రత్యుపకారము మిగుల నుత్కృష్టమైనది.

చ॥ పుడమియు రాజ్యముస్ విడచి భోగవిశేషముల్ త్యజించి కా
రడవుల సంచరించుచు ఫలాదులఁ గుక్షిని నింపుకొంచు నే
నిడుమలఁ బొందుచుండ భవదీయ దయా ప్తిఁదోలంగ, నేఁటి కే
ర్పడ ముదముబ్బ నీశబరబాలకు నేనిటఁ గాంచఁగల్గుటల్.

ఆ. వె., అనుపమానమైన యనురాగమొప్ప నీ
శబరబాలు దెచ్చి సాధుమతిని
నాకొసంగుటరయఁ బ్రాకటంబుగ మూఁడు
లోకములఁ గొసంగుటే! కదయ్య!

నీవు నాకీతీరునఁ జేసిన యుపకారంబు నెన్నఁడును మఱువఁజాలను. నీమూలమున నేను వనాటులతోఁ జేసిన ప్రతిన నెఱవేరినది. ఇఁక నాకుఁ గారడవుల సంచరింపఁ బనిలేదు. అనిపలికి స్మృతినభినయించుచు నయ్యో! అనంగమోహినిమాట మఱచితిని. అయ్యో! పాపరత్నమెచ్చట నున్నదో తెలిసికొని యాపె యాపదఁ దప్పింపకుండ నేనెట్లు వారణాశికిఁ బోఁగలవాఁడను. అని వగచుచున్న దివోదాసునకు రత్నచూడుఁడు మందహాస సుందరవదనారవిందుఁడగుచు నిట్లనియె.

రాజమార్తాండా! నీపరిభావము నీవెఱుంగక యిట్లు వలవంతఁ బొందుచుంటివి. భవదీయ విజ్ఞాననేత్రము దెఱచిన నీకుఁ దెలియని దెద్దికలదు. శబరబాలకుని కొఱకుఁగాని యనంగమోహిని కొఱకుఁ

గాని నీవు సామాన్యునివలె నన్వేషించుచుఁ గష్టపడవలసిన యగత్య
ము లేకున్నను విధివిధానము ననుసరించి యట్లుజరిగినది. మొదట
శబరబాలకుని ప్రేతమును నరిందముండు యక్షలోకమునకుఁ గొం
పోయి, శైలద్రోణియందు భద్రపరచియుంచిన యుదంతమును నేను
మీయనుజ్ఞఁబొంది నాఁడుశీతశైలమునుండి వెడలిపోయినపిమ్మట నంత
ర్దృష్టిం దెలిసికొంటిని కాని తదన్వేషణంబు నెపంబున మీరొనర్ప
వలసిన కార్యము లెన్నే నియుండుటం జేసి యింతవఱకు మీకెఱిం
గింపఁదలంపనైతిని. ఇందులకు నన్ను మన్నింపఁ గోరుచున్నాను.
మఱియు ననంగమోహిని యెందున్నదో కనుంగొనుట కిప్పుడు
మీకు కష్టములేదు. నాగలోకంబున పితృగృహంబున క్షేమముగా
నున్నదని తెలియుచున్నదిగదా యనుటయును దివోదాసుండు నివ్వె
రంబడుచు నార్యా! శైలకందరాంతరంబునుండి యాయన్నులమిన్న
రసాతలంబునకుఁ బోవుట చిత్రముగాఁ దోపకుండునా? అవ్వృత్తాంతము
జెప్పి మాకు సంతోషము గూర్చుమని యడుగుటయును రత్నచూడుఁ
డు మందహాసము జేయుచు నిట్లనియె.

ధాత్రీశ్వరా! సర్వమునెఱింగియును నీవావృత్తాంతము నాచేఁ
జెప్పింపవలయునని తలంచుచుండుటంజేసి నేనే చెప్పెద నాకర్ణింపు
మని యనంగమోహిని వృత్తాంతమెల్ల నంతర్దృష్టిం దెలిసికొని
యిట్లుచెప్పందొడంగెను.

## పాతాళేశ్వరికథ

అట్లు హిమశైలకందరాంతరంబున మణిగ్రీవునకు వెరచి యం
ధకారబంధురమైయున్న యామహాబిలములోనికిఁ బారిపోయి యనం
గమోహిని యతిసాహసమున నడచుచుండెను. ఆగుహాముఖంబున
కతిసమీపంబున మణిగ్రీవుండరిగిన బిలాధ్వమున కిరుపక్కలను

రెండుగుప్తమార్గములుగలవు. కుడివైపుదారి పాతాళమువరకు వ్యాపించియున్నది. ఎడమవైపుమార్గము శాంభవీదేవి యాలయప్రాంగణమునకుఁ జేరియుండెను. అనంగమోహినీసమాన్వేషణంబునకై నీవగ్గుహాంతరంబునఁ బ్రవేశించి వామభాగమందలి మార్గమును దైవవశమున ననుసరించి దేవతాయతనంబుఁజేరికొంటివి. బిలాధ్వమునఁ దిన్నగాఁబోయిన మణిగ్రీవుని వృత్తాంతంబు మీరు విన్నదేకదా! ఇఁక ననంగమోహిని యగ్గుహాలో గాఢాంధకారంబున నేమియుం గనుంగొనఁజాలక భయోద్రేకంబున నొకప్రక్కగా నడచుచుండెను. దైవికముగా నామె కుడివైపునున్నమహాబిలమార్గము ననుసరించి యతిజవంబునఁ బోవుచుండ ముందు మణిఘృణులచే నబ్బిలంబు ప్రదీప్తమై కనంబడుచుండెను. ఆతేజఃపుంజము గాంచి యామించుబోఁడి సముంచిత గమనంబున నాభూగర్భంబుననుండి వెల్వడు నుపాయం బెఱుంగవచ్చు ననునాసతో ముందరుగుచుండెను. ఇట్లబ్బిలంబున నామె యెంతతడవు నడచెనో నుడువఁజాలను గాని బడలికచే నొడలు దడబడువరకుఁ బోయిపోయి యింక ముందరుగఁజాలక నందొకచోఁ జదికిలంబడి వివశయై యంతలోచైతన్యమువడసి శ్రమంబపనయించుకొనుచుఁ గ్రింద శయనించియుండెను. అట్లామె విశ్రాంతింబొందుచున్న సమయమున మాటిమాటికి నికటంబున ఘంటారవంబు వినంబడఁదొడంగెను. దానికబ్బిబ్బోకవతి యబ్బురంబడుచు గొబ్బునలేచి యిటునటు బరికించుచుండఁ గ్రిందనుండి వెండియు శక్తిస్తోత్రపాఠకులనందడి వినంబడెను. ఆప్రాంతముల యందెచ్చటనో దేవతాయతనం బున్నదని గ్రహించి యాచంచలాక్షి యందేగి యమ్మవారినభ్యర్చింపవలెనను నుత్సాహంబునలేచి యబ్బిలము నిర్గమింప నతిరయంబున నడచుచుండ నెదురఁ గనకమయ గోపురప్రాకారములతో నొప్పు దేవతాయతనంబొండు నేత్రపర్వంబగుటయు నాముగుదల తలమానికము ముఱియుచు నచ్చటికరిగినది.

అయ్యది పాతాళేశ్వరియని ప్రసిద్ధికెక్కిన యమ్మవారియాలయము. దాసని దానింతకుముందెన్నఁడో చూచియున్నట్లు సంశయించుచు ననంగమోహిని తిన్నఁగా గర్భాలయముం బ్రవేశించెను. అందు దివ్యప్రభావంబు దేటపరుచుచు వెలుఁగొందుచున్న యాలోకేశ్వరినిగాంచి స్మృతినభినయించుచు నిట్లనిసన్నుతింపఁదొడంగెను.

మ. కలలోఁ గాంచితిఁ దొల్లి నిన్ను వరముల్ గైకొంటి నత్యద్భుతో
జ్జ్వలమౌ సత్ఫలమున్ గ్రహించితిని నస్మచ్ఛీర్షమందొప్పు ని
ర్మలమాణిక్యమహాప్రభావమును సర్వంబానుపూర్వ్యంబుగాఁ
దెలియంగాంచితి నీదయన్ సతత మో దేవీ! ననుంగావవే.

చ. వరుఁడతిసత్ప్రభావబలవైభవుఁడబ్బెను నాకు నీ కటా
క్షరసమహాప్రసారమునఁ గాని మదీయవిశేషదోషని
ష్ఠురమున వానిఁ బాసితిఁ గడుంగడుకష్టము లందుచుంటి ని
క్కఁ గనని నన్నికన్ గరుణఁ గావఁదలంపఁగదమ్మ! యమ్మరో!

చ. చనఁటియొకండు నన్బలిమిచేత హరించి గుహాంతరంబు జే
ర్చనవిధమెల్ల నెమ్మదినెఱింగి భయంబునఁ నబ్బిలంబు వెం
టను జనుదెంచి చేసితి నిటన్ జననీ! భవదీయదివ్యద
ర్శనము మహాద్భుతంబుగద! శాంభవి నీమహిమంబులెన్నఁగన్!

ఉ. రక్కసుఁడొక్కఁడే త్రైజ విరాళిని దెచ్చి యరణ్యమందునన్
చిక్కఁబెట్టనున్నపుడుచేసితి నీదగుదర్శనంబుఁ బెం
పెక్కఁగ స్వప్నమం దిపు డదే విధ మాపదనున్నవేళ నా
కక్కడఁగన్నులంబడితి వీశ్వరి! నావెతలెల్లఁదీర్పవే.

గీ. నాఁటిపోలికయొప్ప నీనాఁడుగూడ
స్వప్నమున నాకునీవుసాక్షాత్కరించు
చుంటివేమొ గ్రహింపలేకుంటినమ్మ
కృపయపరితాపమడఁచి రక్షింపుమమ్మ.

తల్లీ! త్రిభువనేశ్వరీ! నీపరిభావం బిసుమంతయును గ్రహింపఁ జాలకున్నాను. ఆపద వేళయందు నాకుఁ బ్రత్యక్షమై మనంబున కుదుటుఁ గరపుచున్న నీభక్తవత్సలత్వము నెంతనికొనియాడఁగలను. మొదట నాకు స్వప్నంబునఁ బాతాళమునఁ బ్రత్యక్షమైతివి. నేఁడొక కంద రాంతంబున నీయునికిఁ దెలియఁబడుచుండెనుగదా? నేను నిక్కముగా నిపుడు నీసన్నిధానమందుంటినో లేక యిది యంతయును భ్రాంతి మూలకమో తెలిసికొనఁజాలనైతిని. నీనివాసము రసాతలమందుఁ గలదో యతప్రపంచమందున్నదో లేక మధ్యమలోకమందుండెనో గ్రహింపఁజాలకుంటిని. మణిగ్రీవునకు వెఱచి మహాబిలమార్గము ననుసరించి యేతెంచిన నాకిచ్చట నీయాలయము గోచరించుట భ్రాంతిమూలకముగాక వేఱొకటియెట్లగును. ఇదియంతయును స్వప్నవిభ్రమమనుటకు సందియము లేదు. బిలమార్గంబున నడచుచుండ నాకు శ్రమ మిక్కుటమగుటచే నేనందు శయనించితిని. అప్పుడు నాకు నిద్రవచ్చినట్లుకూడఁ గొంచెము స్ఫురించుచున్నది. ఆనిద్రలో నేర్పడిన స్వప్న విశేషముచేతనే నిక్కముగ నేనిప్పుడు నీయాలయంబునఁ బ్రవేశించియుంటిని. అనియాలోచించి వెండియునిట్లనుకొనియె. అయ్యో! ఇదిస్వప్నవృత్తాంతమెట్లగును. నేను మేల్కొనియేయుంటిని. ఇట్లువితర్కించుకొనుటగూడఁ గలలోకలకాదుగదా? అయ్యో! నేనిప్పు డేయవస్థయందుంటినో నిర్ధారణఁజేసికొనలేకున్నాను. తల్లీ! నామనం బిప్పు డతిచంచలముగానున్నది. నిక్కమెఱింగించి నన్నుఁ గృతార్థురాలిం జేయుమని యాయమ్మవారి ననేకవిధంబులఁ బ్రార్థించుచుండెను.

ఇంతలో నా దేవీమందిరమున కెవ్వరో వచ్చుచున్న సందడి యగుటయు మణిగ్రీవుఁడు దన్నుబట్టుకొనుట కందు వచ్చుచున్నాఁడేమోయను భయంబున ననంగమోహిని యతిరయంబున నా దేవీ విగ్రహము చాటున కరిగి యందుదాగియుండెను. అప్పుడు వానుక

యచ్చటికేతెంచి భక్తిపూర్వకముగా, నద్దేవి నర్చించి విమ్మటయామె నుద్దేశించి యిట్లనియె.

జననీ! నీయనుగ్రహం బెన్నటికైన నాపైఁ గలుగకుండునా యని నిత్య మెదురు చూచుచుఁ గాలము బుచ్చుచుంటిని. కాని నేఁటి వఱకు నీకించుకయును దయఁబుట్టలేదు. నేనిట్లింత కాల మోపికఁబట్టి యుండవలయును! నాపుత్రికారత్నము నెడఁబాసి యెన్ని దినములైన దోకదా? ఇంతవఱకు నాయనంగమోహిని జీవించియుండెనా? ఎన్నఁడైన నాకన్నుల కాబాలికామణి గనంబడునా? కలలోఁ బ్రత్యక్షమై యనతికాలంబుననే యనంగమోహిని కనంబడునని నీవానతిచ్చియుండుటచే నేనిట్లు ప్రాణముల నిలుపుకొనఁగలిగితిని. ఇఁక నా యాస తీరిపోయినది. ఎంతకాలము నిరీక్షించియున్నను నించుక యును బ్రయోజనము లేదనుట ధృవమైనది. అనంగమోహినిం గాంచఁగల్గుదు నను నాసతో నిత్యంబును నీసన్నిధి కేనే తెంచి పూజానమస్కారము లొనరించుచుంటిని. దీన నబ్బుసుకృతవిశేషంబున ముందుజన్మమందైననిట్టి విచారము నాకుఁ గలుగకుండునట్లు వరంబొసంగుము. ఇదియె నాకడపటికోరిక. నాకిఁకఁ మనుగడయందు రోతబుట్టు చున్నది. నీసముఖమందే ప్రాణత్యాగం బొనరించి ధన్యుఁడ నయ్యెద నని పలుకుచు గృపాణపాణియై నిజమస్తకమును నఱకు కొనుట కుద్యమించుచుండెను. దేవీవిగ్రహము వెనుకనున్న యనంగమోహిని యిదియంతయును గమనించుచునే యుండుటచేఁ దటాలునబయటికివచ్చితండ్రిచేయిపట్టుకొని యెత్తినకత్తినిలాగిపారవై చెను. వాసుకి యెదుటనున్న తనూజను హృదయోద్వేగంబున గురుతుపట్టఁజాలక తనమరణోద్యోగమును మాన్పించుట కాయమ్మవారే యుండుఁదనకు బ్రత్యక్షమైనదని తలంచుచు నామె మ్రోల సాగిలంబడి భక్తితత్పరత్వంబున నిట్లని వినుతింపఁదొడంగెను.

: దండకము :

శ్రీమన్మహా దేవదేవీ! భవానీ! త్రిలోకైక మాతా! కృతార్థుండ నైతిన్. భవద్దర్శనంబబ్బె నాకిందు నేనెంత పుణ్యంబునుం బూర్వజన్మంబునం జేసియున్నానొ మున్నెన్నఁడెవ్వారునుం గాంచలేనట్టి యుత్కృష్టయోగంబు నీప్రేమచేఁ గల్గె నాకిప్పుడో సర్వలోకేశ్వరీ! శాశ్వతానంద సంధాయినీ! నీసమీపంబునన్ బ్రాణముల్ బాయఁగా నెంచియున్నట్టి నాపూన్కి నీకిష్టమే లేకయున్నన్ మదీయాత్మజాతన్ గుణోపేత నిచ్చోటికిన్ దెచ్చి నాకీయరాదే ముదంబంగ నేనెంతయున్. బంధుసంఘంబుతో నీప్రభావంబు నిత్యంబు వర్ణింతు నమ్మా! దయంజూడుమమ్మా! వెతల్ దీర్పుమాయమ్మ! పాతాళ లోకేశ్వరీ! భక్తసంకల్ప సత్కల్పవల్లీ! నమస్తే నమస్తే నమః.

ఇట్లు నితాంతభక్తి నాదేవిం బ్రస్తుతించుచు ననంగమోహిని పాదమూలముల నొడలెఱుంగక పడియున్న జనకుని యవస్థంగాంచి యామింపుబోణి మిగులవిచారించుచు నిజకరద్వంద్వంబున నాయన ఘునిఁబట్టి లేవనెత్తుచు నిట్లనియె. తండ్రీ! మీకిట్టిమనోవ్యథ సమకూర్చిన మహాపాపాత్మురాలగు ననంగమోహిని దేవీప్రసాదంబున మీ సమక్షమున కేతెంచియున్నది తిలకింపుఁడని యనుటతోడనే యాసరీ నృప కులవరేణ్యుండు దిగ్గునలేచి యెదురనున్న పుత్రికారత్నమును గాంచి మించిన యానందంబునఁ గౌఁగలిచుకొని కొండొకతడవేమియుఁ బలుకఁజాలకుండెను. అనంగమోహినియును చిరవియోగక్లేశంబున వెండియుఁ బలుక నశక్తురాలై చూపులచేతనే తండ్రియందుఁ దనకుఁగల ప్రేమ వెల్లంబు సేయుచు వానియక్కున వ్రాలియుండెను.

ఇట్లు కొంతతడవు వారుచిత్తరువులవలె యుండి క్రమంబున హృదయోద్రేక మడంచుకొనఁదొడంగిరి. అప్పుడు వాసుకి యనంగమోహినితో నిట్లనియె. తల్లీ! నీవు మమ్ముబాసిపోయినది మొదలు

నేఁటివఱకు మేము బడినహృదయపరితాపంబునకు మేరలేదు. ఈత్రిభువ
నేశ్వరి యనుగ్రహాతిరేకంబున నిప్పుడు నీవునాకన్నులంబడి యానం
దమొనగూర్చితివి. రక్కసునిచేఁ జిక్కి నీవు మనుష్యలోకమున
హిమవత్పర్వత ప్రాంతములకుఁ గొనిపోఁబడుటయు దివోదాస
ధారుణీంద్రుండు నిన్నాన క్తంచరుని బారినుండి తప్పించుటయును
నేనిదివఱకే తెలిసికొని యెన్నఁటికైనఁ మగిడి నానన్నిధి కేతెంచఁగల
వనునాసతో నుంటిని. పిమ్మట నెచ్చటికేగితివి. ఇన్నినాళ్ళెచ్చటనుండి
యిప్పుడిచ్చటికెట్లు తెంచితివి? దివోదాస పార్థివేంద్రుఁ, డేమయ్యెను.
నీచరిత్రమంతయును జెప్పుమని యడుగుచున్న జనకునకు నిజకథావి
ధానమెల్ల నానుపూర్వికంబుగా నెఱింగించి మఱియునిట్లనియె.

తండ్రీ! నేనీ భువనేశ్వరి యాలయంబున కేతెంచుట నాకే
వింతఁగొలుపుచున్నది. నేనిప్పుడేలోకమునందున్నానో గ్రహింపఁజాల
కున్నాను. ఇది నిక్కముగాఁ బాతాళమే యైనయెడల యక్షలోక
మునుండి యిందే తెంచుట కడుంగడువిచిత్రముగదా! భయమూర్ఛి
తురాలనై యున్న నన్నామణిగ్రీవుండు దుష్టబుద్ధియై యెత్తుకొని
పోయి యగ్గుహాంతరంబునఁ జేర్చియుండును. అందుండియేగదా
యీ యమ్మవారి యనుగ్రహంబున నిచ్చటకుఁ బారిపోయివచ్చితిని.
ఎట్లయినను నేనిచ్చటికేతెంచుటకు మణిగ్రీవుఁడే కారణమై నాకెంతే
ని యుపకారమొనర్చెను. ఇందులకు వానికేను నిక్కముగఁ గృతజ్ఞు
రాలను. అని వచించుచున్న పుత్రిక పలుకుల కలరుచు నానర్వవంశ
ప్రదీపకుఁడు నిజవృత్తాంతమెఱింగించి పిదప నామెనుదీసికొని నిజ
నివాసమునకుఁబోయి యెల్లఱకు నానందమును గలిగించెను.

దివోదాసపార్థివేంద్రా! అనంగమోహిని నాఁటనుండియును
బితృగృహంబున నుండెను. ఆమత్తకాశిని చిత్తంబు భవదాయత్త
మైయుండుటచేత నాహార విహారంబుల నయిష్టము సూపుచుఁ గృ

శించుచుండెను. ఆసాధ్వీలలామకు నీవతిశీఘ్రమునఁ గనంబడకున్న నామె యాపదలపాలగుట నిక్కము. నీవనుమతించిన నేనిప్పుడే నాగలోకంబునకేగి వాసుకితో నీయుదంతంబెఱింగించి తగినట్లొనరించెదనని పలుకుచున్న రత్నచూడునితో నమ్మహారాజిట్లనియె.

## దివోదాసుని కథ.

మిత్రమా! నీయుపకారబుద్ధి కేనెంతయును నంతసించుచుంటిని. శబరబాలకుండు నజీవుఁడై నానమీపంబున నుండుటచే నేనింక నరణ్యంబులం దిరుగఁబనిలేదు. నేనొనర్చిన ప్రతిజ్ఞవడువున వీనిని దోడ్కొనిపోయి యాప్తులకప్పగించి తిరుగ వారణాసికరిగి రాజ్యరమాలలామంజేపట్టుట యొప్పిదంబగును. అనంగమోహిని నిమిత్తంబున నాగులకెల్లఱకు నేఁటినుండియును భూలోకప్రవేశంబున కనుమతియొసంగుచున్నవాఁడను. కావున నీవతిరయంబున నాగలోకంబునకేగి నాయాదేశము వాసుకి ప్రముఖ రసాతలవాసులకెల్ల నెఱింగించిరమ్ము. అనంగమోహినికి నాక్షేమంబెఱింగించి యామెయభిమతంబుగూడఁ దెలిసికొనిరమ్ము. ఇదియే నాకునీవొనరింపం దగిన యుపకారమని పలుకుటయును రత్నచూడుఁ డందులకు నమ్మతించి యప్పుడే నిజస్వరూపంబుధరించి చేరువనున్న భూవివరంబులో దూరి మాయమయ్యెను. అందుల కందున్నవారెల్ల నబ్బురమందుచున్న సమయంబున దేవకాంతలు నల్వురును నచ్చటికేతెంచి యందున్న దివోదాసునిగాంచి మించినయానందంబున వానిసన్నిధిఁజేరి వాని యెడబాటువలనఁ దమకుఁ గలిగిన పరితాపంబెల్లఁ దెలుపసాగిరి. ఆకాంతామణులవిడచి తానటిగిన పిమ్మట జరిగినవృత్తాంత మెల్లఁదెలుపుచు వారి నుచితరీతి నారాజేంద్రుం డాదరించెను. పిమ్మట నరిందము నీక్షించి యమ్మేదినీవల్లభుం డిట్లనియె.

మిత్రమా! తుంబురుశాపంబు మూలంబున నీయప్పరో

భామినులకు స్వర్గలోకప్రవేశార్హత లేకపోయినది. ఇయ్యది వీరలకె ట్లున్నను నాకుఁ బ్రమోదావహంబయ్యెను. వీరిందోడ్కొని యింక వారణాశికిం బోవుట యుచితముగదా? ఈశబరబాలకునిగూడ మనము తీసికొనిపోయి వీనియాప్తుల నచటికే పిలిపించి వారి కప్పగించుట సమంజసమగును. మనమెల్లరము నీక్షణమ యిచ్చటనుండి కాశికిం బోవుటకుఁ దగుపెరవరయవలయునని పలుకుటయును నరిందముండు మందహాస మొనరించుచు నిట్లనియె.

రాజేంద్రా! నేను యక్షలోకమునుండి తెచ్చిన దివ్యయానం బీ చేరువఁగల నుపవనంబుననే యుండెనుగదా! దాని నధిష్ఠించి మన మందఱ మక్షణంబున వారణాశికిం బోవచ్చునని పలుకుచు నప్పుడే యతండు దివోదాసుని యనుమతంబున నద్దివ్యయానంబునకై పో యి ముహూర్తమాత్రంబుననే దానిం గొనివచ్చి వారియెదుటనుం చెను. ఆరాజేంద్రుండందుల కెంతయును సంతసించుచు నాకాంభవీ దేవి గర్భాలయంబునకు దేవకాంతలతోఁ గ్రమ్మరనేగి యమ్మహాదే వి దివ్యదర్శనం బొనరించివచ్చి యవ్విమానమెక్కి తక్కినవారితోఁ గూడ వారణాశికింబోవ నందుండి కదలెను.

అరిందమునకుఁగల విమానమును నడపునేర్పుచేతనో దివో దాసధారుణీంద్రుని మనోబలంబు మూలంబుననో కాశీనగరవా సు లారాజమార్తాండుఁ డతిత్వరితంబుగ నేతెంచవలయునని యెదు రుచూచుచున్న విశేషంబువలననో దివోదాస రాజకంఠీరవుండెక్కి యున్న దివ్యయానంబుదృటిలోఁ గాశీపురంబు జేరెను. దివోదాసు ని యనుమతంబున నవ్విమానమును దిన్నఁగా రాజమందిరములోనికిఁ దీసికొనిపోయి యరిందముఁ డందొక యుచితప్రదేశంబున నాపెను. అందుండి దివోదాసుండుదిగిన తోడనేమంత్రిసామంత హితపురోహిత భృత్యవర్గంబెల్లఁ బరుగుపరుగున వానిసన్నిధి కేతెంచి మించిన యానం

దంబున రాజోచిత సత్కారముల గౌరవించిరి. ఆరాజేంద్రుండు దేవ
కాంతల నంతర్గృహంబున కనిపి తనవెంట శబరబాలకుని దీసికొని
యరిందమునితోఁ జేరోలగంబున కేగి యందుఁ గొల్వు దీర్చి నిజక
థాశ్రవణ కుతూహలులై యున్న సమస్తబంధుమిత్రుల కెల్ల నుల్ల
ములు బల్లవించు విధంబునఁ దనవృత్తాంత మంతయు నుపన్యసిం
చెను.

దివోదాసునిరాక రాకయుంబోలె సమస్త హితపురోహి
తామాత్య భృత్య చకోరసంచయంబున కెల్ల నాఁడమందానందం
బొసఁగూర్చెను. పౌరులెల్లఱును దమ యేలిక క్షేమంబుగఁ దిరుగ
రాజధానిఁ జేరఁ గల్గుటకు సంతసించి యానాఁడు గొప్పపండుగదిన
ముగాఁ బరిగణించుకొనిరి.

పిమ్మట దివోదాసుండు తొల్లింటిశబరులరావించి వారికి జరిగిన
వృత్తాంతమెల్ల సంక్షేపముగా నెఱింగించి శబరబాలకుని జూపుచు
వీఁడుగో! సర్పదష్టుఁడై మరణించిన మీబాలకుఁడు! మానవదుర్లభం
బగు దివ్యలోకమున కఱిగి తిరిగి యిందువచ్చియున్నాఁడని పలుకు
చు వారికప్పగించెను. ఆశబరబాలకుని సన్నిధినున్న మందసము నిండ
ధనముబోయించి దానితో సుఖంబునఁ గాలక్షేపముసేయుమని పలు
కుచు నారాజేంద్రుఁడు వానికొసంగెను. అందున్న వారెల్లరును
వాని యుపకారబుద్ధి ననేకవిధంబులఁ బ్రస్తుతింపఁదొడంగిరి. శబరు
లెల్లఱును తేఁని యనుమతంబు వడసి శబరబాలకుని దోడ్కొని నిజ
నివాసమున కరిగిరి.

తదనంతరంబు గొన్నిదినంబుల కొకపరివ్రాజకుం డా రాజ
చంద్రుని సన్నిధి కేతెంచి మందహాసభాసురవదనసరోజుండగుచు
నొకయుత్తరము నిజోత్తరీయమునుండి పైకిఁదీసి వానికందిచ్చెను.
దివోదాసుఁడు ససంభ్రమముగ నాలేఖ విప్పి యిట్లని చదువసాగెను.

సీ. శ్రీమన్మహారాజ సేవితపాదప
ద్మునకు దివోదాసభూమిపతికి
వాసుకియను నాగవంశోత్తముఁడు వ్రాయు
వినయపూర్వకమైన వినతిపత్రి
మిది. మానవేంద్ర! మీవృత్తాంతమంతయు
రత్నచూడుండు సర్వంబు మాకుఁ
జెప్పఁగా విని సంతసించితి మెంతయు
నాగులకిపుడీవొనర్చినట్టి
గీ. గౌరవంబునకెల్ల నిక్కంబుగాఁ గృ
తజ్ఞులము మేము, దీనికెంతయును బ్రతిగ
నీయనెంచితిఁ బత్నిగా నాయనంగ
మోహినీపుత్రికను నీకు భూపవర్య.

చ. నినువిడనాడుటే మొదలు నిత్యముడెందమునన్ గృశించుచుం
డెను నిమునంబ దేయుగము తేవఁనుబుచ్చుచు నాయనంగమో
హిని హితమెంచి నీవిచటికేతరవచ్చి పరిగ్రహింపుమో
యనఘ! విలంబమింకఁ దగదయ్య! వచింపఁగనేలఁ బెక్కుటన్.

శా. ఈలేఖంగొనివచ్చినట్టి యతఁడేయిందందుముఖ్యుండగున్
వాలాయంబుగమిమ్ము నాగభువనప్రాంతంబునున్ జేర్పఁగా
పీలౌ మార్గము జూపఁగాఁగలఁడు సంప్రీతిన్ హితామాత్యభృ
త్యాళిన్ దోడ్కొనితర్లిరాఁదగును నుద్వాహార్థమై వేగమే.

ఇట్లు
భవదీయ శ్రేయోభిలాషి
వాసుకి.

అనియున్నయుత్తరమును మాటిమాటికిఁ జదువుచు దానిం దెచ్చినవాని మొగంబుపైఁ జూడ్కులు బరగించుచుఁ గించిచ్ఛ

తాన్యభాస్వరుండై తలపంకించుచు దివోదాసుఁడు వానితో నిట్లనియె.

మ. తెలిసెన్ జో! యిఁక దాపనేమిటికి నీతీరిందునా ముందు ని
ర్మలచిత్తుండగు రత్నచూడుఁడు మహాప్రాజ్ఞుండు విజ్ఞుండు నా
చెలికాఁడొక్కఁడుదక్క నాకిటులవాసిన్ మేలుగూర్పంగ న
న్యులు సంసిద్ధులుకాఁగలారె? నిజమోహా! నాకుఁగన్పట్టెడిన్.

అనియాపరివ్రాజకవేషధారియైన రత్నచూడుని దెలిసికొని వానిననేకవిధంబుల నభినుతించెను. రత్నచూడుఁడును బూర్వపు రూపంబు వహించి యారాజేంద్రుని ముందు నిలువంబడి మహాప్రభావసంపన్నుఁడవగు నీయెదుర నామాయావేషములు బనికివచ్చునా యని మందహాసమొనరించుచు వచించెను. పిమ్మట దివోదాసునితోఁ దనపాతాళలోకయాత్రావృత్తాంతమెల్ల వర్ణించి యనంగమోహిని క్షేమమెఱింగించి వానిమనంబున కానందంబొనఁగూర్చెను. పిమ్మటఁ గార్తాంతికులెఱింగించిన శుభముహూర్తంబున రత్నచూడుఁడు మార్గదర్శకుఁడై ముందునడువ కతిపయపరివారసమేతముగా రసాతలంబున కేగి మహావైభవంబున ననంగమోహినిం బరిణయమయ్యెను. ఆవివాహంబునకు సప్తపాతాళలోకంబులంగల పెద్దలందఱు నరుదెంచి వధూవరుల నాశీర్వదించిరి. పిమ్మట నమ్మహారాజు రసాతలంబున ననంగమోహినితో నిష్టోపభోగంబుల ననుభవించుచుఁ గొంతకాలముండి యనంతరము నిజలోకంబునకరుగుటకు వాసుకియనుమతంబు వడసి యనంగమోహినిందోడ్కొని యఖండవైభవంబున వారణాశికేతెంచెను.

ఆసమయంబునకే యక్షలోకంబునుండి మణిగ్రీవ జలంధరులు గుణవతిం దోడ్కొని దివ్యయానంబునఁ గాశీనగరంబునకేతెంచి తమ రాక తేనికెఱింగించిరి. అమ్మహారాజమందానందకందళితహృదయారవిందుండై యనంగమోహిని కాయుదంత మెఱింగించి యప్పు

డే వారినెల్లఁ బిలిపించి గుణవతి నంతఃపురంబునకుఁ బంపి మణిగ్రీవ జలంధరులఁ బెద్దగాఁ గౌరవించెను. అనంగమోహినినిబట్టమహిషిగాస్వీకరించి యమ్మహారాజు గుణవతిం ద్వితీయగ గాంధర్వవిధిం బరిగ్రహించెను. పిమ్మట దేవకాంతలఁ గూడఁ గనిష్ట భార్యలుగఁ గైకొనెను. హిమశైలంబునకాంభవీ దేవియాలయమందున్న రత్నరాసులకును హేమసౌధంబునందలి మహాభాగ్యంబునకును దివోదాసుఁడే నాయకుఁడై యఖండ వైభవములననుభవింపుచుండెను. ఆ రాజశేఖరుని యనుమతంబున మణిగ్రీవజలంధరులు కొన్నిదినంబులందేయుండి పిమ్మట నిజనివాసంబునకరిగిరి. అరిందముఁడు దివోదాసునివిడచి నిజలోకంబునకరుగలేక భూలోకముననేయుండి యారాజేంద్రుని యాంతరంగిక సచివుఁడై యొప్పియుండెను. దివోదాసున కనంగమోహినియందు సమరంజయుండను పుత్రరత్నంబు దొలిచూలు తనయుఁడై జన్మించెను. మఱియు ననేక పుత్రపుత్రికా సంచయం బారాజేంద్రునకుఁ దక్కిన కళత్రముల యందును గలిగెను.

పిమ్మట దివోదాసుఁడు నిర్ద్వంద్వ నిరవగ్రహ నిస్సపత్నంబుగా ధరణీరాజ్యంబు పెద్దకాలంబు పరిపాలించెను.

## 319 వ మజిలీ.

అట్లు సిరితో సంతతిలో దివోదాసుండు వారణాశీపురంబునఁ బెద్దకాలము నివసించియుండి పుడమిని ప్రజానురంజకుఁడై పరిపాలింపుచుండెను. కాని దేవత లప్పాటభేదనంబుఁ జొచ్చుటకు మాత్ర మతఁడంగీకరించియుండలేదు. కాశీవియోగ వేదనా దోదూయమానమానసులై వేల్పులు శచీకళత్రుం బురస్కరించుకొని యొక్కనాఁడు బృహస్పతిచెంతకరిగి తమమనోవ్యథ తెలియంగఁజెప్పి యద్దివోదాసునకు రాజ్యపదభ్రంశనం బెవ్విధంబున నగునో యానతిమ్మని వానిని గోరుకొనిరి.

అప్పుడావాచస్పతి మందస్మితసుందరవదనారవిందుఁడగుచు వారికిట్లనియె. బృందారక బృందంబులారా! ఇందులకై మీరింత యలజడిం బొంద నేమనంగలను. మానవులు దివిజుల యాశ్రయంబు లేక గడియరైన మనఁగలరా? అగ్ని దేవుని యాధారము లేకున్న వారెట్లుభోజనపదార్థంబులఁ బచనంబుఁ జేసికొనఁగలరు? గాలి లేకున్న వారికెట్లూపిరాడఁగలదు. వరుణదేవుని యనుగ్రహంబునఁగాదే భూమిపై వారికి జీవనంబులు నిలుచుటఁగలుగుచున్నది?

గీ. అగ్ని మనలోన నొక్కరుఁడానొకాఁడా?
చేయఁడే వాయుదేవుండు జెప్పినట్లు
వరుణుఁడెవ్వరివాఁడు ? ముువ్వురును లేక
నిముసమోర్తురె మర్త్యులునిశ్చయముగ.

వరుణానిలాగ్నులు దమతమ శక్తు లుపసంహరించిరేని పుడమిపై బిఠర పాకంబు సాగదు. దానంజేసి యోదనంబు పరిపక్వంబుగానేరదు. వైశ్వదేవ బలిహరణాది సత్క్రియాకలాపంబు లక్కారణంబునఁ గుంఠితంబులగును. హవ్యకవ్య క్రియాశూన్యులైన బ్రాహ్మణులు రాజునందు విరక్తులగుదురు. తక్కిన వర్ణంబులవారును బ్రాహ్మణులననుసరింపఁగలరు. ప్రజానురంజనంబునంగదా రాజు రాజ్యంబు సేయఁగలుగుట. ప్రజావిరక్తిచే రాజునకుఁ గోశదుర్గబలాది సప్తాంగంబులు క్షీణించును. దానఁద్రివర్గంబు నశించును. అందుచే నుభయ లోకమార్గంబును ఖిలీభవింపఁగలదు. ఇందువలన మనయాశయము నెరవేరఁగలదు.

ఉ. చండకరాన్వయాంబునిధిచంద్రుఁడు భూరమణుండతండు తాఁ
గుండియవాఁడు వేలుపులకోటు లసంఖ్యలు భూతధాత్రిపై
నుండఁగ నీక కాశిపురి నొక్కఁడు రాజ్యము సేయుచుండఁగా
దండితనంబు లేకిటుల దైన్యముబూనఁగ మీకుఁబోలునే?

అని పెద్దగానుపన్యసించిన యాచార్యుని పలుకు లాదరించి యప్పుడే శచీకళత్రుండు వైశ్వానరప్రభృతుల బృహస్పతి వచనానుసారముగఁ బ్రవర్తించుటకు నియమించెను.

త్రివిష్టపేశ్వరు ననుమతంబున నగ్నిదేవుండు భూలోకంబునఁ దనమూర్తి నుపసంహరించెను. వాయువు స్థభించెను. వరుణుఁడు వర్షింపకుండెను. అందగ్నిలేకుండుటచే స్త్రీలు పాకక్రియయం దసమర్థలైరి. బ్రాహ్మణుల నిత్యాగ్నులు సెడిపోయెను. ఆసమయంబున భూపతి సమ్ముఖంబున కాంధసికసంఘ మేతెంచి ముకుళితకరపుటులై కొంకుచునిట్లని విన్నవించిరి. దేవా! నేఁడ దేమికారణంబుననో కాని యెంతఁ బ్రయత్నించిన నిప్పారంబున నిప్పుబుట్టదయ్యెను. దానంజేసి దేవరకీదినంబున సూర్యపాకంబున నాయితంబైన యోదనంబు బెట్టవలసివచ్చినది. ఇప్పటికే రెండవజాముదాటుచున్నది. కావున నారగింప వేంచేయుమని మనవిజేసికొనిరి. వారిమాటల కారాజమార్తాండుండు నివ్వెరంబడుచు దేవతలొనరించిన కపటము నెఱింగి యానాటి కర్కకిరణ తాపపక్వంబులగు పదార్థంబుల భుజించి వచ్చి గొల్వుదీర్చి వానవాదులు నేసిన యుపకారంబునకుఁ బ్రతీకారంబు జింతించుచున్న సమయంబునఁ బౌరు లగ్నితిరోధానంబునకు భయంపడి యమ్మహోత్పాతంబు రాజునకెఱింగింప నేతెంచిన వారి నెల్లఱ నాదరించి దివోదానుండు నాకనివాసులు జేసిన దుర్వృత్తికిఁ దలంకఁ బనిలేదని వారికుదుటుగఱపుచు మఱియునిట్లనియె.

చ. అనుమానింపక యాసుధాంధసులు మాయాకల్పనావంచనం
 బునవైశ్వానరునిన్ హరించిరి యహుంబో! యింతమాత్రంబులో
 నన నాయోగమహానుభావమునకున్ భంగంబువాటిల్లునే!
 సనెక ల్దాఁచినఁ బెండ్లియాగునొకో! దుశ్చారిత్రముల్గంటిరే!

సీ. దహనస్వరూపంబుఁ దాల్చి యేఁ గైకొందు

హవ్యకవ్యాహుతు లధ్వరములఁ
బర్జన్యమూర్తిఁ జేపట్టి యేవర్షింతు
సలిలధారలు సస్యములు ఫలింప
శశిదివాకరుల వేషముఁదాల్చికొని యేన
ఖండింతు గాఢాంధకారపటలిఁ
బవను నాకారంబు భరియించి యేను బ్రా
ణ్యంత ర్బహిర్వ్యాప్తి నావరింతు
గీ. వేల్పులందఱు నేనయై వివిధకృతుల
విశ్వలోకంబు రక్షింతు వేయునేల?
యింక మీఁదట నిటనేన యేలువాఁడ
నాగలోకంబు నాకంబు యోగశక్తి.

అని యోగవిద్యాబలంబున సర్వదేవతామయుండై దివోదాసుండు రాజ్యంబు సేయుచుండెను.

ఇట్లుండ మందరాచలంబున నధివసించియున్న పరమేశ్వరుండు కాశీవియోగంబు సహింపఁజాలక తత్సమాగమోపాయంబుఁజింతించుచుండెను. అంతనొక్కనాఁడాయంధకాసురవైరి గజానన, శరభానన, వికటానన వానరానన, వృషానన, వికటలోచన, రుధిరపాయిని గర్భభక్షిణి, యాంత్రిమాలిని, తాపని శోషణి కోటరాక్షి, ముక్తాక్షి, కేకరాక్షి, రక్తాక్షి, స్థూలనాసిక, ప్రిముఖ చతుష్షష్టి యోగినుల రావించి మీరు నానాప్రకారమాయావేషంబులఁ గాశీనగరంబునకు బోయి యందలి పుణ్యస్త్రీల పాతివ్రత్యంబులు బురుషులయాచారంబులు జెఱుచునది. వర్ణాశ్రమంబులు నిజధర్మంబున వర్తింపకున్నచో దివోదాసుండు రాజ్యపదభ్రంశంబు నందఁగలఁడు. అప్పుడుగాని మాకుగాశీసమాగమంబు సిద్ధింపనేరదని జెప్పి వారినొప్పించిపంపెను. వారును శంభునియోగంబున వారణాసికింజని

సీ. పుష్పలావిక యొకర్తు భూమిక త్తె యొకర్తు
గంధవాహిని యొర్తొకర్తు లంజె
హస్తాంఘ్రి రేఖాసమాలోకనక్రియా
సాముద్రికజ్ఞానచతురయోర్తు
సలిలాగ్ని వాయ్వాయు స్తంభవిద్యాకళా
ప్రావీణ్యయోర్తు సైరంధ్రియోర్తు
మానకమ్మ యొకర్తు మంత్రవాదిని యోర్తు
రంగవల్లివిచిత్రరచయితోకతె

గీ. చదువఁ బాడంగ నర్తింప నరసమాడఁ
గథలు సెప్పంగ నగ్గింపఁ గన్నులార్ప
వీణవాయింపఁ బొగడంగ విరులుగట్ట
నేర్చునట్టిది యొకరిత నియత యొకత.

ఈరీతి నానావిధరూపంబులంగైకొని యాయోగినీ మండలంబు వారణాశీపురంబున విహరించుచుండెను. ఇంతలోఁ గాలవిలంబము సైరింపఁజాలక యయ్యంధకారాతి కాశీనగరమందలి వృత్తాంతమరయఁ జండకిరణుని బంపనెంచి వానిని రావించియిట్లనియె.

వానరాధిపా! కాశీవియోగతాపంబున నామనంబున కూఁటఁ గలుగకున్నది. ధర్మమార్గైక తత్పరుండగు దివోదాసుని నందుండి వెడలనడిపించుట కుపాయముదోపకున్నది. వానిసెట్లయిన ధర్మవిముఖునిం జేసినఁగాని మనపని సులభంబు గానేరదు కావున నీవచ్చటికేగి వానియందెద్దియైన దోషమును నిరూపించవలయునని పలుకుటయు నయ్యుష్ణాంశుండు వానియానతి శిరంబునంబూని కాశికేతెంచి యాచకుఁడై, దూతయై, దీనుఁడై, కార్తాంతికుఁడై, దృష్టప్రత్యయవాదియై, వదాన్యుఁడై, జటిలుఁడై, దిగంబరుఁడై, బ్రహ్మచారియై, యతియై, నానాప్రకారవేషభాషా చేష్టాయంత్రమంత్రతంత్రమాయాప్రయోగ

బలంబున మెలంగుచుండెను. కాని యారాజన్యచూడామణియందు దోషమించుకయును గనిపెట్టఁజాలఁడయ్యెను. ఇట్లు విఫలప్రయత్నుండై సూర్యుండు మగిడి యీశ్వరుసన్నిధికేఁగుటకు మొగంబుజెల్లక యా కాశియందే పండ్రెండుమూర్తులం గైకొని యధివసించియుండెను. కాశీవాసనిమిత్తంబుగా మనంబు లోలంబగుట వానికి లోలార్కుఁడను ప్రసిద్ధనామంబు గలిగెను.

అచ్చటమందరాచలంబున సాంబుండు, కాశీవియోగ వేదనాక్రాంతస్వాంతుండై తద్వృత్తాంతశ్రవణ కుతూహలంబున విధాత నమ్మహాపరేత నిలయంబునకుం బంపనెంచి వానిరావించి యిట్లనియె.

ఉ. పోయెను యోగినీబలము పోయినపోకనె పోయెఁ బిమ్మటన్
దోయజబాంధవుండతఁడునుం దడసెం గడు నీరుచూడఁగాఁ
బోయినయట్టి తామరలపోలిక నందఱుఁగాశిఁజిక్కరీ
తోయము నీవు పోద్రుహిణ! తొల్లిటివారలయట్లకాకుమీ!

అనివలుకు నెలసిగదాలువు నానతివడసి యక్కమలగర్భుండు వృద్ధబ్రాహ్మణవేషంబున దివోదాసుని పేరోలగంబున కేతెంచి యాశీర్వదించి కాశీక్షేత్రంబున యజ్ఞంబులొనర్చుటకు దనకనుజ్ఞ యొసంగుమని యాభూపతిని బ్రార్థించిన నదేవతాకంబులగు జన్నంబులెన్నని జేయవచ్చునని పలుకుటయు నక్కుహనాబ్రాహ్మణుండు గటకటంబడుచు నిట్లనియె.

రాజోత్తమా! విశ్వేశ్వరుండు లేకుంటచే నీయవిముక్తక్షేత్రంబెంతేని చిన్నవోయియున్నది. ఆవామదేవుఁడొక్కఁడు మాత్రమిందే తెంచుట కనుమతింపుము. తక్కిన వేల్పులు నేనొనర్చుజన్నంబునకు రాకున్నను జింతలేదని బ్రతిమాలుచున్న వాని కానృపోత్తముం డరాంగీకార సూచకంబుగ మిన్నకుండెను. పిమ్మట నవ్విధాత దశాశ్వమేధయాగంబులు సుప్రయోగంబులుగా నాహరించి బ్రహ్మేశ్వర

దేవుం బ్రతిష్టించి భాగీరథీపశ్చిమతీరంబునఁ జెలఁగియుండెను.

అచ్చట గౌరీశుండును గాలవిలంబంబు సైరింపఁజాలక నిజాం తర్గతంబున నిట్లని చింతించెను. యోగినీబృందంబా యానందకాన నంబున కేగి తిరిగిరాదయ్యెను. వినతసుతుండు పూర్వవృత్తాంతమంతయు మరచి యందేనిలచియుండెను. అంభోజసంభవుండును నందే కదలని కంబంబయ్యె. ఇంకఁ బరమవిశ్వాసనిధులగు ప్రమథులనందుఁ బంచెదం గాక యని శంకుకర్ణ ఘంటాకర్ణ మహాకర్ణ గోకర్ణ తిలకర్ణ స్థూలకర్ణ మహాకాళ పింగళకాహళాది ప్రమథోత్తముల బహుమానపురస్సరం బుగా రావించి కాశీవృత్తాంతంబరసి వచ్చుటకు బుత్తెంచుటయును వారతిరయింబున నచ్చటికేగి యాక్షేత్రమహాత్మ్యంబున నిర్వచిం పలేనట్టి యానందంబనుభవించుచు నభవు నాజ్ఞను మరచి యందీశ్వర లింగంబులఁబ్రతిష్టించి తదారాధనా తత్పరులై యన్యమెఱుంగ కుండిరి.

## 320 వ మజిలీ

మందరాద్రియందు బాలేందుకలాధరుండు కాశికరిగిన వారి వృత్తాంతము తిరుగ నెఱుంగక చింతించుచు గజాస్యునిగూడ నందుఁ బంపువాఁడై వానిరావించి చేయవలసినకృత్యమెల్ల బోధించి యచ్చ టకుఁబంపించెను. వారణాస్యుండు వారణాసికఁజేగ్గి ప్రతిదిన మందనేక దుర్నిమిత్తంబులఁ గల్పించుచుఁ బౌరులకు మిగుల వెఱపుగలిగించు చుండెను. తాను పురజనులలోఁ జేరి యాదుర్నిమిత్తంబులవలనఁ గలు గఁబోవు విపత్తులెఱింగించుచు వానికుపశాంతుల బోధించుచు నంద ఱకుఁ బరమాప్తుండువలె నాకాశీమధ్యంబున సంచరింపఁదొడగెను.

సీ. కలలోనఁ బుట్టినకథలెన్ని యన్నియుఁ
బూసగుచ్చినయట్లు పొసగఁజెప్పు
హస్తరేఖలుజూచియాయుష్యమును భవి

వ్యము తేట తెలివిగా నానతిమ్ము
గూతులిద్దఱునీకుఁ గొడుకులిద్దఱునీకు
నని మోమునూచి సత్యంబునొడువు
దాతగారనువావిఁ దనవారితన మొప్ప
గురుసు మోపక యుండ సరసమాడు

గీ. వ్రతమునోమించు దివసవారములు దెలుపు
ననుగలంబైన భామినీజనుల యెడను
గుండుబొజ్జయుశిఖయును గుఱుచపాదవు
వ్రేలిదర్భాంకురమునొప్పవిఘ్నరాజు.

ఇవ్విధంబున నానాప్రకారంబుల సంచరించుచు నరిష్టం బనతి కాలంబుననే కాశీపట్టణంబునకు సంభవింపఁగలదనువార్త యెల్లఱకుఁ దెలుపుచుఁ బౌరుల భీతావహులం జేయుచు హితుండునుబోలెఁ జరించుచు సర్వజనులచే సంస్తుతింపఁబడుచు ఢుంఠిభట్టాగకుండను నామంబున మెలంగుచు నొకనాఁడు రాజదర్శనంబొనరించి యతండడిగిన ప్రశ్నలకు సదుత్తరములొసఁగి మెప్పువడసి యతని పురోహితులలో నొక్కండై ప్రవర్తించుచుండెను. మఱియొకనాఁడు రాజువానిజూచి యిట్లనియె.

గీ. చెప్పుమా ఢుంఠిభట్ట! కాశీపురమునఁ
బుట్టుచున్నవి యుత్పాతములు దరుచుగఁ
గారణంబెద్ది దీనికి! కలుష మెట్లు
వాటిలెనొ? ధర్మమేవంకఁబల్లటిలెనొ?

. అట్టి రాజప్రశ్నంబునకు జేతులుజోడించుకొని ఢుంఠి వినయ వినమితగాత్రుఁడై యిట్లనియె. రాజచూడామణీ! అప్రియము బలుకుటకు నోరాడకున్నది. ఈయుత్పాతంబులు వలన నివ్వరంబునకు వెన్నుప్పు రానైయున్నది. అయినను మదీయమంత్రబలంబున నీయు

నర్థంబులకెల్ల నుపశాంతి యొనర్పఁగలవాఁడను. కాని నీవిందుండుట యుచితముగాదు. నీకుకీడుగలుగుటకు మేము సహింపఁజాలము. కావున నీవుకొంతకాలము రాజ్యము విడచి యెందేని బోవుట శ్రేయస్కరమగును ఆత్మార్థంపృథివీంత్యజేత్ నెడువాక్యమిందులకుఁ దార్కాణముగానున్నది. అయినను పెద్దల నింకను విచారించి వారి యాదేశంబువడువున నొనరింపుము. త్రికాలజ్ఞుండగు బ్రాహ్మణుండొక్కరుం డుత్తరదేశంబునుండి నేఁటికినూటిగాఁ బదునెనిమిదవనాఁటికేతెంచి నీకు హితోపదేశంబు సేయఁగలఁడనిచెప్పి యప్పార్థివేంద్రుని డెందంబున కెన్నఁడు నెఱుంగని భయమునుగల్పించెను.

పిమ్మటనరవిందాక్షుండుగూడ శంకరునియభిమతంబు పొంది కాశికేతెంచి గంగావరణాసంగమంబునఁ బాదప్రక్షాళనంబొనరించిన కారణంబున నాప్రదేశంబు పాదోదకతీర్థంబయ్యెను. అచ్చటఁగృతకాలోచితక్రియాకలాపుండై యప్పుండరీకాక్షుండు

గీ. త్రిపురకాంతలశీలంబులపహరింప
బుద్ధవేషంబుగై కొన్న పోకలాఁడు
జలజనాభుండు సుగతవేషము ధరించెఁ
గాశికాద్విజ కులధర్మగతి హరింప.

తనకుఁబుణ్యకీర్తియనిపేరు పెట్టుకొని గరుత్మంతునకు వినయకీర్తియను నామంబుపెట్టి శిష్యునిఁగాఁ బరిగ్రహించి జ్ఞానకౌముది యనుపేరు లక్ష్మికిఁబెట్టి యామెం బరివ్రాజికంగావించి తాను శిష్యుండును నొక్కవంకఁ బురుషులఁ బ్రబోధింపఁగను గమలయొక్కతె నింకొక్కచక్కి చక్కరబోండ్లఁ బ్రలోభింపఁగను సంకేతములేర్పరచుకొని వేరువేర తెరవుల నప్పుటభేదనంబుఁజొచ్చి యొక్కచో నెల్లరు వినునట్లు పుణ్యకీర్తి శిష్యుండగువినయకీర్తికిట్లుపదేశింపఁదొడంగెను.

శిష్యా! సర్వజీవులకును జననమరణంబులు స్వభావసిద్ధంబులు.

వానికి నియామకుఁడొక్కఁడెందును లేఁడు. కాలభేదంబునఁగాని బ్రహ్మ
రుద్రాదుల బ్రదుకులుఁగూడ మనకుఁబోలె నస్థిరములైనవే కదా
ఆహార నిద్రాభయమైథునాది సమస్త వ్యాపారములెల్లఱకును సమా
నధర్మంబులు కావున జీవులకు తారతమ్యంబు లెంచక సర్వభూత
సమత్వంబున మెలంగవలెను. చీమ దోమ నల్లి మొదలగు నల్పప్రాణు
లయందున్న జీవుఁడు నీయందు నాయందును గల జీవునికన్న న
ల్పుఁడుకానేరఁడు. కావున నహింసయే పరమధర్మము. సుఖమే స్వర్గ
ము. దుఃఖమే నరకము. శరీరత్యాగమే మోక్షము. అహింసాత్సర్వ
భూతాని, అని వేదములయందే చెప్పఁబడియున్నది. కానియందే య
జ్ఞయాగంబులఁ బశువిశసనంబొనర్పదగునని చెప్పఁబడియున్నది. ఇట్లు
పరస్పర విరుద్ధమగు వేదంబు ప్రమాణంబుగానేరదు. అహింసకన్నఁ
బరమ ధర్మంబు లేదు. హింసకుడు నిక్కంబుగ నరకయాతనలను
నహింసకుఁడు స్వర్గసుఖంబులఁబొందును. దానంబులెన్నియున్నను
నభయప్రదానంబునకు సాటిరానేరవు. దాననే నానాసిద్ధాంతశాస్త్ర
పారంగతు లగువారు భీతునకభయ దానంబును వ్యాధితునకౌషధ
దానంబును శిశ్రూషునకు విద్యాదానంబును నాకొన్నవాని కన్న
దానంబును దానంబులలో నెల్లఁ బ్రశస్తంబులని చెప్పుచుందురు.
ప్రత్యక్షానుమానోపమానార్థాపత్తి జ్ఞానంబులయం దింద్రియార్థ
సన్నికర్షోత్పన్నంబై యవ్యభిచారియు వ్యవసాయాత్మకంబు నగు
జ్ఞానంబు ప్రత్యక్షంబు. ప్రత్యక్షజ్ఞానంబు సర్వజనులకు దేటతెల్లంబుగా
వున నెల్లరు ప్రత్యక్షంబవలంబించియితర ధర్మముల నన్నిటిని బరిత్య
జింపవలయునని సుగతవాదంబు శిష్యునకు బోధించుచు నావట్టణం
బునఁ దిరుగాడుచుండెను. ఇంకొక్కచక్కని విజ్ఞానకౌముదియను పేరు
వహించి పరివ్రాజకావేషధారియగు విమతికన్య యుపన్యాసచాతు
ర్యంబొప్ప నొప్పులకుప్పల సన్నిధినిట్లని యుపన్యసింపఁదొడంగెను,

మానినీమతల్లులారా! పరబ్రహ్మం బానందస్వరూపంబనియుండ జెలిసింగినదేకదా! ఏపనివలనమనంబునకానందంబౌనగూడునోయట్టిపని నొనర్చుట కితరులకై వెరువనేమిటికి? పాంచభౌతికమగు మనశరీరం బొకఁడు సౌఖ్యార్థియై యాచింప నొసంగకుండుటసమంజసమగునా? చనిపోయినపిమ్మటఁజీమలును గాకులును గుక్కలును దిను నీదేహము ను బ్రతికియున్నప్పు డొకఁడుప్రార్థించిన వెంటనే యొసంగుటకన్న మిన్నయగు దానమున్నయదియా? అత్యంతప్రియతమమగు శరీరము ను దానమిచ్చుట నిక్కముగ దాతృత్వలక్షణము. వావివర్ణంబుల విచా రింప నగత్యము గనిపింపదు. దక్షుఁడును మరీచియును బ్రహ్మపుత్రు లేగదా? మరీచినందనుండగు కశ్యపుఁడు దక్షునికన్యకలఁ బదుమువ్వుర నెట్లువివాహమయ్యెను. పరమపురుషుని ముఖబాహూరుపాదంబుల యందుఁ జాతుర్వర్ణ్యం బుత్పన్నంబయ్యెంగదా? ఒక్క తనువు నందు జన్మించిన నలువురు నేకోదరులగుదురో కారో మీరలే విచా రింపుఁడు. అట్టివారికి భిన్నవర్ణత్వమెట్లుసిద్ధింపఁగలదు. కావునవర్ణా వర్ణవిచక్షణంబు విడచిపెట్టి యిచ్చవచ్చిన మచ్చున స్త్రీపురుషులు విహరించుటయే పరమధర్మంబని పెద్దగానుపన్యసింపఁ బురాంగనలకు భర్తృశుశ్రూషాది ధర్మంబుల విముఖత్వంబు గలుగఁదొడంగినది. ఇట్లుబుండరీకాక్షుండునువానియిల్లాలును వాడవాడలకుఁ దిరిగి యుప న్యసించుచుండఁ గొన్నిదినంబులకు

గీ. వర్ణములునాశ్రమంబులువరుసఁదప్పె
వేదములునాగమంబులుఁవిన్నఁబోయె
సౌరభంబులుగృష్ణపక్ష్యములుఁజెడియె
వృద్ధిఁబొందెనధర్మంబువిశ్వమందు.

ఇట్లుండ దివోదాసుండు ఢుంఢిభట్టారకుండుచెప్పిన విప్రుం డె ప్పుడువచ్చునోయని కనిపెట్టుకొనియుండ సరిగఁ బదునెనిమిదవదివనం

బున మధ్యాహ్నకాలంబున సుగతవేషధారియగు మధుసూదనుండు బ్రాహ్మణవేషంబుదాల్చి రాజుసన్నిధికేతెంచి సముచితగతి నద్దివోదాసు నాశీర్వదించి యతనికనుసన్న నాసన్నయున్న తానసనంబునఁ గూర్చుండెను. అప్పుడు విఘ్నేశ్వరుండు రాజుహృదయంబున నావేశించియుండెను. వినాయకాధిష్ఠితుఁడగు భూపతి వైరాగ్యంబు నహించి యందున్న కపటబ్రాహ్మణునుద్దేశించి యిట్లనియె.

గీ. బడలుపడితి రాజ్యభారంబు భరియించి
పోడమె మదివిరక్తి భూసురార్య!
యేమిసేయువాఁడ నెక్కడికేగుదు
నేదిదిక్కు నాకు నెఱుఁగఁజెప్పుమ.

నాభాగ్యంబుకతంబున నీవు హితోపదేశంబొనర్ప నాచార్యుండునుం బోలె నేఁడేతెంచితివి. ఇంతకాలంబు నారాజ్యంబున నకాలమరణంబులును జరావ్యాధిదారిద్ర్యంబులును లేవు. ఇప్పుడేమికారణంబుననో యవి గలుగుచున్నవి. మఱియు నరిష్టసూచకంబులగు నుత్పాతంబులెన్నేని యిప్పారంబునఁ బొడముచున్నవి. దేవతలఁ దృణీకరించిన యొక్కయపరాధంబు దక్క నేనింకేదోసము నెఱుఁగను. ఇదియంతయును వేల్పులచేఁ గల్పింపఁబడిన కపటనాటకముగాఁ దోచుచున్నది. ఏదియెట్లయినను బెద్దకాలము రాజ్యంబొనరించితిని. జరాభరాక్రాంతుఁడనైతిని. ఇంద్రియంబులు విరతిం గోరుచున్నవి. ఇఁక సకలకర్మనిర్మూలనక్షమంబగు మోక్షుం బపేక్షించుచున్నాఁడను. అమ్మహాపదార్థంబు నాకేయుపాయంబున సిద్ధింపఁగలదో యానతిచ్చి నన్ను ధన్యునింజేయుఁడని ప్రార్థించు రాజేంద్రునకు బ్రాహ్మణవేషధారియగు హృషీకేశుం డిట్లనియె.

గీ. కాశికాపట్టణంబున లింగప్రతిష్ఠ
యాచరింపుము కల్పింపు హార్మ్యరేఖ

గోపా! వింటివా! కాశీక్షేత్రప్రభావంబు. అట్టి మహాక్షేత్రంబీకఁ గొన్నిపయనంబులలో మనము చేరఁగలము. అందు భాగీరథీనిర్మలస్రవంతియందఘమర్షణ స్నానంబాచరించి భక్తసులభుండగు విశ్వనాథుని సందర్శించి చరితార్థులమగుదుమని నుడివిన నామణిసిద్ధున కభివాదపురస్కారంబుగా నగ్గోపాలుం డిట్లనియె.

అయ్యగారూ! కాశీక్షేత్రప్రభావంబు వినుటచే నామనంబునకు నధికోత్సాహంబు బుట్టుచున్నది. మీయనుగ్రహంబున నట్టియుత్తమతీర్థగమనలాభంబు నాకు చేకూరుచున్నది. నే నెంతేనిధన్యుండనని పలుకుచుండ నమ్మణిసిద్ధుండు నేటికి గాలప్రొద్దుబోయినది. ముందుమజిలీ యించుకదూరముగానున్నదందురు. వేగమె బయలుదేరి యందు జేరవలయునని వానిని తొందరబెట్టి యప్పుడే బయలుదేరి యగ్గోపాలుండు గావడియెత్తుకొని వెంటరా నడచనంతరానపథంబు నకుఁ బోయెను.

---

శ్రీరస్తు.

శుభమస్తు—అవిఘ్నమస్తు.

# పంద్రెండవ భాగము.

## 321 వ మజిలీ.

శ్రీకాశీవిశ్వేశ్వరా !
ప్రాకటబ్రహ్మాచ్యుతస్తుతాద్భుతమహిమా
స్తోక ! శశికళాధర ! గౌ
రీకన్యాహృదయపుండరీకనివాసా !

దేవా ! అవధరింపుము. అట్లు మణిసిద్ధుండు శిష్యునితోఁ దదనంతరావసథంబు జేరి భోజనానంతరంబున నుచితస్థలంబున సుఖోపవిష్టుఁడై యున్నసమయంబున సద్గోపాలుండు వానిసన్నిధిం గూర్చుండి వినయంబున నిట్లనియె.

గీ. ఇచటఁ జేరినదాది మీరింతవఱకు
నాకుఁ జెప్పిన కథలెల్ల నాకలింపుఁ
జేసికొనుచుండఁ దోఁచె నాచిత్తమునకు
శంకలొకదానియందు విస్తారముగను.

సీ. కాదంబరీమహాగాథ గాథాంతరం
బునఁ బుండరీకుఁడను మునితనూజుఁ
డమ్మహాశ్వేతకై యుమ్మలించుచు జీవ
ముల బాయఁ జంద్రుఁడమ్మూర్తి నాత్మ
లోకంబునకు వేగఁ గైకొనిపోయి యం
దొనరఁ గాపాడఁ గారణముగలదె ?
వారికి పూర్వసంబంధ మెయ్యదియైన
నుండెనా? శ్వేతకేతుండు కనులఁ

గీ. బడఁగ శ్రీదేవి మోహ విభ్రాంతయై సు
తుంగనిఁ జెలంగి మానికొసంగిపోవు
టరయ సత్యాద్భుతంబు కార్యంబుగాదె!
హేతువెయ్యది దీనికి యెఱుఁగఁ జెప్పుము.

శా. చంద్రాపీడునియందె ముగ్గని తదశ్వశ్రేష్ఠముం గొంచుని
స్తంభిత్వంబున దివ్యపుష్కరిణి మధ్యంబందుం బడ్డట్టియా
చంద్రోద్యన్మణి పత్రలేఖయును మోహాంతమ్ము మేమాయెనో
సాంద్రానుగ్రహమొప్పనా కిపుడు భాస్వద్రీతిమై జెప్పవే ?

గీ. శాపముదొలంగఁగాఁ గపింజలుఁడు సగసి
వెడలివచ్చినవిధము సవిస్తరంబు
గాఁదెలిసెఁగాని పత్రలేఖావధూటి
వార్త తెలియదయ్యెను గురుప్రవర ! పిదప.

ఆ. వె. పత్రలేఖపూర్వభవ మందు నెవ్వతె?
కారణాంతరంబు కతన నామె
జన్మమెత్తె నట్లు చర్చింతు నెమ్మది
సత్యమెఱుఁగఁ జెప్పు స్వామి ! నాకు.

క. ఏతత్కథాచమత్కృతిఁ
జేతఃపరవశతఁ గాంచి చెలఁగెడినాకీ
రీతినిసందేహములవు
డాతతగతిఁ దోపవయ్యె నయ్య! యడుగఁగాన్.

మ. అతికౌతూహలమొప్ప నిట్లడుగు శిష్యశ్రేష్ఠు బుద్ధిప్రవీ
ణతకెంతే మణిసిద్ధయోగి హృదయానందంబునుం బొంది స
న్నుతమాణిక్య మహాప్రభావగరిమన్ బూర్వాద్భుతోదంతమం
చితరీతిన్ గ్రహించి సర్వ మెఱింగించెన్ వానికీతీరునన్.

గోపా! వినుము. స్వర్గంబునఁ బ్రసిద్ధమగు నచ్చరల కులంబులు పదునాలుగు గలవు. అందొకటి పద్మగర్భునివలన నుద్భవించెను. మఱియొక్కటి వేదములవలన నుదయించెను. ఇంకొక్కటి యగ్నివలన సంభవించెను. వేఱొక్కటి వాయువువలన జన్మించెను. ఒకకులంబు భూమివలన నావిర్భవించెను. ఒకటి జలంబువలనఁ బుట్టెను. మన్మథునివలన నొక్కకులంబు గలిగెను. మృత్యువువలన నింకొక్కటి యుత్పన్నమయ్యెను. అమృతంబువలన మఱొక్కటి జననమొందెను. ఒకయచ్చరకులంబు సూర్యకిరణంబులవలనను నింకొక్కటి చంద్రకిరణంబులవలనను బొడమెను. ఒకటి విద్యున్మాలయందు జనియించెను. దక్షకన్యకలైన మునియు, నరిష్టయువలన నొక్కొక్కకులంబు బొడసూపెను. ఇవియన్నియుం గలిసి పదునాలుగు కులంబులయ్యెను. గంధర్వులలో దక్షకన్యకాద్వయంబువలనఁ గలిగిన రెండుకులంబులే నిలిచియుండెను.

అందు మునిపుత్రులు పదునార్వురలోఁ గడగొట్టువాఁడు చిత్రరథుండను మిగులఁ బ్రఖ్యాతిం గాంచెను. అతండతిపరాక్రమోపేతుండై దేవదానవసమరంబున దేవతలకుఁ బెక్కుసారులు మిగుల సహాయము జేసి యింద్రున కంతరంగిక మిత్రుండై యుండెను. అరిష్టతనూజులార్వురలో జ్యేష్ఠుండు హంసుండనువాఁడు చంద్రకిరణ సంజాతాప్సరకులంబునఁ బొడమిన గౌరియను నతిలావణ్యవతిం బరిణయమై చెలంగియుండెను. అమృతసంభవంబగు కులంబునఁ బుట్టిన మదిరయను కన్యను చిత్రరథుఁడు పెండ్లాడెను. అతండు బాల్యమందే గంధర్వులకెల్ల నేలికయై భారతవర్షంబున కుత్తరదిశనున్న కింపురుష వర్షమందుఁ గల హేమకూటపర్వతంబున నివసించియుండెను. అందాతనిచేఁ బరిపాలింపఁబడుచు వేనవేలు గంధర్వులు కాపురముండిరి. మఱియుఁ జిత్రరథుండు హంసుని రెండవ గంధర్వకులంబున కొడయునిగా నియమించుటంజేసి యతండుగూడ హేమకూటమందే యపరిమితగంధర్వ

బలంబు సేవింప నివసించియుండెను. చిత్రరథునకు హంసునకుఁ బరస్ప రానురాగమ్ము దినదినాభివృద్ధిఁ గాంచుచుండఁ బెద్దకాలము వారు రాజ్యపరిపాలనంబు సుఖంబునఁ జేయుచుండిరి. కాని వారికెంతకాల మునకును సంతానప్రాప్తి కలుగదయ్యెను. అక్కారణంబున వారనవ రతము జింతాకులస్వాంతులై భోగవిలాసంబుల విరక్తులైయుండిరి.

చిత్రరథుండొకనాఁడు మిత్రుండగు శచీకళత్రునకుఁ దనమన స్సంకటం బెఱింగించి యపత్యలాభంబు బడయు నుపాయంబు దెలిసి కొననెంచి మించిన తమకంబున స్వర్గలోకంబున కఱిగెను. ఆశత క్రతుండు సర్వబృందారకబృంద పరివేష్టితుండై సుధర్మామధ్యంబునఁ జేరోలగంబున్న సమయంబునఁ జిత్రరథుండు మందగమనంబున నందే తెంచి హృదయపరితాపంబు మొగంబునఁ గనిపింప నిలింప వల్లభుని ముందఁదలవాల్చి నిలచియుండెను. ఆగంధర్వనాయకుంగాంచి సము చితగౌరవ పురస్సరంబు సురపతి యాదరించి యాసన్నాసనంబున నుపవిష్టునొనరించి స్నేహభావంబు దేటపడురీతి నిట్లనియె.

మిత్రమా! భవదీయదీనాననసమీక్షణంబున మదీయ హృద యం బపరిమితపరితాపంబునఁ గొందలమందుచుండెను. ఎన్నఁడులేని కలత నీకేమిటికిఁగల్గెనో గ్రహింపఁజాలకున్నాను. సహజధైర్యనిధా నమగు నీడెందమున కెట్టియిక్కట్టు సంభవించెనో యూహింప శక్య ముగాకున్నది. నీవిచారకారణం బెఱుంగుటకు నాహృదయం బాత్రతం బొందుచున్నది.

చ. గురులకు నెగ్గుసల్పితివొ? కోరియగమ్యగమించితో? రణాం
తరమున భీతిఁజెందితివొ? దబ్బరలాడితివో? యవధ్యులఁ
గరమువధించినావొ? యుపకారిఁ దలంపవొ? యేయకార్యమిం
కరయఁగఁ జేసియుంటివొ? రయంబునఁబల్కుమ దైన్యమేటికిఁ.

గీ. సుఖమె ? నీసోదరుండు హంసుండతండు
కుశలమగునొక్కొ ? నీబంధు కోటికెల్ల
సేమమేగద ? గంధర్వ శేఖరులకు
లేదుగా ? శత్రుబాధ మీా మీాఁదనిపుడు.

ఇట్లు పలికిన బిడౌజునకేమి ప్రత్యుత్తరంబొసంగవలెనో యెఱుంగక చిత్రరథుండు మౌనముబూని యుండుటచే మఱింత హృదయోద్వేగముంగాంచి యాశతమన్యుండు కెండియు నిట్లనియె. హితుఁడా! నీవైఖరినేఁడు తారుమారుగా నున్నదిగదా? నీదీనాననంబుఁ దిలకింప నాడెందంబు గలతఁబడుచున్నది. ఎన్నఁడును నీయందిట్టి దైన్యము గనివిని యెఱుంగను. నేఁడేమిగల్గెనో తెలియదయ్యెను. సత్వరము భవదీయదుఃఖకారణ మెఱింగింపుము. అందులకుఁదగిన ప్రతీకారమాలోచింతము. ఇంకను మౌనమువహించి యుంటివేని మిత్రద్రోహమొనరించినవాఁడవగుదువు. చెలికాడా? నీదేహంబున నత్యంతబాధకంబగు రోగమెద్దియైన నుత్పన్నమై యుండలేదుగదా ? అని యనేకవిధంబుల నడుగుచున్న వానికి చిత్రరథుండల్లన నిట్లనియె.

త్రిలోకాధిపా! నాదేహమున నెట్టిరోగమునులేదు. గంధర్వలోకంబెల్లఁ గుశలముగానున్నది. నాబంధువర్గంబు సుఖసమంచితమై యొప్పియుండెను. నాలోకమునందు శత్రుభీతియునులేదు. నీయనుగ్రహంబున మాకేకొఱంతయునులేదు. కాని నాసోదరుండగు హంసునకును నాకును నిరంతరమొక విషయము మనోవేదనఁ గల్గించుచుండెను. సంతోషరహితస్వాంతములకు సౌఖ్యమను వస్తువు గగనకుసుమమేగదా?

ఆ. వె. ఎంతభాగ్యమున్న నెంతగౌరవమున్న
నెంతవిద్యయున్న నేమియున్న
సంతులేకయున్న సర్వంబసహ్యంబ
దెంతవానికైన నిదినిజంబు.

సంతానరహితుని భోగభాగ్యంబులు వ్యర్థంబులు. అపుత్రకుని యానందంబు శూన్యగేహంబునందలి దీపకాంతివంటిది. అనపత్యుని విద్యాబలంబులు ప్రయోజనరహితంబులు. పిల్లలులేనివాని జీవనము నిరుపయోగము. అట్టి నిరర్థక ప్రాణధారణముకన్నఁ జచ్చుటయే యుత్తమమని తలంచుచున్నాను. ఇట్టిదారుణ విచారమునకు లోనై సంతతము గృశించుచు నేఁడిందే తెంచితిని. ముల్లోకములకు నియామకుండవగు భవదీయ సందర్శనంబొనరించి నీయానతి ముందు కృత్యమునకుఁ గడంగనెంచితిని. మీఁద దేవరయే ప్రమాణము. నాహృదయశల్యము నూడఁబెఱుకుటకు మీరలే కర్తలని మిన్నకుండెను.

ఆపలుకులాలించి వాని యభిమతం బెఱింగి కటకటంబడుచు నాసహస్రాక్షుండు చేరువనున్న దేవగురుని మొగము దిలకించి యాచార్యవర్యా! నాప్రియమిత్రుఁడగు నీచిత్రరథుని హృదయపరితాపకారణం బెఱింగినదిగోలె నాడెందంబున మిగుల జాలిబుట్టుచున్నది. అగతానాగతఫలంబుల శాస్త్రదృష్టి నెఱింగి చెప్పుటయందు మీకుఁగల సామర్థ్యం బెవరికిని లేదు. ఈగంధర్వపతి భాగధేయమెట్లున్నదో పరీక్షించి యెన్నఁడైన వీనికి సంతానయోగము గలదేమో తెలియఁ జేయుఁడని పలుకుటయును నాబృహస్పతి కొంతసే పెద్దియో గుణించి భవిష్యమెఱింగి యప్పాకశాసనున కిట్లనియె.

దేవతాచక్రవర్తీ! ఈగంధర్వశ్రేష్ఠుని దిష్టంబు సామాన్యంబు గాదు. చతుర్దశభువనంబులయందును వీనిఁబోలు పురుషప్రవరుం డుండుట యబ్బురంబు. అలఘుగుణగణయుతుండై యఖండసద్యశోవిరాజితుండై యనిర్వచనీయశౌర్యసమేతుండై యనల్పబలపరాక్రమసమన్వితుండై యనన్యదుర్లభమహావైభవప్రశోభితుండై నెగడు నీచిత్రరథుఁడు సర్వవిధములఁ బ్రశంసనీయుఁడై యుండెను. కాని వీనికి పుత్రస్థానముమాత్రము మిగుల దుర్బలతనందియున్నది. వీనికి పుత్ర

సంతాన మెన్నఁడును గలుగనేరదు. అయినను గొంతకాలమున నొకపుత్రికారత్నముమాత్రము వీనికి జన్మింపఁగలదు. అబ్బాలికా మణివలన సంభవమగు పురుషసంతానమే వీనివంశమున కాధారమై యుండునని యూఱకుండెను. చిత్రరథుండు మొగంబున దైన్యంబు దోప నీరెలుంగున నాచార్యునితో "గురుప్రవరా! నాకు పుత్రులు గలుగుభాగ్యంబు లేకున్న నాతమ్ముఁడు హంసునకైన సట్టియోగ మున్నదాయని ప్రశ్నించుటయును నాదేవగురుండు దిరుగఁ గొంత సేపు గణితము జూచి పురుషపుంగవా! మీయిరుపురి భాగధేయము లొక్కరీతినే యొప్పియున్నవి. నీకుఁబలె హంసునకుఁగూడ నేక పుత్రికాయోగమేగాని కొడుకులుగలుగు సుకృతములేదు. మఱొక్క విశేషముగూడఁ గలదు. మీయిరువురికును గూతుండ్రు కొంచె మించుమించుగ నేకకాలమందే కలుగఁగలరు. వారు దేహములు వివిధములైనను నొక్కటివలెనే ప్రవర్తింపఁగలరు. వారికి భర్తృ సమాగమం బొక్కకాలమందే సంభవింపఁగలదు. మఱియును వారు సంతానవంతులైనపిదప నేకముహూర్తమందే దేహత్యాగ మొనరింపఁగలరు. ఇంతకన్న నేఁ జెప్పఁదగిన దెద్దియును లేదని యూరకుండెను.

అప్పుడు దేవవల్లభుండు నిజమిత్రునకు మనఃప్రియంబుగ నెన్నియో యనునయవాక్యంబులఁ జెప్పి పుత్రజననంబుకన్నఁ బుత్రికాసంభవంబె జననీజనకులకు సర్వవిధంబుల సంతోషప్రదంబని వానిచే నొప్పించెను. మఱియును వాని హృదయము రంజిల్లునట్లు నాఁడు పెక్కువినోదంబులు నాదేవసభయందు జరిపించెను. పిమ్మట చిత్ర రథుండును దేవేంద్రునివలన ననేకరీతుల నాదరింపఁబడి వానియనుజ్ఞఁ గైకొని నిజావాసమునకేగెను. కాని వాని మనంబున కూరటగలుగ కుండెను. ఒకనాఁడు నారదుండు యదృచ్ఛావిహారంబునఁ జిత్రరథు

పాలి కేతెంచుటయును నతం డతనిచేఁ బూజితుండై యర్ఘ్యాసనంబున సుఖోపవిష్టుఁడై యున్నసమయంబునఁ జిత్రరథుండు దన మనోవిచారం బెఱింగించి పుత్రసంభవంబున కుపాయమానతిమ్మని ప్రార్థింప నా దేవర్షి యిట్లనియె.

గంధర్వకులచూడామణీ! దీనికై ప్రాకృతునివోలె నీవింత వలవంతఁబడుట సముచితమేనా ? పరమేశ్వరానుగ్రహంబునఁ బడయరాని దెద్దిగలదు ? ఆదేవుండు భక్తసులభుండని యెఱుంగవా ?

సీ. కాలునిఁ ద్రోసి మార్కండేయునకు చిరం
జీవనమిచ్చి రక్షింపలేదె ?
హాలాహలము లీలఁ గ్రోలి సురాసుర
ప్రకరంబు బాధఁ దీర్పంగలేదె ?
దివిజగంగాస్రవంతిని నౌదలభరించి
భువి భగీరథుపూన్కిఁ బ్రోవలేదె ?
త్రిపురదైత్యుల సంహరించి సుధాంధస
కోటికానందంబు గూర్పలేదె ?

గీ. మఱియు నిజభక్తు లెంద ఱెందఱఁ గటాక్ష
వీక్షణంబున హృదయసంప్రీతినొసఁగి
కాచి రక్షింపలేదె ? యాక్రతువిరోధిఁ
గొలిచి కోర్కెలందనివారు గలరె యెందు ?

కావున నామహేశ్వరు నారాధించి యిష్టఫలసిద్ధింబొందుము. ఇతర శంకల విడువుమని బోధించి యామునివల్లభుం డెందేనిఁబోయెను.

చిత్రరథుండును నీశ్వరారాధనంబునఁ దనకోర్కె యీడేరఁ గలదని నిశ్చయించి మంచిముహూర్తంబున నిలువెడలి భూలోకంబునకుఁ దపంబొనర్ప నేతెంచెను. అందు సువర్ణపురంబున కుత్తరమున నున్న కైలాసగిరిపరిసరంబున నిర్మానుష్యంబగు నరణ్యంబు తగిన

స్థలంబని తలంచి యచట నొకనాఁడు నతిసుందరంబగు దేవమంది రంబు గట్టించి యందుఁ ద్ర్యంబకుని బ్రతిష్ఠించి యావిరూపాక్షు సిద్ధాయతనంబునకుఁ బూర్వదిగ్భాగంబున నచ్ఛోదంబను నతిమనో హరంబగు సరోవరంబును జైత్రరథంబను నుద్యానవనంబును నిర్మించి యందుఁ బెద్దకాలము దీక్షగాఁ దపంబాచరించుచుండెను.

కొంతకాలమునకు వాని తపంబునకు మెచ్చి పరమేశ్వరుండు ప్రత్యక్షమై యభీష్టవరంబు గోరుకొనుమని యానతిచ్చెను. అందుల కాగంధర్వసార్వభౌముండు మహానందకందళితహృదయారవిందుఁడై తనకును హంసునకును సంతానముగలుగునట్లు వరంబిమ్మని ప్రార్థించెను. అప్పు డప్పినాకపాణి వారిరువురకును జెరియొకపుత్రికయును బొడమఁగలరని వరంబిచ్చి యంతర్హితుండయ్యె. పుత్రసంతాన మపేక్షించి తపంబొనరించుచున్న యాగంధర్వపతికి పశుపతివరంబు సంతోషమునుగలిగింపదయ్యెను. అక్కారణంబునఁ జిత్రరథుండు చింతాకులస్వాంతుఁడై యిట్లనివిచారింపఁదొడంగెను. అన్నా! మందబుద్ధినై చేతికబ్బిన మహాభాగ్యము ననుభవింపఁజాలనైతినిగదా? అనన్యదుర్లభంబగు నీశ్వరసందర్శనభాగ్యంబబ్బినను మన్మనోగతంబు నీడేర్చుకొనఁజాలనైతిని. ఆదేవోత్తముం డభీష్టవరంబు గోరుకొమ్మని యానతిచ్చినప్పుడు పుత్రసంతానము గావలెనని స్పష్టముగ వేడుకొనక వెంగలినై సంతానముమాత్రమె కోర దివురుట నాయభాగ్యత మూలముననేగాక యితరమెట్లగును? అయ్యో! చేసినకృషియంతయును వ్యర్థమయ్యెగదాయని యనేకవిధంబుల విచారించుచున్న సమయంబున నారదుం డెందేనిఁబోవుచు నచ్చోటికేతెంచెను. చిత్రరథుండు వాని రాక నెఱింగి లేచి నమస్కరించి యథార్హసత్కారములొనర్చి జరిగిన యుదంతంబెల్ల నెఱింగించి యమ్మునితల్లజునితో మఱియు నిట్లనియె.

సీ. తల్లిదండ్రులకు సద్గతిహేతువగువాఁడు
తనయుండు జన్మమాత్రంబువలన
కన్నవారికిఁ గీర్తిఁగల్పించుఁ గొమరుండు
వినయవివేకసద్విధులవలన
పితరుల కతిమనఃప్రీతిఁగొల్పు సుతుండు
సరసవిద్యావిశేషములవలన
జననీజనకులకు సౌఖ్యంబుగూర్చు పు
త్రకుఁ డుపచారపద్ధతులవలన
గీ. అట్టిసూనుండుబుట్టు భాగ్యంబు నాకు
గలుగదయ్యెను. నాతపఃఫలమదెల్లఁ
దారుమారయ్యె నాడుసంతానమబ్బ
వంశమెటునిల్చు మీదఁ దాపసవరేణ్య!

అని వ్యసనపడు చిత్రరథు నూఱడించుచు నారదుం డిట్లనియె. గం ధర్వకులచూడామణీ! విధి నతిక్రమింపఁజాలువా రెందునులేరుగదా? పరమేశ్వరుని యాదేశముగూడ వారివారిపురాకృతము ననుసరిం చియేయుండును. నీకొక్కపుత్రికయును హంసునకొక్కపుత్రికయును గలుగఁగలరని పలికిన సర్వేశ్వరునిమాటల కన్యథాత్వమెట్లుండును? దీనికై యెంతవంతపడినను బ్రయోజనములేదు. పరమేశ్వరప్రసాదసం లబ్ధలగు పుత్రికలను సామాన్యబుద్ధిఁ దలంపరాదు. ఆపుత్రికాద్వ యంబుమూలంబున మీయుభయగంధర్వకులంబులకును శాశ్వతసద్య శంబు గలుగఁగలదు. వారికిపుట్టు పుత్రసంతానమే గంధర్వరాజ్య రమాపరిష్వంగసౌఖ్యార్హమై మీకత్యుత్తమలోకసంప్రాప్తికి కారణ మగును. తపంబునఁ బరమేశ్వరుని సన్నిహితుంజేసికొనఁగల్గిన నీభాగ ధేయము మిగులస్తోత్రపాత్రమైనది. ఇఁక మనంబున నేవిచారమును బెట్టికొనక నిజసదనంబునకుఁ బోయి సుఖంబునఁ గాలముగడుపుచుం

డుము. నీచే నిచ్చటఁ బ్రతిష్టింపఁబడిన నీశ్వరునకు నిత్యమును బూజా విధానములు జరుగుచుండునట్లు చూడుము. దాన నీకుత్తమలోక ప్రాప్తిగలుగఁగలదు. పొమ్ము. శుభంబులం బడయుమని దీవించి యాదేవమునీంద్రుండు యథేచ్ఛాగతింబోయెను. చిత్రరథుండు వాని మాటలవలనఁ గలంకముడిగి నిజనివాసంబునకుఁబోయి యావృత్తాంత మెల్ల నాప్తుల కెఱింగించి సంతోషమునఁ గాలముబుచ్చుచుండెను. నిత్యమును బుడమికేతెంచి యందుఁ దనచేఁ బ్రతిష్టింపఁబడిన సదా శివమూర్తిని స్వయముగా నర్చించుచుండెను.

## 322 వ మ జి లీ.

శ్రీవైకుంఠమందుఁ గార్తికశుద్ధైకాదశినాఁడు గొప్పయుత్స వము బ్రతివత్సరము జరుగుచుండును. నాఁడు శ్రీమన్నారాయణుండు పాలసంద్రంబునుండి యోగనిద్రాపరిబోధితుండై లేచివచ్చి సర్వప్రపంచసంరక్షణంబునకుఁగడంగును. అప్పుడు దేవతలెల్లరునువచ్చి యా యాదినారాయణదివ్యదర్శనంబొనర్చి స్తోత్రపాఠంబు లొనరించుచుం దురు. సురపురోహితుండగు బృహస్పతి సర్వబృందారక సమక్ష మందాయధోక్షజుని లక్ష్మీసమేతముగా దివ్యసింహాసనమునందుఁ గూర్చుండఁబెట్టి యాగమవిధుల వివిధసత్కారము లొనరించుచుం డును. దేవర్షిబృందమెల్ల నాసభాభ్యంతరంబున లక్ష్మీనారాయణప్రీతి కరంబుగ నాశిషంబులఁ బఠించుచుండును. తుంబురునారదు లాదేవ దేవుని వింశత్యవతారవిశేషంబుల దివ్యగానంబొనర్తురు. అప్సరోయువ తు లాసభాప్రాంగణంబున నాట్యకళాప్రదర్శనంబొనరింతురు. ఇట్టివినో దంబుల నాఁడావైకుంఠమందిరంబెల్ల నత్యంతశోభాయమానమై చె లఁగియుండును. నాఁడు లక్ష్మీనారాయణసందర్శనంబు సర్వపాపహ రంబనియును నిఖిలభయ విధ్వంసకంబనియును వివిధహృదయోపతాప

నివారకంబనియును శాశ్వతమోక్షసామ్రాజ్యలక్ష్మీసముపలబ్ధసాధకంబనియును ననేకవిధంబులఁ దలంచుచు భక్తసందోహ మావైకుంఠమందిరద్వారప్రదేశంబున గుమిఁగూడియుండును.

అట్టి యుత్కృష్టోత్సవదినంబున నొకప్పుడు దేవతలును మునీశ్వరులును నేతెంచి యావైకుంఠపురంబున విడిసియుండిరి. మునిపత్నులెల్లరును సముచితరీతి నలంకరించుకొని శ్రీదేవిం దర్శింప ముందుగా నామెమందిరంబునకఱిగి తమరాక పరిచారికాముఖంబునఁ దెలియఁజేసిరి. రమాదేవి యావార్త విని ముప్పిరిగొనుసంతసంబున నమ్మునిపత్నుల కెదురేతెంచి యభ్యంతరంబునకుఁ గొనిపోయి వారినెల్ల నర్హరీతి నాదరించెను. గౌతమసతియగు నహల్యయును నాచార్యుని భార్యయగు తారాసతియును సహజలావణ్యప్రశోభితంబులగు నిజాంగయష్టులకు నూత్నశృంగారమాపాదించు తెరంగున వివిధభూషణభూషితలై మనోహరకుసుమవిసరసమలంకృతకేశపాశలై సౌందర్యాభిమానసమంచితముఖసరోజాతలై యథేచ్ఛగా నానారీమండలంబున మెలంగుటఁ దిలకించి కలుములజవరాలు మనంబున నించుక యేవగించుకొనెను. అనసూయను నరుంధతిని లోపాముద్రను మునిపత్నులందరియందును మిక్కిలి గౌరవించి యామె పూజించెను. వారి సతీత్వమహత్వంబు పెద్దగా నుతించెను. అందువలనఁ దక్కినవారి కించుక హృదయపరితాపం బొదవెను. సహజాభిమాన గర్వాభూయిష్టలగు నహల్యాతారారమణుల కందువలన నందరికన్న నధికముగ మనంబుల నీర్ష్య జనించినది. ఇట్టి యంతఃకరణప్రవృత్తులతోఁ గొంత ప్రొద్దరిగినవెనుక వారికిట్టి సంవాదము జరిగెను.

లక్ష్మి—ఆర్యాణులారా! మీసందర్శనంబున నాహృదయంబునకు నేఁ డపరిమితానందంబొదవెను. మీచరిత్రములు సర్వప్రపంచకాతీతములు. మీమహిమలు మహాద్భుతసమేతములు. సకలభువనం

బులును మీమాటలకు వశంవదములైయుండు. ఇట్టి మీతోఁగలసి
ముచ్చటించుట నాకు మహాభాగ్యము.

అనసూయ—దేవీ ! నీవిట్లు మమ్ము బెద్దసేసిపలుకుట నీయభి
మానసూచనముగాక వేఱొకటెట్లగును. సర్వప్రపంచసంరక్షకుండగు
నధోక్షజున కిల్లాలవై నిఖిలదేవతాచక్రవర్తినివై యొప్పు నీయెదుట
మే మెంతవారము.

అరుంధతి—తల్లీ ! నీచేఁ గొనియాడఁబడినకారణంబున మేము
ధన్యులమైతిమి. నీకటాక్షరససమప్రసారంబుమాత్రముననే నిరుపేద
లైన సర్వసంపదలు గలుగునని వచింతురుగదా! అట్టిలోకైకశరణ్యాంబ
వగు నీతో ముచ్చటింపఁగలిగిన మాయానందమునకు నేఁడు మేరలేదు.

లోపాముద్ర—అంబా ! కాఱడవుల నేయాకుటింటిలోనో
కాపురముండి భర్తయే సర్వమనినమ్మి యాతనిపాదంబులఁ గొల్చుచు
నమాయకవృత్తిఁ గాలముగడపుచున్న మావంటి నిరుపేదలపై నీకిట్టి
యవ్యాజమైన యనురాగంబు గలుగుటకు మేము పూర్వభవంబున
నెట్టిపుణ్యమొనరించితిమో యెఱుంగము.

లక్ష్మి—నిఖిలదేవతాపురోహితుండగు వాచస్పతి సతియగు
నీతారారమణి దక్కఁ దక్కినమునిపత్నులందఱును భర్తలతోఁ దపో
వనంబులఁ దరుచుగఁ గృశించుచున్నమాట నిక్కమగును. కాని
సాధ్వికి జీవితేశ్వరునితోడిదలోకమని నమ్మి యట్లుండుటచేతనే
మిక్కిలి ప్రసిద్ధిఁగాంచఁగలిగిరి. స్వర్గంబునఁ గాపురముండి రాజభోగా
నుభవానందంబందినకతంబున మీయందఱయందును దారయే మిగుల
నదృష్టవంతురాలని యామెమొగంబు దిలకించుచు మందస్మితంబున
నర్మగర్భంబుగా వచించెను.

తార—(ఇంచుక మొగముజిట్లించుకొని) ఏమమ్మా ! నం
భర్త ఇంద్రుఁడా యుపేంద్రుఁడా ! రాజభోగానుభవంబు నాకెట్లుకలు

గును! దేవతలకందఱకును బురోహితమాత్రుఁడై వారి కనుస
న్నల మెలఁగుచున్న వానియిల్లాలనని నన్ను మీ రిట్లవమానపర
చుట యొప్పిదమేనా?

లక్ష్మి—(చిఱునవ్వుతో) తారాసతీమణీ! యింతలోనే నీ
కింతయలుకు గలుగవలయునా? మునీశ్వరులు భార్యలకు హితంబు
సేయుపొంటె యాత్మప్రభావంబునఁ జంద్రుఁడైనఁ గాఁగలరు ఇంద్రు
డైనఁ గాఁగలరు.

అహల్య—(తనలో) ఇంద్రుని పేరుచ్చరించుచు నీ శ్రీదేవి
నన్నుగూడ నెత్తిపొడుచుచున్నదిగదా. (తారతో) సఖీ! చూచి
తివా శ్రీదేవి సాహసము! అజ్ఞానమున నెన్నఁడో మనమిరువురము
నింద్రచంద్రసహవాసం బొనరించిన నీపద్దోషము నీమె యెట్లిచ్చట
సూచించుచున్నదో గ్రహించితివా? లేకున్న వారిరువురనామముల
నిందుదహరింపఁ బనియేమి? సమానులలో నేఁడు మనకిచట తలవం
పులు గలుగునట్లు బలుకుచున్న నీయుదధికన్య నేమనవచ్చును?

తార—నేను మొదటినుండియు నీలక్ష్మిచేష్టితముల గ్రహిం
చుచునేయున్నాను. అనసూయాప్రముఖుల నత్యంతము గౌరవించి
మననిరువుర నీమె యించుకయుపేక్షించియుండుట నీవు కనిపెట్టలేదా?
ఇట్టి తేలికబుద్ధిఁగలిగిన యీమెను బెద్దఁజేసి చూడవచ్చుట మనదే
తప్పని తలంతును.

అహల్య—తక్కినవారివలె మనముగూడ మోటుముస్తాబు
వహించియుండక దివ్యభూషణభూషితులమై చెలఁగియుండుట కీమె
యీర్ష్యవహించియున్నట్లు తోచుచున్నది. తనకన్న నెదుటివారు
మనోహరాకృతి నొప్పియుండుట కొందఱికిఁ గన్నెఱ్ఱగా నుండు
నందురు.

తార—నీవుచెప్పునది సత్యమేకావచ్చును. మొగమునిండఁ

బన పింతదట్టముగా నలందుకొని నుదుటఁ బట్టెడు కుంకుమబొట్టుఁ బెట్టి కొని చక్కఁగా దిద్దఁబడకుండుటచే నరజారుచున్నకొప్పునం దడవి పూవులం దుఱిమి ముకుదూల మూడునట్లు వ్రేలాడు నాసామణిం బూని బొమ్మకుఁ గట్టినట్లు చీరధరించి కొన్ని యనాగరకంపు నగలఁ దొడిగి చూపర కపహాస్యముగలిగించు వేసములనున్న తక్కినముని పత్నులవలె మనముగూడ నుండక శృంగారవేషంబుల నొప్పియుం డుట యీామె కిష్టములేకుండవచ్చును. దానికి మన మేమిచేయఁ గలము! పేదముదుసలి పేరంటాండ్రవలె నుండుమన్న మన మెట్లుండఁ గలము?

లక్ష్మి—(మందహాసముతో) మీారిరువురును రహస్యసంభా షణంబునకుఁ బూనియుంటిరేమి? మీాముఖములు దిలకింప మాపై నేద్దియో యలుకవహించుచున్నట్లు తోఁచుచున్నది. యథేచ్ఛగా మాటలాడుకొనుచున్న సమయంబున నలుకఁబూనుట సమంజసముగాదు.

తార—మహాభోగపరాయణులండ్రై యనేక చిద్విలాసభాసు రుండ్రై యనిర్వచనీయప్రభావసమేతుండ్రై త్రిభువనజేగీయమానుఁడగు యొడయని జెట్టపట్టిన యదృష్టశాలి సన్నిధికి విభూతిరుద్రాక్ష మాలికాధరులై యసదృశజటాకలాపభారులై యత్యంతఛాందస ప్రవృత్తులైయున్న భర్తలతోఁ గాపురముసేయుచున్న మేము దగుదు. మమ్మాయని యిందఱు దెంచుట హాస్యాస్పదముకాకుండునా?

అహల్య—(కోపముతో) వచ్చినందులకు మంచిపరాభవమే జరిగినది. ఇఁక మనమిక్కడ నుండఁబనిలేదు. వచ్చినదారిఁ బోయి చేతనయిన నిందులకుఁ బ్రతీకార మాలోచించుకొందము రమ్ము. (అని తారచేయిపట్టుకొని బిరబిరలాగికొని యవ్వలఁబోయినది.)

తక్కినమునిపత్నులెల్లఱును జరిగినదానికి మనంబులవగచుచు శ్రీదేవి యనుజ్ఞఁగైకొని నిజనివాసములకుఁ బోయిరి. రమాదేవియును

నహల్యాతారాసతులతోఁ దనకు నిష్కారణకలహము సంభవించినం దులకు, నెమ్మనంబున నుమ్మలికము జెందుచు నంతర్గృహంబునకుఁ బోయెను.

# ఇంద్రచంద్రుల శాపము

నాఁడు యథానిర్దిష్టముగ వైకుంఠమున జరుగవలసిన వేడుకలు జేయ మొదలుపెట్టిరి. ఈశ్వరుఁడుగూడ పార్వతీసమేతముగ నాఁటి యుత్సవదిదృక్షాపేక్ష వచ్చి సభనలంకరించియుండెను. ఇంద్రుఁడును జంద్రుఁడును దక్కఁ దక్కిన దేవతలెల్ల వచ్చి యర్హాసనంబుల నుపవిష్టులైయుండిరి. గౌతమబృహస్పతులుగాక తక్కిన దివ్యమునీంద్రసందోహమెల్ల నామందిరమున కేతెంచెను. కొంత సేపటికి యథోచితాలంకారభాసురులై లక్ష్మీనారాయణులు సభాస్థలంబునకు విచ్చేసి యందున్నవారికెల్లఁ గనుపండువయొనర్చిరి. పురోహితుండగు బృహస్పతి యంతవఱకు రాకుండుటచే నాదేవసభయందుఁ గొంతకలవరము ముదయించినది. తక్కినవారు రాకుండుటగూడ నెఱింగి యెల్లఱును విస్మయసందేహడోలాయమానమానసులై వారికై యెదురుచూచుచుండిరి.

ఇంతలో నారదుండు పరుగుపరుగునవచ్చి హతాశులమైతిమి. అనల్పముగుప్రమాదము సంభవించెను. నేటియుత్సవమున కంతరాయముగల్గినదని పల్కుచుఁ జేరువనున్న యాసనంబునఁ జదికిలం బడెను. వానిమాటల కెల్లరును నాశ్చర్యభయవశంవదులైరి. అప్పుడు కశ్యపుఁడు నారదునిసన్నిధి కేతెంచి యిట్లనియె.

కశ్య—నారదా ! నీమాటలు జాలభయవిషాదములఁ గలిగించుచున్నవిగదా. నేఁడేమిప్రమాదము సంభవించినది ? ఈయుత్సవమున కేమిమాటలంకిముదయించెను ? గౌతమబృహస్పతు లిందు

రాకుండుటకుఁ గతంబేమి ? ఇంద్రచంద్రు లేమైరి ? సత్వరము యథా ర్థమెఱింగింపుము.

నారదుడు—ఆర్యా ! వారు నేఁడు మహాక్రోధాభిమానులై యున్నారు. అనర్థము రాకమున్నే ప్రతీకార మాలోచింపవలసి యున్నది.

కశ్య—జరిగినవృత్తాంత మెల్ల సవిస్తరముగా నెఱింగింతువు గాక. ఊరక కాలయాపన మేమిటికి ?

నార—నేఁడు శ్రీదేవిం దర్శింప మునిపత్ను లెల్లఱును నామె సమక్షమున కేగిరి. అందాలోకమాతచే సహల్యాతారారమణు లవ మానింపఁబడిరఁట. వారిరువురును దమ విడిదెలకరిగి విచారమాన సులై యెవ్వరితోడను బలుకక తలగట్టుకొని పరుండిరఁట. అం దులకుఁ దహతహంబడుచున్న భర్తలతో నాముద్దుగుమ్మలు శ్రీ దేవిపై లేనిపోనినేరము లెన్నియో చెప్పిరఁట. దానికై యాముని యుగ్మము మండిపడుచుండెను. ఇంద్రచంద్రులు సన్నిధినుండి వారి క్రోధాగ్నినిఁ దమయవినయప్రసంగమునఁ బ్రజ్వలింపఁజేయుచుండిరి. వారి కోపమూలంబున నమ్మహాలక్ష్మి కేమియిక్కట్టు సంభవించునో యనుభయంబున నీయుదంతము మీకు నివేదింప నే నిందే తెంచి తిని. మీఁద మీరలెయాలోచింపఁ గర్తలని మిన్నకుండెను.

ఆమాటలాలించి చేరువనున్న నిటలాక్షుండు క్రోధతామ్రా క్షుఁడై యందున్నవారెల్ల భయకంపితులగునట్లు చంద్రదేవేంద్రుల నుద్దేశించి యిట్లనియె. ఏమి యీయింద్రచంద్రుల యసమంజసప్రవ ర్తనము ! సర్వలోకాధినాయకుండగు లక్ష్మీనారాయణునకుఁ బ్రియం బుగ నిందొనర్పవలసిన మహోత్సవంబు జూడ నిందఱు దేవతలు మహర్షులు వచ్చి వేచియుండఁ దామెచ్చటనో నిలచియుండుట హైన్యమని యేల వారికి దోపకున్నదో గ్రహింపఁజాలకున్నాను.

ధూర్తజాయాప్రకల్పితమహామాయావాగురాబద్ధహృదయరాజీవులగు గౌతమబృహస్పతు లందుమసలిన మసలియుందురుగాక. వారి ననుసరించి వీరందునిలిచి లక్ష్మికి ప్రతిపక్షులై బలుకఁ దివురుట సహింపఁ దగినదికాదు. ఇట్టి యవినయప్రవర్తనులు దేవలోకముననుండఁదగరు. అచిరకాలముననే వారిరువురును నరలోకంబునఁ గష్టపరంపరలం దగుల్కొని తమయవజ్ఞతకుఁ దగినఫలం బనుభవించెదరుగాక యని యింద్రచంద్రుల శపించెను.

పరమేశ్వరుని సామేననొప్పియున్న యార్యాణియును నట్టి యుత్సవసమయంబున శ్రీదేవితోఁ గలహించి యమాయకులగు భర్తలకుఁ గళంకమాపాదించిన యహల్యాతారారమణులను దేవలోకనివాసయోగ్యతలేకుండఁ బుడమిఁ బుట్టునట్లు శపించెను. విష్ణువక్షస్థలంబున నొప్పియున్న శ్రీదేవి పార్వతీపరమేశ్వరుల శాపవాక్యము లాలకించి కించిచ్ఛిన్నతాస్యభాస్వరయై యింద్రచంద్రులకతంబున నిట్టి దారుణశాపం బనుభవింపవలసివచ్చిన యామచ్చకంటులకు శాపగ్రస్తులైయున్నను వారిరువురసహవాసము వెండియు లభింపఁజేసిన నీ పరమేశ్వరిశాపంబు వరంబై సంతోషముగూర్చుఁ గావున నట్లయగుంగాక యని యనుగ్రహించెను. మఱియును భార్యల దుష్టప్రవర్తనంబు సైరించి వారిం బురస్కరింకొని యెదిరి తప్పెన్నుచున్న గౌతమబృహస్పతులు శాపకారణంబున రూపాంతరంబులువహించియున్న సతులకు మనఃప్రియులఁగూర్చుటయందు సహాయులై మెలంగెదరుగాక యని యూరకుండెను.

ఇట్లు దారుణముగా వారెల్లరును శపింపబడుట కాసభాసదులెల్లరును నిశ్చేతనులైరి. అప్పుడు నారాయణుండు ప్రశాంతవచనంబుల నిట్లనిరెను. ఎంతవారలకైన నొకప్పుడు ప్రమాదము సంభవించుట సహజము. ఈశుభదివసంబున నిచట జరుగనున్న మహోత్సవంబున

కానందంబున నేతెంచిన వారి కిట్లు ప్రమాదము సంభవించుటకు నా మనంబొప్పకున్నది. పార్వతీపరమేశ్వరులిడిన శాపంబును శ్రీదేవియాడిన మాటలను ద్రిప్ప నెవరితరంబగును. రూపాంతరంబుల నింద్రచంద్రుల కహల్యాతారాసతులయందుఁ బుత్రోదయంబగునలకే యీ శాపదోషంబు నిలువఁగలదు. సంతానముగలిగిన యనుక్షణమందే వారెల్లఱకును శాపాంతమై యథాస్థితిఁ గలుగఁగలదు. మఱియును చంద్రుండు లేకున్న నోషధులు వర్ధిలఁజాలవు. దానఁ బ్రజాసంరక్షణంబునకుఁ గొఱంతవాటిల్లును. కావున నీశాపఫలం బాకళానిధి యంశమాత్రమే యనుభవింపఁదగునని యనుగ్రహించెను. పిమ్మట నాయధోక్షజుండు నాఁటియుత్సవంబులెల్ల నిలుపుజేయించి దేవతలను మహర్షులను వీడ్కొల్పి లక్ష్మీసమేతుండై యంతర్గృహంబున కేగెను. పార్వతీపరమేశ్వరులు వృషభవాహనారూఢులై కైలాసమున కేగిరి. వాణీహిరణ్యగర్భులును గందినడెందంబులతో మరాళ మందయానంబున నిజమందిరమున కరిగిరి. తక్కిన సర్వబృందారకులును మునివృషభులును విన్ననగు మొగంబులతో నాసభామందిరము విడచి యదృచ్ఛాగతింబోయిరి. నారదుండు గౌతమబృహస్పతులున్న విడిది కరిగెను. అప్పటికి వారించుక శాంతచిత్తులై గతమునకు వగచుచు నాగతమునకు వెరచుచు మనోవైకల్యంబు మొగంబులఁ గనుపింప నొకచోఁ జదికిలంబడి దీర్ఘనిశ్వాసంబుల నిగుడించుచుండిరి.

నారదుండు మెల్లన వారి సన్నిధింజేరి ముకుందుని మందిరంబున జరిగిన వృత్తాంతమెల్ల పూసగ్రుచ్చినట్లు వారికి విశదపరచెను. తమకుసంభవించిన శాపదోషంబువిధంబెల్ల నాలకించి మించినవిచారంబున వారు హాహాకారంబులు సేయఁదొడంగిరి. ఆదేవమౌనియును వారి నుచితవచనంబుల నూరడించుచు మఱియు నిట్లనియె. పూజ్యులారా! విధివిధానంబు ననుభవింపక యెంతవానికైనఁ దీరదు. కాని

శ్రీదేవి యిడినశాపంబు చాల కుచ్ఛితముగానుండెను. ఇదొక్కటియే నామనంబును వేధించుచున్నదని వారి కాలక్ష్మీదేవిపై యీర్ష్యజనించునట్లు పలికి యూరకుండెను.

అప్పుడు గౌతముఁడు క్రోధఘూర్ణితవదనుండై యేమేమి !! ఆశ్రీదేవికి మే మంతచేతకానివారముగాఁ గాన్పించితిమికాఁబోలును. ఆమె మమ్ము తాపసులమని, విభూతిరాయులమని జటావల్కలాజినుల మని ముదుసల్లమని మఱియు నెన్నో విధంబుల మునిపత్నుల సమక్ష మందు మిగుల నధిక్షేపించిన పాపకారణంబున మముబోలు మునీంద్రునిమూలంబుననే పుత్రుంగాంచి యపయశంబుగాంచుగాక యని ప్రతిశాపంబిడెను. అందులకు నారదుండు సంతసించుచు దేవేంద్రుండు జన్మాంతరంబున నాశ్రీదేవికే తనయుఁడై జనియించి రూపాంతరంబున నీకుఁ బరమాప్తుఁడై యుండఁగలవాఁడు. అని వెండియు నిట్లనియె. శ్రీదేవి మీయిరువుర నరకలోకంబునఁ బుట్టునట్లు శపించియుండలేదు కావున మీరు దేవలోకములయం దెచ్చటనైన జన్మించవచ్చును కాని మనుష్యలోకంబున శాపమూలంబునఁ గష్టపరంపరలం బడు నింద్రచంద్రులతోఁ గొంతకాలము సహచరులై యుండుటమాత్రము తప్పదని పలికెను.

అప్పుడు బృహస్పతి ఖిన్నమతియై యాహా ! ఎంతవిపత్తు సంభవించినది ! శాపమూలంబున నరలోకమందున్న పత్నులను మఱొకరికిఁ గూర్చుటయే మాపనియా ! అట్టి యవమానము మాకు గలుగకుండునట్లాయిరువురురమణులు నరకలోకమునఁ గాక యధోలోకంబున జన్మింతురుగాక యని యూరకుండెను. నారదుం డామాటలకు మందస్మితంబొనరించుచు నార్యా ! శ్రీదేవిశాపం బమోఘంబు. అధోభువనంబునఁ బొడమినను దిరుగ నూర్ధ్వలోకంబున జన్మించినను వారి కింద్రచంద్రుల సంఘటనము నరలోకంబునఁ దప్పదుగదా? యని వచించు నారదునకు బృహస్పతి యిట్లనియె.

నారదా! నీమాటలమూలమున నాయిరువురుతరుణులు నధో లోకంబునను నూర్ధ్వలోకంబునను గూడ జన్మింపవలెనని పొడగట్టుచున్నది. దైవవిధి దురతిక్రమణీయము. ఏది యెట్లు జరుగనున్నదో యట్లె యగుంగాక యూరక వగవనేమిటికని పలికెను. పిమ్మట తమ యవినయంబుకతంబునం బుట్టిన యనర్థంబుల విని యహల్యాతారారమణులు మిగుల విచారించిరి. వారి నుచితరీతిని ననునయించి నారదుండు యథేచ్ఛాగతింబోయెను. పిమ్మట నెల్లరును నిజనివాసంబుల కరిగిరి.

---

323 వ మజిలీ.

# పుండరీకునికథ

దేవలోకంబున శ్వేతకేతుండను మహాముని గలండు. అమ్మహానుభావుండు దివిజగంగాసరిత్తీరంబున నాశ్రమంబు గల్పించుకొని తపంబాచరించుచుండెను. ఒక్కనాండమ్మునిముఖ్యుండు మందాకినీస్నానంబొనరింప నేగి యందలి వికసితసరోజాతంబుల దేవపూజకై కోసి తెచ్చుట కాజలంబులందిగెను. ఆసమయంబునం గమలవనంబున సన్నిహితయై వేయిఱేకుల తమ్మిగద్దియపైం గూర్చుండియున్న లక్ష్మీదేవి యామహానిసత్తము నీక్షించి గౌతమశాపమూలంబునం జిత్తచాంచల్యము నొందెను. దర్శనమాత్రంబుననె సమాగమసౌఖ్యంబందిన యామెకు సద్యోగర్భంబున నప్పుండరీకమందు పుత్రోదయంబయ్యెను. అప్పు డద్దేవి యాపుత్రకు నెత్తుకొనివచ్చి మునీంద్రా! వీఁడు నీతనయుండు. వీనిం గ్రహించి సంరక్షించుకొనుమని వచించి యబ్బాలకు నాశ్వేతకేతున కొసంగెను. పుత్రసంభవంబుమాత్రంబు

ననే యామెకు శాపాంతమగుటయును జరిగినదానికి మనంబున లజ్జించుకొనుచు న్నాశ్రీదేవి యంతర్హితురాలయ్యెను.

పిమ్మట శ్వేతకేతుండు తనూజలాభంబునకంతరంగంబున సంతసించుచు నబ్బాలకుని నిజాశ్రమంబునకుం గొనివచ్చి పుండరీకంబున సంభవించినకారణంబున వానికి పుండరీకుఁడని నామకరణంబొనర్చెను. అబ్బాలకుం డమ్మునీంద్రుని సంరక్షణావిశేషంబున దినదినప్రవర్ధమానుండగుచుండెను.

దేవలోకముననే యొకమునిదంపతులకు గౌతముఁడు శాపమూలంబునఁ గపింజలుండను పుత్రుండై జన్మించెను. వానిని తలిదండ్రులుపనీతునొనర్చి విద్యాభ్యాసంబునకై శ్వేతకేతునియొద్దకుఁ బంపిరి. పుండరీకునితో సమవయస్కుండగు నాకపింజలుని దనయాశ్రమంబునందే యుంచికొని పుత్రునితో వానికి సకలవిద్యలును నేర్పుచుండెను. పుండరీకకపింజలు లత్యంతమైత్రి గలిగియుండిరి. ఉపదేశికుని ప్రభావంబున నబ్బాలకు లచిరకాలంబుననే సర్వశాస్త్రములయందును ప్రవీణులైరి.

ఇట్లుండ నొకనాఁడు నారదుండు శ్వేతకేతుని యాశ్రమంబునకేతెంచెను. అందాబాలకుల నిరువుర నీక్షించి మందహాసమొనరించుచు నమ్మునిపుంగవునితో నిట్లనియె.

నార—మహాభాగ! ఈకుమారులిర్వురును భవదీయశిష్యులుగావలయును. శాస్త్రము లెంతవఱకు పఠించిరి?

శ్వేత—పుండరీకుఁడను నీబాలకుండు నాపుత్రుండు. రెండవవాఁడు విద్యాభ్యాసమునకై వచ్చియున్నవాఁడు. వీరు సర్వశాస్త్రములఁ బఠించిరి. కోరికగలదేని యెందైనఁ బ్రశ్నింపవచ్చును.

నార—ప్రశ్నింపనగత్యములేదు. శాస్త్రములన్నియును వీరి ముఖములయందుఁ బ్రతిఫలించుచుండెను. కాని యొక్కసందియము

గలదు. ఆగ్రహము రాకున్నఁ దెలియఁబల్కెదను.

శ్వేత—ఆగ్రహమేల? నీసందియము తప్పక తీర్చుకొనవలసినదే!

నార—మహాత్మా! బ్రహ్మచర్యదీక్షచేఁ బ్రసిద్ధికెక్కియున్న నీకీపుత్రకుం డెట్లుగలిగెనో వినఁగుతూహలముగుచున్నది. నే నెఱుంగఁదగినఁ జెప్పఁ బ్రార్థించెదను.

శ్వేత—ఆవృత్తాంతము గొంత గూఢమైనది. కాని నీసందియము బాపుటకై ప్రధానాంశమునుమాత్రము జెప్పెద వినుము. మందాకినీతీరంబునఁ బుండరీకమధ్యమందు నాకబాలకుండు లభించెను. కావుననే వీనికి పుండరీకుండను పేరుబెట్టితిని. వీని నప్పటినుండియును బుత్రప్రాయునిఁగా నీయాశ్రమంబుననే పోషించుచు విద్యాబుద్ధులఁ గరపితిని.

నార—బాగు. బాగు. ఈకుమారుని ముఖమునఁ బ్రభుపసంబులఁ బొలింపఁదగు చక్రవర్తిలక్షణంబులు పెక్కులు గనిపించుచున్నవి. వీని నీయాశ్రమంబున మునివృత్తియందుంచుటకన్న లోకసంరక్షణంబునకు వినియోగించుట యుచితమని నాతలంపు. మీాద మీాచిత్తము.

శ్వేత—ధనుర్వేదమందుఁగూడ నితండు కుశలుఁడయ్యెను. కాని పరిశ్రమకొరవడియున్నది. అందులకై వీని నెచ్చటికైనఁ బంపవలెననియే నేనునుఁ దలంచుచుంటిని.

నార—అట్లయిన వీని నావెంటఁ గొనిపోయి ధనుర్విద్యాపరిశ్రమంబున కనువగుచోట సుశిక్షితునింజేయించెద ననుజ్ఞయిప్పింతురే యని యడుగుటయు శ్వేతకేతుం డందులకానందించి పుండరీకుని వానితోఁ బంపుటకు సమ్మతించెను.

ఆదేవమునీంద్రుండు శ్వేతకేతునాశ్రమంబునఁ నాదినంబుగడపి

మరునాఁడు పుండరీకునిఁ దోడ్కొనిపోవనున్న సమయంబునఁ గపింజ లుఁడుగూడ వారివెంటఁ బయనమయ్యెను. కాని వానితల్లిదండ్రుల యనుమతంబు బడయకుండఁ దమవెంటఁ దీసికొనిపోవుటకు నారదుం డంగీకరించలేదు. కపింజలుండును బుండరీకునియందుఁ దనకుఁగల మైత్రివలన వాని నెడఁబాసియుండఁజాలక తన తల్లిదండ్రులయనుజ్ఞఁ గైకొని వెంటనే వచ్చెదనని జెప్పి యందుండివెడలిపోయెను. అప్పుడు నారదుండు శ్వేతకేతుననుజ్ఞఁ గైకొని పుండరీకునితో సటఁగదలి సకలదేవతాలోకంబులఁ దిరుగుచు నందలివిశేషంబులు వానికి జూపుచుఁ గ్రమంబున భూలోకమున కేతెంచెను. అందుఁగల పుణ్య తీర్థంబులెల్ల వానికిఁ జూపించుచు వానివానివిశేషంబుల సంగ్రహ ముగా నెఱంగించుచుఁ జివరకు భారతవర్షంబున దక్షిణాపథంబున నున్న పావనగోదావరీ సరిత్తీరంబున కేతెంచి యమ్మహానది యందుఁ గృతస్నాతులై తీరంబున కేతెంచుచున్న సమయంబునఁ బ్రాంత మందు జనుల కోలాహలంబు వినంబడెను.

దానికి వారు వెరఁగందుచుఁ జూచుచుండ నొకదండనుండి వేదండంబొండు పటిరియంబున వారున్నవైపునకు వచ్చుచుండెను. దాని ననుసరించి యపరిమితసేనాసముదయం బరుదెంచుచుండెను. ఆవేదం డంబు తిన్నఁగాఁ బుండరీకుండున్నచోటికి కేతెంచి నిజశుండాదండం బెత్తి యందిమరింపఁబడియున్న మణిహార మాపుండరీకుని మెడలో వైచి యతిసంతోషసూచకముగ ఘీంకారమొనర్చుచు వానిచుట్టుఁ దిరుగు చుండెను. ఇంతలో వెనుకవచ్చు పరివారము జయజయనినాదములతో సమీపించిరి. ఈయద్భుతసంభవమును గాంచి నారదమునిచంద్రుండు మందహాసమొనరించుచుండెను. అమ్మణిహారప్రశోభితుండగు పుండరీ కుండు పుండరీకాక్షు ననుకరించుచుండెను. అప్పుడు రాజపరివారము నండి ప్రధానామాత్యుండు సకలరాజచిహ్నములంగైకొని ముందునకు

వచ్చి పుండరీకు నాశీర్వదించుచు నిట్లనియె.

ఉ. కుంతలభూపుఁడీల్గఁగనె కొంకక నిశ్శోకయోగ్యుఁ బట్టపుం
దంతియెఱింగి గూర్చుట విధాయక మీయెడఁ గావునన్ గరా
భ్యంతరసంగృహీతమణిహారముతో సరుదెంచి నిన్నె భూ
కాంతునిగా వరించెఁ గడకన్ గరిరాజట మాటలేటికిన్.

కుమారా ! నీముఖంబున సర్వవసుంధరారాజ్యరమాసమోపభోగార్హంబులగు చిహ్నంబు లనేకంబులు పొడఁగట్టుచున్నవి. నీ రూపంబు త్రిభువనాసేచనకంబుగ నెగడియున్నది. నీయాదేశానుసారంబుగ మేమెల్లరము మెలంగఁగలము. అసమశోభావిభూతిచే సతిశయిల్లు ప్రతిష్ఠానపురమందు భద్రసింహాసనారూఢుండవై యీ కుంతలరాజ్యపరిపాలనం బొనర్పుము. నృగసగరభగీరథాదియాదిమ భూపాలకుల కీర్తివిత్తాపహర్తవై పయోధిపులినసంక్రాంత విక్రమక్రముండవై విపక్షభూపాలసంపదాపహర్తవై ముజ్జగంబులచేఁ గొనియాడఁబడుచుండుమని దీవించుచు నామంత్రిముఖ్యుండు రాజోచిత వస్త్రాభరణంబు లప్పుండరీకుని మ్రోలఁ బెట్టెను.

నారదమునీంద్రుని యాదేశంబునఁ బుండరీకుండు సకలరాజ చిహ్నంబుల ధరించి యపరపుండరీకాక్షునివలెఁ బ్రకాశించుచుండెను. పమ్మట నయ్యుపవాహ్యంబు నధిష్టించి మహావైభవంబునఁ బ్రతిష్ఠానపురప్రవేశం బొనరించి యందు రాజభవనంబున విడిసి శుభసమయంబున మంత్రిసామంతహితపురోహితప్రముఖప్రకృతివర్గము పరివేష్టింపఁ గుంతలరాజ్యసింహాసనాధిష్ఠితుండయ్యె. ఇట్లుండ నొక నాఁడు నారదుం డేకాంతగృహంబున నప్పుండరీకునితో నిట్లనియె.

వత్సా ! పరమేశ్వరానుగ్రహంబున నీకుఁ దగినపదవి లభించెను. ఇకఁ గుంతలరాజ్యరమాపరిష్వంగవిశేషంబున నీ కనన్యదుర్లభం బగుసుఖం బొనఁగూడఁగలదు. నేనిందుండరాదు. తరుచు వచ్చి నీ

క్షేమమరసిపోవుచుందును. నీ కేలోపమును రానేరదు. నీజనకునివలన నభ్యసించిన 'ధనుర్విద్యావైశారద్యంబెల్లఁ 'దెల్లమగునట్లు సర్వదిగ్విజ యం బొనర్పుము. శుభంబులంబొందుము. పోయివచ్చెదనని బల్కి వాని యనుమతంబువడసి యద్దేవమాని యథేచ్ఛాగతిఁబోయెను.

పుండరీకుండట్లు కుంతలభూపరివృఢుండై యథాన్యాయంబునఁ బ్రజాపరిపాలనం బొనరించుచుండెను.

గీ. వాని వక్షస్థలంబు లక్ష్మీనివాస
యోగ్యముగఁ దనరె ముఖమహోత్పలాంత
రమున నుచితగౌరవపీఠమమరె వాణి
కుభయులను నొక్కచో నిల్పి యొప్పె నతఁడు.

అతండు దివ్యతేజోవిరాజితుండైనను సూర్యునివలె ననేక కరప్రయోగసంతాపితమండలుఁడు కాలేదు. శీతాంశునివలె నపరోద యంబున వక్రత్వమునుఁ బొందలేదు. సప్తార్చివలె దహనవ్యాపారంబు న విభూతి నుత్పాదింపలేదు. దీపికవలెఁ బాత్రోపరిఁ బ్రజ్వలించుట లేదు. మాణిక్యమణివలె సువర్ణబంధంబున నాయకత్వము వహించి యుండలేదు.

శా. ఆరాజేంద్రుభుజాసిముఖ్యము ప్రతాపాంతర్విహారాత్తి వి
స్తారంబందున గ్రీష్మతీవ్ర, మరిరాడ్దారాశ్రుధారాసమా
సారంబొప్పఁ బ్రవర్షణంబు, తుహినచ్ఛాయావిరాజద్యశ
స్సారాప్తిన్ శిశిరంబు, నిట్లొకటఁ దేఁ జాలున్ద్రికాలంబులన్.

మఱియు నతండు సుశిక్షితసేనాసమగ్రుఁడై విశేషవిజిగీషుఁడై భుజబలంబున నల్పకాలంబుననే నఖిలదిగ్విజయంబొనర్చి విజయనిశితాసిచే విపక్షక్ష్మాపాలవంశనిర్మూలనం బొనరించి మించెను. అప్పుండరీకపార్థివుండు ధర్మంబునఁ గలికాలప్రాబల్యంబు నిరసించుచు, సుగుణంబుల నఖిలసాధులోకంబును రంజింపఁజేయుచు, వినయంబున గురు

జనుల సన్మానించుచు, క్రమాగతానుజీవిసామంతచక్రమును బ్రసాదంబున నభినందించుచు, బ్రకృతిజనంబు ననురక్తి నాదరించుచు, చతురంభోధివలయాలంకారమై యనన్యభోగ్యమై యేకాతపత్రశేఖరమై యెసఁగు వసుంధరారమాసామ్రాజ్యసింహాసనంబున సుప్రతిష్ఠుఁడై యుండెను. ఆతనికి విభూతివర్ధనుండనువిప్రకులసంజాతుండు మంత్రియై సకలరాజకార్యంబులఁ గ్రమంబున నిర్వర్తించుచు రాజున కత్యంతాప్తుఁడై మెలంగుచుండెను. ఇట్లు పుండరీకుండు కుంతలరాజ్య పరిపాలనం బొనర్చుచు నత్యంతసంతోషస్వాంతుఁడై కాలంబు గడపుచుండ సర్వజగదాప్యాయనవిశారదయగు శారదసమయం బేతెంచెను.

గీ. అంబుధరపంక్తి విష్ణుపథంబునందు
వివిధపాండురవర్ణశోభితము నయ్యె
వయసుమీరఁగ ధవళభావంబునందు
వృద్ధునిశిరోజపుంజంబు విధముగాఁగ.

శా. లీనాతిస్థిరమా చకోరతరుణీలీలేక్షణాశోణిమ
శ్రీనింపారెడు బంధుజీవకుసుమశ్రేణిక్ ద్విరేఫాంగనల్
ఆనందంబున నూత్నధాతుపటమందంతర్మషీలిప్తపాం
థానుస్యూతకథాక్షరావళివిధంబై విభ్రమించెక్ సదా.

అట్టి యుత్కృష్టశరత్సమయమం దొకనాఁటి యుదయంబున నాభూజాని నిజాస్థానమండపముం బ్రవేశించి సువర్ణసింహాసనంబు నధిష్ఠించి సుఖోపవిష్టుఁడై పృథుభరతభగీరథాది పూర్వభూపాలచరితోపన్యాసకు లగు మంత్రులతోడను, దుర్దమారాతినిగ్రహవార్తానివేదకు లగు సామంతులతోడను, బాణభట్టాభినందప్రభృతి కవిచక్రకలితావరిష్టగోష్ఠీవినోదకులగు కవీశ్వరులతోడను, ప్రమాణశాస్త్రోపన్యాస విభ్రములగు తార్కికులతోడను, పరిహాసమిశ్రితాలాపకౌశలు లగు నర్మసహచరులతోడను నతం డమందానందకందళితహృదయారవిం

దృష్టియై యున్నసమయంబునఁ బ్రతీహారి యరుదెంచి జానుకరకమలం బులు పుడమిసోఁక మ్రొక్కుచు నిట్లనియె.

దేవా! పలినవారికి మిత్రుఁడు లీలోద్యానపాలకుఁడు వసంత శీలుఁడు దేవరదర్శనార్థియై వచ్చి ద్వారంబున నిరీక్షించి యున్న వాఁడు. మున్నలయే యనిన తోడనే యారాజేంద్రుండు మాయానతి, నాభీరదేశమండలి నందావటమను పురంబునకు నుద్యానపాలకుఁడుగాఁ బోయి యతండు జిరకాలమున కేతెంచినాఁడు. సత్వరము ప్రవేశ పెట్టుమని వాని కానతిచ్చెను. పిమ్మట ప్రతీహారిచే రాజాజ్ఞ నెఱింగి వసంతశీలుఁ డతివేగంబున స్వామిసన్నిధి కేతెంచి యథార్హవంద నాదికం బొనరించిఁ దాఁ గొనితెచ్చినఫల మొకటి యుపాయనముగ నారేనియెదురఁ బెట్టెను.

ఆఫలము గైకొని "వసంతశీలా! వచ్చితివా" యని యాద రించు ప్రభునితో దేవా! అత్యద్భుత మగువిషయము దేవరవారి కెఱింగింప నిచ్చట కేతెంచితి నని యారేనిసమీపమున నుపవిష్టుఁ డయ్యెను. పుండరీకుండును రసాంతరతరంగితాంతరంగుఁడై విశేష మేమో సత్వరము వచింపుమని యనుటతోడనే వసంతశీలుఁ డిట్లని చెప్పఁదొడంగెను.

ప్రభువరా! వసుంధరారమణీదేవికి నూతనశృంగార మాపా దించు శరత్కాల మేతెంచినతోడనే దేవరయానతి నాదలంబూని నవోద్యానకార్యతత్పరుండనై నందావటపురంబున కఱిగి యొకనాఁటి వేకువను శరత్కాలసంపదలచే నొప్పు నుద్యానవనంబున కేగితిని. అచ్చట పల్లవకుండను సేవకుఁడు నీరుఁ దోడు జలయంత్రముల నమ రించుచు నతివృష్టివిఘటితములగు బోదుల సరిజేయుచుండెను. నీరు నిండుటచే కొట్టుకొనిపోయినపాదులు జక్కపరచుచుండెను. మండప ములయందు నైకదిగ్భాగములచే వంగిఁ గ్రిందుకు జాఱిన లతావితా

నంబుల యథాస్థితిం బొందుపఱచుచుండెను. అరఁటిచెట్లయందు ప్ర
లాడు సొరుగెల్ల ఖండించివైచుచుండెను. ఝంఝామారుతము చే
గొట్టుకొనివచ్చి వనస్పతులయందుఁ జిక్కుకొనియున్న ముండ్లగుత్తు
లెల్లఁ దీసిపారవైచుచుండెను. అప్పుడు నే నతిజాగరూకతతో ప్రతిలతా
మండపమును,ప్రతిపాదపమును, ప్రతివిటపమును,బరిశీలించుచు నందం
దలి జలాశయంబులను నందలిపద్మంబులసౌందర్యంబును బరికించుచు
నాయుద్యానవనరామణీయకంబునకు సంతసించుచు మిగిలి యున్న
పనుల నెల్ల సత్వరము నెరవేర్పుమని పల్లవకుని నియోగించి మఱలి
పోవుచుంటిని.

అట్లు నేనొంటిగనె నిశ్చింతగ మంధగమనంబున నరుగుచు
నెండచే శ్రమపడి చల్లనిప్రదేశమున కేగనెంచి పురపరిసరోపాంత ప్ర
దేశంబున నొకసుందరమగు బౌద్ధమందిరముం గాంచి దానివెలుపల
నున్న వితర్దికపైఁ గూర్చుంటిని. అందుఁ గొంతవిశ్రాంతిని బొంది
స్వతంత్రావలోకనంబుల నిటునటుఁ బరికింప నోదేవా! ఏమి చెప్ప
దును? నే నుదయంబున నుద్యానంబున కేగునప్పుడు స్ఫటికసృష్టివరి
పాండురంబై కనంబడిన యాచైత్యము నా కప్పు డింద్రనీలశిలావినిర్మి
తంబైనట్లు హరితవర్ణంబునఁ గనంబడెను. దానికి నేను వెఱఁగు
పడుచు నెడద ననేకవిధంబులఁ దలంచుచుండ నందుండి నా కిట్లు
వినంబడెను.

గీ. ఎంతచిత్రంబుగా నుండె నెంచిచూడ
లలితగుణమైనఁ గ్లేశమూలంబు నయ్యె
నెందు విశ్రాంతిలేదు దేహికి నిజంబు
యేమిచెప్పుదు నింక సంసృతివిధంబు.

అందులకు నే నక్కజంపడుచు నాపల్కులు వినంబడినవై పు
జూచుచుండఁగనే యాచైత్యగర్భమునుండి యొకభిక్షు [illegible]

తచ్ఛిఖరము నధిష్ఠించెను. తోడనే యామందిరము యథాపూర్వము గ స్వచ్ఛకాంతులం బరగెను. ఆశుకమునకు జాతివిరుద్ధముగం దలపై శిఖ యొండు గలదు. అది చూచి నే నాశ్చర్యపడుచు నిట్లని తలంచితిని. ఏకఖండేందుకాంతశిలానిర్మాణంబున నొప్పి నీరంధ్రసంధిగర్భంబగు నీచైత్యమునం దెట్లీశుకము ప్రవేశించి పైకి రాగలిగినదో కదా! ఇయ్యది లోన నుండుటచేతనే యీచైత్య మట్లు హారితవర్ణంబున నొప్పారెను. ఇంతకమున్ను విన్న గంభీరార్థసూచితంబు లగు పలుకు లీశుకసత్తమము వచించినవియై యుండనోపు. దీని యౌదలం గల శిఖయే దీని యుత్కృష్టతను సూచించుచున్నది. ఇట్టి వింత శకుంతమును మహారాజున కర్పించిన నుత్తమముగా నుండునని దలంచుచు చూచుచుండగనే య వ్విహంగ మా చైత్యశిఖరంబున నుండి క్రింద వ్రాలి యందలి మూలమణిపీఠకుట్టిమంబున నిటునటు తిరుగాడం దొడంగెను. అప్పుడు నేను దానిని పట్టుకొనంగలుగుదు నను నాసతో నవనమితగాత్రుండనై యలక్షితపదప్రచారుడనై దాని సన్నిధి కేగి చేతితో పట్టుకొన నుంకించినంత నది నాకు చిక్కక పైకెగిరిపోయి కొంతదూర మందున్న యొకవృక్షశాఖపై వ్రాలెను. ఆయద్భుత శకుంతము నెట్లైనను పట్టుకొని మహారాజున కర్పించుటకు కృతనిశ్చయుడనై నేను దాని వెంటాడుచు నాపక్షితో నొకచెట్టునుండి మఱొకచెట్టునకు తిరుగుచుంటిని. అదియును నొకచో భూమికి దిగుచు నేను సమీపించినవెంటనే పై కెగయుచు నిముసమాత్ర మాగుచు మరియొకచో నేలపై వ్రాలి వెంటనే పై కెగురుచు నింకొకచో చేతికి చిక్కినట్లై యుండి పారిపోవుచు నిట్లాదిన మంతయు గడపెను. నేనును మార్గామార్గము లెఱుంగక దానివెంటం బరువెత్తుచుంటిని. ఇట్లు క్రమక్రమంబున న న్నా శకుంతము దురంతారణ్యమధ్యంబునకుం గొనిపోయి వనతరుశిఖర శాఖాశతాంతరంబున నదృశ్యమైనది.

## 324 వ మజిలీ.

# పామరుని కథ

అప్పుడు నేను దానికొఱకై విచారించుచు నందందు వెదుకఁ జొచ్చితిని. అందుఁ గనంబడిన యరుణకుసుమకళికం గని యాచిలుక చంచువని భ్రమఁ జెందుచు, హరితఫలగుళికంగాంచి దానిమౌళియని దలంచుచు, ప్రచలితవినీలతరుదళంబులఁ జూచి దానిపక్షకాండములని మోసపడుచు, వికటార్కఫలకోశముదిలకించి దానియంగయష్టి యని సంశయించుచు, పైనెగురుచున్న యన్యశకునిపక్షపుటపుటారావంబు విని యాచిలుకయే యెగురుచున్నదని శకించుచు నావిపినమంతయుఁ బరిభ్రమించితిని. పిదప నావిపినాంతమును ఖండితాశుఁడనై చేరి చేయు నది లేక విచారించుచున్నసమయంబున సమీపంబున నవిరళతరుసరళ కాంతారమునుండి యనేకవిహంగారవకోలాహలంబు వినిపించెను. అంతట నాశుకము లభించునను నాశ మనంబునఁ దిరుగఁ జనింప యా పక్షులపిం డున్నదిశ కేగితిని. అందు ముం దతినిర్మలజలప్రవాహ పరిశోభితంబై యుష్ణాంశుని తనయయని వినుతి కెక్కిన తాపియను సరిద్వరంబు నేత్రపర్వం బొనరించెను.

గీ. ఆమహాధునీముఖ్య ముష్ణాంశునాత్మ
జాతయైయున్నఁగాని తజ్జలము మిగుల
సామ్యతను గాంచె శీతాంశు శైత్యతా వి
శేషమున కందు మదికి నచ్చెరువు గొలుప.

ఆనిర్మలతరంగిణీసందర్శనంబొనర్చి ఆహా! నందావటపురంబు నుండి యెంతదూర మేతెంచితిని! ఇచ్చటి కప్పురంబు పదియోజనంబులదూరములో నున్నదందురని తలంచుచు నానది యుభయతటంబులఁగల వృక్షశాఖల విమర్శించుచుఁ దిరుగుచుండ భువనైకచక్షుం

డగు నాదిత్యభగవానుఁ డపరదిక్కున కేగెను. అప్పుడు నేను వృథా
శ్రమపడి యంతదూరము వచ్చినందులకు విషాదము జెందుచు మదీ
యావిమృశ్యకారిత్వంబునకు పశ్చాత్తాపంబునొందుచు నిట్లు వితర్కిం
చుకొంటిని. ఔరా! పక్షికొరకు నే నెంతమూఢుఁడనైతిని. సాధ్యా
సాధ్యముల విచారింపక దిరుగువారు నావలెనే యిట్లు విఫలమనో
రథులగుచుందురు. పక్షులకు ఖేచరగమనముండుట నే నెఱుంగనా?
నేను ఖేచరుండనుకానుకదా! దాని నెట్లనుసరించిపోగలను? పాశబం
ధాది సదుపాయంబులఁ బక్షులఁబట్టుటఁ దగుఁగాని వానితో నెగిరి
పట్టుట మానవున కెట్లు సాధ్యమగును? ఇచ్చటఁ జేరువ నెద్దియునుఁ
బల్లెయైన నున్నట్లు కనుపింపదు. నిమేషములోనే యీదినాంతమగు
చున్నది. రాత్రి చీకటిలో నేకాకినై మార్గవిభాగం బెఱుంగఁజాలక
యంతములేని యీవిపినప్రయాణ మొనర్చి నే నెట్లు తిరిగిపోఁగలను?
అని యిట్లు డోలాయమానమానసుండనై మందగమనంబున నాసరి
త్తీరంబున నెదురఁగనంబడిన మార్గంబున నడచుచుండఁగా ముందొక
పొలములో వరికళ్లముసమీపమున నొకకుటీరముంగాంచి యతిహర్షం
బున దానిం జేరితిని. అందెవ్వరును లేరు. అం దొకచో గడ్డిపడక
యును పచనపాత్రిలును బ్రొయ్యియు నుండుటఁ దిలకించి
యందెవ్వరో నివసించియుండునట్లు నిశ్చయించి వారిరాకకై నిరీ
క్షించి తద్ద్వార బహిఃప్రదేశంబున నుపవిష్టుఁడనై యుంటిని. ఇంతలో
స్థూలదేహముగలిగి నర్భవలితమగు త్రాటితో బిగింపఁబడిన పరిధా
నము వహించి చినిగిన ప్రాతకంబళి మూపున ధరించి చేతియందొక
యూతకోలఁ బట్టుకొని తలపైఁ నతిభారమగు గడ్డిమోపు బెట్టుకొని
యొకమోటుమానిసి నన్ను సమీపించెను. మఱియు వాని వామకరం
బున మోదుగునారచే చరణములు గట్టఁబడియున్న యాశుకశ్రేష్ఠము
నాకు నేత్రపర్వంబొనర్చెను. దానింగాంచి మృతోజ్జీవితుఁగన్నరీతి నే

నత్యంతానందమందితిని. ఇంతలో! నాపామరుండు తలపైనున్న గడ్డి మోపును గుటీరద్వారప్రదేశమునఁ బడవైచి దానిని లోనికిఁజేర్చి యాసమీపముననే యాచిలుకను బంధించి బైటకేతెంచి మూపుపై నున్న కంబళీఖండమును నేలమీదఁ బరచికొని నాసమీపమునఁ గూర్చుండి పళ్లు బిగించి రెండుచేతులతోఁ దలఁ గోకికొనుచు సోదరా! యేగ్రామమునుండి నేఁడిచ్చటికేతెంచితివని నన్నడిగియు నంతలోఁ దలగోకికొనుటవలనఁ గలిగినసుఖంబున సీత్కారమొనరించుచుఁ జేరువ పొలములోఁబడిన పశుల నదలించునెపంబున హాకాకారవంబుజేయుచు నడిగినమాటలే మఱల నడుగుచుఁ దనగ్రామేయక స్వభావంబున నామనంబునకు మిగుల విసువుబుట్టించెను.

అప్పుడు నేను వాని యవినయమును సహించుకొని స్వకార్య నిర్వహణతత్పరుండనై యిట్లని తలంచితిని. గ్రామ్యజనులు సహజముగాఁ బొగడికలకు వశ్యులగుదురు. వీనిని మంచిమాటలచేత లోఁబరచుకొని యీరాత్రియిందు సుఖముగాఁ గడపెదను. మఱియు నిందుండి యీశకుంతము నీతఁడేమిచేయునో చూచెదను. ఈచిలుక వీనికెట్లు లభించెనో తెలిసికొందును. ఏయుపాయముననైన నీవి కిరవరంబును వీనివలన సంగ్రహించెదఁ గాక యని నెమ్మనంబునఁ గృతనిశ్చయుండనై యందులకుఁ దగినరీతి మాటలాడుచు వాని కానందమొసగూర్చితిని.

ఆయమాయకుఁడు నాయందుఁ బ్రసన్నుఁడై రాసభాశ్రయోచితమగు నౌచిత్యమును బ్రదర్శించుచు నందొకమూల గడ్డిచుట్టపై నున్న యన్నపుకుండను గొనివచ్చి యందున్న జొన్నన్నమును పుచ్చకాయకూరతోఁ బెట్టి యుచితరీతిని నాకాతిథ్యగౌరవంబొసంగెను. నాటియుదయమునుండియు నాహారములేకుండుటచే మిగుల నాకలిగొని యున్న నే నాగోపాలహాలికుండొసంగిన భోజనము నమృతమయా

హారమట్లు మిగుల నాప్యాయనముగ భుజించి వాని యనుమతంబునఁ జేరువనున్న నవకలమపలాలమృదుతల్పంబున విశ్రమించితిని. పామరుండును నావలెనే భుజించి నాసమీపమందలి వేఱొకగడ్డిపరుపుమీద నుపవిష్టుఁడై చిలుకకు పంజరము గట్టనారంభించెను. అప్పుడు నేను సమయము దొరకినదని యుబ్బుచు నుచితవచనంబుల వాని కిట్లంటిని.

ఓహో! కృషీవలకులతిలకా! మీరు నివసించుగ్రామ మెయ్యది? తమ నామధేయమేమి? ఈచిలుక మీకెచ్చట నెట్లుదొరకెను. దీని నెందులకు సంగ్రహించితిరి. దీని నెవఁడైన శ్రీమంతునకుపాయనంబుగ నొసంగఁదలంచితిరా యేమి? అయ్యా! మీకు కోపముగలుగదేని యొకమాట వచించెదను. ఈచిలుకను నాకొసంగుఁడు. దీనిని మహారాజునకుసమర్పించి మీకు గొప్పయుపకారము జేయించెదను. మీకనల్పమగు భాగ్యమబ్బగలదు. సమానులలో మీకత్యధికమగుగౌరవముగలుగఁగలదనివచించితిని. పంజరనిర్మాణమునందే దృష్టి నిల్పియున్న యాపామరుండు నావంక దిలకింపకుండగనే యిట్లు ప్రత్యుత్తరంబొసంగెను.

ధాన్యసారమనుపుర మీసమీపమునఁ గలదని మీరు వినియే యుందురు. అందు గోపతియనుకుటుంబీకుఁడుగలఁడు. వానికి నేనాత్మజుండను. నంపరకుండనువాఁడను. కృషీవలుండనగు నేనీపొలములో వరిచేను నూర్చుటకుఁ గళ్లము జేసి యిందువసించుచుంటిని. నేఁడిచ్చటికనతిదూరంబుననున్న పొలమునందు సగముగోసి కట్టఁబడియున్న వరిమోపుల నీకళ్లమునకు జేర్చబోతిని. అందొకవరికంకెమీద వ్రాలియున్న యీచిలుకం దిలకించి సహర్షంబున దానిసన్నిధికేగి వరిగింజలొలిచితినుచుండుటచే నారాక గ్రహింపని దీనింబట్టి తెచ్చితి. దీని నీకొసంగఁజాలను. ప్రాణములకన్న నెక్కుడుగ నేను ప్రేమించుచున్న

నాభార్య ప్రథమగర్భంబున నంతర్వత్నియై పురుడుబోసికొనుటకు బుట్టినింటికి మేఖరికయనుపురంబున కరిగియున్నది. శుకామిషంబున నామెం దృప్తిపరుపనెంచి దీనిం గైకొంటిని. ప్రియురాలి యభీష్టము దీర్చుటయందు దివిలోకరాజ్యమైనను దృణప్రాయముగదా? కావున నీవీచిలుక నడుగుట యుడుగుమని వచించుచు యాపంజరమల్లుట ముగించి యందాచిలుకను భద్రముగా బెట్టి తన్న గృతార్థునిగాఁ దలంచుచు దానిని దనసైజ్జపజ్జ నుంచికొనెను.

---

325 వ మజిలీ.

# శుకలాభము

వాని నిశ్చయంబెఱిగి నే నతిచింతాకులస్వాంతుండనై ఆహా! ఈచిలుకను బడయుటకు నేనేమియుపాయము బన్నుదును. వీని నింకే మనియాచింతును. హఠాత్తుగా దీనింగైకొని పారిపోదునా? లేక యర్ధ రాత్రంబున వీఁడు నిద్రాముద్రితుఁడై యున్నతరి దీనిందస్కరించుకొని పోదునా? అని విచారించుచున్నసమయంబున నాచిలుక యట్టహాసంబుగ నవ్వి ప్రస్తుతార్థమును సూచించుచు నిట్లు పద్యద్వయమును పఠించెను.

గీ. ఒకనికన్నులఁబడియుఁ జిక్కకయె పారి
వచ్చితిని నింకొకనిచేత పట్టుబడి మ
ఱొక్కవ్యక్తివాతఁబడగనుంటి నహహా!
దైవయోగంబు మీరఁ దుస్తరముగాదె?

గీ. అరయ దేహికి నియమానుసరణినొప్ప
జీవితాంతంబునందునఁ జావుగూర్చి

మృత్యుముఖమున జీవితమొసఁగఁజేయు
విధికి విశ్రాంతిలేదెందు విశ్వమందు.

ఆఘూట్కలాలించి పామరుండు భయోద్రేకంబున మేను గగు ర్పొడువఁ ద్రుళ్ళిపడి లేచి కాలికొలఁదిఁ బరువెత్తఁదొడంగెను. వాని పిరికితనంబునకు నేను కడుపుబ్బ నవ్వుచు భయపడకుము భయపడకు మని వాని ననుసరించి పోయి పట్టుకొంటిని. అందులకు వాఁడు తొ ట్రుపడుచు నన్ను వదలిపెట్టు వదలిపెట్టు మని పెద్దయెలుంగున నఱ చుచు మఱియు నిట్లనియె. తమ్ముఁడా! నేను పుట్టినదిమొదలు నేఁటి దనుక నెందును మనుజునివలె నవ్వుచు మాటలాడు చిలుకను గని విని యెఱుఁగను. ఇది పిట్టగాదు. పెనుభూతము. మనల విఱచుకొని తినఁగలదు. దీనికి వెఱచియే నేను పాఱిపోవుచున్నాను. నీవును సత్వ రమ యిందుండి పారిపొమ్ము. నీకు భయము లేకున్న నిందుండు మని భయార్తివిధురితచేతస్కుఁడై ప్రలపించుచు నాపట్టు తప్పించుకొని యొక్కపరుగునఁ బారిపోయెను. నేనును నాయభీప్సిత మీడేరిన దని సంతసించుచు నాచిలుక యిఁక నలభ్యమని నిరాశజేసికొని యున్న నాకు దానిని దృష్టిలోఁ దక్కఁజేసిన దైవమును సంతరంగంబునఁ గొనియాడుచు నాశుకశ్రేష్ఠమును గైకొని ప్రత్యూషంబున నందుండి పోవ నిశ్చయించుకొనుచు నాకుటీరంబును వెండియుఁ బ్రవేశించి తిని. అందు శుకలాభమునకు నెమ్మనంబున నుబ్బుచు తదీయాలాప విశేషంబు నెన్నుచు నవ్వు పుట్టించు పామరుని చేష్టితంబులఁ దలపో యుచుండుటచే నాకంటికి నిదురరాలేదు. ఆరాత్రిశేష మా చిలుక తోఁ బ్రసంగించుచు గడుపనెంచిన నాసంకల్పమెఱింగి యాచిలుకయే నాతో నిట్లు ముచ్చటింపఁదొడంగెను.

మహాత్మా! నాచిన్నవిన్నపమొం డాలింపఁ గోరుచున్నాను. పామరమహాగ్రహబాధనుండి బయటఁబడిన యాదీనశకుంతశాబకము

తోఁ దమ కేమిపని గలదు? మీరు మహాత్మస్వరూపులు. మహాత్ములు దీనులవిన్నపము లాలింతురు. ఒరులకు కీడు సేయఁదలంపరు. యాచకుల కడిగినదాని నొసంగుదురు. కాన మిమ్ము ప్రార్థించుచున్నాను. పుడమిపై సర్వసంసారవిషయములందును సారభూతమైనది ధర్మమని మిముబోంట్లు వచింతురు. అట్టిధర్మమునకు సారము ప్రాణికోటియందు దయయే యగును గదా! దయాధర్మసార మార్తపరిత్రాణము. ఈసద్గుణంబులు సజ్జనులకు సహజంబులై యుండును. నన్ను మీ రెవనికో యొకనరపతి కర్పింపఁ దలఁచుచున్నారుగదా! అందువలన నిందు బంధింపఁబడి యుండుటకన్న మిన్నయగుబాధ నాకు మీరు కల్గించుచున్నారు. మనంబున ప్రతిఫలితరాజసేవాపరిక్లేశభయంబు నాకు నితాంతము గల్గుచున్నది.

మ. భయదామాత్యదృగర్చిపాగ్నిముఖమై ద్వార్థ్యాగ్రహోదగ్రవా
క్ప్రయఘేత్కారియునై, నియోగిరసనోద్యత్తీవ్రసత్కర్తికన్
నియతిన్ సేవకశుష్కశల్యవితతిన్ వే దాల్చుచున్ రాక్షసి
క్రియ నేప్రాణినిరాజసేవ విడచున్ గీడెంచకుండన్ భువిన్.

కావున నోసుధీమణీ! నన్ను వదలిపెట్టుము. విహంగమకుటుంబమునుండి నన్ను వేఱుచేయకుము. నికుంజతరుకోటరకుటీరావాససౌఖ్యమునకు దూరము జేయకుము. యదృచ్ఛారాసఫలరసోపభోగమునుండి తప్పింపకుము. వివిధవనసరణీసంచారమునుండి తొలగింపకుము. నభస్థలోత్పతనవిలాసవైభవముశూన్యముగఁ జేయకుము. అనాథను. ఆర్తురాలను. పతత్రిమాత్రమ నని దుఃఖాతిశయంబునని కమాట రాక యూఱకుండెను.

ఆమాటలు విని నేను మైమఱచి యవి శుకప్రోక్తములని యెఱుంగక యొకానొకవ్యక్తి ప్రగల్భవచనంబులుగ మొదట సంశయించి పిదప నిట్లు తలంచితిని. స్వార్థవిషయికములగు దీనివచనం

బులకు నేనును స్వార్థము ననుసరించి ప్రత్యుత్తర మొసంగఁజూచితినేని యిది మంచిమాటలచే నాహృదయమును దయార్ద్రం బగునట్లొనరించి మనస్సును సహేతుకప్రశ్నోత్తరంబుల స్వవశంబుగఁ జేసికొనఁగలదు. ఈశకుంతచతురవచనంబులకు లోఁబడి పంజరబంధమునుండి తప్పించితినేని ప్రభువునకు దీనిని సమర్పించి మనఃప్రియం బొనరింప సమకట్టిన నాప్రయత్నమెల్ల వ్యర్థము కాఁగలదు. దీని నెట్లయినను స్వామిసన్నిధికిఁ గొనిపోవలయును. ఈచిలుకవృత్తాంతమెల్ల ప్రభుసమక్షముననే వినెదంగాక యని నిశ్చయించుకొని దానిమాటలకేమియుఁ బ్రత్యుత్తరం బొసంగక యూరకుంటిని.

ఇంతలో శుకాలాపభయపలాయితుం డైన|హాలికుని వెన్నంటి పోయిన తిమిరకేశపిశాచమువలెనే యారాత్రి గతించెను. తెల్లవారె నింక చిలుకం గొనిపొమ్మని నన్ను బ్రబోధించు తెఱంగున నిశోపాంతమందు మేతకై విడువఁబడి తిరుగుచున్న పశులమెడల నవలంబించియున్న కాష్ఠఘంటానినాదంబు నాచెవులంబడెను. నే నప్పుడత్యంతసంతోషంబున లేచి యదియ తగినసమయంబని తలంచి యాశుకముం గొని యందుండి బయలుదేరి యాదినాంతమునకు నందావటనగరము జేరుకొంటి. అంతవరకు నాజాడ దెలియక తహతహంబడుచు నారాక నెఱింగినతోడనే ససంభ్రమముగ నెదురువచ్చినపరిజనుని చేతి కాపంజర మిచ్చి దానివృత్తాంతము వానికి సంగ్రహముగఁ జెప్పుచు విడిదెకుం బోయితిని. ఆయద్భుతశకుంతమును దేవర కెప్పుడు చూపింతునను నుత్సాహముతో దానికి వేఱొకమణిఫలకపంజరమును నిర్మింపఁజేసి యారాత్రి యందు విశ్రమించి నే డిచ్చటి కేతెంచితిని. ఇట్టివిహంగరత్నము భూమండలాఖండలుండగు మహారాజుసమక్షము నందుండిన మిగుల శోభింపఁగలదని తలంచి మద్గృహంబున కైనఁ బోవక తిన్నఁగా నేలినవారిసముఖంబునకే దానిం దోడ్కొనివచ్చితిని.

అయ్యది ద్వారప్రదేశంబున దారకునిచేతియం దున్నది. మదలయేని గొనివచ్చెద. పిమ్మట దేవరచిత్తమే ప్రమాణ మని యూరకుండెను.

ఆపలుకు లాలించి రాజు విస్మయావేశహృదయుఁడై సత్వర మాశుక శ్రేష్ఠముం గొని తెమ్ము విమర్శింతమని యానతిచ్చెను. తోడనే వసంతశీలుఁ డతివేగమున ద్వారదేశమునకరిగి రత్నపంజరముతో నాచిలుకను స్వయముగాఁ దెచ్చి రాజుమోలను విడచెను. అప్పుడా చిలుక మెడయెత్తి ప్రసన్నదృష్టులా తేనిపైఁ బరపుచు వాని నుద్దేశించి యిట్లనియె. దేవా! హరనయనహుతాశనశిఖాదందహ్యమానుండగు కుసుమాయుధునిచే విడువఁబడిన రూపమును, నహల్యాభిసరణవిషణ్ణుండగు శతమన్యునిచేఁ గోల్పోఁబడిన విలాసంబును, పాల్కడలి నురగతల్పంబున శయనసుఖవ్యసనపరాయణుండగు నారాయణునిచే విడువంబడిన భువనరక్షణవ్యాపారమును, నొక్కుమ్మడి నీసమక్షమున కేతెంచి నీయందు సుప్రతిష్ఠితములై యున్నవి. ఇట్టి నిన్నేమని స్తుతింపఁగలను?

మ. ఘనదానవ్రతతత్పరుండవయినన్ గార్పణ్యముంబూని యీ
వినుతాజాండఘటంబు నీగుణ లసద్విఖ్యాతమాణిక్యరా
శిని నిండించి మహానిధానముగ వాసిన్ గాంచియున్నాఁడ విం
కను దావెయ్యది నీప్రతాపము వెలుంగన్ జ్యోతియై భూవరా.

ఇట్లత్యద్భుతంబుగ వచించిన చిలుకపలుకుల కానృపసత్తముండలరుచు విస్మయస్మేరాననుండై సమీపవర్తులతో దాని వర్ణనాద్వైదుష్యంబును మాటలపొందికను ప్రగల్భవచోవైచిత్ర్యమును బొగడుచు నాచిలుకంగాంచి యిట్లనియె. ఓహో విహంగమప్రవరా! నీ వెవ్వఁడవు? ఏజాతివాఁడవు? వస్తువివేకహీనమై వర్ణశూన్యాస్పష్టశబ్దోచ్చారణమాత్రకమై యొసఁగు విహంగమజాతియందు బొడమినను నీ వెట్లు మనుష్యభాషఁ జక్కఁగఁ బలుకనేర్చుకొంటివి. శుకజాతివిరుద్ధం

బుగ శిఖవహించిన నీరూప మక్కజముగొలుపుచున్నదికదా! నీవిప్పు డతిచాతుర్యముగ వచించిన స్తుతిపఠన మంతకన్న మిన్నగ వింతఁ గొల్పుచున్నది. మఱియును నిస్సంధిరంధ్రోదరంబగు నా చైత్యమునం దెట్లు ప్రవేశించి పైకి రాఁగల్గితివి? అందుండి నీవు పఠించిన పద్య ప్రవృత్తమెట్టిది? వసంతశీలునకు దొరకనినీవు హాలికునిచే నెట్లు పట్టు బడితివని యడుగు నరేంద్రున కాచిలుక నిజవృత్తాంత మిట్లు చెప్పఁ దొడంగెను.

---

326 వ మజిలీ.

# చిలుక కథ

దేవా! అవధారు. సహ్యాగిరిపరిసరంబున జనసంచారశూ న్యంబై మహీహిదుర్గమంబై యతిభయంకరమైన మహారణ్యమొకటి గలదు. అందొకవిశాలన్యగ్రోధ తరుకోటరంబున నివసించియున్న శుకకుటుంబినికి పిల్లలుపుట్టి చచ్చుచుండుటచేఁ గల్గునెగులుమాన్ప నుత్తరవయసునందు నేనుద్భవించితిని. నే నండమునుండి బయటఁబడిన తోడనే యేహేతువవలననో శుకజాతివిరుద్ధముగ నీశిఖ నాతలపై నుదయించెను. అట్టిపించముతో జాతివిలక్షణంబుగనున్న నాస్వరూప మును దిలకించి నాజాతిపక్షులే గాక కన్నతల్లికూడ నన్ను పరిత్యజిం చెను. ఇట్లు పురాకృతకర్మదోషంబునఁగల్గిన కష్టముల ననుభవిం పుచు నాయరణ్యమునందే బడియున్న నన్ను, శారదియను వనదేవత దయార్ద్రహృదయయై చేపట్టి ప్రతిదినమును నాహారాదికంబొసఁగి పోషించుచుండఁ గ్రమంబున నాకు ఱెక్కలువచ్చి యెగురుటకు శక్తి గల్గెను. ఈపించముకూడ నావయసుతోడనే దినదినాభివృద్ధిగఁ బెరు

గుచుండెను. పింఛము పెరుగుచున్నకొలఁది నాయంతఃకరణంబున స్వయంప్రబోధ ముదయింపసాగెను. సమస్తవస్తుతత్త్వోపనిర్ణయము నందును సర్వశాస్త్రములందును వివిధాశుకావ్యప్రకల్పనావిశేషమం దునునానాపురాణకథోపకీర్తనానైదగ్ధ్యమాధుర్యమునందును విభ్రమా లాపగోష్ఠియందును మనుష్యజ్ఞానముగల నాకుఁ గ్రమంబున నతిప్రా గల్భ్యము జనించెను.

అట్టి నన్ను శారదీదేవి తిలకించి వత్సా! ఇంక నీవు యథే చ్ఛఁగ విహరింపవచ్చును. మద్వచఃప్రభావంబున నీకగమ్యవిషయప్ర చారమందును నరంధ్రసంధిస్థానప్రవేశమునను నత్యంతసామర్థ్యము కలుగఁగలదని వరములిచ్చి చిత్రశిఖుఁడను మంచిపేరుపెట్టి స్వతంత్ర విహారమునకు నన్ను విడచి యంతర్హితురాలయ్యెను. అట్లు జాతివిల క్షణంబుగఁ బింఛమువహించియున్న నన్ను చూచినమాత్రముననే శత్రుత్వమువహించి యితరశుకశకుంతసంతతులు బ్రహరించుచుండ స్వజాతిసంగాతసౌఖ్యమెరుఁగక యేకాకినై నాఁడు మొదలు నే నా వ నాంతరమందున్న సర్వవృక్షకోటరాంతరంబుల నివసించుచు కాల మొకరీతిఁ గడపుచుంటి. సకలతత్త్వనిర్ణయంబొనర్పందగువివేకముగల్గి యున్న నన్ను క్షణమైనను స్వజాతిసుఖసంగమాభిలాష విడువదయ్యె. ఒకనాటి ప్రాతఃకాలంబున శరత్సమయసంజాత సంతోషాతిరేకం బుతో నంతరిక్షమున నెగురుచు నతిసంకులంబుగ నెచ్చటికో బోవు చున్న చిలుకలపిండుంగాంచి దాని వెనువెంటఁ గొంతదూరమరిగితిని. అందు ముందేగుచిలుకలు వెనుకకుఁదిరిగి నన్నుజూచి పట్టరాని యా సున నాపైఁబడి యుచ్చండచంచుపుటకోటిచే బొడచి నన్నుఁ జంపఁ బ్రయత్నించుచుండ నతిభీతిఁ బరువెత్తి సంధిరంధ్రశూన్యమైన యా చైత్యగర్భంబును శారదీవరప్రభావంబునఁ బ్రవేశించి ప్రాణములఁ దక్కించుకొంటిని. అట్లొనఁగూడిన మహాపదవలన మిగులవెతనొం

దుచు సమగ్రగుణావిర్భావమూలకంబగు మదీయశిఖోన్మేషంబుగూడ నాపదకు గారణమయ్యెగదా యని తలంచుచు నట్టిపద్యములందుండి పఠించితిని.

ఆచైత్యగర్భముం బ్రవేశింపఁజాలక చిలుకపిండు నన్ను విడచి యథేచ్ఛగఁబోయెను. వానివలన నాకట్టి బాధగల్గినను వానిఁ జూడకుండ నేనుండఁజాలక మిగులవెతనందుచు నది యెంతదూరమందున్నదో చూడవలయునని బయటకేతెంచి యాచైత్యశిఖర మధిష్ఠించితిని. ఆశుకసమాజము దృష్టికగోచరమగుటచే దిగులొంది అయ్యో! తిరుగ నాజాతిపక్షుల నెన్నఁడు జూడగల్గుదునో యని చింతించుచు క్రింద విమలమణిపీఠకుట్టిమప్రదేశంబున ప్రతిఫలితమైన నారూపమును దిలకించి మందబుద్ధినై నాజాతిచిలుక యొకటి యందుఁ్రవాలియున్నదని భ్రమసి తటాలున క్రిందకు గంతువైచి దాని ననుసరించి తిరుగుచుండ వసంతశీలుఁడు పట్టుకొనబోవ వానికి జిక్కక పారిపోతిని. ఆతండు నన్ను వెంటాడుచుండఁ గొంతదూరమరిగి యాకలిచే బాధపడుచు నొకవరిపొలమును సమీపించి యందు వరిగింజలఁ గొరికి తినఁదివురుచు నాకలిపాటున వివశతంజెందియున్న నేను భయంకరంబైన పామర కరగ్రహోపదంబడితిని. పిమ్మట నెన్నఁడు నెరుంగని పంజరబంధమునఁ దగుల్కొంటిని. కాని దైవయోగంబున పామరుఁడను యమదూత వలనఁ బట్టువడినను తుదకు భాగ్యవశంబున నీసమక్షమునకుఁ గొనిరాబడితిని. శారదీప్రముఖ వన దేవతాప్రకరంబు ప్రతిదినంబును నేమూన వనాయకుని నాశీర్వదించుచుండ నే నాలకించియుంటినో యట్టిరాజేంద్రు ననన్యతుల్యాకృతిని దూరమునుండి చూచిన తోడనే నేను గ్రహింపఁగల్గితిని. ప్రమోదరసమిశ్రితమగు భవదీయదర్శనామృతము నాస్వాదించి నాయాత్మ స్వస్థతంబొందినది.

ఆకాశమందు వాయుపథంబున సంచరించు ననుబోంట్లకిట్టి యసమక్లేశానుభవంబు బురాతనకర్మపరిణామంబునఁ గాక యితరం

బున నెట్లు గలుగును? సహజంబుగ నీడజంబులు విశ్రంభశీలంబులు. అట్టిజాతిని బొడమినను నే నొకనికి పట్టువడి భూమీంద్రుని వశ మగుట విచిత్రము గదా! కావున నో రాజచంద్రమా! పురాకృత కర్మానుగుణంబుగఁ బ్రవర్తించు నీలోకంబున మంచిచెడ్డల కెందును నెవ్వఁడును గర్తగా నేరఁడు.

గీ. ఆత్మయనుపదార్థంబు శుభాశుభాతి
మయముగావున దానిని నియతిఁ దెచ్చి
యంతరాంతరముల నెంత యణచిపెట్టి
యున్నసుఖదుఃఖముల నందె యుండి గాంచు.

కావున నే మదీయపురాకృత శుభకర్మపరిణామమూలంబున న శేష నరలోకతిలకుండవై, వివేకచూడామణి వగు భవదీయదివ్య దర్శనలాభం బిపుడు నాకొనఁగూడఁ గలిగె నని నతివిన్నాణముగా వచించి యూరకుండెను.

ఆపలుకుల కామహీజాని మిగుల ముదమందుచు నాచిలుక నుద్దేశించి యిట్లనియె. ఓహో! శుకశ్రేష్టమా! స్వజాతిపక్షుల నెడ బాసి, స్వేచ్ఛాసంచార నిరోధంబుగ పంజరబంధంబునం బడి యిష్ట పదార్థంబును గాక పరులిడిన యాహారమాత్రముననె గాంచి యేపత్రి మాత్రమాత్రతం జెందకుండును? నీ వితరపక్షులవంటిదానవు గావు గదా? కేవలము నీవు పురాకృతదుష్కృతమువలన నే పక్షిజాతిఁ బుట్టితివి. అయినను సకలవిజ్ఞానసంపదయందు మనుష్యులను, మరుత్తు లను గూడ నతిక్రమించు విన్నాణ మందియుంటివి. కావుననే నీ వింత వంత నందుచుంటివి. ఇఁక విచారింపకుము. నీకోర్కె లన్నియును స మయానుసరణిని దీర్చి నీకు సుఖము జేకూర్పఁగలను. నాసమీపము నకుఁ గొనివచ్చువఱకును బిడాలాదికమువలన నాపద గలుగకుండ నీ కీపంజరనివాసమే సమంజసముగా నుండునని యతిమృదుమధురభాష

ణంబుల నొత్తేఁడు చిత్రశిఖుని చిత్తమును సంతోషాయత్తముగ నొన రించి వసంతశీలున కాచిలుక నప్పగించి వాని కిట్లనియె. ఓవనపాల పుంగవా! నీవీచిత్రశిఖుని నుద్యానమణిమండపంబున నుంచి ప్రతి దినమును స్వయముగ నాహారపానీయంబుల నొసంగి రక్షించుచుండు ము. వినోదకథాప్రసంగసమయంబుల నెల్లప్పుడును మాయానతిని వీనిని మాసమక్షమునకుఁ గొనివచ్చుచుండు మని వసంతశీలున కనుజ్ఞ యొసంగెను. ఇంతలో మాధ్యాహ్నికసమయసూచకంబుగ శంఖంబు మ్రోఁగెను.

ఆనినద మాలించి యుచితవేదియగు నారాజేంద్రుండు వసంత శీలుని దగినరీతి బహూకరించి రత్నపంజర మందున్న చిత్రశిఖుని వాని కప్పగించి పోవ ననుజ్ఞ యొసంగెను. మఱియును సన్నిధానవర్తు లగు రాజపుత్రకుల నెల్ల వీడ్కొల్పి స్నానాది మాధ్యాహ్నికకృత్యం బుల నిర్వర్తింప సింహాసనమునుండి లేచెను. అట్లు లేచి రెండడుగులు ముందునకఱిగినతోడనే యాధాత్రీశునకు బ్రణమిల్లివానియనుజ్ఞఁ గై కొని పోవ నొకరినొకరు త్రోసికొని ముందున కేతెంచుసామంతరాజుల గాత్రసంఘట్టనంబున వారికిరీటమాణిక్యములు నేలరాలి రత్నాకర తీరంబున నలలతోఁ దృళ్ళిపడు రత్నసంచయముభాతి భాసిల్లెను. ఆ యలజడిం దెగిన తదీయహారాద్యాభరణంబులనుండి పడిన ముత్యము లు స్వాత్యంభోధరవిముక్తజలబిందువులకైవడి డంబుమీఱెను. ఇటు నటు నటించు గుటిలాలకసమూహముల కింకిణీక్వాణత్కారకలకలం బనంగ నగరంబున నరువాత లేచిన జనులకోలాహలములీలఁ జెలు వొందెను. సమ్మర్దవశంబున విలాసినీజనంబు లాస్థానమణిస్తంభంబుల నూతఁగొని యుండఁ దదీయప్రతిబింబములనెపంబున నమ్మండపశ్రీలు సమాలింగన మొనర్చి వారి నాదరించున ట్లొప్పెను.

ఇట్లతివైభవంబున నారాజమార్తాండుండు వేత్రహస్తు లిరు గడల బరాబరులు సేయ వందిమాగధులు ముందు జయజయనినాద

మొనరింప నాస్థానమండపంబునుండి వెడలివచ్చి స్నానాది యథార్హ
కృత్యంబులం దీర్చుకొని భుజించినపిదప లీలాతల్పంబున విశ్రమించి
సుహృజ్జనులతో నిష్టగోష్ఠి సలుపుచు మఱలఁ జిలుకం దెప్పించి దాని
తో నాదినంబు వినోదంబుగఁ గడపెను. ఇట్లే ప్రతిదినమును చిత్రశిఖు
ని సరసవచనంబుల వినుచు నాభూమీశుండు సుఖంబుగఁ గాలము
బుచ్చుచుండెను.

---

327 వ మజిలీ.

# పుండరీకునిమృగవనవిహారము

మఱియొక్కదినంబునఁ బుండరీకరాజేంద్రుఁడు విలాసమణిభవ
నంబున మంత్రిసామంతహితపురోహితులతో నిష్టగోష్ఠివినోదంబులఁ
బ్రొద్దుపుచ్చుచుఁ గట్టెదుట మణిపంజరమందున్న చిత్రశిఖునిఁ దరలి
తారవిందసఖంబులగు దృష్టులం దిలకించి యిట్లనియె. సఖా! బుద్ధి
విశేషంబునఁ బరిహసితబృహస్పతియనఁదగు నీవిభూతివర్ధనామాత్యుని
ప్రజ్ఞామూలంబున నరాతివంశాంకురంబులెల్లఁ బెకలింపఁబడినవి. సద్గు
ణగణాకర్షితంబై భూపాలబృందంబు వశంవదంబయ్యెను. వసుమతీ
చక్రంబెల్ల నాయాజ్ఞఁ దలఁదాల్చుచుండెను. మంత్రబద్ధయైనట్లు లక్ష్మి
నాకువశీభూతయయ్యెను. మదీయరాజ్యమం దెల్లెడలను సుఖసంతోష
ములు దాండవమాడుచుండెను. ఇట్లు సర్వార్థసిద్ధిం జేకూర్చిన మదీ
యకృపాణం బొరయందిమిడియున్నది. రణవినోదాభావంబుచే నా
భుజాదండంబు దుస్థితిపాలయ్యెను. ఇఁక నే నేవినోదవిశేషంబునఁ
గాలంబు గడుపఁగలను. హృదయాహ్లాదకరంబుగ నింక నే నేవ్యాసం

గంబునఁ బ్రవర్తింతునని యడుగ రాజేంద్రుని యింగితమెఱింగి చిత్రశిఖుం డిట్లనియె.

దేవా! పుడమియందు మనుష్యునకు కల్యాణప్రదంబగు నఖిల సుఖోపభోగానుభవమే పర్యవసాయమగు వ్యాపారము. దాని కాస్పదమై హృదయవాంఛితము లొసంగునది రాజ్యలక్ష్మి. సప్తార్ణవ తరంగమాలాభరణంబగు వసుంధరయే రాజ్యమునకు మూలాధారము. అట్టి పుడమింబడయఁ బ్రద్వేషివంశవిచ్ఛేదనం బవసరమగు చున్నది. దానిని దేవరవా రింతకు నొనరించియేయున్నారుగదా? భూవలయమధుపటలంబున రాజ్యసుఖరసోపభోగలాలసులగుక్షుద్రనర పాలబృందంబులనెల్ల పారఁదోలితివి. వీరుల కవచంబుల నిజ నిశితాసి దండమున విదారించుటంజేసి పుట్టిన యనలజ్వాలల భవదీయభుజా కదనకేళీకండూతిం బాపికొంటివి. క్షురప్రముఖవిఖండితేభదంతముస లంబు లున్మూలింపఁబడిన విరోధివంశాంకురములవలె సంగ్రామభూ ములయందు నీచే విరజిమ్మఁబడినవి. నిశితనిస్త్రింశధారోత్తారితరిపుశిర శ్శృంఖవలయంబులచే వీరలక్ష్మి నలంకరించితివి. వైధవ్యవిధురితారి సీమంతినీనేత్రసలిలధారలతో మధూత్సవం బొనరించితివి. విపాటిత విపక్షవంశసమాకర్షుండవై యశోముక్తాఫలంబులఁ ద్రిభువనలక్ష్మికా భరణంబులుగ నొనరించితివి. ఇట్టి నిన్నేమని వర్ణింపఁగలను.

మ. అనిలో నీనిశితాసి తీక్ష్ణగతి సూర్యాఘుంబు గల్పించిమించె,
నరాతిప్రమదాశ్రుధారల మహాసింధుప్రజం బేకమై
దనరంజేసె, ఘనారవంబున యశోద్వాంతాట్టహాసంబుతో
డ నటించెణ్ నరశీర్షహారముల వేడ్కన్ దాల్చి భీమాకృతిన్.

ఇట్లతిప్రతాపవిహారంబొనరించి శత్రువంశనిర్మూలనంబు చేసిన నీకు భూవలయంబున నాయోధనవినోదవ్యాపారమున కవసరము గలుగదయ్యెను. అయినను నీవొనర్పఁదగిన దింకొక్కటిమాత్రము గలదు.

గీ. ధాత్రి నిర్వైరులై రణోద్ధతులునైన
ధరణిపతులకు భుజవినోదంబుగోఱకు
రోషచలితకిటీనికురుంబమందు
చాపమడరింప మృగయాప్రసంగముండె.

ఇట్లు చిత్రశిఖుండు వేటమాటయనినతోడనే బైట నెవ్వని తోడనో యెవ్వఁడో మృగయాఖేటనవ్యాపారం బభివర్ణించుమాట లిట్లు వినంబడెను.

మ. కరికుంభస్తనియై మృగీవిశదస్ఫూర్జద్వ్రజద్దృష్టియై కేకిసుం
దరబర్హాచ్ఛదకుంతలప్రమదయై నానావిహారస్ఫుర
ద్వరభూదారగభీరఘోరశితదంష్ట్రాకాంతిసంఘాతయై
కరమొప్పారు మృగవ్యలక్ష్మి నెనయన్ గాపూరుషుం డర్హుఁడే?

చిత్రశిఖునిపలుకుల కుపశ్రుతివలె నొప్పిన యామాట లాలించి యారాజబిడౌజుం డమందానందకందళిత హృదయారవిందుండై మృగయాఖేటనవినోదవిషయంబుఁ జక్కఁగా స్మృతికిఁ దెచ్చినందుల కాశుకనాథుం బొగడి యట్టివినోదం బనుభవింపఁ గృతనిశ్చయుండై మృగవనగమనావశ్యకంబు లగు నుచితపాశవాగురసారమేయాద్యుపకరణంబులతో వేఁటకాండ్ర సంసిద్ధపఱుపఁ బ్రతీహారిముఖంబునఁ దగినవారి కనుజ్ఞ నొసంగెను.

మఱునాఁటివేకువ నుచితవేషము ధరించి యమ్మహారాజు నవరత్నకాంతులఁ బ్రదీప్తం బగు జీనుతో నలంకరింపఁబడిన యుత్తమాశ్వమును నింద్రుం డుచ్చైశ్శ్రవంబునుం బోలె నధిష్ఠించి, వేఁటయందు నేర్పరులైన యనుచరు లమితోత్సాహంబున ముందు నడువ, సమరలీలావ్యాపారసహచరు లగు సామంతనరేంద్రకుమారులును, మంత్రిసూనుం డగు విజయవర్ధనుండును, తురగారూఢులై పార్శ్వములఁ ననుసరింప, మృగయులు మార్గము దెలుప, నపరిమితపరివారసమేతుఁడై వేఁటకు బయలువెడలెను.

ఇట్లతివైభవంబునఁ గదలి యనతికాలముననే యారాజముఖ్యుండు, మృగయావ్యసన పరాయణుండై యనేకతరులతాలతాంకుర విరాజమానం బగు నొకమహారణ్యప్రదేశంబు సపరివారంబుగఁ బ్రవేశించెను. అయ్యది నానావిధవిహంగసందోహసంకుల నిస్వనంబుతోడను, పర్వతాగ్రసంపాతిత ప్రవాహారావముతోడను, కుసుమ మధుమదారుణిత షట్పదసమూహ ఝుంకారముతోడను, పవన చలితకీచకానేకసంకీర్ణస్వనంబుతోడను మిగుల భీషణమై యుండె. మఱియు నాప్రదేశమున సంచరత్పతంగనఖవికీర్ణం బగు కుసుమకింజల్కపూరం బనల్పరజోవృష్టివలె వివిధవర్ణముల భయావహం బయ్యెను. అందనిల తరళిత లతావనప్రసూనపతనంబు క్షత్రపాతంబువలె మృగారిష్టసూచకంబుగ నుండెను. తరుశిఖర శాఖాంతరములనుండి దుముకు వానరములబరువుచేఁ గుసుమములు నేల రాలి మహోద్భూతోల్కాపాతమువలె శార్దూలాది సకలసత్వవినాశనమును దెల్పుచుండెను.

అట్టిమహారణ్యంబున మృగయులసహాయంబున నుచితరీతి మృగయావిహారం బొనర్పఁ బరిజనుల కారాజేంద్రుం డనుజ్ఞ నొసంగెను. తోడనే వారెల్ల రత్యుత్సాహంబున గంతులు వైచుచు, మృగములఁ బట్ట నురుల నొడ్డి, వలలఁ బన్ని, యంతరాంతరముల నశ్వవారము నిలిపి, మార్గంబున ధనుర్ధరులై కాచియుండి, సారమేయముల నుసికొలిపి, యుచితస్థలంబున నొకమహోక్షంబును గట్టి మాటొగ్గి, దీప మృగకదంబకముం బఱపి నిముసములో నాయడవినెల్ల నాక్రమించిరి. మఱియు శ్వాపదవిలోకనార్థమై కందరదరీప్రవేశం బొనర్చుచు, గహ్వరంబులఁ బరిభ్రమించుచు, పల్వల తటంబుల నాక్రమించుచు, నిర్ఝరతరంగిణులసమీపంబున సంచరించుచు నతికోలాహలంబుగ నామృగయు లావనాంతరంబులఁ జెలరేగుచుండ, సమీపభూరుహం

బులనుండి భయకంపితారావంబు లొనరించుచు బ్రాణభీతిఁ బైకెగురు విహంగమ సమూహంబులును, వెవుల నిక్కఁబెట్టుకొని పొదలమాటు ననుండి పరువులెత్తు శశకనికురుంబములును, సగము కొఱుకఁబడిన దర్భాంకురములు నోటినుండి జారుచుండ బెదరుచూపులతో నురుకు సారంగకదంబకములును, నప్పుడే రొప్పఁబడిన వల్మీకమృత్పిండము లఁ గొమ్ములయందుఁ దాల్చి వెనుకకుఁ దిరిగి చూచు సైరభప్రకరం బులును, భూమినెల్ల వలితవదనాగ్రంబునఁ బెకలింపఁగలిగి మాటి మాటికి భీకరఘుర్ఘురారావము లొనర్చు వరాహనివహంబులును, చి గురుటాకుజొంపముల నోటి కందించుచుండుటచేత వర్తులంబు లగు తుండములతోడను, సంసదేశపాతితంబులగు కర్ణతాళంబులతోడను. నపాంగమిళితనేత్రతారకంబులతోడను నొప్పు మదపుటేనుఁగుల గుం పులును, క్రోధగర్జారవంబున దిక్కులు పిక్కటిల్లఁ జేయు శార్దూల సంచయంబులును గలిగి యామృగయాకోలాహలం బతి దారుణ మయ్యెను.

మ. హరి, కుంభస్థలి నగ్రవామపదమున్ హత్తించి వేటొక్కకా
    లరయన్ బేరెదమీఁద నడ్డముగ శూన్యాధారతన్నిల్పి, యా
    దరిసంకోచమితాశితాగ్రమెడలన్ దచ్ఛుభ్రక్వమార్గంబులన్
    కరివిచ్ఛేదనవృత్తిమాని మృగయాకల్లోల మీక్షించెడిన్.

అప్పుడు వేఁటకాండ్రు హరిణంబులఁ బాశంబులం బట్టి, వల లొగ్గి పక్షుల నిర్బంధించి, సారమేయంబులసహాయంబున వరాహము లఁ బొడిచి, బాణప్రయోగంబునఁ గంఠీరవంబుల సంహరించి, వల యాకారంబుగ నశ్వంబుల రొప్పించుచు వ్యాఘ్రంబులఁ బరిమార్చి, శరభంబులఁ బోరిఁగొని, సకలశ్వాపదసంతానంబుల రూపు మాపి, యమ్మహారణ్యంబున నశ్రుతపూర్వంబుగ నదృష్టపూర్వంబుగ ననను భూతపూర్వంబుగ మృగయాసంరంభ మాచరించుచుండిరి.

ఇంతలో నుష్ణాంశుండు గగనశిరోధిరూఢుం డగుటఁ దిలకించి విజయవర్ధనుండు వినయంబున నాభూపాలున కిట్లనియె. దేవా! వేట తమకంబున నున్నమృగయులెల్లరు నీయెండవేఁడిమిని మిగుల నలసి యున్నారు. సర్వవనసత్వసంహారం బొనరించి ధనుర్ధరులు వామకరం బుల బాణాసనంబులందాల్చి యందందుఁ దిరుగుచున్నారు. ఉచ్చండ వేగమునఁ బరువు లెత్తింపఁబడిన యశ్వము లొండొంటిజేరి స్థిమిత పడుచున్నవి. సారమేయంబులు సౌమ్యములై నాల్కలు వ్రేల్వైచి కొని నిలచియున్నవి. సూర్యభగవానుఁడు తీవ్రకిరణంబులఁబఱపి తీవ్ర శరశిఖరఖండితములగు మృగమాంసఖండములఁ బచనం బొనర్ప నగ్నివలెనే భరింపరాని యెండఁ గాయుచున్నాఁడు.

చ. అలఘుకపోలపాళి ననయంబు నిదాఘజలంబుగ్రమ్మఁ గ
న్నుల కరమొప్పుగల్గఁగఁ, దనూలత వాడఁగ మోముగందఁగాఁ
జలమున సంచరింతురు నిషాదినులుష్ణకరప్రసక్తిచేఁ
గలఁగి యనంగసాత్వికవికారము లందినరీతి నిమ్మైడన్.

మఱియును మధ్యందినమార్తాండాతపోజ్జృంభణంబును సహిం పఁజాలక పతత్రిజాలంబు లున్నతద్రుమంబుల శిశిరపత్రపటలాంత రంబుల నడఁగియున్నవి. కరికులధారాజలనిమజ్జనమునుండి లేచి వచ్చిన షట్పదపటలంబు సూర్యకిరణంబుల వసివాడిన కమలకాననలక్ష్మికిఁ బట్టిన నీలాతపత్రంబువలె సరోవరంబునఁ బ్రివర్తించుచుండెను. ఘర్మాంశుకర నికరంబువలనఁ దోడిమఁబట్టు జారిపడిన లతాప్రసూన ముకుళంబులచే వనభూమియెల్లఁ గప్పఁబడుచున్నది. కందరదరీప్రవేశ మొనరింపఁ బరువులెత్తు వనచరుల పరుషపదఘట్టనంబుల గిరితటంబు ల రేగిన గైరికరజోపూరంబులవలన దిశాభాగము లన్నియు నెఱ్ఱఁ బడి యున్నవి. కావున నోదేవ! ఇఁక వేటఁ జాలించి విశ్రమించుట యొప్పునని సమయోచితంబుగ వచించిన విజయవర్ధనునిమాట లాద

రించి యప్పుడే యాభూపాలముఖ్యుండు మృగయాఖేలన వ్యవహార విముఖుండై యావనంబునుండి బయలువెడలెను.

అట్లు బయలువెడలి యుద్ధురమహాతపసంబాధితంబైన నిజపరివారంబు నెల్ల నెచ్చటనైన నొకశీతలప్రదేశంబున విశ్రమింపఁజేసి యాదుస్సహామధ్యాహ్నమును గడుపనెంచి యరుగుచుండ ననతిదూరంబుననే ముందఱ పచ్చికబయళ్ళతో, నికుంజమంజరులతో, సురదారు చందన ఘనసార పున్నాగ పాటలీ నీప చంపక ముచుకుంద కేసరాశోక పనసామ్ర జంబు జంబీర క్రముక నారికేళ ఖర్జూరకాది సుందరసాంద్ర ద్రుమ సందోహములతో బహుళశీతలజలాశయముల తో, నతిసుందరమగు కుసుమసుందరమను విలాసోద్యానవనమును బొడఁగాంచెను.

అట్టిరమణీయప్రదేశంబును గనుంగొని యారాజోత్తముఁడ మందానందంబున నాతపక్లేశ మపనయించుకొన సపరివారముగ నందు విడిసెను. ఆశ్వికులు దిగినతోడనే పైనున్న జీనులు తీసివేయఁబడఁగా కొన్నిగుఱ్ఱములు ధూళియందుఁ బొరలఁ దొడంగినవి. కొన్ని దూర్వాస్థలంబుల కఱిగి మేయసాఁగినవి. పరిజనులలోఁ గొందఱు నిర్ఘరాంబువులఁ దానమాడిరి. కొందఱు తనివితీఱ నీరంబులఁ గ్రోలిరి. కొందఱు తరుచ్ఛాయల విహరించిరి. కొందఱు కూర్పాసకంబుల నూడఁదీసి చల్లగాలిసుఖ మనుభవించిరి. కొందఱు కేశబంధముల విదళించుకొని యిటునటుఁ దిరుగుచుండిరి. కొందఱు లతామండపముల నుత్తరీయములఁ బఱచుకొని శయనించిరి. కొందఱు చల్లనిప్రదేశంబుల కఱిగి నిదాఘతాపం బడఁగ విసరుకొనుచుండిరి. కొందఱు క్రిందఁ బడియున్న ఫలంబుల నేరికొని తినుచుండిరి. అప్పు డమ్మహారాజు దివ్యాశ్వమునుండి దిగి విజయవర్ధనునిపైఁ జేయూని నడచుచు సమ్ముఖంబున కేతెంచి నమస్కరించిన వనపాలుని వసంతశీలుని స

న్నానించుచు, మందమందగమనంబున నతిశీతలమైన ప్రదేశ మందు విమలమణిశిలాఫలకవినిర్మితంబైన దివ్యమాణిక్యమందిరంబును బ్రవేశించెను.

---

328 వ మజిలీ.

# చిలుక పురుషుండైన కథ

అందు మాధ్యాహ్నికకృత్యంబుల యథార్థంబగురీతి నిర్వర్తించి పిమ్మట సమీపంబున సుందరకాసారతీరంబునంగల సహకార విటపిచ్ఛాయల శిశిరజలసమీరసంగమసుఖం బనుభవించుచు విశ్రమించియుండి యాయుద్యానవనరామణీయకంబును దిలకించుచుండ వానియభిమతం బెఱింగి యింగితజ్ఞుండైన విజయవర్ధనుం డామహారాజున కిట్లనియె.

దేవా! పరిపక్వఫలస్తబకములతో నిండియున్న యీద్రాక్షలతామండప మెంత మనోహరముగా నున్నదో చూడుము. మీఁదుగా నున్న తరులతాకుసుమములనుండి స్రవించు మకరందమువలనఁ దడిసిన యీమాలతీలతామతల్లిక మదనరాజ్యాభిషేకవేదికవలె నెంత వింతఁ గొల్పుచున్నదో కనుంగొనుము. మణిమండపాంగణంబునఁ జంద్రకాంతశిలాసోపానములతో నతిసుందరముగ నిర్మింపఁబడిన యీదిగుడుబావి యెంతసంతోషప్రదముగ నున్నదో తిలకింపుము. అల్లదే దూరంబున వివిధతరులతాప్రశోభితంబగు విలాసభూధర ప్రదేశం బెంతమనోజ్ఞముగ నున్నదో పరికింపుము. ఈబాలమాతులుంగీ వనంబునకు వామభాగంబున కదళీఖర్జూరనారికేళాది పాదపసమూ

హంబునకు నీ రెత్తు మోటనూతు లెంత వైశాల్యము గలిగియున్నవో
గ్రహింపుము. అనేకజలవిహంగమవిహారయోగ్యమై కురవకనికురం
బునకు దక్షిణంబున నున్న యాదివ్యసరోవరసౌందర్య మెంత యొప్పి
దముగ నున్నదో వీక్షింపుము. అని యిట్లనేకవిధంబుల నాయుద్యా
నవిశేషంబుల నంగుళీనిర్దేశంబునఁ జూపించుచుండఁ జేరువనుండి
వారి కిట్లు వినంబడెను.

శా. ఓచంద్రోపలగౌరి! యోమరకతప్రోజ్జృంభితశ్యామలా!
యోచామీకరభిన్ననర్మవిమలా! యోపద్మరాగాంబరా!
యీచక్కిన్ గఠినాత్మ దీనిఁగనరారే? యీఫలంబీయఁగా
యాచింపంగ మదుక్తి కుత్తరము నీయన్ జూడ దొక్కింతయున్.

ఆమాట లాలించి నల్దెసల దృష్టులఁ బ్రసరించుచు వసంతశీలు
నుద్దేశించి, ఓహో! ఇచట నెవఁడో యవధీరితప్రియుండై చెలిమి
కత్తియలతో నుపాలంభపూర్వకంబుగ నిట్లు పలుకుచున్నాఁడు కాఁ
బోలు నని వచించు నానృపసత్తమునితో వసంతశీలుండు మందస్మితం
బున నిట్లనియె. స్వామీ! ఇచట నెవ్వఁడును బ్రియురాలిచేఁ దిరస్కృ
తుం డైనవాఁడు లేఁడు. చెలికత్తెలతోఁ జెప్పుకొనువాఁడును నిందు
లేఁడు. అయ్యవి దేవరవారిమనంబున కనవరతంబు వినోద మొనఁ
గూర్చు చిత్రశిఖుని చిలుకపలుకులు. నేఁ డిందు విచ్చేసిన ప్ర
భుసేవావ్యగ్రహృదయుండనై యాచిలుక కాహార మొసం
గుట మఱచితిని. కావున నయ్యది క్షుధాంధీభూతచేతస్కయై యమ్మ
ణిమండపమునందు మరకతస్తంభాంతరితపంజరమునుండి యందుఁ గల
వజ్రోపలసాలభంజికాకరంబున నున్న కమలరాగ దాడిమీఫలంబుఁ
గని నిజమైనదానిఁగానమ్మి యెంతఁబ్రార్థించినను దాని నొసంగకుండు
టచే మిగుల వగచుచు నందందుఁ గల వివిధమణిపుత్రికలఁ జెలువ
లని భ్రమించి తనకోర్కె వారికిఁ దెలుపుచు నాక్రోశించుచుండెనని
విన్నవించెను.

ఆమాటలు విని యాభూజాని మిగుల నక్కజంపడుచు నారా! సకలతత్వావబోధబుద్ధిం గలిగిన యాచిత్రశిఖుని చైతన్యము కృత్రిమ ఫలాభిలాషచే నిట్లు తారుమారయ్యె నేమి చెపుమా? మందబుద్ధియై వీఁడు ముందెట్లు ప్రవర్తించునో చూచెదముగాక యని పలికి యానరేంద్రుం డావంకఁ దిలకించుచుండెను.

అప్పు డాచిలుక తనయభిలాషఁ దీర్చుకొనను ద్యమించి మిగుల రొదసేయుచు దృఢచంచూపుటంబున నాపంజరద్వారంబున కమర్పఁబడిన విద్రుమశలాకల మాటిమాటికి నాకర్షించుచు గట్టిగాఁ బొడుచుటచే నాకవాటము భగ్నమైనది. దాన నేర్పడినమార్గంబున నయ్యది బైట కేతెంచి యతిరయంబున సింహాసనస్థానవేదికపై కెక్కి సమీపమందలి రత్నపుత్రికాహస్తంగతమై యున్న పద్మరాగ దాడిమీఫలంబును ముక్కుతోఁ దీవ్రముగాఁ బొడువఁ దొడంగెను. దృఢ మణిశిలాస్ఫాలనంబున దానిచంచువు విగళితమయ్యెను. చంచుభంగమైనతోడనే చిత్రశిఖుండు శుకశకుంతస్వరూపంబు విడచి కరికర బాహుండును, నాయతభుజుండును, పరిఘ వక్షస్థలుండును, విశాల లాటుండును, నష్టాదశవర్షప్రాయుండును నైన పురుషపుంగవుం డయ్యెను.

ఆయద్భుతదృశ్యమును జూచుచున్న పుండరీకరాజేంద్రుఁ డత్యంతాశ్చర్యరసావేశహృదయుండై యేమేమి! ఈవింత! ఇంతలో నీచిత్రశిఖుం డేమయ్యె నని ససంభ్రమంబునఁ బలుకుచుఁ బార్శ్వవర్తులతో నావంకఁ జూచుచుండెను. ఇంతలో నందున్నపురుషుండు తనశుకశరీరమునుండి జాఱి యాప్రదేశమందుఁ బడియున్న దాని, నెద్దియో గ్రహించి చేతియందు చుట్టగాఁ బట్టుకొనియున్న యొకవస్తువును జూచి యెద్దియో జ్ఞప్తికి వచ్చినట్లు తలపంకించుచు మందహాస భాసురవదనారవిందుఁడై రమణీయం బగునామణిమండపము నలువంకలఁ దిలకించి పిదపఁ జూపుల బైటకుఁ బఱపినతోడనే యెదుర న

నేక నవశరంబుల గ్రహింపనున్న కుసుమసాయకునిలీల, నందనంబును భ్రమంబున నివసించిన పురందరునివలె, కమలకులభవనావాసినిదైన సిరిని గొనిపోవ నేతెంచిన పద్మనాభునిరీతి, నతిసుందరాకారంబున నొప్పుచు, ననేకచక్రవర్తిలక్షణలక్షితుండై, యనంతలావణ్యాలలితుండై, యశేషసామంతభూపాలాశ్రితుండై, యసామాన్యవైభవోపేతుండై, యనల్పగుణగణగరిష్ఠుండై, లీలాసరస్తటంబున నుచితాసనంబున నుపవిష్టుండై యున్న యాభూలోకరాజదేవేంద్రు నుపలక్షించెను.

తోడనే హృదయానందంబు మొగంబునఁ గనుపింప నత్యంత జవంబున నారాజేంద్రునిసమీపంబున కేతెంచి ప్రతీహారిముఖంబున రాజానుమతంబు వడసి వానియంతికంబున కఱిగి యుచితప్రణామాదికం బొనరించి తదనుజ్ఞ నర్హాసనంబున నుపవిష్టుండై వాని నిట్లు స్తుతించెను.

మ. అనఘా! గంధగజౌఘకుంభదళనం బందుర్ భవత్ఖడ్గమం
దున లగ్నంబయి చూడఁగల్గిన ద్యుతిస్తోమాతిగోళంబులన్
జనముల్ ముత్యములందు రయ్యది వృథాజల్పంబు సత్యంబదే
మన ధారాజలమజ్జదూర్జిత రిపోద్యద్బుద్బుదవ్రాతముల్.

శా. దేవా! నీయసిధార నాజిఁ దెగి యుద్వృత్తిన్ ద్విషచ్ఛీర్షముల్
ద్యోవీధిన్ బహురత్నసంయుతకిరీటోద్యద్ద్యుతుల్ మీఱఁగాఁ
బోవన్ నాకమయూరికబ్బె సుషమాపూరంబు, సౌరాంగనల్
భావోన్మేషతఁ బెండ్లివేడుకలకై వర్తింప నప్పట్టునన్.

పిమ్మట నానూతనపురుషుండు నిజవామకరంబునఁ బట్టుకొని యున్న యావస్తువును సవ్యకరంబున గ్రహించి యారాజచంద్రునితో నిట్లనియె. దేవా! జగత్త్రయనియామకుండగు బిడౌజునకైనఁ బొందరానిదియును నెల్లజనులకును జూడఁ దలంపుఁ బుట్టించునదియును నై

నీవస్తువును పశుపతిప్రసాదమునకుఁ బాత్రులైన దేవరకు సమర్పించుకొనుచున్నా నని పలుకుచుండఁగనే వసంతశీలుఁ డద్దాని నందుకొని పుండరీకున కర్పించెను. దానిం గ్రహించి యాభూకాంతుం డిదేమని పలుకుచు నతిరయంబున నాచుట్ట విప్పి చూడ నదియొక చిత్రఫలకముగాఁ గనంబడెను. అందుఁ దనస్వరూప మే లిఖింపఁబడి యుండుటఁ దిలకించి యత్యంతాశ్చర్యస్వాంతంబున నౌరా! నాస్వరూప మిట్లెవనిచేత నిందు వ్రాయఁబడె నని విస్మయ మందుచున్న నరేంద్రునితో సర్వసేనానాయకుండైన సింఘలాంగదుం డిట్లనియె.

---

329 వ మజిలీ.

# చిత్రపటముకథ

దేవా! ఇయ్యది మనసైన్యాధిపతి యగు పాంచాలసింహుని ధ్యానపటము. అతండు దేవపూజాసమయంబున నేలినవానియాకృతి నెదురఁ బెట్టుకొని యర్చించుచుండును. వెనుక నతండు దిగ్విజయార్థ మఱిగినప్పుడు భూమండలం బెల్ల జయించి ద్వీపాంతరంబుల నున్న రాజ్యంబులఁగూడ స్వాధీనంబు జేసికొన నంభోధిమార్గంబున నోడల మీఁదఁ బయనము జేయుచు సముద్రమధ్యంబున ధౌతసితసైకతంబుల నతిరమణీయంబగు నొకయంతర్ద్వీపంబున దిగి యచ్చటఁ బౌర్వాహ్ణికకర్మంబుల నిర్వర్తించుకొని కొంతసేపు విశ్రమించెను.

ఇంతలో ననుకూల మగుగాలి వీచుటంజేసి ప్రయాణమునకు నావికులు తొందరపెట్ట సత్వరమ యందుండి బయలుదేరి యోడ నెక్కెను. ఆతొందరలో దేవపూజోపకరణంబుల కధికారియైన వి

ప్రుం డీచిత్రపటము నయ్యంతర్ద్వీపంబున మఱచివచ్చెను. వారెక్కిన ప్రవహణం బప్పుడు నిముసములో ననేకయోజనంబు లేగువేగంబునం బోవుచుండుటచేతను, తాము విడిసినప్రదేశమును సముద్రమధ్యంబునం దెలిసికొనుట దుష్కరం మని తలంచి యాచిత్రపటమున్నకై వారు ప్రయత్నింపలేదని యూఱకుండెను.

ఆపలుకు లాలించి పుండరీకుండు తల పంకించుచు నాచిత్రఫలకమందు మఱొకప్రతిరూప ముండుట యెఱింగి యతికుతూహలంబున విమర్శింప నందొకస్త్రీస్వరూపముగూడగోచరమయ్యెను. సృష్టికర్తనిర్మాణనైపుణ్యము నభిలాషించురీతి, మనోభవుని పరిజ్ఞానతటినివలె, శృంగారవీరుని రణవ్యూహకల్పనములాగున, త్రిభువనసీమంతినీరూపసర్వస్వాపహరణం బొనరించి యుశ్వాసనిశ్వాసశబ్దములులేక డాగియున్న తస్కరీవిధంబున నావృతపటావస్థితమై, హరలలాటలోచనానలభయంబునం బారివచ్చి యడంగియున్న యసమశరశరీరసౌందర్యలక్ష్మివోలె నతిమనోహరాకారమై, శక్రశాపోపహత యగు నూర్వశీరమణివలెం జిత్రాకృతియై, దేవీస్వరూపమువలె ననిమిషలోచనయై, తపోనిష్ఠనున్న గౌరివలె ననావిలయై, మదనదాహామూర్ఛితయగు రతీదేవివలె నిశ్చలాంగలతావయవయై, పరమేష్ఠిసృష్టివిద్యవలె ననేకవర్ణప్రశోభితమై, చిత్రగతమై యొప్పు నాయొప్పులకుప్పరూప మీక్షించి సహర్షుండై యారాజేంద్రుం డిట్లని తలంచెను. ఆహా! ఏమి యీసౌందర్యస్వరూపము!

చ. అమలవిలాసలోకవిజయధ్వజభూషణచిహ్నమై, నవా
సమ సమవర్ణదీప్తమయి, సాధువధూజనరూపగర్వసం
క్రమితమునై, మనోజవిభుగాత్రనిగుప్తిం దనుత్రమై, మనో
జ్ఞమయిన నీస్వరూపము భృశం బెవం డిట్లు లిఖింపంగల్గెనో!

మఱియును—

గీ. అమరహిమధామునందున్న యమృతరసము
పొంగి పడ దానిఁ బటమందుఁ బూసి పుష్ప
బాణుఁడు నిజేషుతూలిక వ్రాసె దీనిఁ
గానిచో నింతసుఖ మెట్లు గనఁగఁ గలుగు ?

అట్లు గాకున్న నీచిత్రము వజ్రలేపంబున లిఖింపఁబడి యుండ వలెను. కావుననే యీచిత్రస్వరూపమున దృఢముగఁ దగుల్కొన్న నాదృష్టులందుండి మఱలుటకు సమర్థములు గాకున్నవి. ఈమోహ నాంగిరూపంబున మన్మథరాజ్యచక్రవర్తిలక్షణంబులు నియమితములై యున్నవి. ఈమెవిమల లలాటపట్టికపైన నలుపురంగుతో లిఖింపఁ బడిన ముంగురులు రూపవతులగు యోషిల్లలామల దర్పజ్వరాప హారకంబులగు మంత్రాక్షరశ్రేణులవలె నొప్పుచున్నవి. ముఱియును దీనిం దిలకించినపురుషులకు మనోవికారము గలుగునని వెరచియే రతీదేవి మన్మథునితోఁ గూడి సర్వత్ర పరిభ్రమించుచున్నది. రోహిణీ యరుంధతులు శశివశిష్టుల నుదయాస్తమయంబులనైనను విడువక పార్శ్వముల నుండిరి. లక్ష్మి విష్ణువక్షస్థలంబున సంతతము నిలచి యున్నది. శచీదేవి యనిమిషదృష్టుల నింద్రుని నెల్లప్పు డీక్షించుచు వాని బాయకున్నది. గౌరీసతిగూడ యంధకరిపుని యర్ధాంగమునఁ గలసియున్నది. ఇట్టి యసమానరూపలావణ్యముల నొప్పియున్న యీ రమణీమణి, నేమని వర్ణింపఁగల నని తలంచుచు నత్యంతకౌతుకావేశ హృదయసరోజాతుఁడై యాభూపతి శుకస్వరూపమును విడిచివచ్చిన పురుషపుంగవు నుపలక్షించి యిట్లనియె.

మహాత్మా ! నీ వెవ్వఁడవో ,నే నెఱుంగనైతిని. నీకుల మె య్యది ? కమనీయమగు నీనామధేయ మెయ్యది ? జన్మదేశ మెయ్య ది ? ఎవనిసన్నిధిని విద్యాభ్యాస మొనరించితివి ? ఈచిత్రఫలకము నందు లిఖింపఁబడిన యువతి యెచ్చట నున్నది ? ఈప్రతికృతి నీకెట్లు

లభించినది ? ఎందుకొఱ కిట్లు చిత్రంబున నీయువతీలలామ వ్రాయఁ బడియుండెను ? నీవు శుకశకుంతభావము నెట్లు పొందితివి ? దేనివలన నీకు తిరిగి నిజస్వరూపలాభంబు సంప్రాప్త మయ్యెను ? ఇట్లు ప్రశ్నించు పుండరీకున కానూత్నపురుషుం డిట్లనియె.

స్వామీ ! అత్యంతకుతూహలమును గలిగించు నావృత్తాంత మెల్ల సవిస్తరంబుగ విన్నవించుకొందు నని పలుకుచుండఁగనే సముచితార్థవేదియగు వసంతశీలుఁ డమ్మహారాజున కిట్లనియె. దేవా ! నవరసానుషంగమగు నీవృత్తాంత మాస్థానప్రదేశంబున విన నర్హంబగును. ఇచ్చట పరిజనులు ప్రతీహారహుంకృతుల మౌనము వహించి యున్నను, నాసన్నకుసుమమంజరుల ఝంకార మొనర్చు తుమ్మెదలును, పక్వఫలంబుల మెసవుచుఁ గలకలముసేయు శుకాదిశకునిసంతానములును, సహకారశాఖాగ్రములనుండి కుహూకార మొనర్చు పికసంతతులును, తమాలషండముల నెక్కి కేకారవ మొనర్చు మయూరవారంబులును, దీర్ఘికాపులినములఁ గోలాహలం బొనర్చు మరాళకులంబులును దుర్నివారంబులై యేలినవారిమనంబునకు సావధానమును బోఁగొట్టఁగల వని వచింప నమ్మహీపతి వల్లెయని సత్వరము లేచెను. తత్కథాశ్రవణకౌతుకభరంబున నడచువాని కైదారడుగుల దూరములో నున్న నమ్మణిమండపము గవ్యూతిశతాయితంబై గన్పట్ట నెట్టెట్టులో నాయుర్వీపతి మణిమండపముం జేరి యందు విమలమణిమయాసనంబున, సుఖోపవిష్టుఁ డయ్యెను.

330 వ మజిలీ.

# కుమారకేసరికథ

అట్లుపవిష్టుఁడై వినోదకథ శ్రవణమునకై సావధానమనస్కుఁడై యున్నయన్న రేంద్రుని యభిప్రాయ మెఱిఁగి వసంతశీల్కుఁ

డు కొండఁ బెట్ట శుకశరీరము విడిచివచ్చిన యామహాతనపురుషుఁ డిట్లని చెప్పఁ దొడంగెను.

దేవా! అవధరింపుము. భువనంబులఁ బ్రసిద్ధమగు మర్త్యలోక కీర్తివలె వివిధసౌధ సుధా ధవళమై, జంబూద్వీప జయశ్రీవిధంబున నున్నతాయతసధ్వజవిరాజమానమై, భారతవర్షసౌభాగ్యములీల మాణిక్యమందిరపరిశోభితమై, యుత్తరాపథప్రవృత్తికరణి ప్రభూతారామరమణీయమై, భూచక్రమును జుట్టియున్న మహార్ణవముయొక్క రూపాంతరమువిధంబున గభీర జలదుర్గమపరిఖావృత పరిసరమై, మిన్ను నొరయుటచే జారివడియున్న రవిరథతురగతుండడిండీరపిండములఁ బోలు చంద్రకాంతకపిశీర్షములతో వెలయు మరకతశిలానిర్మాణప్రాకారమై, సిరులకు నెలవగు ననేకచిత్రశాలల కాకరమై, పరిశుద్ధవర్తనులగు పురజనుల కావాసయోగ్యమై, ముల్లోకములకు నగమై పొగడ్త కెక్కిన మధుర యను పట్టణశ్రేష్ట మొకటి కలదు.

అందు మహేంద్రవిదళితుం డగు కంసదానవుని యంతఃపురపురంధ్రుల కాటుకకన్నీటిధారలచే నిండినదో యన నల్లనైన ప్రవాహజలము గలిగి వసుంధరారమణి భూవల్లరివలె, నుదగ్దిశాసీమంతినిమరకతరత్నహారమువలె, కళిందవీరునిక్రృపాణపట్టికవలె, పూర్వార్ణవకుంజరముచరణశృంఖలమువలె,నలరారుచు వైకటభారాతిభయంబున లోన నడఁగియున్న కాళియభుజంగుని జీర్ణనిర్మోకదళఖండములవలె నొప్పు డిండీరశకలంబులు దీరంబునఁ గలిగి విమలజలకేళీరసప్రసక్తగోపీగణాభ్యంతరవిహారి యగుమురారి శరీరసంపర్కమునఁ బవిత్రవంతములగు నుదకములు గలిగి మిగులఁ బ్రసిద్ధి కెక్కిన యమునానది యప్పురి కుత్తరదిశ నాశ్రయించి ప్రవహించుచుండును.

ఆపట్టణంబున కధినాథుండై కళిందకేతుండను రాజు గలఁడు. అతండు హరచరణసరోజసంసేవాసక్తచిత్తుండై నిజప్రతాపప్రసారము

న నరాతి[illegible] [illegible]చు, [illegible]
విభూతి ధరించుచు, నింద్రుని వలె సకలశాస్త్రముల [illegible]
బరీక్షించుచు, ననవరతసేవా వినమ్రసామంతమౌళిమణిమండిత [illegible]
సరోజాతుండై, యనంతపరాక్రమోపేతుండై, యనిర్వచనీయప్ర[illegible]
పుండై, దిగంతవిశ్రాంతకీర్తికలాపుండై మిగులఁ బ్రసిద్ధికెక్కెను.

చ. అతనియశోమరాళి కకుబంతములన్విహరించుచుఁ మురా
హితు నెదురన్ సుధాజలధి నీది వియద్గతిఁ బోవఁ దత్పయో
ప్లుత గరుదుజ్ఝితాచ్ఛకణముల్ గనఁ దారకలయ్యె దానియం
చితవలయాంగ ధీధితి విశేషము దా శశిబింబ మయ్యెడిన్.

ఆరాజోత్తమునకు విచిత్రగుణశాలురగు పుత్రులు బలువురు పుట్టిరి. వారిలోఁ గడఁగొట్టువాఁడు కుమారకేసరియను నపత్యోత్తముండు. వాఁడు చంద్రాదిరత్నములఁ గాలకూటాంకురమువలె, గ్రహములలోఁ గేతువువలె, సంవత్సరములయందు క్షయవలె, యుగములలోఁ గలివలె, నతిమలినాత్ముఁడై కడునింద్యచరిత్రుఁడై యుండెను. ఆయభాగ్యుఁడే నేనని యెఱుంగునది— నన్ను పితరులు సన్మార్గంబునఁ బెట్ట నెంతప్రయత్నించినను, నెన్నినీతు లుపదేశించినను పూర్వకర్మదోషంబున వానినెల్లఁ బెడచెవిం బెట్టి ద్యూతవిషయావర్తితహృదయుండనై మెలంగుచు వారి కెంతేని విషాదమును గల్పించితిని.

ఇట్లనుక్షణప్రవర్ధమానద్యూతక్రీడాభిలాషచేఁ గ్రమంబుగ నిజధనమెల్ల నాదుర్వ్యసనమునందు వెచ్చించితిని. ఒకప్పుడు బంధుజనుల నర్థించియు, నొకప్పుడు శ్రీమంతుల నాశ్రయించియు, నొకప్పుడు జానపదుల బెదరించియు. సంపాదించిన రొక్కమెల్ల నక్షతవవృత్తిం బెట్టుచు నెట్టులో కొంతకాలము గడపితిని. ఈవర్తనము నందుఁ దప్పక గెలుపుగలుగును. ఇదికాకున్న 'నింకొకదాని[illegible]

డైన జయము నిక్కమను నాసతోఁ గ్రిందుమీఁ దెఱుంగక ప్రవర్తిం
చుచుఁ గలధనంబెల్ల నోడి జననీజనకులకును, భ్రాతృవర్గమునకును
గూడ సహింపరానివాఁడనై యొకనాఁ డిట్లు చింతించితిని. ఔరా!
సమానులలో నే నెంత తేలికపడియుంటిని? నే నిట్లెంతకాలము గడు
పఁగలను? ధనహీను నెవ్వరును గౌరవింపరు. వాంఛితరసోపభోగ
సంప్రాప్తికి ధనమేగదా మూలము. ధనసమృద్ధి గలిగినవాని కేమి
లేకున్నను లోపముండనేరదు. శ్రీమంతులకు నాయకుండైన నా
తండ్రిధనాగారమెల్ల నామూలమున శూన్యమైనది. నాయనజ్ఞతకతన
నాజననిమణిభూషణములుఁ గోల్పోయెను. నాపైఁగల యనురాగము
వలన బంధువులెల్లఁ దమభాగ్యము నెడఁబాసిరి. రాజపుత్రుఁడ నను
గౌరవమూలంబున జానపదులు దమవిత్తమును బోఁగొట్టుకొనిరి. సా
మంతలోక మెల్ల నావలన నిర్బంధింపఁబడి యపారమగు సిరికి దూర
మయ్యెను. ఇంక నే నెచ్చటనుండి ద్రవ్యమును దేఁగలను? ద్యూత
క్రీడావినోదమహాభాగ్యం బెట్లనుభవింపఁగలను? ద్రవ్యోపార్జనంబు
నకు నూతనమార్గ మెద్ది గలదు? మహార్ణవమందు వివిధరత్నజాతులు
సంభవించునందురు. మఱియు రోహణాచలము మణిసమృద్ధమని వ
చింతురు. ఛీ! అగస్త్యునిచేఁ గ్రక్కఁబడిన సముద్రమందలి రత్నము
లు నాకెట్లు స్పృశింప నర్హములగును? రోహణాచలగర్భంబున ర
త్నంబుల నిక్షేపించుకొని దానిమీఁదఁ గూర్చునియున్న యాగృప
ణుని ధనము నాకెట్లు పనికివచ్చును? లేకున్న మదీయభుజబలంబున
రోహణనగేంద్రమును మథింపకుందునా? ప్రతాపానలంబున సము
ద్రము నింకింపకుందునా? అభిమతార్థసిద్ధికి వీరుల కసాధ్య మేమి
గలదు? ఇఁక ధనసమార్జనమునకు మఱొక్కమార్గ మేది గలదు?
బాగు. బాగు. చక్కఁగా జ్ఞప్తికి వచ్చినది. సకలసువర్ణమణిమయా
గారపరికరంబులచే నొప్పుచు రాక్షసులకు నివాసమైన లంకాపట్టణ

మున్నది గదా ? దానిని పూర్వము స్త్రీహృదయుఁడగు రాముఁడే సాధించియుండ నశేషభువనైకవీరుండనగు నేనుమాత్ర మిప్పుడు జయింపఁ జాలనా ? కావున నేనట కేఁగి యాపురమును హఠాత్తుగా నాక్రమించి యందున్నసువర్ణశిలాసంభారంబెల్ల సంగ్రహించి కుబేరుని నాఁటినుండియును సంపాదింపఁబడి ధనాగారమున దాచియుంచిన విభీషణునిధనమెల్లఁ గొల్లగొని దానిని నాకు వంగి నమస్కరించు రాక్షసులమూఫులం బెట్టి యిందుఁ దెప్పించెదం గాక. అపూర్వముగాని ద్యూతవ్యసనమందు నామనంబున కాతంకము గలుగనేరదని నిశ్చయించుకొని దిగంతయాత్రోచితసమయం నపేక్షింపక ముందువెనక లరయక ద్యూతకార్యావ్యవస్థితహృదయుండనై పలువుపరికరముల స్వీకరించి నాఁటిమధ్యాహ్నము గడచినపిమ్మట నితరు లెవ్వరికిని దెలియకుండ నేకాకినై యిల్లు వెడలిపోతిని.

అట్లు గృహప్రతోళీద్వారంబున నిర్గమించి యిట్లని తలంచితిని. ఔరా ! నేనిట్లు ప్రయాణపరికరంబులతోఁ బోవుట యెవఁడయినఁ జూచెనేని నాజననీజనకులతోడను బంధువులతోడను జెప్పకమానఁడు. దేశాంతర మరుగుచుండుటఁ దెలిసి తోడనే వారు నాకడ్డ రాకమానరు. లేకున్న నావెనువెంట నెవరినైన సహాయము బంపకుండలేరు. దాన నాకనేకములగు నంతరాయములు గలుగఁగలవు. కావున నొరు లెవ్వరికంటఁ బడకుండ జనపదమునకుఁ జేరువదారినిఁ బరిత్యజించి పోయెదంగాక యని నిశ్చయించి యతిత్వరితగమనంబునఁ బురపరిసరం బతిక్రమించి దక్షిణదిశ కేగుమార్గంబునంబడి నడచుచు సూర్యాస్తమయ సమయంబునకు యోజనశక్తిక యను గ్రామంబును జేరుకొంటిని.

ఆపురంబు జేరినతోడనే యెదురఁ గనంబడిన యూరిచెరువు నందు సాయంతనసంధ్యాదివిధుల నిర్వర్తించుకొని యప్పటికే చిమ్మ

చీఁకటిచే నావృతమైయున్న యాగ్రామములోని కరిగి యితరు లెవ్వరుఁ జూడకుండ నాకుఁ బూర్వపరిచితుండగు పిప్పలకుండను వృద్ధద్యూతకారునిగృహమును దెలిసికొని యందుఁ బ్రవేశించితిని. అతండును నభ్యాగతుండ నని, రాజపుత్రుండనని, ద్యూతమిత్రుండనని, నాయం దత్యంతాదరము జూపుచు యథోచితస్వాగతప్రశ్నాసనాది సత్కారముల నాకొంతేని సంతసమును గూర్చెను. పిమ్మట భోజనము జేసి శయ్యాగతుండనైయున్న నాసన్నిధి నాసీనుఁడై యతం డతి వాత్సల్యముతో "కుమార! దూరదేశయాత్రకుఁ బోవఁ దలంచినట్లు కనంబడుచుంటివి. ఎచ్చటి కరిగెదవు? ఏమిపనిమీఁదఁ బోవుచుంటివి? పరులెవ్వరికిని దెలియఁగూడనిప్రయోజనమం దేమిగలదు? తోడులేక పోవ నేమిటికని ప్రశ్నించెను. "సత్య మెఱింగించిన నాప్రవాసమున కంగీకరింపక యితండు నాజనకున కీరహస్యము దెలియఁబంపి నాపయనంబున కంతరాయము గల్పింపఁగలఁడు. అట్లుగాకున్న వృద్ధుఁడై నను నాయందలి ప్రేమచే వెంటఁబడును. వీనిని నమ్మరాదు. యథార్థమును గోప్యముజేసి వచించి వీనిని వంచించెదఁగాక" యని దలంచి వానికి నే నిట్లంటి:—

పిప్పలకా! వినుము. ఇచ్చటకు దక్షిణముగా సముద్రము గలదు. దానిని దాటిన నమానుషప్రచారమైన ప్రదేశ మొండు గన్పించును. అందు దేవతలకైన నసాధ్యమగుభాగ్యము గలదు. దానిని నేను సాధించి తెచ్చుటకుఁ బోవుచుంటి నని ప్రత్యుత్తరం బొసంగితిని.

అతిప్రసిద్ధద్యూతరసికుండ నని నన్నెఱింగిన యతండు జూదమునకై యెవనినో నిర్బంధించి ధనము దెచ్చుట కెచ్చటికో పోవుచుంటి నని తలంచి దృఢప్రతిజ్ఞుండగు రాజపుత్రుని ప్రతికూలవచనంబుల నొప్పింపనేమిటి కని యూరకుండెను. పిమ్మట ద్వారప్రదేశము

న కరిగి సేవకునిభాతి నాయుధము బూని యారాత్రియెల్ల మేల్కాంచి యావృద్ధుం డుండెను. నేనును దూరము నడచివచ్చినశ్రమచే గాఢముగా నిద్రఁబోతిని. రాత్రి మూఁడుయామములు దాటినపిమ్మట నా కొకస్వప్నమైనది. ఒకానొక కాననంబున వనలక్ష్మివలె నతిసుందరాకారమున నొప్పు స్త్రీరత్నము మబ్బులోఁ జిక్కుకొనియున్న కంఠీరవము నుద్దేశించి యిట్లనినట్లు వినంబడెను.

గీ. విక్రమంబునఁ గరిబృందవిదళనైక
మల్లుఁడ వతిబలుండవు మహి మృగేంద్ర!
కాని యిపుడు పయోభృతిఁ గడిమిసెడితి
వకట! విధిముందుఁ బౌరుష మడఁగదొక్కొ.

ఇట్లు విని స్వప్నసంభ్రమంబున వెంటనే మేల్కాంచి యిట్లని తలంచితిని. ఆహా! ఇది కల. ఈవిధంబున నాయన్వయదేవతదైవబలంబు లేకున్న నేపనియును సాధింపఁబడదని సింహాశిక్షాకైతవంబున నా కుపదేశ మొనర్చియుండ వచ్చును. పయోభృత్ప్రశంసవలన నేను దాటవలసిన సముద్రము స్ఫురించుచున్నదిగదా! కాని కలలెల్లఁ గల్లలు. అట్టివానిం బురస్కరించుకొని బడలు పడుట కాపురుషలక్షణము. కావున వివేకముగలిగి నాపూన్కె నెఱవేర్చుకొనెదను. ఇప్పుడే నే నిందుండి బయలుదేరిపోయెదం గాక! విధి బలీయమని చెప్పుట యీనాటిమాట కాదు. దాని నెవ్వరును విశ్వసింపఁదగదు. నే నొక్కఁడనైనను నన్నెదుర్కొను బగతుర బిక్కుమార్చియైన ముం దేఁగఁగల నని దర్పోద్రేకంబున లేచి పిప్పలకా! నీ వుండుము. నేఁ బోయివచ్చెద నని వానిని వీడ్కొల్పి యటనుండి గదలి యమందగమనంబున నాగ్రామము విడచి పోయితిని.

దుర్వ్యసనపరాయణుం డెట్టివాఁడైనను నవహాస్యమునకు లో

నగునుగదా! అట్లు బోవుచు నే నేనగర మేఁగినను, నేగ్రామము ప్రవేశించినను, 'నెవనియింటిలోని కరిగినను నచ్చటివారు వీఁడు జూదరి. మనయిండ్లలో నేమైన దొరికిన దోఁచుకొని పోఁగలఁ డని జాగ్రూకతతో నే నావలి కేగువరకు కనిపెట్టుకొని యుండెడివారు. ఒకొక్కయూర ద్యూతవిద్యానిపుణులు నన్నాదరించి యక్షక్రీడా సక్తుం జేయుచుందురు. ఆయానంగంబున నాపయనముమాటయే మ అపు వచ్చుచుండెడిది. అప్పుడప్పుడు జూదమువలనఁ గలిగిన గెలుపు సొమ్ము పూర్తిగ నోడువఱకు నావ్యసనంబునం బడి మైమఱచి యుం డెడివాఁడను. చేతఁ గాసైన లేనప్పు డింకెట్లు ద్యూతక్రీడకు గడఁగు వాఁడ నని చింతిల్లుచుందును. ఒకప్పుడు వివేకముగల్గి నామూఢత్వ మునకు నేనె నవ్వుకొనుచుందును. ఇట్టిప్రవృత్తితో ననేకదినంబులు గడపుచుఁ బయనము సాఁగించుచుండ నుత్తరదక్షిణావనీభాగములు గలపించి యొండొంటి డీకొన నారెంటినడుమఁ దగవుదీర్ప నడ్డుగాఁ జాపిన సముద్రుని భుజదండమువలె నొప్పుచు, గాలిచేఁ గదలు వీచి కాశిఖరశీకరప్రకరములతో వరుణకుంజరమదావస్థయనఁ జెలఁగుచుఁ దీరముల నిర్మింపఁబడిన తాపసానేకకుటీరములచే ధర్మపురమువలె నలరారుచు, నిర్వాణనగర వీథివలెఁ జెలువైన రేవాపరాభిధానము గల నర్మదానదీతీరమును జేరుకొంటిని.

మ. ఘనరేవాభిదనొప్పుదాని విశదాఖర్వప్రవాహద్యుతిన్
 గన సాతూద్దివినుండి వచ్చిన వియద్గంగాసరిద్రీతి నొ
 ప్పెను. వాతోచ్చలితాంబుబిందుతతి తద్విఖ్యాతతీరాశ్మవీ
 థిని జెందన్ గనుపించెఁ దారకలు బ్రోదిన్ జేరియున్నట్లొగిన్.

 పిమ్మట నే నామహానదికి నమస్కరించి దానిం దాటి దక్షిణా పథంబునం బ్రవేశించితిని. అందుండి తిన్నఁగా సముద్రమధ్యమం దున్న లంకాపురంబున కేఁగ నత్యుత్సాహంబున బయలుదేరితిని.

ఇట్లు క్రమంబున భిల్లపల్లియల నతిక్రమించి, గ్రామంబుల విడచి, నగరంబులఁ బరిత్యజించి, వనంబులఁ దరించి, పర్వతంబుల దాటి చివుర కత్యంతభీకరంబగు నొకమహారణ్యమధ్యంబునఁ జిక్కుకొంటిని. ఇంతలో సూర్యుం డస్తంగతుఁడయ్యెను. క్రమంబున గాఢతమంబు దిశల నాక్రమించి నేత్రములున్న ఫలంబు బోఁగొట్టెను. అప్పు డిట్లని చింతించితిని. అయ్యో ! ఇమ్మహారణ్యంబున నిరపాయంబుగ నెచ్చో టనుండి యీరాత్రి గడపఁగలను ? ఏచెట్టుతొఱ్ఱలో విశ్రమించి యుందును ? ఏకొండగుహలలోఁ దలదాచుకొందును ? ఏ నికుంజపుంజంబున నడఁగియుందును ? ఇంతకన్న నివసింప ననవగు తావు ముందెద్దియైన దొరకునేమోయని వితర్కించుచు నంధకారబంధురమ్మగు నమ్మహారణ్యంబున నతిభయంబునఁ బరిభ్రమించుచుంటిని.

ఇంతలో దూరంబున నాకటికిచీఁకటిలో మురారివక్షస్థలకౌస్తుభమువలె, ప్రకాశించుచు దీపభ్రాంతిఁ గొల్పు వెలుఁ గొకటి ముందుఁ గనుపించెను. దానిం జూచి సంశయాకులితచేతస్కుఁడనై ఔరా ! ఆవెలుఁ గేమైయుండును ? ఏదైన దీపకాంతియా ? లేక రవులుచున్న దావాగ్నిశిఖయా ? కాకున్న నేదైన దివ్యౌషధివిశేషమా ? ఏదైన నగుఁగాక. దీని ననుసరించి పోయి నిజ మెఱింగెదనని నిశ్చయించుకొని యావైపు బోవ ముందు నా కొకజీర్ణదేవతాయతనము గోచర మయ్యెను. దానిముం దొకమండపము గలదు. అప్పుడు నే నతిహర్షంబున దానిని సమీపించిచూడ దుర్గాదేవివిగ్రహాలయిటుక లూడినగోడయందుఁ జిరకాలముక్రిందటఁ జచ్చి శల్యావశిష్టమై యున్న పన్నగశిరంబున వెలుఁగు దివ్యరత్నము గాన్పించెను. అప్పుడు నేను విస్మయమందుచు నౌరా ! ఈచండికాయతన మంతయు శూన్యముగానున్నదేమి ? బాగు, బాగు. ఈభుజగమణియే దీపభ్రాంతిఁ గొల్పి నన్నిందుఁ జేర్చెను. ఇందు నేను కరచరణ

ముఖంబులం గడిగికొని యాచమనం బొనర్చి శుచినై యీయమ్మ
వారికి నమస్కరించెదంగాక యని యిటునటు బరికింప ముందొక
యల్పవిరసాంబువులతోఁ బాడుపడియున్న పుష్కరిణి గనుపింప నందు
విధ్యుక్తధర్మంబుల నిర్వర్తించి సత్వరమ యాదుర్గాదేవిసన్నిధి కఱిగి
"జయ జయ త్రిభువనజనాప్యాయినీ కాత్యాయనీ" యని భక్తిప్ర
యుక్తవచనంబుల నిట్లని స్తుతించితిని.

శ్లో. స్వామిన్యార్యే భుజంగాభరణవలయిని స్థూలశూలాస్త్రచండే
చాముండే చండి చంచన్నిబిడనరశిరఃస్రక్పరీతాంగి దుర్గే
దేవి స్వర్నాథచూడామణికిరణకణశ్రేణిధౌతాంగ్రిపా
ద్వంద్వే వంద్యేఽభిసంద్యే జనని జయజయ శ్రీమహాకాళి దివ్యే.

ఇట్లు స్తుతించి యాయమ్మవారికి సాష్టాంగనమస్కారం బొన
రించి లేచి యన్యపథికజనోపలబ్ధి నపేక్షించుచు బహిర్మండపమున
కేఁగితిని. అందుఁగూడ నెవ్వరును లేరు. లోనఁ బ్రతిష్ఠింపఁబడియున్న
క్షేత్రపాలకవిగ్రహముం గాంచి యిట్లని స్తుతించితిని.

శ్లో. ధృత్వావేశప్రసక్తై ర్జ్వలదనలముఖోన్ముక్తఫేత్కారఘోరైః
క్రూరై రుత్తాలతాళవ్యతికరముఖరీభూతభూమాస్థిమాలైః
క్రీడంతం ప్రేతరంకైః కుణపభువిమహాజంగలగ్రాసలోభ
భ్రామ్యద్భల్లూకఘూకప్రకరపరిగతం క్షేత్రపాలం నమామి.

పిమ్మట నమ్మండపంబున నించుక విశ్రమించి విస్మయంబునఁ
గనులు మూసికొని యిట్లు ధ్యానించితిని. ఔరా! విధివిధాన మతి
విచిత్రమైనదిగదా? అతిభయంకరమహారణ్యమధ్యమందుఁ జిక్కి
జీవితాశ వదలుకొనిన నాకు రత్నజ్యోతిం జూపి యిందుఁ జేర్చెను.
కాకున్న నిట్టిగాఢాంధకారంబున నీయాయతన మేరీతి గోచరమగు?
నని తలంచుచుఁ గనులు దెఱచి చూచినంత మణికింకిణీరణత్కార
ముతో నంబరమునుండి దిగుచున్నవాఁడును, కటికిచీఁకటిలోఁ గూడఁ

దన్నావరించియున్న నిజతనూద్యుతిచే విస్పష్టముగఁ గనుపడువాఁడు
ను, చరణనూపురధ్వని విని వెన్నంటివచ్చు గగనగంగామరాళ
బాలకశ్రేణివలె ధవళనరకరోటిమాలిక నుత్తరీయముగా ధరించువాఁ
డును, భస్మావలేపనంబున సితాచ్ఛధూళిధూసరిత మగు మోక్ష
మార్గమునఁ జరించు బాటసారివలె నొప్పువాఁడును, నస్థిమణిభూషణ
భూషితుం డై గగననగరంబునం గల తారకధనమెల్ల నపహరించు
కొనివచ్చు దొంగవలె నెన్నఁదగినవాఁడును, వామకరంబున శుక్ల
కపాలశుక్తికం దాల్చి శశిబింబార్ధమును సంపూర్ణముగఁ జేయ దా
నిని జేతఁ బట్టికొనినవిధాతవలె నొప్పువాఁడును, పూదండవలె నల్పా
స్థికర్పరకంబులచేఁ జుట్టఁబడిన జటాకలాపము దాల్చినవాఁడును నగు
కాపాలికుం డొకండు నాకుఁ గనంబడెను.

అట్లు పుడమికి దిగి యాకాపాలికుండు తొలుత నతిభక్తి నా
దేవి కభివందనం బొనర్చి పిమ్మట నన్గాంచి విస్మితుం డై నాసమక్ష
మున కేతెంచెను. నేనును లేచి వానికి నమస్కరింపఁ బ్రీతుఁ డై మ
దంతికమునఁ గూర్చుండి వత్సా! దురతిక్రమాపాయబహుళం బగు
నీమహారణ్యమధ్యంబున నెట్లు జిక్కుకొంటివి? ఎచ్చటనుండి వచ్చి
తివి? నీ కిం దేమినిమిత్తము గలదని సంభ్రమంబునఁ బ్రశ్నించు
వానిసన్నిధిని నిజము మరుగుపఱుపఁజాలక యథార్థమెల్లఁ జెప్పి నా
పూన్కికుఁ దగుసహాయము జేయుమని ప్రార్థించితిని. నావృత్తాంతము
సాంతముగ విని యామునిముఖ్యుండు శిరఃకంపం బొనరించుచు
నిమేషమాత్ర మేకాగ్రచిత్తుఁ డై నావంకఁ దిలకించి తోడనే పర్యంక
బంధంబున సుస్థిరుఁ డై యాకసమువంకఁ జూపు నిగుడించెను. తోడన
తళతళమెఱయుఁ గౌక్షేయక మెచ్చటనుండియో వచ్చి వానిముందఱఁ
బడెను. దానిం గైకొని యతండు మందహాస మొనరించుచు, వత్సా!
ఈకృపాణమును గైకొనుము. నీపూన్కి కిది సన్నిధినుండిన నెంతపని

నైన సాధింపఁగలవు. ఇయ్యది దివ్యప్రభావము గలది. దీనిం జేపట్టి యున్నవానిని దేవదానవులైన నిర్జింపఁజాలరు. దీనివలన నీయభీప్సిత మీడేరఁగలదు. కావున నతిజాగరూకుఁడవై కాపాడుకొనుచుండు మని చెప్పి నన్నాశీర్వదించి యాకత్తి నిచ్చి యాకాపాలికుండు వియ ద్గమనంబున నెచ్చటికో పోయెను.

తత్కృపాణలాభంబునకు మనంబున నత్యంతసంతోషమును బొందుచు నప్పటికే రాత్రి చాల గతించుటచే నించుక విశ్రమింప నెంచి యాదేవీభవనంబులోనికిం బోయి యందొకచో శయనించి గాఢముగా నిద్రఁబోతిని. ఇంతలో వెలుపల నెద్దియోసందడి యగుట చే మెలఁకువ వచ్చినది. బహిర్మండపమునఁ జాలమంది జూదరులు ద్యూతక్రీడాభిరతిం దవిలియున్నట్లు వారిమాటలవలన నాకుఁ దెల్ల మయ్యెను. ద్యూతప్రసంగము చెవులఁ బడినయనంతరము నాకన్నుల కు కునుకురాలేదు. ఆయాటఁ జూడవలయు ననునుత్సాహము నెమ్మ నంబును వేధింప, నతిరయంబున నందుండి లేచి కృపాణము చేతఁ బూని వారిసమీపమునకుఁ బోయి యాసమాజమందుఁ జేరి యమంం దానందంబున జూదమాడఁ దొడంగితిని. అక్షవిద్యారహస్య సంవేది నైన నేనే యందున్నవారికెల్లఁ బైచేయినై యన్నిపందెములు గెలుచుకొంటిని. నా కందుఁగలపాండిత్యమెల్లరును బ్రస్తుతింపసాఁగిరి. వారు కొనివచ్చిన దివ్యమణిసందోహ మెల్ల నాకు క్రమంబున వశ మయ్యెను. తిరుగఁ బందె మొడ్డుటకు వారియొద్ద నింకేమియును లే నందున విభ్రాంతులై చూచుచుండ మింటనుండి విమానముమీఁద నొకపురుషుం డం దేతెంచెను. వానిని నేను దివ్యపురుషుండని భావిం చితిని. మాయుదంత మెల్ల నతండు విని మందస్మితంబున నాతో నిట్లనియె.

పుణ్యపురుషా! నీయక్షక్రీడాపాండిత్య మపారమైనది. ఇట్టి

నీతో విలాసముగా నాడుటకు నామనం బెంతేని యుత్సుకతం బొందు
చున్నది. కాని పణ మొడ్డుటకు నాయొద్ద నీవిమానముకన్న నొం
డెద్దియును లేదు. కావున దీని నే నొడ్డుచున్నాను. పందెము వేయు
మని నన్నుఁ బురికొల్పెను. నే నంతకు గెలుపొందిన రత్నములఁ
గొన్నిటి నొడ్డి పందెము వైచితిని. కాని నేనే యోడితిని. ఇంకొక
పందెము వైచితిని. అదియునుగూడ వెనుకటిదానివలెనే యైనది. నే
నార్జించిన మాణిక్యరాశి నెల్ల నతండు గెలుచుకొనెను. అన్ని
పందెములు నేనె యోడుచుండుట నాకెంతేని యబ్బురముగాఁ దోఁ
చెను. ఇంకఁ బణ మొడ్డుట కేమియును జేత లేనందున నేను విభ్రమం
బుననుండ నతండు మందస్మితంబుగ సోదరా! ఊరకుంటి వేమి?
ఇదియే కడపటియాట. నీయొద్ద కృపాణ మున్నదిగదా! నీవు దాని
నొడ్డుము. దానికిఁ బ్రతిగ నావిమానము నే నొడ్డెదను. ఇది దివ్య
యానంబు గలదని యెఱుంగుము. నీకృపాణమున కిది తీసిపోదని
పలుక నేనందులకు సమ్మతించితిని. తృటిలో నాదివ్యయానము నావశ
మయ్యెను. అంతటితోఁ దృప్తిపడక నే నాకృపాణము నే యొడ్డి యిం
కొకపందెము వైచి యోడిపోతిని. ఆచంద్రహాసము నాపురుషుండు
గైకొని యింక నాట చాలు నని చెప్పి మాయమయ్యెను. అందున్న
వారెల్ల నిముసములో నేమైరో గ్రహింపకుండఁ బోయిరి. నేను గెలు
పొందిన విమానముమాత్రము నాసమీపమం దుండెను. దానికి నేను
విస్మయ మందుచు నిట్లని తలంచితిని.

ఔరా! ఇదేమి చిత్రము! ఇంతలో వీ రంద ఱేమైరి? అ
య్యో! నాయం దత్యంతవాత్సల్యంబున నమ్మహానుభావుం డొసంగిన
దివ్యకృపాణమును నిముసములోఁ బోగొట్టుకొంటిని! దానిసహాయం
బున నే నెన్నియో యద్భుతకార్యముల సేయ నెంచితిని. అన్నియును
వ్యర్థము లైనవి. నాదుర్వ్యసనలోలుపత్వమే నన్నింతకుఁ దెచ్చెను.

బుద్ధి వచ్చినది. ఆశక్తి యున్నవానిని దేవదానవులుగూడ జయింపఁ జాలరని యమ్మహాత్ముండు మొదటనే చెప్పియుండెను. కావుననే దానిని నాసన్నిధినుండి యపహరించుటకు వీరెవ్వరో యిట్టిపన్నుగడ వేసియుందురు. వీరిమాయల నే గ్రహింపఁజాలక చేతి కబ్బిన లిబ్బిని చేతులార జారవిడిచితిని. పోనిమ్ము. నే నిప్పుడు పూర్వమువలెనే యుంటిని. ఆకాపాలికుండు నాకాఖడ్గము నొసంగలేదని యనుకొనెదం గాక! అట్లనుకొననేల? దానికి మాఱుగ నా కీవిమానము లభింప లేదా? ఇది కీడులో మేలు. దీని కంతరిక్షగమన మున్నదిగదా? నే నిం దధిష్ఠించి లంకాపట్టణంబునకుఁ ద్రుటిలోఁ బోవచ్చును. నాపయ నంబునకుఁ బరమేశ్వరుండు దీని నాధారముగ నొసంగెఁ గావలయును. నాపూన్కి నెఱవేర్చుకొనుట కాఖడ్గప్రవరంబుగూడ నున్న నెంత బాగుండును? నాభుజబలపరాక్రమంబులకుఁ దోడుగ నీవిమానము తో నాఖడ్గముగూడ నున్న ముల్లోకముల జయించి యపరదివస్పతి నై చెలంగకుందునా? కలిగినదానితో సంతృప్తి నందుట ధీరలక్షణ మందురు. ఆకృపాణము లేకున్నను మద్భుజబలంబుమాత్రంబుననే లోకమంతయును సాధింపఁగలను. భుజబలసంపన్నునకు సాధింపరాని దెద్దికలదు? ఈవిమాన మెక్కి నే నిప్పు డేల లంకకుఁ బోవరాదు? దివ్యశక్తిగల విమానయానము ఒ న్నధిష్ఠించి యున్నవాని యిచ్ఛ వచ్చినచోటికిఁ బోవునని చెప్పుదురుగదా! కావున దీని నధిష్ఠించి నే నిప్పుడే లంకాపురంబునకు బయన మగుట యుక్తమని నిశ్చ యించి యాక్షేత్రపాలునకును దుర్గామహాదేవికిని భక్తిప్రణామంబు లాచరించి యతిసాహసంబున నవ్విమాన మధిష్ఠించి లంకాపురంబున కేఁగవలెనని తలంచుకొంటిని.

మహారాజపుంగవా! వినుము. నే నవ్విమాన మెక్కినతోడ నే యది యతిజవంబునఁ బైకిలేచి హరగళగరళమలీమసం బగు నంత

రిపుశిఖరంబున కేఁగి యందుండి ముందున కరుగఁదొడంగినది. అట్లతి
వేగంబునఁ బోవుచుండ దానిస్వచ్ఛపతాకకాంతికలాపము గాలిచేఁ
గొనిరాఁబడిన గగనగంగాడిండీరపటలమువలె విలసిల్లెను. తిమిరపటము
నడంపఁ గొనిపోఁబడు ప్రదీపతంత్రమువలె నవ్విమానంబున నమర్పఁ
బడిన యనంతరత్నద్యుతులు జెలఁగెను. తదీయకింకిణీరణత్కార
నిస్వనంబు వేగంబున సమీరవీరునిజయించి యొనరించువిజయకోలాహల
ముగతిని నతిశయించెను. మఱియు నయ్యది గతివేగంబునఁ గదలుపతా
కములపటపటాత్కారముతోఁ గనకదండముల నభస్తలంబును విదారిం
చుచు, జలధరముల నతిక్రమించుచు, తారకలఁ గదలించుచు, నతి
జవంబున నల్లరుగుచుండ నప్పటికి చీఁకటి యడంగి వెలుఁగు వచ్చి
యుండెను. అందు నే నన్యునిచే నడపింపఁబడు నంధునివిధంబున నే
దిక్కునకుఁ బోవుచుంటినో, దేని నతిక్రమించితినో, ముం దెచ్చటి
కేఁగుచుంటినో, యందలిభూము లెట్టివో, గిరిసరత్కాంతారపరిగతం
బగు నమ్మార్గం బెట్టిదో, యందలిజనపదంబు లెట్టిప్రచారము గలవి
యో యించుకయునుఁ దెలిసికొనఁజాలకుంటిని. కాని మాటిమాటికిఁ
జల్లనిపిల్లవాయువులు నెమ్మేన సోఁకుచుండ నావిమానయానంబున
గమనసుఖమునుమాత్ర మనుభవించుచుంటిని. రాజేంద్రా! ఏమి చె
ప్పుదును! అట్లు పోవుచుండఁగా నొక్కచో నావిమానము దివ్య
ప్రభావమెల్ల భగ్నమైనట్లు, సంచారయంత్రము చెడిపోయినట్లు ముం
దేఁగ సమర్థత లేనట్లు, యెవనిచేతనో నిరోధింపఁబడినట్లు కదలకుండ
నాగిపోయినది. అందులకు నే నతివిస్మయావేశహృదయుఁడనై నే
యడ్డంకియు లేని యానభోమార్గంబున నతిజవంబున నేఁగుచున్న
విమాన మెందులకు నిలిచిపోయినదో నే నెంత యాలోచిం
చినను నిజస్థితి నించుకయును దెలిసికొనఁజాలనైతిని. దానియడుగు
భాగమున నమరింపఁబడియున్న విమలమణిదళమునుండి గనుపడు

దురంతవిస్తారమగు పయోరాశిమాత్రము గోచరమయ్యెను. దానిం గాంచి నే నక్కజంపడుచు నింతనీరున్న ప్రదేశ మెద్ది ? ఇదే దేనియొక మహాప్రహదమా ! లేక మింటి కెగయు తరంగములతో నొప్పు సరోవరమా ? కాకున్న లంకాపురంబును జుట్టుకొనియున్న దక్షిణాంభోనిధియై యుండునా ? అని యిట్లతిడోలాయమానమానసుండనై వితర్కించుచుండఁ దోడనే కింకిణీనినాదమునఁ గలకల ముదయింప నా విమానము గంపింపఁదొడంగెను. ఆకదలికకు నేనందుఁ గూర్చుండఁ జాలక యత్యంతభయంబున దానిదండి నూఁతఁ జేసికొనఁబోవుచుండఁ గా నాతో నవ్విమాన మాయంభోధిమధ్యంబునఁ బడిపోయెను.

ఆ యగాధజలగర్భంబున మునిఁగినతోడనే నాకుఁ జైతన్యము తప్పినది. తిరుగ నా కెట్లు తెలివివచ్చినదో నే నెఱుంగను. అప్పుడు నాకువిమానముగాని సాగరముగాని గనుపింపలేదు. కాని విమలవిద్రుమ శిలానిర్మాణమగు నొక ప్రాకారమణిమయద్వారము నాయెదుటఁ గనుపించెను. దానిం దిలకించి విస్మయమందుచు నేనిట్లు దలంచితిని. ఔరా ! నన్నిందుఁ జేర్చిన యావిమానయాన మేది ? నేను మునిఁగిన యాసముద్ర మేమైనది ? నే నందు మునుఁగలేదా ? పారావార నిమగ్నములైన నాయంగముల నట్టిచిహ్నంబు లేమియును గనంబడ వేమి ? నేను మఱొకఁడను గానుగదా ? బహుతరంగతాడితసర్వాంగుఁడ నగు నాకిట్టివిధంబునఁ గనుపించుచున్న దేమో ! ఇయ్యది సముద్రగర్భమం దెద్దియో గొప్ప యింద్రజాలముగాఁ దోఁచుచున్నది. తిమితిమింగిలాది జలజంతువులగర్భమం దెచ్చటనైన నే నిప్పు డుండలేదుగదా ? వెనుక యోజనశక్తికాగ్రామంబునఁ బిప్పలకునియింటఁ గలలోఁ గాంచిన స్త్రీ సింహాకృతికైతవంబునఁ బౌరుషముకన్న విధి బలీయమని పల్కినమాట లన్నియును యథార్థములైనవి. సముద్రమందు మరణించి నేనిప్పు డపరలోకంబున కేతెంచియుండుట నిక్క

ము. ఈ ప్రాకారాంతరము నున్నది యమమందిరముగా వచ్చును. నేను నరకలోకమునఁ బడితినా ? కాదు కాదు. నేనంత నికృష్టుండ నైనను నంత్యదశయందు దివ్యపురుషసందర్శనం బొనరించి దివ్యయానాధిష్ఠితుండ నగుటచే నాకు త్తమలోకసంప్రాప్తి కలుగవలెను. కావున నిది స్వర్గద్వారము. నరకస్వర్గంబుల నేదియైన నింతశూన్యముగ నుండునా ? అయ్యో ! నేనిప్పు డేదియు నిశ్చయింపఁజాల కున్నాను. ఏమైనఁ గానిమ్ము. నాకిట నీయవాంతరవితర్కమేల ? ఈ ప్రాకారాంతరంబున కేఁగెదంగాక. పిమ్మట నేమి జరుగనున్నదో యది జరుగఁగలదని తలంచుచుఁ జంద్రకాంతమాణిక్యవిఘటితకవాటముచే నతిసుందరమైన యాప్రాకారద్వారమున లోనఁ బ్రవేశించితిని. అందు దట్టమగు మణిధూళిచే నరుణకాంతులీను మార్గమునఁ బడి కొంతదూర మరుగ ముందు గాలిచేఁ గగలు నాఁకుజొంపములలోని కల్పతరుమంజరులవలె నెలరాల గుత్తులతో నలరారుచుఁ, గనులకు మిరుమిట్లుగొలుపు జిలువలజేఁనిపడగలవలె రతనంపుఁగాంతుల దుర్నిరీక్ష్యమగుచు, మిసిమిమించు బంగరుకొండవలెఁ జెలువొప్పు గొప్ప వెలుఁగుఁగుప్పతో నొప్పుచు, నత్యంతప్రభావముచేఁ బ్రజ్వరిల్లుచున్న నొకప్రదేశము గనుపించెను.

ఆప్రదేశము జూచినతోడనే నామదికి మిగుల దిగులు గలిగెను. రెండుమూఁడడుగులు వెనుకకు వైచి యిట్లు విచారించితిని. అయ్యో ! నేనిందు బడబాగ్నిలోఁ బడిపోవుచుంటినా ? మహార్ణవగర్భంబున నింక దేని కిట్టిచండతేజం బుండఁగలదు ? అంతులేని కాంతుల కిది నిధానముగావలయు. ఓహో ! తెలిసెఁ దెలిసె. ఈమహాతేజంబువలన శోషింపఁబడుటచేతనే యిందు నీరించుకయును లేకుండెను. ఇచ్చట గల్గు శీతలవాయుప్రసారమే నాయూహను ధృవపఱచుచున్నది. అట్లుగాకున్న నింకేమై యుండును ?. కానిమ్ము. ఏమైన

ఏమి ? సాహసంబున ముందేఁగెదను. నాయనుమానమే తిరమైన నిందు మడిసెదన్. లేకున్న నపూర్వవస్తుసందర్శనంబునఁ గన్నుల కలిమి సార్థకము జేసికొందును. ఈవిశేషమేమో చూచెదనుగాక. అని నిశ్చయించుకొని ముందున కేఁగితిని.

అట్లు సంశయాకులితచేతస్కుండనై ముం దేఁగుచుండ ననతి దూరమందే యా తేజోరాశినడుమ నత్యంతదేదీప్యమానం బగు దేవతాయతనం బొండు గనులపండు వొనరించెను. దానిసమీపంబునఁ జక్కనిపూఁదోఁట కలదు. అప్పుడు మది కుదుటపఱచుకొని నే నత్యంతరయంబున నాగుడిలోఁ బ్రవేశించి యందుఁ బ్రతిష్ఠింపఁబడి యున్న పురాణదంపతుల నుమామహేశ్వరులఁ గనుఁగొంటిని. తోడనే నిటలతటఘటితకరపుటుండనై యభీష్టసిద్ధి కప్పరమేశ్వరు నిట్లని స్తుతించిని.

ఉ. మిక్కిలికన్నుబొట్టువలె మేన నలందిన బూది గందపున్
జిక్కనమట్టు లఱ్ఱునను జేర్చినపామును బూలదండఁగా
మక్కువ నేన్గుతోల్వలువమాడ్కిఁ గనుంగొనఁ గొండపట్టి ని
న్నెక్కుడెడదన్ దలంతు నను నేలుమ లేనెలఁదాల్చు దేవరా.

ఇట్లు స్తుతించి సాష్టాంగనమస్కారం బొనరించి లేచి యొంతైన విశ్రమింపనెంచి యందొకమూల మాణిక్యమణిఫలకముతోఁ జెలువగు నరుఁగుమీఁద కేఁగి యుపవిష్టుండనైతిని. ఇంతలోఁ బ్రాంగణమున మణిభూషణముల చప్పుడు లుప్పతిల్ల నావంకఁ దిలకించితిని. స్త్రీరాజ్య పురశోభంబువలె, శృంగార మహార్భాటములీల, సౌందర్య తుళశమువిధంబున, యౌవనప్రసిద్ధార్థముగతి నతికుతూహలకోలాహలంబున నడచుచు, మకరవాహానుని బ్రకటించు మన్మథసైన్యమువలెఁ గాంచీముఖాభరణాగ్రంబుల మకరరత్నచిహ్నంబులం దాల్చి, వెన్నెల కిక్కయగు చంద్రునికుటుంబముగతి నతిప్రకాశమాన మగు

మౌక్తికహారకంబుల ధరించి, యాందోళికల విలసిల్లు వసంతుని వర్గంబువిధంబునఁ గర్ణపాశముల నూగు కుండలశ్రీలవహించి, రతిదేవి పరిగ్రహించిన కౌతుకభరితలవడువునఁ గరాగ్రంబుల లీలా కువలయంబులఁ బూని, పాతాళసంభూతమగు తిమిరనికురుంబముకరణి నవిరళంబుగఁ గురులతెడంగుఁ గాంచి, నభంబునుండిదిగివచ్చి చలించు తారకానికరంబులీల విభ్రమించు మౌక్తికంబులఁ బూని, దిగ్గజముల శిరస్సిందూరరాగము దిక్కులఁ బ్రసవింప లగ్నమైన తరుణకాంతుల నొప్పు నడుగుఁదామరలఁ దాల్చి, సముద్రము వెడలివచ్చి ముఖసంయుతమై యున్న విద్రుమదళంబు దెన్నున సహజశోణాధరబింబంబుఁ బొంది, స్వర్గమునుండి యేతెంచిన పారిజాతపరిమళంబుగతి సౌరభ నిశ్వాసవైభవంబు గలిగి, లావణ్యాజలైకసముద్రమై, కింకిణీరణితరవాకారవమై, ఆభరణప్రభలకేశాభ్రమై, త్రిభువనలక్ష్మికి క్రీడాపుత్రికామై, గుళికాధనుర్ధరుండగు మనోభవుం డనవరతము విడచు మరకతోపలగుళికలవలె మధుపంబులు మూగికొను ముఖనవిరసౌరభంబు గలిగి యనన్యయువతీసామాన్యమగు కన్యాసమూహము గోచరమయ్యెను.

ఆసమూహమధ్యంబున నతిధవళాతపత్రంబునీడ నొయ్యారముగ నడచుచుఁ జంద్రమండలంబునుండి యేతెంచిన లక్ష్మివిధంబున నొప్పుచు, సావిత్రిధ్యానపరతంత్రుఁడగు ప్రజాపతిచే సృష్టింపఁబడు ట నాదేవిస్వరూపమునే వహించి మించుచు, నాకన్యాసమూహంబున కెల్ల నేలికయై కనుపించుచు, సర్వాంగసుందరియగు నొకతరుణీలలామ నాకు నేత్రపర్వ మొనరించెను.

శా. ఆ వామాస్తనయుగ్మశృంగ కలితోద్యన్మందరావార్య స
ద్భావ్యవృత్తోత్తమ విగ్రహాతిశయ లావణ్యాబ్ధి నాస్యేందు బి
బావిర్భావము, నోష్ఠకౌస్తుభభవం, బామోదనిశ్వాసశో
భావిరతంబగు నాకుకామరసగోత్రోన్నతంబు గ్గనిన్.

ల్లలి విస్తరమేల ?

గీ. ఇంతి సుందరరూపసంసృష్టిఁ జేసి
కాంచెఁ గవిధాత మదిఁ బుట్టఁ గామవహ్ని
దాని సైరింపలేక శైత్యంబుఁ బడయ
నతఁడు హరిబొడ్డుతమ్మియం దధివసించె.

ఇట్టి యనన్య సామాన్య రూప లావణ్యాతిశయంబున నొప్పు నొప్పులకుప్పం దిలకించి నే నత్యంతాశ్చర్యస్వాంతుండ నై యిట్లు తలంచితిని. ఆహా ! ఈయువతీరత్న మెవ్వరు ? ఎచ్చటనుండి వచ్చెసినది ? ఇట్టిసుందరీమణులుగూడ సముద్రగర్భమం దుందురు కాఁబోలును. తొల్లి సముద్రమథనసమయంబున నందుండి లక్ష్మీదేవి యుత్పన్నయై నారాయణునిఁ జేపట్టియుండలేదా ? రూపాతిరేకంబున రతి ప్రభృతి యువతీమణులకన్న మిన్నగ నొకయలివేణిని నిర్మింప నుత్సుకతం బొంది విధాత యీయేకాంతప్రదేశంబున కేతెంచి యీస్త్రీరత్నమును నిర్మించి యుండలేదుగదా ? రూపసంసృష్టియందు ప్రథమాభ్యాసముగా నతండు మొదట లక్ష్మిని నిర్మించి యుండవచ్చును. ఈ యసామాన్యసృష్టి కుపాదానమృత్తికం గొనివచ్చు తురంగమే యుచ్చైశ్శ్రవంబు. స్తనబింబపిండముల కాధార మైరావతకుంభి. శ్వాసపరిమళోపయోగద్రవ్యము పారిజాతము. ముఖము దిద్దుటకు పరికరము హిమాంశుబింబము. కరప్రక్షాళనజలం బమృతము. మెఱుఁగువెట్టుటాయి కౌస్తుభమాణిక్యము. ఈయంగవిన్యాసవస్తువులెల్ల సురలకు సముద్రమందే గదా దొరకినవి. ఇట్లనేకవిధంబుల నేను వితర్కించుకొనుచుండ నావేదండగమన కన్యాకదంబముతో నా యాలయప్రాంగణమునకు దక్షిణముగానున్న మార్గంబునఁ బుష్పాపచయం బొనర్పఁ బూఁదోఁటకేఁగెను.

పిమ్మట నందుండి [illegible] [illegible] [illegible]

నే తెంచి యా యాయతనమున బ్రవేశించి గొడుగు ముడిచి యా మూలఁ బెట్టి దివ్యాంశుకావేష్టితంబగు నీపటంబునుగూడ దానియొద్ద నుంచి వెంటనే యందుండి వెడలి యాకన్యాసమూహమును గలిసి కొనెను. ఆయువతి కార్యాంతరవ్యగ్రహృదయయై యున్నకతంబునో నాతొందరలో సమీపమందున్న నన్నుఁ జూడలేదు.

అప్పుడు వారు పుష్పాపచయమునుండి తిరిగి వచ్చులోపల నందు వస్త్రమునఁ జుట్టిపెట్టఁబడిన వస్తువేమో చూడవలెనను నుత్సాహము నెమ్మనంబున వేధింప నే నత్యంతవేగంబున నాప్రదేశంబున కొకగంతువైచి యాబట్టచుట్టఁ జేతఁ బట్టికొని విప్పిచూడ నీ పటము గనంబడినది. అందొకవైపున నాస్త్రీస్వరూపమును, మఱొక వంక భవదీయస్వరూపమును జిత్రింపఁబడియుండుటఁ దిలకించి నే నత్యద్భుతరసావేశహృదయసరోజాతుండనై యొండెఱుంగక మీయిర్వుర రూపవిలాసవిశేషంబులఁ గనులు విచ్చి యతిశ్రద్ధగఁ బరికించుచున్న సమయంబున భస్మోద్ధూళితసర్వాంగియు, కపిలజటాకలాపయు, వల్కలపటావృతయు, దురవలోకప్రకృతియు నగు నొకవృద్ధతపస్విని యెక్కడనుండియో మహాకోపంబుననాగిచ్ఛ గృహాభోపకోణము నన్వసరించి బిరబిర నరుదెంచిచూపుల నిప్పులు రాల్చుచు వెటపు గొలుపు తీక్ష్ణవచనంబుల నన్నుద్దేశించి యిట్లనియె.

ఓరీ! పాపాత్మా! పురుషపశువా! వివేకశూన్యా! మనుష్యాధమా! నీ వేలరా వచ్చి యీప్రదేశమెల్ల నపవిత్రముగ నొనరించితివి? అపవర్గవిషయవేదులైన మహాత్ము లధిష్ఠింపఁదగిన యీ వేదికపై నేమిటి కడుగిడితివిరా? మూఢుఁడా! దేవతార్చనోపకరణంబగు నీవస్తువు నిట్లేల భగ్న మొనరించితివి? నీదుర్వినయమున కిప్పుడే తగినఫల మనుభవింతువుగాక. మొకటి నీకన్నిట్లు నీకుపదేశింప మచ్చఁగలదు. ఒకచోటనుండి యిటుల నేగిరివైతివి కావున నవశ

జాతియందుఁ బుట్టుము. మాణిక్యశుక్తికాఖండంబునం బొసరించిన కార
ణంబునఁ దదాకారముగల చంచుపుటంబు గలవు చిలుక వయ్యెదవు
గాక. మఱియు నీపటము శుకజాతివిలక్షణంబుగ నీతలపైఁ బింఛము
రీతి నుండఁగలదని నన్నుఁ దీవ్రముగా శపించెను.

అట్లు శప్తుండనై నే నేమియుపచార మొనర్చింతినో యెఱుం
గక క్రిందుఁ జూడ నందుఁ బఱువఁబడిన కృష్ణాజినమును దానిపైన
నాకాలు దగిలి బద్దలైన మాణిక్యశుక్తియును గనుపించినవి. వానిం
దిలకించి మిగులననుతాపము నందుచు నయ్యో! చిత్రపటవిలోకనా
వ్యగ్రహృదయుండనై యీకృష్ణాజినమును ద్రొక్కుటయు దానిమీఁద
నున్న శుక్తి కాలికిఁదగిలి భగ్నమగుటయుఁగూడ నించుకయును
దెలిసికొనజాలనైతినిగదా? నే నొనర్చిన దుష్కర్మమువలననే నాకిట్టి
పరిణామము గలిగెను. కానిమ్ము. విధి దేనిని సమకూర్చునో దాని
ఫలం బనుభవించెదంగాక.

> గీ. గాత్రములు గాంస్యపాత్రలు గర్మగతిని
> ఛిద్రతనుగాంచు నయ్యవి చిత్రముగను
> కాంస్యకారకుపై. ఖరిఁ గడక నెపుడు
> నరయఁ బరివర్తనమొనర్చు నావిధాత.

కావున నాకీ శాపసంతాపము దప్పించుకొనరానిదగుటవలన
నందులకు విచారింపఁబనిలేదు. కాని యారమణీమణివృత్తాంతము
దెలిసికొనఁజాలమికి మిగుల వగచుచున్నాను. ఆమె యెవతె? ఎవని
తనూజాత? ఏకులమందు జన్మించినది? నివాసస్థలమెయ్యది? ఇచటి
కేమిటి కేతెంచినది? నామధేయమేమి? ముజ్జగంబులయందును సాటి
లేనిరూపముగల యీయువతీమణి యుపహసితానంగరూపుండగు
పురుషపుంగవుని హృదయమునందువలచెనో యీపటమం దిట్లేలవ్రాసి
యున్నది. అని యిట్లు నాలో నేనే ప్రశ్నించుకొనుచున్న సమయం

బున శాపకలకలంబు విని పుష్పాచయము మాని పూఁ[illegible] ఇద్దరుముగ్గురు చెలికత్తియలతో నాకన్యకాలలామ యుత్తరయంబున నచటికేతెంచినది.

అట్లేతెంచి నాచేతనున్న చిత్రపటమును జూచి చి[illegible]రాలై నిముసమాత్ర మెద్దియో ధ్యానించి మొగంబున చింతయు కినుకదోప నన్ను శపించినతపస్విని కిట్లనియె. ఆర్యాణీ! ఇదేమి! సకలప్రాణులయందును సమానానుకంపఁజూపు భవాదృశులు కోపమలోపలేపంబైన చిత్తమును విమలసమాధిసింధూదకంబునఁ గడిగి వైచితిరుగదా? కృపారసతరంగిణీ! ధవళభస్మానులేపనంబున హిమకాలచంద్రికవలె శీతలస్వభావవైన నీవిట్లు తీవ్రతంబూనఁదగునా! కరాగ్రములఁ జుట్టుకొనియున్నరుద్రాక్షవలయంబుచే దర్శనీయమగు నీ మూర్తి పన్నగావృతంబగు చందనలతికవలె నిట్లు భయంకరముగా నున్నదేమి? ఘనకోపానలజ్వలితమగు చూపుచే జలధరంబువడువున నశనిపాతంబొనరించుచు నమృతాకాంక్షితంబగు లోకము నేలతపింపఁజేసెదవు? ఆక్రోశకటురవంబులగు మాటలచే నింపగుచెవులను నీటిరొద్దున విఱుగు నలలయట్లపడివలె నేల వ్యథగలిగించెదవు? భగవతీ! ఇంద్రియనిగ్రహంబొనరించి భవసంబంధమును దూరముజేసి యుంటివనుమాట నీవిప్పుడు మఱచితివా యేమి? శిలాదినిర్మిత శుక్తికాభంగంబు నెపంబున సాధువృత్తి విడనాడి సర్వార్థముల కనర్థమూలమగు కోపమువహించి వీని నిట్లు శపించితివి. మఱియు నో దేవీ! హరిహరబ్రహ్మలకైన దురాపమై నిశ్శ్రేయస రసాస్పదంబై విజ్ఞానతేజోమయమై, వివేకమాణిక్యనిర్మాణమైయున్న క్షమాతత్త్వం[illegible] గాంచియున్న నీ చిత్తముచ్ఛన్నమై భంగంబున కిట్లు క్రోధముబూనుటవలన నీనియమమున కనర్థము వాటిల్లునుగదా? కావున సంసారపా[illegible] గా[illegible] పరిపద్వర్ధనిజత్వము నెట్లు పొందితివో [illegible]

వలనఁ గోపము నుపశాంతించుకొనుము. పరిశుద్ధాశయుఁడగు వీనికి శాపాంతమును బ్రసాదింపుము. మఱియు నితండు శుకజాతిఁబుట్టినను నత్యధికమగు మనుష్యచైతన్యముతోఁ గాలముగడపున ట్లనుగ్రహింపుమని ప్రార్థించుచున్న యాచిలుకలకొలికి పలుకుల కలరి ప్రసన్నురాలై యాతపస్విని యిట్లనియె.

కుమారీ! నీవు కోరినట్లే యగుఁగాక. ఈపటము వీనితలమీఁదఁ బంధమై వెలుఁగుచున్నకొలఁది విజ్ఞాన మభివృద్ధిఁ బొందుచుండును. మఱియు మదీయాసనగతుండై యరుణమణిమయంబగు నీశుక్తి నెట్లు భగ్నమొనర్చెనో యట్లె యొకప్పు డొకజగదేకవల్లభుని యాస్థానవేదిక నెక్కి శుక్తికాయమానంబగు చంచూభంగం బొనరించుకొని నిజస్వరూపము నందఁగలఁడని నాకు శాపాంతమును బ్రసాదించెను.

ఇంతలో శాపదోషంబుమూలంబున నాకుఁ జైతన్యము దప్పినది. ఇంద్రియారవిందంబులు ముకుళితము లైనవి. లోకమెల్ల నంధకారబంధుర మయ్యెను. ఆత్మ జడత్వమును వహించెను. పిమ్మట నేనెవ్వఁడనో, యెచ్చట నుంటినో, యేమైతినో, యేరూపమున మెలఁగితినో, యెచ్చటెచ్చటఁ దిరిగితినో, యెట్లు పొట్టపోసికొంటినో నాకేమియుఁ దెలియదు. నేఁ డిచట శాపాంతమగుటచే నిజస్వరూపమును దాల్చి విస్మయంబున ముందుఁ జూడ భవదీయదివ్యదర్శన మయ్యెను. చిత్రపటమందలిరూపమును నేనిప్పుడు చూచినరూపమును నొక్కటే యగుటచే పూర్వస్మృతిగలిగి యత్యంతానందంబున నిటకేతెంచి దేవరవృత్తాంత మెల్లఁ బ్రతీహారిముఖంబున నెఱింగి ప్రభుసన్నిధానమునకుఁ జేరితిని. ఇదియే నావృత్తాంతము. ఈపటమందలి యోషామణి నాఁడు సముద్రగర్భమందు నేను చూచినసుందరాంగియే. ఇందున్న దేవరస్వరూపమును బ్రత్యక్షముగఁ గనుంగొనఁగలిగి

తిని. ధన్యుండనైతిని. సాధ్యాసాధ్యము లెఱుంగక లంకావిజయ మొనర్పఁబూనిన నామనంబునకు భవదీయదివ్యదర్శనంబున శాంతి యొదవెను. సంసారాంభోధిపతనంబుమూలంబున నాకు భవత్పరిచయ రత్నలాభ మొందవినదని సంతసించుచుంటిని. దేవా! మర్త్యలోక మకరధ్వజా! నామాట నమ్ముము. ఆకన్యాలలామ, చిత్రగతమైన నిజమూర్తి దేవరప్రతిబింబమును హృదయంబునఁ దాల్చి యెటుల సేవించుచుండెనో యట్లె యీచిత్రపటమును విడువక యాయంబికా దయితు నారాధించుచుండుటఁ బరికింప నీయం దామె యనురాగము గలదై ప్రసూనశరసాయకశిఖా దంధహ్యమానమానసయై యెట్లో కాలంబు గడుపుచున్నదని తలంతును. ఆమెసౌందర్య మనన్యసామా న్యము. నిఖిలవిశ్వనిర్మాణదక్షుండగు పరమేష్ఠి సృష్టినైపుణ్యమున కెల్ల నామెరూపము దలమానికముగదా! ముల్లోకములయందును సౌందర్యమునఁ బ్రసిద్ధికెక్కిన శచీప్రభృతులరూపముగూడ నాకన్యకా లలామ యెదురఁగ వన్నెకెక్కనేరదు. త్రిభువనాధిపత్యమైన నొసంగ సమర్థమగు తపంబుగూడ నట్టియువతీరత్నమును లభింపఁజేయఁజాల దని యూఁహకుండెను.

అప్పుడు పుండరీకుఁ డిట్లనుకొనియె. ఆహా! ఈకథ యెంతవింతగ నున్నది? దీనిని వినినదిగోలె నాహృదయంబున నెద్దియో నూతనసం తోష మంకురించుచున్నది. విషమకర్మకల్లోలలీలాగర్భితంబగు సం సారమహాసముద్రాంతరమం దట్టికన్యారత్న మెచ్చట గనుపింపఁ గలదు? కాని, యఘటనఘటనాసమర్థుం డగు విధి కసాధ్య మెద్ది గలదు? అట్టివిధియే నా కనుకూలవర్తియై యున్న యాయన్ను మిన్నను నిక్కముగ నాకు, సమకూర్చునని నమ్మెదను. అని యిట్లు దలంచుచు నందుండి లేచి ముందు నడచుచున్న కుమారకేసరి న త్యంతప్రేమోపచారవచనంబుల నాదరించుచు నమ్మణిమండపము

వేడిలి వసంతశీలుని యనర్ఘపారితోషికములం బ్రీతునిఁగావించి తురంగారూఢుండై సామంతవర్గము జేయునతులందుకొనుచుఁ గ్రమంబున నిజ నగరంబున కేఁగెను. ఇంతలో నాకన్యాలలామను సమకూర్చుభారము నరపతి తనయందుంచినాఁడని విధి యామెను వెదుకఁబంపెనోయనునట్లు పగలును సూర్యుఁడునుగూడ నిష్క్రమించిరి. అప్పుడు రాజేంద్రుని మనంబున మన్మథరాగంబు నిండినట్లే పశ్చిమభూభృచ్ఛిఖరంబున సంధ్యారాగ మావరించెను. పిదప గాఢాంధకారము దిశలెల్ల నాక్రమించుకొనెను.

---

## 341 వ మజిలీ.

# రాక్షసుని గర్వభంగము

---

నాఁటిరాత్రి చీఁకటి పురమెల్ల దట్టముగా నలుముకొనెను. ఇదిస్థల మిది నీ రిది మెరక యిదిపల్లమని నిరూపింప నశక్యముగా నుండెను. ఇంతలో జనార్దనునిచేతిపాంచజన్య మట్లు, కాళియఫణా పంజరమందలి నిర్మోకపుంజముగతి, యమునాజలమందలి ఫేనపిండము డంబున, కువలయవనమందలి హంసవిధంబున, తారకానాథుం డంబరము నలంకరించెను.

గీ. చీఁకటికి నూడు వీఁడని వీఁక మిగుల
మఱుఁగునభిసారికల చూపుమంటలఁబడి
చందురుఁడు బూడెబుంగయై స్వచ్ఛబింబ
మడరఁ దొలిదిక్కు గట్టున నమరియుండె.

మఱియును,

గీ. ఇనుఁడు లోకాంతరంబున కేగ నపగ
తాళిఘనశిరోజకలాపయై కమలిని
విధవవోలె వెన్నెలయను విమలవస్త్ర
మునుముసుంగిడికొని మోము ముడుచుకొనియె.

అప్పుడు చీఁకటియడఁగ నభంబు శుభ్రకాంతు లీనుచుండఁ గుముదములు వికసింపఁ దమ్ములు ముకుళింప, శశికాంతశిలలు చెమ్మగింప, జారచోరప్రచారంబులు సన్నగింప, విరహిణులచిత్తముల కనంగతాప మతిశయింప, జగమున కాహ్లాద మొనఁగూర్చు సుధాంశుండు మింటఁ బ్రకాశించుచుండెను. అట్టిసమయంబున మదనతాపముచే వేగుచున్న పుండరీకరాజేంద్రుండు పూర్వరాత్రకరణీయంబుల నిర్వర్తించుకొని జ్యోత్స్నాపూర్ణోపశాలితం బగు సౌధాగ్రమున కేకతముఁ బోయి యందు విలాసపటమండపమున ధవళచీనచ్ఛాదాంబరంబున డంబుమీఱు హంసతూలికాతల్పగతుండై పాలమున్నీటి యందు మధుసూదనువిభాతి నతిశయించియుండెను. హరిణలాంఛనుఁడగు చంద్రునిజూచి తదాకారసాదృశ్యం బగు చిత్రపటంబు దలంపునకు వచ్చుటయు నయ్యది చేతఁ బట్టుకొని యందు లిఖింపఁబడి యున్న యన్నులమిన్నరూపంబును ననిమేషదృష్టులం దిలకించుచు నిట్లు తలంచుకొనెను.

ఔరా! ఈకన్యకాలలామ నా కెట్లు సమకూడఁగలదు? ఈమె నేయుపాయంబునఁ గనుంగొనఁ గలను? నేను ముం దేమి యొనర్పవలయును? నామనోపహారిణి నెందు వెదకుదు నని చింతించుచు మఱియు నతండు నిలింపులమందిరంబులయందు విద్యాధరుల పురములలో గుహ్యకాశ్రయంబుల భుజగరాజధానుల నామె యెందున్నదో వెదుక నుత్సహించుచు, నంబరమున కెగుర, గిరుల నుల్లంఘింప, భూమి నతిక్రమింప, సముద్రమును దరింప, ద్వీపాంతరంబుల కరుగ,

నురగలోకమును బ్రవేశింపఁ దలంచుచు, నందులకుఁ బక్షుల సర్వగామిత్వమును, జగదేకచక్షుషుండగు సూర్యుని సర్వవిలోకిత్వంబును యోగసిద్ధుల సర్వవేదిత్వంబును నపేక్షించుచు, మదనమూఢుండై సితకర కిరణసంతానముల గగనారోహణరజ్జువులని భ్రమించి వాని నూఁతగఁ బైకేఁగ నుంకించుచు, కుముదవనమారుతారూఢుఁడై దిక్కులఁ బరిభ్రమింప నూహించుచు, నిట్లనేకభంగుల హృదయాందోళన మందుచుఁ గొంతకాలము గడపెను.

ఆరాజేంద్రుం డిట్లు విరహతాపంబున వేగుచు నాకసము వంకఁ జూచుచుండ నా విమలచంద్రికాపుంజంబున నకస్మాత్తుగా విస్తారాంధకారము గ్రమ్మెను. దాని కతం డబ్బురంపడుచు నోహో! ఇదేమి? ఇట్లత్యద్భుతంబుగ నంధకార మావరించినది! ఇంతలోనే హిమాంశుం డస్తంగతుఁ డగుటకు హేతు వెయ్యది? నేఁటితిథి ననుసరించి ప్రథమయామంబునఁ గొన్నిగడియలు తప్ప రాత్రియంతయును జంద్రుఁడు ప్రకాశింపుచుండవలెను గదా? ఇది హేమంతమును వర్షాగమంబును గాకుండుటవలన నాకసము నిర్మలముగా నుండవలెను. మఱియును సంపూర్ణగ్రాసమగు జంద్రగ్రహణము గలిగె ననుకొనుటకైన నేఁడు పూర్ణిమకాదే? ఇంక యిదేమై యుండును? అంజనపర్వతము దిఱుగ ఱెక్కలఁ దాల్చి నంబరతలంబున కెగిరియుండ లేదుగదా? లేక యకాలజలధరసమావేశ మగుచుండెనా? కాకున్న నెవఁడైన నిట్లింద్రజాలమును బ్రదర్శించుచుండెనా? అని యిట్లారాజేంద్రుండు వితర్కించుచున్న సమయంబున నయ్యంధకార మెల్లఁ బుంజీభవించి గగనమునుండి యానగరపరిసర భూమియందుఁ బడెను. తోడనే హృదయవిద్రావకంబుగ మర్మవిచ్ఛేదకంబుగ నెడతెగని యార్తధ్వని యాభూజానికి దూరము నుండి వచ్చుచుండుటచే నస్పష్టాక్షరార్థంబుగ వినంబడఁ దొడంగెను.

పుండరీకుం డాయాక్రోశరవం బాలించి, యారా! ఆయ ద్భుత తమోరాశి వెంటనంట నంబరమునుండి పుడమి కేతెంచిన దె వ్వరై యుండును? ఆయార్తనాదంబునకుఁ గతం బేమై యుండును? ఏమైనఁ గానిమ్ము. ఆర్తపరిత్రాణమె ధర్మముగదా! అందును ధాత్రీశ్వరుండగు క్షత్రియున కాధర్మ మవశ్యకర్తవ్యము. కావున నే నిప్పుడేపోయి యాపదపాలైన యావ్యక్తి నాశ్వాసించెదను. ప్రసంగ వశంబునఁ దదీయ యన్వయాభిధానాదులం దెలిసికొందునుగాక యని యందుండి లేచి వీరపురుషోచిత వేషంబు ధరించి కృపాణధారియై యాచీఁకటిలో నొరులెఱుఁగకుండ నతిజవంబున నాయార్తధ్వని నను సరించి పోయెను.

అట్లు పోయి స్మశానవాటికయం దున్న చండికాదేవి శూ న్యాయతనంబున కనతిదూరములో విశాలాశ్వత్థవృక్షముక్రింద మ హాంధకారకూపోపకంఠంబున నతిమలినాకృతిఁగల యొకవ్యక్తినిఁ జూ చెను. అయ్యది త్రివిక్రమస్వరూపముకన్న దీర్ఘమై, యాకసముకన్న నున్నతమై యుండెను. మఱియును మహామారి గర్భపాతమువలె రక్తోపవర్ధితాంగముగలిగి భువనభోజనుండగు కృతాంతుని యతిథివలె, కల్పాంతసంచారుండగు భైరవునిసహాయునివలె, నంధకాసురసంహార మునకుఁ జండిక యేర్పఱచుకొనిన సేనానివలె, శక్తియొక్క పురుష స్వరూపమువలె, భయంకరస్వరూపముగలిగి, మండుచున్న నేత్రద్వ యముతో దారుణమగు వదనగహ్వరము గలిగి, యందుండి వెడలు పృథుతరానేకవహ్నిచ్ఛటలు మాటిమాటికి రక్తాసవంబు గ్రోల వ్రేలాడు రసనాశతంబువలె నొప్పుచుండ భూషణీకృతానేక నరకరో టుండై భయంకరాకారభాసురుండగు రాక్షసుం డొకండు గృతాం తునికన్న నుగ్రుఁడై మృత్యువుకన్న హింస్రకుండై గన్పట్టెను.

ఆనిశాచరాధముని యమదండభీషణం బగు భుజదండంబుచే నయ్యంధకూపోదరంబునుండి పైకెత్తి పట్టుకొనఁబడియుండి యతి దీనంబుగ నాక్రందించుచు, భయతరళితంబులగు జూపుల దిక్కులఁ బ్రసరింపఁజేయుచు, గడగడనడంకుచున్న నిజతనూలతో యానక్తంచరుని మేనఁగల తెల్లని నరకపాలమాలికాభరణంబునఁ బ్రతిఫలింప వానినే శరణు జొచ్చియున్నట్లు గనుపించుచు, జటావల్కములు ధరించి చేతి యందు రుద్రాక్షమాలికం గ్రహించి యోగపట్టికం బూని యొడ లెల్ల భస్మ మలందికొని లలాటంబునఁ జంద్రరేఖం బూని ప్రశాంత సుందరాకారముతోఁ బదునాలుగేండ్లవయసున నున్న యొకకన్యా తపస్విని యారాజోత్తమునకు గోచరమయ్యెను. తోడనే యతం డో హో! భయపడకుము. భయపడకు మని యాసన్నమరణభయా కులిత యగు నాతపస్విని నాశ్వాసించి యానిశాచరునిచే నామె హానిం బొందకమున్న తా నచటకుఁ జేరుకొనుటకు మనంబున సంత సించుచు నారాక్షసాధము నుపలక్షించి హుంకారపురస్సరంబుగ నోరీ! దురాత్మా! విడువుము. తొలఁగిపొమ్ము. ఈమె నీకుఁ జాలిన యాహారము గానేరదు. ఈపిశాచవనంబునఁ గాలాపహృతజీవితంబు లగు జంతుకోటుల సర్వత్ర గ్రహించి తత్పిశితపిండములచే దుష్పూ రంబగు నీజఠరగర్తంబును నిండించుకొను మని పలికెను.

ఆరక్కసుం డక్కజంబున నక్కుంతలభూపరివృఢుం దిలకించు చు నోరా! సురసిద్ధవిద్యాధరోరగ మనుజగుహ్యకులలో నీయువకుఁ డెవ్వఁడై యుండును? నేనింతకుఁ ద్రిభువనంబుల సంచరించుచుఁబురుషు ల నెందఱనేనిఁ జూచియుంటిని గాని యిట్టివాని నెందును గని విని యెఱుంగను. ఆహా! ఏమి యీపురుషపుంగవుని శరీరలావణ్యము! ఏమి వీనిసౌందర్యము! ఏమి వీనిధైర్యము! వెఱపుఁ బుట్టించు రక్క సులకుఁ గూడ భయంకరుండ నైన నాయెదుట నితఁడు శంకలేక

కత్తిదూసి నిలువఁబడుట విచిత్రముగదా! వీఁ డెవఁడో యొకయసామాన్య వీరునివలెఁ గన్పట్టుచున్నాఁడు. సమరమునకై యేతెంచి భుజాస్ఫాలనం బొనరించు ప్రతివీరు నిట్లు మెచ్చుకొనుచుండుట వీర పురుషలక్షణముగాదు.' వీనిసామర్థ్యం బెఱింగెదం గాక యని యా భూమీశు నీక్షించి యట్టహాసం బొనరించుచు వానికిట్లనియె.

ఓరీ! నీ వెవఁడవురా? త్రిదశులకైన నజేయవిక్రమక్రముండ నగు నాతో నీమోట కేమిటి కిట్లు గలహింప నెంచెదవు? కల్పాంత విస్తృతాంభోధిజల మహాప్లవంబునఁబడు వసుంధర నెవఁడైన మునుఁగ కుండఁదప్పింపఁగలఁడా? నాచేఁజిక్కిన యీయాశ్వరతపస్విని నివిడిపింప సమర్థుఁడెవ్వఁడుగలఁడు? రెండుచేతులుమాత్రమేగలజంతువవు నీవేమి చేయఁ గలవురా? చతుర్భుజుండగు నారాయణునకు, దశభుజుండగు హరునకు, ద్వాదశభుజుండగు కుమారునకుఁ గూడ నే నజేయుండ నని యెఱుంగుము. ఇఁకఁ దక్కినవారి లెక్క యేమి? కావున నేను నీకు హితోపదేశం బొనరించుచుంటిని. బుద్ధిఁ గలవాఁడవై నీ వీయశక్యమగు కార్యమునకుఁ బూనకొనకుము. యౌవనప్రాదుర్భావ గర్వంబున నభంబున కెగురఁజూచెద వేమిటకి? దర్పాంధుండవై కృతాంతముఖకూపంబున నెందులకుఁ బడఁదలంచెదవు? వీరవ్రతంబు పేరున మృత్యువు నేమిటి కారాధించెదవు? శౌర్యగ్రహావిష్టహృద యుండవై ప్రజ్వలించుచున్న యగ్నికుండంబున దుముక నేల సాహసించెదవు? రణరసాస్వాదప్రవృత్తిచే విషతరుఫలంబుల భుజింప నేమి టికి గమకించెదవు? సుభటచర్యాకుతూహలైక దుర్లలితుండవై దారుణపన్నగముతో నేలఁ గ్రీడింపఁదలంచెదవు? భుజబలావష్టంభంబున దిగ్గజముగరంబు బట్టుకొని యాటలాడ నెందులకుఁ బూనెదవు? ఆపన్నపరిరక్షణాసక్తివలన విశ్వైకవీరుండనగు నాతో నేల యుద్ధము నకు డీకొనెదవు? దురంతమగు నీవిఫలప్రయత్నమునుండి వైళము

విరమింపుము. రణవిముఖుల నీరాక్షసప్రవరుండు క్షమించునని యె ఱుంగు మనిపలుకు పలభుజున కాభూభుజుం డిట్లని ప్రత్యుత్తర మొసంగెను.

ఓరోరీ ! దుర్మదాంధా ! ఈవ్యర్థాలాపములతో నాహవ మహోత్సవంబున కంతరాయమును గల్పింపఁ జూచెద వేమిటికి ? స్వప్రశంసాపరాయణుండవై బహుభుజుల కైన జయింపరానివాఁడవని చెప్పికొని ద్విభుజుండనగు నన్నపహాస్య మొనర్చుచు నీవంటి పిశాచ జన్ముల నగ్గించుచుంటివా ? స్వసామర్థ్యమే నరులకు బహుబాహుత్వ మని యెఱుంగవా ? నిశాచరచక్రవర్తియగు రావణుండు వింశతి భుజుండైనను ద్విబాహుండగు శ్రీరామునిచేఁ దలలు నఱుకఁబడి మడియుట మఱచితివా యేమి ? భుజసహస్రవిశ్రుతుండగు కార్తవీర్యుండు భార్గవునిచే నిర్జింపఁబడుట యెఱుంగవా ? కావున నోరి మూఢ ! వీరులకు యుద్ధసమయంబున ద్విబాహుత్వమే యుపకరింపఁ గలదని దెలిసికొనుము.

చ. అలఘుమతుల్ త్రిలోకవిజయంబున దక్షిణహస్తమున్, భయా
ర్తుల కభయప్రదానమునఁ దోర్తన వామకరంబు, వాడఁగా
గల రిఁక నిన్నుఁబోలు మదగర్వులు స్వోదరపూర్తికొక్క కే
ల్మల నిగమప్రదేశ సమమార్జన కింకొక కేల్గ్రహింపరే ?

హరిహరాదుల కైన నసాధ్యుండనని బల్కుచుఁ ద్రైలోక్య వంద్యులం గూడ నీసడించుచున్న నీనాలుక దుత్తునియలు గాలేదా? కాకున్న నానిశితాసిం దాని నిప్పుడే వేయిచీలికలుగాఁ గోసివైచెదం జూడుము. ఓరీ ! పాపాత్మా ! ఆత్మప్రశంసాపరాయణా! వృధా వాగాడంబరా ! మాటలవలనఁగాక పరాక్రమము సమరంబునఁ జూపింపుము. రమ్మ్మ. రణమున కాయత్తము గమ్మ్మ. అనిలో ముందు బాణ మేయనని నాకు శపథ మున్నది కావునఁ దొలుత నీవే

నాపైఁ గవిసి ప్రహరింపుము. పిమ్మట నిముసములో మదీయతీవ్రాసి ధారల నీశిరము దెగ్గి ధరణిపైఁ బడఁగలదు. నిన్ను నిర్జించి యీ బాలతపస్వినిని రక్షించెదనని శౌర్యమదోద్రేకదారుణంబులగు రణా లాపంబు లారాజేంద్రుండు బలుకుచుండ నారక్కసుండు ప్రతిభటలా భంబున కానందించుచు, వానివీరాలాపంబుల కక్కజంపడుచు దదీ య భుజబలంబునకుఁ జకితుఁ డగుచు నట్టివానితో సంగరంబునఁ గ లియఁ ద్వరపడుచు నాసమయమునకుఁ దగిన రోషము దెచ్చుకొని యిట్లనియె. సాధు! రణశౌండీర! సాధు! నే ననేకదారుణసంగ్రా మంబుల నారితేఱినవాఁడను. నీవో పిన్నవయస్కుఁడవు. నన్నుఁ బోలు రాక్షసులతో నీవింతదనుక నెన్నఁడును బోరియుండవు. నీ వీరం బెంతటిదో జూచెదంగాక. ఇదిగో మద్భుజపరిఘప్రహారములఁ గాచికొమ్మని చేరువనున్న తాళద్రుమంబు బెఱికి పైకెత్తి బిరబిరఁ ద్రిప్పుచు రాజుపై విసరెను. తోడనే యతండు దానిని నిజకృపాణ ధారాభిఘాతంబునఁ దుత్తునియలుగ నొనరించెను. రక్కసుం డుక్కు మిగిలి యింకొక్కదానిం బెఱికికొనివచ్చి వానిం గొట్టెను. దానినిఁ గూడ పుండరీకుం డశ్రమంబున ముక్కలుజేసెను. రక్కసుం డిట్లన్ని వృక్షములఁ బెకలించి మీఁద వైచుచున్నను వానినెల్ల ఖండఖండ ములుగ నారాజోత్తముం డొనరించుచుండెను. ఇట్టియుద్ధమున నా ప్రాంతభూరుహంబులెల్ల శూన్యమైనవి. పిదప నానక్తంచరుండు శిలా సమర మొనరింపఁ బూనెను. రాజేంద్రుం డప్రమత్తుఁడై నిజకుఠార ధారల వానినెల్ల నుగ్గుసేయఁ దొడంగెను. పిదపఁగొంతసేపు వారిరు వురకును నస్త్రయుద్ధము జరిగెను. అందుఁగూడఁ బుండరీకుఁడే మేలు చేయియయ్యెను. పిదప నారక్కసుం డుక్కివంబున నెక్కడనుండియో యొక విశాలదారుణపాషాణమును శిరమునఁ బెట్టుకొనివచ్చి దర్పో ద్రేకంబున నిట్లనియె.

చ. అమరఁ గృతాంతుపీఠమున కత్యధికంబయి, మారియింటికు
ద్యమునయి, మృత్యుదేవికి శుభాస్పదమౌ యభిషేకవేదికై
పరగెడి యశ్మఖండ మిది వ్రక్కలుసేయు భవచ్ఛిరంబు, నె
వ్వరు నిఁక దీని సడ్డఁగలవారలు లేరు సురాదు లందునన్.

ఇట్లనుచు రాజేంద్రునిఁ బ్రహరింపనున్న యారక్కసుని ప్రవృత్తిం గని యాతపస్విని హాహాకార మొనర్చుచు నారాజున కేమి ముప్పు వాటిల్లునో యని నెమ్మనంబున భయమందుచుండెను. ఈ యేటుఁ దప్పించుకొనుట మానవేంద్రున కతిదుష్కరమని యంబరచరులు వగచుచుండిరి. ఈపాటుతో ధాత్రి యనాథ యగునని దిక్పాలకులు గుందుచుండిరి. ఇంతలో యుద్ధవిశారదుండగు మేదినీకాంతుండు ఖడ్గమును విడచి యతిరయంబున వేఱొకగండశిలం గైకొని యారక్కసుని మణిబంధమున విఱుగఁగొట్టెను. మణిబంధము విఱిగిన తోడనే చేతనున్న యాదారుణశిలా శకలము నేలఁబడ పతన వేగంబున భూమియందు లోతుగాఁ గ్రుంగిపోయెను. అంతఁ బోరు దిలకించుచున్న నభశ్చరుల సాధువాదములు దిక్కులఁ బిక్కటిల్లెను. పిమ్మటఁ దనప్రయత్న మెల్ల నట్లు విఫలమగుట కా రాక్షసప్రవరుండు విభ్రాంతుండై యదృశ్యుఁ డయ్యెను. అందుల కా రాజు విస్మయంబున నిట్లనుకొనెను.

ఏమిది! అసమానపౌరుషముగల నీపిశితాశనప్రవరుం డిట్లు సమరసమాప్తము గాకుండఁగనే మాయ మయ్యె నేమి? సంగరరంగమున నరునిచే నిర్జింపఁబడుటకు లజ్జపడి యిట్లు తిరోభూతుం డయ్యెఁ గావలయు. లేక మఱియొకయుపాయ మెద్దియైన గ్రహించివచ్చుటకు నిజసదనమున కఱిగియుండెనా? మాయచే నన్ను వంచించుటకునభంబున కేఁగెనేమో! నాయాశయ మెఱుంగుట కిట్లుండవచ్చును. రాక్షసుల యుద్ధక్రమం బీక్రియనే జరుగుచుండు నేమోగదా! వాఁడుబలా

యతుండగుటవలన నింతటితో సమరోపసంహారమైన దనుకొనవచ్చును. నేనింకనీతపస్విని వెంటఁగొనిపోదునా? లేక యింకొకక్షణమునిరీక్షించి యుందునా? రాక్షసులు క్షుద్రప్రవర్తనులు. కావున నాపాపాత్ముని జాడ నింకొకముహూర్త మరసెదంగాక యని తలంచుచుండ నకస్మాత్తుగ నందున్న మహాంధకూపంబునుండి భయంకరహుంకారరవం బుప్పతిల్లెను. తోడనే యందుండి పొగ లేచినది. తదనంతర మతిభీకరం బగు నగ్నిజ్వాలలు వెల్వడినవి. ఆమంటలతో దుర్నిరీక్ష్యతేజుం డగు రాక్షసుం డేతెంచి రాజుముందర నిలచెను.

ఆయగ్నిజ్వాలలు చాలదూరము వ్యాపింపఁ బుడమి మండుచుండెను. దిక్కులు మండుచుండెను. ఆకాశము మండుచుండెను. ప్రళయకాలానలంబునఁ బడిపోయినట్లు విశ్వ మంతయు నాకులత్వ మందెను. అట్టిసమయంబున వాఁ డగ్నిమయాకృతియై, యగ్నిమయాలోకపద్ధతియై, యగ్నిమయాలాపవృత్తియై, యగ్నిమయాస్త్రసంభృతియై, యగ్నిమయాశేషవ్యావృత్తియై తీక్ష్ణవచనంబుల నాక్షితిపాలపుంగవున కిట్లనియె.

శా. నీబాహాబలకౌశలం బడఁగి హానిం జెందఁగా ఠాయిగా
దా బోలందిన తాళవృక్షమునుగా దస్త్రంబునం దస్త్రమున్
గాఁబో దిద్ది దవానలంబు నినుఁ దీక్ష్ణజ్వాలలన్ గ్రమ్మెఁగెడిన్
నీబాధన్ దొలఁగింప నాకరుణగానీ లేదు దిక్కన్యమై.

ఓరీ! నరాధమా! ఈదారుణాగ్నిజ్వాల లావరించినప్పుడైన రక్షింపుము రక్షింపు మని నన్ను శరణు వేడకుండఁజాల వని పలుకు నారక్కసిమొక్కలీనితోఁ బుండరీకుండు మందహాసభాసుర వదనపుండరీకుఁడై యిట్లనియె. ఓరోరి క్రవ్యాదకీటకాధమా! రమ్ము. నీబీరం బడంప నేను సంసిద్ధుఁడనైయుంటిని. నీవలె మాయాప్రయోగ ప్రకారంబునంగాక వీరపురుషోచితం బగు సంగ్రామంబున నీమదము

నదమద మొనరింతును. నాచేత నిర్జింపఁబడి యిప్పుడే గదా పారి పోతివి. చల్లనినీటిచే నార్పఁదగిన యగ్నిజ్వాలలతో నిప్పుడు సిగ్గులేక వచ్చి రణప్రగల్భము లాడుచుంటివా ? ఓరి పిశాచపశువా ! ఈసమ రాధ్వరంబునఁ బశువువలె నిన్ను విశసనం బొనరింతును. ని న్నేమి చేసెదనో వినుము.

శా. నీసర్వాంగములన్ దవానలశిఖానీతప్రచండాగ్నికీ
లాసందోహమునందుఁ బక్వమగు లీలన్ జేసి మాంసంబు దీ
ర్వాసిన్ గోసి తదీయఖండములు గాలాస్యస్ఫురద్గహ్వర
వ్యాసంగంబున నేను బెట్టెదను మాద్య చ్ఛీతలగ్రాసమున్.

కావున :—

గీ. అతిశయభుజప్రతాపాగ్ని యలమియుండ
లేదు నాయందుఁ జోటేమి నీదువహ్ని
కింక వినుము ! నీగృహమున కేఁగి బంధు
జనులఁ గలయుము, సమరభీషణత మాని.

ఇట్లు నీవొనర్పవేని యందులకుఁ దగుఫలం బిప్పుడే యనుభ వింపఁగలవని యారక్కసునితోఁ బలుకుచుఁ దనలోనిట్లనుకొనెను. ఈ యనలతీవ్రంబును జల్లనినీటిచే ముందుఁ జల్లార్చి పిదప మదీయఖడ్గప్రహా రంబున నీరాక్షసాధముని దెగటార్చెదను. జలము లేనప్పు డార్ద్రతరు పల్లవంబులైన నగ్నిని జల్లార్పవచ్చును. కావున నట్లొనరించెదం గాక యని నిశ్చయించి వామకరంబునఁ గృపాణము దాల్చి సవ్య కరంబునఁ జేతికందిన పృథుదళాతిమాంసల పల్లవంబగు నయ్యశ్వత్థ శాఖను గ్రహించి యోరోరి హింస్రకాధమా ! నిలు నిలు మని యతిసాహసంబున నారాత్రించరాధముని మార్కొనెను.

అట్లు భీకరాగ్నిజ్వాలల కించుకయును వెఱువక సాంద్రప్రవాళ భాసురం బగు తరుశాఖం గొని యుద్ధసన్నద్ధుఁ డగుచున్న యారాజ

పుంగవుని యవక్రవిక్రమక్రమంబు నీక్షించుచున్న యంతరిక్షచరులు సాధువాదంబు లొనరింపసాఁగిరి. మఱియు నాసంగరంబును దిలకించు చున్న నేకాదశరుద్రులును నాపుండరీకుని ధైర్యసాహసంబుల కత్యద్భుతరసావేశహృదయులై తలలు పంకించుచుండఁ దదీయజటాజూటములనున్న జాహ్నవీప్రవాహంబు జాఱి పుడమిపైఁ బడెను. ఏకాదశరుద్రుల యుత్తమాంగములనుండి గంగాజలం బేకధారగాఁ బడి ముంచుటం జేసి యాశవాశనుని వైశ్వానరసృష్టియెల్లఁ ద్రుటిలో విధ్వస్తం బయ్యెను.

అప్పు డప్పిశితాశనుండు విస్మితుం డగుచు నతిసంభ్రమంబున మృత్యువు శిఖాదండమువలె, సురేంద్రుని రెండవ వజ్రాయుధంబువలె, కాలమహిషము తృతీయశృంగమువలె, త్రిశూలము చతుర్థకోణమువలె నభ్రకుంజరము పంచమవిషాణమువలె విశేషభీషణమై, దనుజదారుణాఘాతంబున విఘటితంబైన నృసింహదేవుని తీవ్రనఖంబువలె నిశితమైన మండలాగ్రంబొండు బిడికిటంబట్టి దానివ్రేటునఁ బ్రతివీరుండు దప్పించుకొనిపోకుండ నడ్డుపెట్టినట్లు బాహువులఁ జాపుకొని తీక్ష్ణదృష్టుల నిగుడించుచు నౌడుగఱచి పదఘట్టనంబునఁ బుడమి యదుర నా రక్కసుం డుక్కుమిగిలి యాదారుణకృపాణంబు బుడమిఱేనిపై విసరెను.

అప్పు డాఖడ్గోత్తమంబాభూపాలోత్తమునిదరి కఱిగి ప్రదక్షిణపూర్వకంబుగ వాని పాదమూలంబునఁ బడిపోయెను. తోడనే యా రక్కసుండు విభ్రాంతుఁడై సంగ్రామదారుణవేషంబు విడచి చేతులు జోడించుకొని వినయవినమితోత్తమాంగుఁడై యా నరేంద్రునకు జోహారులొనరించుచు నిట్లనియె. ఓహో! నిజము దెలిసికొంటిని. భూమండలశరీరమునకు బ్రాణమనియును, బ్రహ్మాండశుక్తియందలి యాణిముత్తెమనియును, నరలోకవ్యంజనమునకు మృగనాభినాయక

మనియును, భూకల్పలతికయందలిరత్నగుచ్ఛమనియును, జంబూద్వీప పదకమందలి మాణిక్యబంధమనియును, సకలభువనభూపాలచూడా మణియనియును నెవ్వరు కీర్తింపఁబడుచుండిరో యట్టి ప్రతిష్ఠాననగర పరమేశ్వరునిగాఁ గుంతలావనీనాథుగాఁ బుండరీకరాజదేవేంద్రునిగా నిన్నెఱింగితిని. నీ యత్యద్భుతచరిత్రము నీ విక్రమక్రమము నీ విజ్ఞాన సంపద, నీ యుదారస్వభావము నీ యైశ్వర్యవిశేషము నీ సద్గుణగరి మంబు నే నెన్నెన్నిసారులో ముల్లోకములయందును విని యానం దించితిని. అంధకమథనునిచేఁ బరాక్రమంబునఁ గొనియాడఁబడిన మదీయసామర్థ్యంబు నెదిరింప నీకుఁదక్క నితరులకు శక్యమగునా? త్రైలోక్యవిజయినియగు నీమండలాగ్రము దనశక్తినుడిగి నీపాదముల మ్రోలఁ బడియుండుట విచిత్రముగదా? ఈ కృపాణమును నీకు గానుకగా నొసంగుచున్నాఁడను. ఈతపస్విని విడచిపెట్టుచున్నాను. ఇఁక నాకు సెలవొసంగుము. పోయివచ్చెదను. అవసరముగలిగినప్పు డు నన్నుఁదలంచినంత నే వచ్చి నీయాస నెరవేర్చి పోవుచుందునని విన్నవించెను.

పుండరీకుండును విస్మయకౌతుకావేశహృదయుఁడై యిట్లనియె. అసమసమరాంతమున నొనఁగూడిన మన మైత్రి శుభదాయకమై చిర ము వర్ధిల్లుగాక. ఇందు నాకు నిశాచరధౌరేయుఁడగు మిత్రుఁ డలవడి నందుల కెంతయును సంతసించుచుంటిని. నీ వృత్తాంతమెఱుంగుటకు నామనం బుత్సహించుచున్నది. నీవెవ్వఁడవు? రక్కసుండవైనను నీ యందు సద్గుణము లుండుట గ్రహించితిని. ప్రభావసంపన్నంబగు నీమండలాగ్రము నెందుండి యెట్లు సంగ్రహించుకొనివచ్చితివి. ఉన్న తాశయుండవగు నీవీతపస్విని దయమాలి యేమిటికి కష్టెడ్డించితివని ప్రశ్నించు నరేంద్రున కాదానవేంద్రుం డిట్లనియె.

# మాయాబలుని కథ

---

దేవా అవధారు! దక్షిణసముద్రమున కావల కనకమయాశేషవస్తునిస్తులంబై యత్యంత శోభాయమానముగు లంకాపురంబు గలదని వినియేయుందువు. అచ్చట దశకంఠునిశాసనమునఁ గట్టఁబడిన సమీరణుం డిప్పటికిని ప్రబలదాయతపతాకాగ్రంబులఁ దన వణకు గనుపింప నతిభయంబున నప్పురంబునఁ బ్రవేశించుచున్నట్లుదోఁచును. రావణునిచే బంధింపఁబడి యనవరతము విలపించుచున్న త్రిదశవనితల కన్నీటిధారలచే మలినమైనరీతి వినీల మరకతశిలానిర్మాణహర్మ్యంబుల మాణిక్యకుట్టిమంబు లొప్పారుచుండెను. ఆపట్టణంబున రాక్షసుల కధీశ్వరుఁడై పులస్త్యుని పుత్రుండును నంభోజసంభవవంశప్రదీపకుండును నగు విభీషణుండు రావణవధానంతరము శ్రీరామునిచే లంకారాజ్యపట్టాభిషిక్తుఁడై నివసించియుండెను. అతనిప్రఖ్యాతి త్రిభువనంబులయందును వ్యాపించియున్నదిగదా!

చ. పరమగుణాకరుండయి ప్రపంచ మహాపరితాపకుండునై
    పరగిన రావణుం డసురవల్లభుఁడీల్గ విభీషణుండు, భా
    సురశశిరాశయుండు, పరిశుభ్రసుధాత్మకమూర్తి రాజునై
    ఖరకరుఁ డస్తమింప శశికైవడి లోకహితంబుగూర్చెడిన్.

గీ. సహజదుష్టము నతిభయాస్పదమునైన
    దనుజకులమందుఁ బుట్టుకఁ గనెనుగాని
    యతఁడు విమలాకృతిని సేవ్యుఁడయ్యెఁ బ్రజకు
    ఫణిఫణాగ్రంబునందున్న మణివిధాన.

ఆ విభీషణునకు నేను మాతులసూనుండను. మాయాబలుం డనువాఁడను. వెనుక రావణుని క్రోధమునకు గురియై యతండు వెడలఁ గొట్టఁబడినప్పుడు నే నాపత్సహాయుండనై వెంటనుండి వాని మన్ననలకుఁ బాత్రుండనైతిని. ఆ విభీషణరాక్షసేశ్వరుం డొకనాఁడు ప్రణయలోకముతో విలాసగోష్ఠిం బ్రొద్దుపుచ్చుచున్న సమయంబునఁ బ్రతీహారి సత్వరమవచ్చి దేవా! కంకాళకుండను రక్కసుం డెక్కడనుండియో యతిజవంబున నేతెంచి దేవరదర్శన మతిశీఘ్రుంబున నభిలషించుచు వాఁకిట నిలచియున్నాఁడు. ముదలఁదేమని మనవిసేయ నా రాక్షసేంద్రుండు వాని నతిశీఘ్రమ ప్రవేశపెట్టుమని యనుజ్ఞనొసంగెను. అంతఁ బ్రతీహారిదారిఁజూపఁ గంకాళకుం డేతెంచి రాక్షసచక్రవర్తికిఁ గృతప్రణాముఁడై యేలినవానికి రహస్యముగా మనవిసేయఁదగిన పని యున్నదని బలుకుటయును దక్కినవారినందఱ నవులకుఁబంపి మద్వితీయుఁడై యున్న యా దానవేంద్రునితోఁ గంకాళకుం డిట్లనియె.

దేవా! దేవరచే నవనీతలంబున నన్నిదిక్కులకుఁ బంపఁబడిన వార్తాహరులలో నొక్కఁడనగు నేనుత్తరదిక్కుగాఁబోయి మహానదిందాటి పిదప నర్మదానదీతీరముననున్న పెక్కుపట్టణములఁ దిలకించుచుఁ గ్రమంబున భృగుగచ్ఛమను నగరరాజము జేరితిని. ఆపట్టణ రామణీయకంబు దిలకించుచుఁ గొన్నాళ్లందు గడపి పిమ్మట నుత్తర దిక్కుననున్న గ్రామపురపత్తనంబులంగల విశేషంబులఁ బరికించుచుఁ దుదకుఁ గంసారిశైశవదశాస్పదంబైన మధురాపురంబున కఱిగితిని. అందొకచో భ్రాతృయోగవిఘటితుండగు మారుతివలె మనుష్య రూపమందిన యాంజనేయునివలె క్షత్రియకులమం దవతరించిన యశ్వత్థామవలె, నరలోకమం దుదయించిన కార్తవీర్యునివలె, నతి బలపరాక్రమసమేతుండగు రాజపుత్రునిఁ గుమారకేసరి యనువానిని ద్యూత క్రీడాపరతంత్రుని నొక్కచోఁ గాంచితిని. వానిద్యూతవిద్యానైపుణ్య

మున కక్కఱింపడుచు నే నచ్చటనే ప్రచ్ఛన్నముగ నుంటిని. పిమ్మట నారాజపుత్రుండు కితవమిత్రులతోఁ బుడమి నెందును వీరుఁడులేకుండఁ జేసి యెందైన నొకధనికుఁడగువాని ద్రవ్యమెల్ల నపహరించికొనివచ్చి ద్యూతమునకై వినియోగించెద ననువాని బీరంపుమాటల నాలకించి వీఁ డెంతకైనఁ దగినవాఁడు. త్రిభువనంబులఁ వీని కసాధ్యమగు నదెద్దియు నుండఁజాలదని తలంచుచు నుఱియు నిట్లని యూహించితిని. ఈరాజపుత్రుండు ద్యూతక్రీడాభిరుచివలన నతిసాహసంబుతోఁ గనకము కొఱకు మేరువు నుత్పాటింపఁగలఁడు. రత్నేచ్ఛవలన ఫణీంద్రఫణాపటలమును విదళింపఁగలఁడు. అర్థకాముఁడై కుబేరుని బంధింపఁగలఁడు. తొల్లి కపిమాత్రుఁడగు నాంజనేయుఁడు దశకంఠునిచే బంధింపఁబడియును లంకాపురంబెల్ల భస్మ మొనరించియుండలేదా? భీమసేనుండును నాగలోకమున కేగి కాద్రవేయుల నెల్ల నిర్జించి యమృతకుండమును గైకొనలేదా? వీఁడును స్వర్ణార్థియై లంకాపట్టణం బాక్రమింపఁదలంచు నేమో చూచెదను. వీని ననుసరించియుండి యేమేమి చేయునో యెందెందుఁబోవునో తెలిసికొందుఁగాక యని నేను వాని వెన్నంటి తిరుగుచుంటిని. వాఁ డొక దినమందు దక్షిణ దిక్కుగాఁ బోయి యారాత్రి కొకగ్రామము జేరుకొనెను. అం దొక వృద్ధకితవుని యింట విడిసి వానితోఁ దాను దక్షిణసముద్రమున కావలనున్న యొక యమానుషప్రచార మగు ప్రదేశమున కరుగుచున్నానని ప్రస్తావవశంబునఁ జెప్పెను. ఆమాటవిని నేను చకితుండనైతిని. నే ననుకొన్నట్లేయైనది! ఈ వీరుఁడు తప్పక లంకాపురంబును నిగ్రహించుటకే పోవుచున్నాఁడు. దక్షిణసముద్రమున కావల రాక్షసనివాసభూమి లంక కాక యిం కేమున్నది? అమానుషప్రచార మగు ప్రదేశ మదిగాక యిం కేదిగలదు? వీనివెంటఁబోయి యింకను బరిశీలించెదంగాక యని యదృశ్యరూపంబునఁ గ్రమ్మర వాని ననుస

రించి పోవుచుంటిని. వాఁడతిజవంబున దక్షిణాపథము నతిక్రమించు చుండెను. తుదకు మలయమండలమును బ్రవేశించినతోడనే నాసందియము దీరినది. తప్పక లంకాపురమును ముట్టడించుటకే వాఁడేతెంచు చుండెనని నిశ్చయించుకొని యావార్త దేవర కెఱింగింప నతిజవంబున నిం దేతెంచితిని. తిరుగ బలవంతుండగు పురుషపుంగవుం డీలంకను జయింప నేతెంచుచున్నాఁడు. నాకుఁ దెలిసినవృత్తాంతమెల్ల నేలికకు నివేదించుకొంటిని. మీఁదికృత్యమునకు దేవరయే ప్రమాణ మని యూఱకుండెను.

ఆవృత్తాంత మెల్ల విని రాక్షసేశ్వరుండు శంకాకులస్వాంతుండై చెంతనున్న నాపైఁ దనచూపులం బఱగించెను. వానియింగితం బెఱింగి నే నిట్లంటిని. దేవా! దీనికై మీరింత వలవంతఁ బడ నగత్యము లేదు. దుర్వారభుజపౌరుషంబునఁ బ్రసిద్ధి కెక్కిన వీరులు పెక్కురు మనయొద్దఁ గలరు. వారు మేరువునైనఁ బ్రవ్వి తేఁగలరు. స్వర్లోకంబు నిముసములో నాక్రమింపఁగలరు. పాతాళంబు నతలంబొనర్పఁగలరు. మఱియును మదీయ మాయాప్రభావంబునకుఁ ద్రిభువనంబుల నెదు రెయ్యదియైనఁ గలదా?

చ. పవలది రాత్రిగా, నిశిఁ బవల్గతిఁ, జంద్రుఁ డినుండులా గినుం
 డువిధునిమాడ్కిఁ, జీఁకటిఁ గడున్ వెలుఁగట్లు, వెలుంగు నంధకా
 రవిధము, వార్ధి నేలవలెఁ, బ్రస్థల మంబుధిలీల నిట్లు వ
 స్తువులను మార్చి లోకమును దోడ్తనె విభ్రమ మందఁ జేసెదన్.

ఇట్టి నేను దేవరయానతివడువున నీకంకాళకునిసహాయముతో నంతరాళయానంబునఁ బోయి యిచ్చటి కేతెంచువానిని నివారించి వచ్చెద నని విన్నపం బొనర్ప నావిభీషణుండు నీయిచ్చవచ్చిన ట్లొనర్పు మని యానతిచ్చెను. తోడనే నేను గంకాళకునితో లంకమీఁద కేతెంచనున్న యామానవుని సమీపమున కఱుగ బయలుదేరితిని.

పిమ్మట నచిరకాలంబుననే మలయమండలంబున నొకమహారణ్య మధ్యంబున నున్న జీర్ణచండికాలయమును దిలకించితిని. నిలువఁ దావులేని యీదురంతారణ్యంబునఁ దిరుగు నావీరాధ్యగుఁ డొకప్పు డైన నీయాలయమును జేరుకొనక మానఁడని తలంచుచు నే నట కేఁగితిని. అందు దేవీపదోపసేవకులగు వేతాళురు పలువురు నన్గాంచి యాలింగనకుశలప్రశ్నాదిసత్కారము లొనరించిరి. వారితో ముచ్చ టించుచు నే నందుఁ గొంతకాలము గడపితిని. ఇంక జామురాత్రి యున్న దనఁగాఁ బ్రాంగణమున నున్న కంకాళకుం డదరిపడుచు "అదిగో! నేను చెప్పిన వీరుఁ డిచ్చటకే వచ్చుచున్నాఁ" డని నాకుఁ జూపించెను. నే నాయుదారమూర్తిని దిలకించి విస్మయఁ పడుచు "వీనినిఁగూర్చి కంకాళకుండు చెప్పినది యత్యల్పము. స్వ రూపంబున భీమాదివీరులు వీనిని నిక్కముగఁ బోలనేరరు. స్వర్గలోక మందలి వీరులఁగూడ నతిశయించుచు వీనిరూప మొప్పియుండెను. కావున వీనిచేష్ట లెఱుంగువఱకు నీ వేతాళవర్గముతో నదృశ్యుండనై యుండెదంగాక" యని యట్లొనరించితిని. ఇంతలో నాపురుషపుంగ వుండు గుడిలోని కేఁగి దేవికి నమస్కరించి బైట కేతెంచి యం దున్న మండపముమీఁద నుపవిష్టుం డయ్యెను. అప్పు డంతరిక్షమం నుండి నాకుఁ బూర్వపరిచితుం డగు కపాలభైరవుం డను విద్యాధరా కాపాలికుం డేతెంచెను. వానికి నమస్కరించి యావీరుఁడు నిజ వృత్తాంతమెల్ల నక్కాపాలికునిప్రశ్న కుత్తరముగాఁ జెప్పెను. మధు రాపురపాలకుం డగు కళిందకేతుని తనూజుండు కుమారకేసరి యను నతండు ద్యూతవ్యసనపరాయణుండై లంకాపురంబును జయించి విభీ షణునికోశ మందలి ప్రభూతకాంచనరాసులం గొనివచ్చుటకుఁ బోవు చున్నాఁ డనుట విని కంకాళకుఁడు చెప్పినవృత్తాంత మెల్ల నిక్క మయ్యెనని వానిపరేంగితజ్ఞానమును మెచ్చుకొనుచు వాని నత్యంత

ము గౌరవించితిని. అప్పు డాపురుషుని విక్రమాతిరేకంబునకుఁ దృప్తుఁ డై! యక్షపాలికుండు నిజయోగవిద్యాకృష్టమగు దివ్యకృపాణ మొకటి వాని కొసంగి యంతర్హితుం డయ్యెను. పిమ్మట నారాజపుత్రుండును ఖడ్గమును గైకొని యాగుడిలోనికిఁ బోయి యందు నిద్రించెను.

అప్పుడు నే నారా! వీఁడు సంగరరంగమున నిక్కముగ న సాధ్యుండు. మీఁదుమిక్కిలి నిరాయుధుండగు వీనికి దివ్యకృపాణము లభించినది. వీని నుపేక్షించిన నిఁక లంకాపురము మాకుఁ దక్కుట కల్ల. కావున వీనియందు మాయాప్రయోగం బొనరింపవలెను. వీఁడు ద్యూతవ్యసనుఁడు గదా! మాయాద్యూతంబున వీనిని నిర్జించెదం గాక యని నిశ్చయించుకొని యందలి వేతాళవర్గము నెల్లఁ గితవబృం దముగా నేర్పఱచి ప్రాంగణమండపమున జూద మాడ నారంభింపఁ జేసితిని. ద్యూతరసోల్లోలకోలాహలము వినినతోడనే తదేకపరతంత్ర చిత్తుఁడగు నారాజకుమారుండు గుడిలోనుండి వచ్చి వారితోఁ గలిసి యాఖడ్గమును బణమొడ్డుచు జూద మాడఁ దొడంగెను. నేనును గం కాళకుని మాయాశక్తిచే విమానముగఁ జేసి దాని నధిష్ఠించి విహిత విద్యాధరాకృతిం బూని యంతరిక్షమునుండి యవతరించి వారిం జేరి యాపురుషునితో నామాయావిమానమును బణమొడ్డి జూదమాడితిని. నావిమాన మతండు గెలుచుకొనెను. వానికృపాణమును నేను గెలు చుకొంటిని. వాంఛితార్థసిద్ధిం గాంచి నే నావేతాళవర్గముతో నదృ శ్యుండ నైతిని. అప్పు డావీరుండు మనుష్యదుర్లభం బగు విమాన లాభమునకు సంతుష్టుఁడై లంకాపురంబున కేఁగ విమానరూపమున నున్న కంకాళకునిమూఁపుమీఁద నుపవిష్టుఁ డయ్యెను. వాఁడును నా యుపదేశానుసరణి గగనంబున కెగిరి యొకచో గంభీరవారాశిమధ్యం బున వానిని బడఁద్రోసి నిజరూపము దాల్చి నన్నుఁ గలిసికొనెను.

## ౩౩౩ వ మజిలీ.

# బాలయోగినికథ

పిదప మేమిరువురమును లంకాపురంబున కేఁగి జరిగిన వృత్తాంత మెల్ల విభీషణున కెఱింగించి కృపాణమును వాని కర్పించితిమి. అందుల కారాక్షసేశ్వరుం డానందమును బొంది యాకృపాణమును నాకుఁ గానుకగా నొసంగెను. దేవర కిప్పు డే నొసంగిన మండలాగ్ర మదే యని విన్నవించుకొనుచున్నాను. ఈతపస్విని యెవ్వరో నే నెఱుంగను. ఏకారణముచేతనో మాలంకాపురంబునఁ బ్రతిదినము నందందు వల్కలంబులఁ దాల్చి తిరుగుచు నొకనాఁడు నాకంటఁ బడినది. చూచినమాత్రముననే నేను మదనుని పూములుకులకు గుఱియైతిని.

గీ. వల్కలపటావగుంఠనాపరత నాత్మ
వర్ష్మమును గప్పుకొన్న తాపసిని నీమెఁ
గనఁగ నొరనున్న మదనపీరునికటారి
చందమునఁ దోఁచె నాదగు డెందమునకు.

మఱియును—

గీ. నడచినప్రయాసవలనఁ జొప్పడిన ఘర్మ
వారిచే ధౌతమగు నీశరీరయష్టి
యపుడె నీర్వెట్టు కెడలిన యంగజన్మ
నలినబాణంబువలె నెద నాటె నాకు.

అప్పుడు నేను మకరధ్వజుని తీవ్రబాణంబుల వేధింపఁబడుచు, మంచిచెడ్డ లెఱుంగఁజాలక, ధైర్య మెడల, లజ్జను బరిత్యజించి యా

మించుబోణివెంటc బోదొడంగితిని. నారాక నెఱింగి యాబాలతప
స్విని యందుండి పైకెగిరి నిరాలంబ నుగు నంబరంబునకుc బోయినది.
నేనును నుత్పాతవిద్యం బురస్కరించుకొని యామె యొక దివ్యనారీ
మణి యని తలంచుచుc గామగమనంబున నామెవెంట నఱిగితిని.
ఇట్లు బోవుచు చందనవనవలయపరిమళోపగూఢమై గిరినిర్ఝరతుషార
నికరాంచితమై యొసంగు మందమారుత మొకచో నెమ్మేన సోcక
ననంగతాప మతిశయించుటయును నేనాప్రదేశంబున మాయాద్విజుని
రూపమునుబూని యామె ననుసరించి సరసవచనంబుల వశ్యురాలిగాc
జేసికొననెంచిన నాయాశయ మెఱింగి యాతపస్విని నన్ను విడచి వెండి
యు మింటి కెగసెను. నన్ను వంచించి పోవుచున్నదను కోపంబున నిజ
స్వరూపమును దాల్చి హఠాత్కుండనై యతిజవంబున నామెవెంటc
బడితిని. రావణుcడు సీతను బలాత్కారముగా నపహరించిన ట్లామెను
గైకొనc దలంచితిని. అట్లు పారిపోవుచు నామె యిచ్చటc బడినది.
పుణ్యావశంబున జగదేకరక్షకుండవగు నీశరణ్య మామెకు లభించినది.
పిదప దేవరతో నాకు సంగరము గలిగినది. శవపిశితపేశితోత్కర్తన
కర్మైకశక్తి గల యాకత్తి నీవు ధరింపc దగినదికాదు. నే నొసంగిన
కృపాణమో తలంచినంతనే సన్నిహితమగుచుండు దివ్యప్రభావము
గలది. మొక నొకప్పు డీఖడ్గరాజము స్వప్నమున నాకుc గనంబడి
దేవాంశసంభూతుcడగు పురుషునిమీcద నన్నుc బ్రయోగించిన నుప
యోగ ముండనేరదని బలికెను. అజ్ఞానుండనై దీనిని నీమీcదc బ్ర
యోగించితిని. దేవాంశసంభూతుండ వగుటచే నియ్యది నిన్నేమియుం
జేయcజాలక నమస్కరించునదివోలె పాదమూలమునం బడినది. కా
వుననే దీనిని నీ కొసంగితిని. ఈతపస్వినియందుc గల నామోహమెల్ల
ననౌచిత్యవిషయ మగుటవలన, దండధరునిభయమువలన, వివేకప్ర
బోధంబువలన నిసంబున నుదారాశయము గలుగుటవలన, బూర్తి

గా నశించెను. ఇదియే నావృత్తాంతము. ఇఁక నాకు సెల వొసం గుము. సత్వరమ పోవలయు నని రాజేంద్రు ననుమతంబు బడసి యా నిశాచరపుంగవుండు సూర్యోదయ మైనతోడనే పోవు చీఁకటివలెనే తిరోభూతుఁ డయ్యెను.

ఆబాలతపస్విని రాక్షసభయంబునఁ గలిగిన వణకుచే నెమ్మే నఁ బొడమిన చెమ్మటయెల్ల నడంగ స్వస్థచిత్తయై యామేదినీకాంతు ని రూపమును స్వచ్ఛదృష్టులం దిలకించి యెద్దియో స్మృతి నభినయిం చుచు నెమ్మోమువంచి మృత్యుముఖంబునుండి వెలువడిన హృదయం బును తూళన మొనరించురీతి నవిరళాశ్రుధారలు నయనంబులనుండి గార వెక్కివెక్కి యేడువఁదొడఁగెను. పుండరీకుం డామెం గాంచి జాలిఁగొని అన్నా! రక్కసుం డను క్రూరగ్రహమువలన విడువం బడి వర్షానక్షత్రప్రవృత్తివలె ననివారితంబుగ నయనఘనజలాసార మును గురియుచున్నదా యేమి? సహజోష్ణంబు లగు నశ్రుధార లీమెహృదయంబునఁబడి నాయెదను దపింపఁజేయుచున్నవిగదా! నేను సంగరంబునఁ బడిన కష్టమును జూచి యీయమె డెంద మార్ద్రితం బూని యిట్లు ద్రవించుచుండవచ్చును. లేక తన్నిట్లు చిక్కులం బెట్టి న రక్కసుం డక్షతుండై పోవుటకు విచారించుచుండెనా? వ్రతనియ మము సెడెనని విలపించుచుండెనా? లేక యితరదుస్సహదుఃఖానుస్మ రణంబున నిట్లాపన్నురా లగుచుండెనా? అ దేమై యుండును? ఏ మని నేను నిర్ణయింపఁగలను? విచారకారణం బెఱుంగక నే నేమని యంత్రపుం బొమ్మవలెఁ గన్నీరు విడుచుచున్న యీయమె నూఱడింపఁ గలను? అని యారాజేంద్రుండు వితర్కించుకొనుచుండ నాతపస్విని కన్యక కలంక ముడిగి నిజవల్కలోత్తరీయంబున వక్త్రాంబుజమును దుడుచుకొని కువలయదళకోమలములగు చూపుల నతనిపైఁ బఱపుచు మృదుమధురవాక్కుల నానరేంద్రున కిట్లనియె.

శా. ప్రేతస్త్రీగ్రథితాస్రతోయయుతమై, వేతాళికాలూనమాం
సాతిప్రోజ్జ్వలమై, విశుష్కకీకస నికాయాకారసంకార వి
జ్ఞాతంబై విలసచ్చితానలగతాశ్మంతాంతరంబై కనన్
బ్రేతారణ్యము రక్తభోజనుల కర్థిన్ వంటయిల్లయ్యెడిన్.

మఱియు నియ్యది పిశాచలోకనగరములో మహాసంఘసంభృ
తంబగు నడివీథివలె నున్నదిగదా ?

చ. శిరమున నాంత్రరజ్జువులఁ జేర్చి, మహాజగరోగ్రచర్మమం
బరముగఁ దాల్చి మూఁపునను బ్రాంశుతరావిరళాస్థిదండమున్
గరమువహించి ప్రేతతతి కంపము నొందఁగ ఫేత్కృతిధ్వనుల్
బఱపుచు నీవరేతపురి భైరవుఁ డుండెను దండపాణియై.

ఇందుఁ గ్రీడాసంక్రాంతకౌణపవిముక్త ఫేత్కారముఖరంబులగు
నరకరంకములయందుఁగూడ రాక్షసత్వము గనంబడుచున్నది. జం
ఝామారుతమువలనఁ బైకి లేఁగు చితాభూతమునకుఁ గూడ ఖేచర
త్వము గలుగుచున్నది. కరాళకోటరకుటీరముల నాశ్రయించియున్న
మర్కటముల కిలకిలారావశాదస్వనంబువలన నీయశ్వత్థభూరుహంబు
గూడ భూతభావమును బొందియున్నది. మఱియును—

చ. కరములఁ జిమ్మువేగమునఁ గ్రాలెడిగాలిని శోత్రనాసికాం
తరములు మ్రోఁతఁబెట్టఁ, గ్వణనం బొనరింపఁగ నస్థియంత్రముల్
సరభసవృత్తి నాట్యమొనరించుఁ బిశాచము లిందు గీతవా
ద్యరతి లయానుగుణ్యముగ నస్రసురాపరితృప్తి నీచమై.

చ. పలలముగొంతఁ గతుములఁ బాలుఁ గొంతయు శేషమాస్యమం
దలవడఁ గొన్న లుబ్ధకుణపాధము గాంచి హాఠంబుజేసి యి
మ్ముల హరియింప వేగ మొకభూతపుడింభకుఁ డడ్డువచ్చి దో
ర్బలమున హుంకరించి ప్రహారంబుల నొంచి యలంచు నల్లదే.

నిరంతరమును నరమాంసఖుముద్గలం దినుచున్నను దృప్తిఁ
జెందని డింభకునీ దనయుత్సంగమున నిడుకొని యుపలాలించుచు నజ

నచ్చైటికమగు నిజవక్షోజమును నోటి కందీయ వాఁడది గబళించి లలత్ప్రశితవల్లూరమని జప్పరించుచుండ నాబాధ కోర్వలేక కోరలు గనుపించునట్లు నోరు దెఱచుకొని మోము పైకెత్తి వికటముగా ఫూత్కార మొనరించుచు రోదనము జేయుచున్న యాప్రేతజాయం దిల కింపుము. ఒకచోఁ బిశాచయువకులు ప్రజ్వలితచితోదరంబునుండి కించిద్దాఘ్రష్టకుణపముఁ గొనివచ్చి హస్తంబునఁ గహకహారావం బొనరించుచున్నారు. మఱొకచోట ప్రేతసంఘాతములు, వేఱొకచోట వేతాళబృందములు, ఇంకొకచోట భూతకదంబకములు, ఇట్లు సర్వత్ర భీభత్సదర్శితం బైన యీశ్మశానమున నిలచియుండుట సకల సౌభాగ్యసమేతుండవై ధరణీరాజ్యలక్ష్మీధురంధరుండవగు నీకు మంగళప్రదము గాదని వచించు నాతపస్విని పలుకు లాదరించి యారాజేంద్రుఁ డిట్లని తలంచెను.

ఈమెవచించినదెల్ల నిక్కము. ఇచ్చట సర్వత్ర భరింపరాని దుర్వాసన ప్రబలియున్నది. చితాధూమం బెల్లెడల వ్యాపించియున్నది. భూతప్రేతపిశాచముల కాటపట్టగు నీశ్మశానమును సత్వరమ విడిచిపెట్టుట యుచితమగును. ఈమెను బ్రశాంతమగు తపోధనాశ్రమంబున సగౌరవముగఁ దోడ్కొనిపోయి యందు స్వస్థతం బొందినపిదప నీమె యెవరో యెచ్చటనుండి వచ్చినదో లంకాపురంబున కెందుఃకేఁగినదో యింత లేఁబ్రాయంబునఁ దాపసి యేమిటికయ్యెనో మొదలగు వృత్తాంతమెల్లఁ దెలిసికొనెదంగాకయని నిశ్చయించి యా రాజపుంగవుఁడు శ్మశానమున కధిష్టాత్రియైన భీషణయను దుర్గాదేవి సమీపంబున కేఁగి ఫాలాగ్రమిళితకరసంపుటాంజలుండై ప్రణమిల్లుచు నిట్లని సన్నుతించెను.

శ్లో. విద్యుత్పుంజోగ్రనేత్రం పృథుచపల లలజ్జిహ్వ ముద్వృత్తగల్లం
సృక్కాంతోదగ్రదంష్ట్రాప్రకటమసరళస్థూలపింగోర్ధ్వకేశం

నను నితరులకు విపత్తు సంభవించుచుండ నిఁక వారి విక్రమమును వర్ణింపనేల ? లోకములెల్లఁ దమ సర్వనిధులకు సంరక్షకులుగా నేర్పరచికొనినవారి పరార్థనిస్పృహత్వంబు నేమని గొనియాడఁగలను ? యోగులవలె వాయుభక్షకులైనవారి యదైన్యప్రవృత్తి నెంతని గీర్తింతును ? వృద్ధులలో వృద్ధుఁడైన శేషుఁడే నిజశిరంబున, నగిరి తరుషండసాగరమహాభరయగు వసుంధరను లీలాకుసుమకలికవలె ధరించియుండ వారి బలపరిభావం బేమని చెప్పఁదగును ?

గీ. ఫణభృతులు సృష్టి కధికులై పరగ వారి
సుగుణభరగుల నేమనిపొగడఁదగును
వారి తలఁబుట్టు నస్థిలవంబుగూడఁ
బ్రస్తుతింగాంచె జగముల రత్నమనఁగ.

విప్రాకారముననున్న శ్రీహరికి సర్వభూమండలమును దానము జేసిన సుకృతంబువలననే బలిదానవచక్రవర్తికి నాగలోకనివాస సౌఖ్యం బబ్బెను. పూర్వము వసుంధరోద్ధరణ నెపంబున రసాతలంబున కేఁగిన వరాహరూపుండగు జనార్దనుం డాలోకమును విడువఁజాలక యిప్పటికి నందే నివసించియుండెను. కూర్మావతారంబునఁ నతండు పాతాళమున కేగలేక పంకాంబువుల నిర్మగ్నుఁడై యుండెను. కావున నసే యుత్కృష్టవిష్టపాలోకన కుతూహలుండగు వాని కితరలోకనివాసంబునకు మనస్కరించినదికాదు.

చ. అతితర నత్తపోనియతినైనఁ గనంగ నశక్యమైన, యా
యతలనివాససౌఖ్యము సురాధిప భూతగణాధిపాది దే
వతలకుఁ గల్గలే దచటివస్తువులెల్ల నశేషసృష్టిలో
నతిరమణీయముల్ తరమె యాఫణిలోకవిశేష మెన్నఁగన్.

ఆశేషసుఖసమంచిత మగు నాపాతాళలోకమందు ముంగిటఁ గల ముగ్గుపట్టివలె, గోడమీఁది చిత్తరువుభాతి, తరుణీమణి కేశ

నున్న యాభరణముగతి, మంజులతానికుంజమున నున్న పుష్పము విధంబున ముల్లోకములకు వన్నెఁ దెచ్చుచు నిందీవర మను నగరంబు గలదు.

మ. స్తుతి విస్తారమ దేల నప్పురమునందుఁ సారసంసార సం
భృతి కెల్లన్ ఫలమా మృగాక్షుల ముఖశ్రీసన్నివేశంబులక్
షతతామోదగతాళిపాళిమిషచే స్వర్భాను డిందుభ్రమన్
ప్రతిసంచార మొనర్చు దైవికముగా నచ్చెన్ విధుం డంచటన్.

అట్టిపురంబున వాసవునివిధంబున నధికమగు సంపద్విశేషంబు గలిగి, యాగ్నేయకసాయకధరుండగు హరునివలె నరిబృందముల నెల్ల వశీకృతములుగ నొనరించుకొను ప్రతాపము గలిగి, యాపూరిత శంఖస్వనుండగు హరివలె శుభ్రయశస్సు గలిగి, శాపానుగ్రహ సమర్థుం డగు విరించివలె దుర్లంఘ్యశాసనము గలిగి, నిరాతపం బగు నాలోకంబున నున్న మన్మథునకు హారనయనదహనదాహోపశాంతికై బొడమిన జలధరవితానమువలె నొప్పు నిజవినీలఫణాఫలకడంబరంబు గలిగి, యహిభువనంబునఁ గూడఁ బ్రచరింప నిచ్ఛఁ గొని పూర్వాద్రి నుదయించిన భానునివలెఁ బ్రకాశించు నిజశిరోరుమండపమణికిరణచక్రుఁడై, యపరిమిత పరాక్రమక్రముఁడై, కాకోదరభట శ్రేష్ఠుఁడై, సురసమ్మాన్యుఁడై, త్రివిష్టపభర్తకు మిత్రుఁడై, పాతాళనాయకుఁడగు వాసుకి కాప్తుఁడై, చరాచరగురుండగు శంకరునకుఁ బ్రియభక్తుఁడై, మహాత్ముఁడగు శంఖపాలుని వంశమున కాభరణమై క్షత్రియమహాన్వయంబునకు మాణిక్యమై శిఖండతిలకుం డను రాజశ్రేష్ఠుండు గలఁడు.

సహజముగా జలమందే నివసింపఁ దలంపుగల కూర్మరాజు జలధిపతుపాతంబునఁ దదంగమథనోపకరణం బగు మందరాద్రికిఁ దిరుగుమట్రాడుగాఁ బరఁగి యుపకార మొనర్చిన వాసుకియెడలఁ గుపితుండై

డైనను శిఖండతిలకుని పరాక్రమం బెఱింగి పరాహతశంకచే సంకుచిత దేహుఁడై నిజకటాహకర్పరంబున నడంగియుండెఁ గాని జగత్రయ మును దాల్చు మహాశక్తిఁ గల యాయాదికూర్మ మాకోపంబున ని మునములో వాసుకిని వానిపాతాళమునుగూడ రూపు మాపకుండు నా ? అభయంబుననే వాసుకి పాతాళరక్షణ భారం బెల్ల శిఖండతిల కుని మూఁపునం బెట్టి యనాకులుఁడై, కైలాసమున కేఁగి ధూర్జటికి శిఖాబంధముగా నేర్పడి సురనదీసలిల శీతలశీకర ప్రసారభాసురంబగు నాదేవుని జటావనంబున సుఖంబుగా నివసించి యున్నాఁడు. అట్టి శిఖండతిలకుఁడు నిజమండలాగ్రమునకు విజయకమలమువలె, భుజము ల నొప్పు భూమివలె, వక్షమం దున్న లక్ష్మివలె, ముఖమందున్న సరస్వతివలె, కంటిమీఁది తెప్పవలె, పరాక్రమమునకు వీరలక్ష్మి వలె, గుణకలాపమునకు కీర్తివలె, వ్యాపారమునకు బుద్ధివలె, వ్యవ హారమునకు నీతివలె, హృదయంబున కనురాగమువలె నొప్పుచు సు వంశసంజాతమగు మౌక్తికమువలె సువృత్తనిర్మలయై, యౌవనసంశ్రి తయై, రూపపరిపూరితయై, లావణ్యపరిగతయై, సౌభాగ్యపరిభృత యై, వినయసంపన్నయై, సర్వలక్షణసమన్వితయై యలరారు విజయ రేఖ యను మానినీరత్నమును ధర్మపత్నిగాఁ బట్టమహిషిగాఁ బడసెను.

ఆమె సతులకుఁ బతియే దైవమని నమ్మి తదంఘ్రిసేవాను షంగచిత్తయై సతీవ్రతం బాచరించుచుండ నామెయందు దేవతలు గూడఁ బ్రసన్నులై యొసంగినట్లు పరమేష్టి నిజకటాక్షటంకమునఁ జకోరదనము నెల్ల సానఁబెట్టి సృష్టింప, నారాయణుండు నాభికమల పరిమళపరాగంబున మెఱుఁగువెట్ట, శంకరుండు మౌళీందుకిరణధారల మార్జనం బొనర్ప, మన్మథుండు నిజశరప్రభావం బధిష్టింపఁజేయఁ ద్రిభువనైకసారయై యుపయసుందరి యను పుత్రికారత్న మాయిల్లా లి గర్భంబునఁ బొడమెను.

అయ్యది ప్రథమసంతానసంభవం బగుటచే నప్పు డాఫణిరాజు మహోత్సవంబు లనేకంబులు జేయించెను. సూతికాగృహద్వారముప్రోల షష్ఠిజాగరణంబులయందుఁ జేయఁబడిన ఘటధ్వనుల కైతవంబున సంకల్పజన్ముండు జగజ్జయంబునకై భుజాస్ఫోటనం బొనరించుచున్నట్లు తోఁచెను. ఆబాలికకు నామకరణాదివిధులు యథావిధిగ నిర్వర్తింపఁబడిన పిదప జ్యోతిష్కు లామె దేవాంశసంభూతుఁడగు పురుషుని బెండ్లాడఁగలదని వచించిరి. యోగీశ్వరుల మోక్షేచ్ఛయు, సజ్జనుల సుచరిత్రము, దపస్వుల నియమము, గృపణుల ధనము, భయశీలుర ప్రాణరక్షణవ్యాపారము, దినదినం బెట్లభివృద్ధిఁ జెందుచుండెనో యట్లె యాబాలిక తల్లిదండ్రులు మిగులఁ బ్రేమతోఁ బెంచుచుండఁ బెద్దదగుచుండెను.

ఇట్లు కొంతకాల మరుగ సముచితసంభారముల సమకూర్చియుంచి, మనోహరలావణ్యరసంబున మెఱుఁగుఁ బూతఁబెట్టి, సమున్మిషిత త్రివళుల రంగవల్లికలఁ దీర్చి, వక్షోజముల నుపరిభాగంబున మంగళకలశలగా నమర్చి యనంగప్రభుని ప్రథమప్రవేశంబునకు శుభపరికరంబుల నలంకరించిన దివ్యసౌధమువలె నబ్బాలికామణి యంగయష్టి యలరారుచుండెను. వర్షాంతమున నొప్పు చంద్రికవలె, సానఁబెట్టిన మాణిక్యదీపికకైవడి, విలాసాంభోజకళికవిధంబున, వివిధవర్ణంబులఁ జిత్రింపఁబడిన చిత్తరువుభాతి, స్నిగ్ధతనుచ్ఛాయలం బరఁగు నవయౌవనం బామెయందుఁ బొడసూపెను.

గీ. తరుణివక్షోజకలశాంకితంబునైన
దివ్యవేదికమీఁదఁ దదీయకాయ
కాంతి వారిప్రవాహసద్గరిమ మరుఁడు
గరము నూత్నరాజ్యాభిషేకంబు వడసె.

గీ. చంచలాలోకధారిణీసరణి మీరఁ
బ్రావృషమునీల బాల యౌవనపుఁ జిత్త
యతిశయంబుగ వహియించె ననవరతము
నమల లావణ్యవాహినీసముదయంబు.

మ. సతి లావణ్యసరిద్వహారపరుఁడౌ సంకల్పజన్ముండు వి
స్మృతి సాత్మీయసుసాధనోత్కరమటన్ జేజార్ప నందందు గం
గతమై దోఁచెఁ గపోలసత్పులినభాగంబందుఁ బ్రాతి చి
హ్నితమామీన, మపాంగతీరసరణిన్ దృగ్రూపబాణంబు, లు
న్నతరీతిన్ జాబుకంపుటొడ్డునను నందంబైన భ్రూతీరమున్.

అట్టి యనన్యసామాన్యలావణ్యంబున నొప్పుచున్న కన్నె మిన్నం గాంచి తజ్జనకుం డొకనాఁ డిట్లని యోజించెను. ఇట్టి మహో న్నతాకృతి నలరారు యోషామణి యెన్నఁడైనఁ బాతాళనాయకుం డగు వాసుకికంటఁ బడకుండునా? చూచినతోడనే యతండు మదనా తురుండు గాకుండునా? మదనమూఢుఁడై యీమెను దన కొసంగు మని నన్నుఁ గోరకుండునా? అప్పుడు నే నేమి సేయవలయును? స్వామిమనోరథం బీడేర్పకుంటుట సమంజస మగునా? వానికి నా యందుఁ గల సుహృద్భావము నెట్లు గా దనఁగలను? ఇదియునుం గాక కోరినదానిని లేదనుప్రవృత్తి నాకుఁ గిట్టదు గదా? పోనిమ్మని నాపుత్రికను వాని కిచ్చుటకు నామనం బొప్పదు. అతం డెంత రసా తలచక్రవర్తియైనను ముల్లోకసుందరియగు నాతనూజాత కనురూప వరుండు గానేరఁడు. కావున నాపుత్రిక నతండు జూడకుండ నీమె వృత్తాంత మతం డెఱుంగకుండఁ దగినట్లు జేయుటయే కర్తవ్యమని నిశ్చయించి సముద్రగర్భమం దున్న యొకమనోహరమగు నంతర్ద్వీ పంబునఁ గన్యాంతఃపురంబు నిర్మించి యందు వలయు వస్తుసముదా యము నెల్లఁ జేర్చి యనేకుల వృద్ధకంచుకుల నందుఁ గాపుంచి నమవ

యస్కులగు కన్యకలఁ బలువురతో నాయుదయసుందరి నావివిక్త స్థలంబున నివసింపఁజేసెను.

ఆళిఖండతిలకున కత్యంతప్రేమాస్పదుఁడైన రత్నమాళియను పద్మముఖులాభరణునకు వేణీమతియను సహధర్మిణియందు లేక లేక తారావళియను పుత్రికగా నే నుద్భవించితిని. ఉదయసుందరికి నేను సమానవయస్కనై యామెతో నాహారవిహారశయ్యాసనములయందుఁ గలసిమెలసి ప్రవర్తించుచుఁ దదీయసఖీమండలమున కెల్లఁ దలమానికమ్మనై యుంటిని. నవయౌవనంబునఁ జెలంగియున్న కన్నకూఁతునకుఁ దగినవరుని సమకూర్ప నాళిఖండతిలకుండు మిక్కిలి తొందరపడుచుండెను. పదునాలుగులోకములయందున్న రాజకుమారుల మనోహరాకారములఁ జిత్రపటములమూలమునఁ దెప్పించి యామెకుఁ బంపి వారివారి యుత్కృష్టచరిత్రము లెల్ల సఖులచేఁ జెప్పించి యొప్పింపఁ జూచుచుండెను. కాని వారి నెల్లఁ దృణప్రాయులఁగాఁ ద్రోసివైచినది. త్రిభువనవిహార మొనరించు విద్యాధరుల నిరసించినది. దేవతామూర్తులగు మన్మథాదులఁగూడఁ దిరస్కరించినది. పురుషులరూపము నే చూడరాదని తలంచుకొనినది. అందువలన నామెతల్లిదండ్రులకంతేని సంతాపము గలిగెను.

అట్లు పురుషదర్శనద్వేషిణియై యుదయసుందరి మాతోఁ గేవలము విచిత్రపత్రచ్ఛేదనవిద్యయందును, మనోజ్ఞచిత్రరచనాకౌశలమునందును ననల్పవేణుగానమాధుర్యతరంగములయందును, సమరద కందుకక్రీడావిశేష మందును, నిరంతరడోలావిలాసవైభవం బందును, మనోహర శుకపిక శారికాది శకుంతసంతాన మంజులాలాప శ్రవణసంతోషములందును, ననేకగృహమృగ మరాళచంద్రకక్రీడాడంబరము నందును, నభినవలతానిషేవణము నందును, కుసుమాపచయ వినోద[illegible] నందును, క్రీడాసరోవరంబుల జలకేళిఁ దేలుటయందును, నిరంతరము మనమునకు వినోదంబు గలిగించుకొనుచుఁ గాలము గడపుచుండె[illegible]

ఇట్లుండ నొకనాఁటి ప్రాతఃకాలంబున నినుఁ డరుదెంచినతో డనే మోమున వికాసము గనుపింప నధికానందంబునఁ గమలినీరమణులు ప్రబోధతరళితంబులగు నరవిందపత్రేక్షణంబుల ననురాగముతో వాని నీక్షించుచుండ, మధుపానమత్త మధువ్రతవ్రాతము ఝుంకారగీతంబులఁ బఠించుచుండ, వేలావనతరుశిఖరములందు నిద్రనుండి లేచి సముద్రసైకతోత్సంగముల ననుసరించి బారులుగట్టి విహంగమకులంబు లెగురుచుండ, నంతఃపురపరిజనంబు ప్రాతఃకృత్యములయందప్రమత్తులై సంచరించుచుండ నాయుదయసుందరి సుఖప్రబోధయై చక్కఁగా నలంకరించుకొని ప్రభాతక్రియల నిర్వర్తించి విలాసభవనంబున సుఖాసనంబునఁ గూర్చుని ప్రసన్నముఖియై యున్నసమయంబునఁ జెలిమికత్తియలెల్ల నుల్లాసమున నామెం బరివేష్టించి కొందఱు రాత్రి యుద్యానదీర్ఘికాచక్రవాకవియోగవేదనాక్రందనము దాము విన్నచందమున వినిపించుచుండఁ గొందఱు కలిసియున్న లీలామృగమిథునమువలె నల్లిబిల్లిగ నల్లుకొనియున్న లతలం జూపుచుండ నత్యంత వినోదంబున నున్న సమయంబున మయూరకాఖ్య కిన్నరమిథున మతిరయంబున నట కేతెంచి యేలాలతావల్కలనియమితంబైన చిత్రపట మొకదానిని యుదయసుందరిమ్రోలఁ బడవైచెను.

అక్షివిక్షేపమాత్రమున నామెయాశయ మెఱింగి నే నద్దాని గ్రహించి యాచ్ఛాదనమును దొలఁగించి చూడ నందొకసుందరపురుషుని ప్రతిరూపము జిత్రింపఁబడియుండెను. ఆయద్భుతస్వరూపసందర్శనంబున విస్మితురాలనై యారా ! మయూరకా ! ఇందు లిఖింపఁబడిన సుందరపురుషుండెవ్వఁడో చెప్పుమని ప్రశ్నింప వాఁ డిట్లనియె. నేఁడు వేఁకువను సముద్రాంతర్ద్వీపమండలి పర్వతమందు విహరింపఁబోయి మేము తిరిగివచ్చుచుండ నొకచోట విచిత్రతరులతాప్రశోభితమగు సుందరజలాంతరస్థలంబునఁ బడియున్న యీపటము మా

కు గోచరమయ్యెను. అందున్న సుందరాకారమును నే నతికౌతుకం
బున నీక్షించి శంఖాంకితకరుం డగుటచే నీతండు నిక్కముగఁ బురు
షోత్తముఁ డగునని నాప్రియురాలు మయూరికతోఁ బల్కితిని. శంఖ
రేఖాదులవలన మురారియని మీరు తలంచుచుంటిరి గాని యిట్టి
సుందరాకారమున నెసంగు నితండు మన్మథుండని నాభార్య వచించి
నది. ఆవిధంబున మాకు వాదోపవాదములు జరిగినవి. ఎవరివాదము
వారు సమర్థించుకొననెంచి చివురకు మేమిరువురము బందెములు
వైచుకొని మీవలన నిశ్చయ మెఱుంగుట కద్దాని నిందుఁ దెచ్చితిమి
కావున నీరూప మెవ్వరిదో మీరు నిర్ణయింపవలయునని పలికెను.
అప్పు డాయుదయసుందరి విస్మయమందుచు తారావళీ! ఏదీ! పట
మిటు దెమ్ము. అతం డెవ్వఁడో నేను విమర్శించి చెప్పెద నని నాచేతి
లో నున్న యాపటమును లాగికొని పరికింపఁదొడంగెను.

ఆసుందరపురుషరూప సందర్శనంబు మాత్రంబుననే యామె
హృదయంబున ననంగశరపరంపరలు నిండిపోయెను. సర్వాంగమును
గంపింపఁ దొడంగెను. నెమ్మోమున చెమ్మటబిందువు లుత్పన్నమయ్యెను.
ఆపాదమస్తమము రోమాంచములు విజృంభింపసాఁగెను. తోడనే హృద
యంబునఁ బ్రవేశించు ననురాగమునకు దారి యొసంగుచున్నట్లు
కంపించు వక్షోజశిఖరములవలనఁ దరళితములై హారయష్టులు ప్ర
క్కకుఁ దిరిగెను. అట్లు నిరాటంకముగఁ బ్రవేశించు ననురాగమును
దిలకించి పరపురుషసామీప్యద్వేషిణి యగు కులాంగనవిధంబున మ
నంబునుండి లజ్జ తొలఁగిపోయెను. దొంగ యరిగినవెనుక వచ్చు
రక్షకభటునివలెనే త్రపాశూన్యమగు హృదయంబున నున్మాద మధి
ష్టించి యుండెను. ఉన్మాదపరుషఫూత్కారపవనదండము విధంబున
మనంబున రవుల్కొన్న మన్మథాగ్నిచే వేడినిట్టూర్పులు మాటిమా
టికి వెడలఁ దొడంగెను. మదనదావానలజ్వాలలచే సరళనిశ్వాసార

అందుఁ గోమలమగు మరాళతూలికాతల్పంబునఁ గూర్చుండి నాచేతియందున్న పటమును గైకొని యత్యంతాదరంబున నా కిట్లని యె. సఖీ ! తారావళీ ! ఇట్టిపురుషుని నీ వెచ్చటనైనఁ జూచియుంటివా ? ముల్లోకములయందలి యువకులరూపములు చిత్రించునప్పుడైన నిట్టియుత్కృష్టరూపమును గాంచినట్లు జ్ఞాపక మున్నదా ? వీని నెట్లెఱుంగనగునో వచింపుము. త్రిభువనంబులలో వీని నెచ్చట వెదుకఁగలము ? ఇతం డెట్లు నాకన్నులం బడును ? దురాత్ముఁ డగు మరుఁ డను వేఁటకాఁడు దీపహారిణివలె వీనిరూపమును నాకుఁ జూపించి మదీయనయనసారంగద్వయము నపహరించి చలించుచున్న మనంబునుగూడ వశంబు జేసికొనెనుగదా ? ఇందులకుఁ బ్రతీకార మేమో సత్వరమ చెప్పు మని తొందరఁబెట్టుచుండ నే నారా ! ఈ మత్తకాశినిచిత్త మనంగజాయత్తమై మిగులయులజడిం బడుచున్నది. ఇప్పు డీమెను మాటుధోరణిం బెట్టి మనంబున కించుక విశ్రాంతి గలుగఁజేసెదంగాక యని నిశ్చయించి యామె కిట్లంటిని.

నెచ్చెలీ ! చిత్తమున స్వస్థతం జెందుము. బుద్ధిమంతుల యంతఃకరణంబునకుఁ గోచరింపని దేమికలదు ? మానసంబున కగమ్యంబును నసాధ్యమును నెద్దియును లేదు. అశరీరుఁడగు మన్మథహతకునకు లోఁబడి నీ విట్లుండుటఁ దగదు. ఆపురుషుని నీవు చూచినట్లే తలంచుకొనుమని ప్రబోధించు నాతో మందహాస భాసుర ముఖారవిందయై, ప్రియసఖీ ! నామనంబు నాకే స్వాధీనము గాకున్నది. నా మనోహరు నన్వేషించుభార మంతయును నీమీఁదనే యున్నదని వచించి యామె దీర్ఘనిశ్వాస మొనరించి యూరకుండెను.

అప్పటినుండియును మన్మథగ్రహ మామెమనంబున నావహించి నిశ్శంకముగా బాధించుచుండెను. స్మరశరనికరాఘాతంబున నామెమేను గృశించుచుండెను. అనవరతనేత్రవారిధారలవలె నామె

యుబలాటము మెండయ్యెను. స్వప్నమునఁ గనంబడిన యానంద రాంగుని వృత్తాంతములే యామెకు ముచ్చట లయ్యెను. చిత్రపట నిరూపణమే వ్యాపార మయ్యెను. ఆశాప్రసరవినోదంబు లగు మనః ప్రవృత్తులే సఖురాం డ్రయ్యెను. వానిం గూడు తలంపులే లీలోపకర ణంబు లయ్యెను. కుసుమశరవికారములే క్రీడ లయ్యెను. మదనతాప నివారణమున కొనఁగూర్చిన చల్లని మైపూఁతలే సర్వసుగంధానులేప నంబు లయ్యెను. చెమ్మట లార్పు నొనర్చిన కర్పూరవిరచనోపచార మే పత్రాంకరచనావిలాస మయ్యెను. విన్యస్తసరసబిసప్రవాళవల యాదులే దివ్యభూషణము లయ్యెను. మేన నుంపఁబడిన కమలకైర వాదులే కుసుమహారము లయ్యెను. కదళీదళములచే విసరఁబడిన వా యువే నేపథ్యవిశేష మయ్యెను.

గీ. అతనుపరితాప మూర్ఛ యను మహాప
థంబు నందేగ నెంచి య త్తరుణిమిన్న
కరములను బెట్టఁబడు బిసకంకణముల
నెపమునను శాంఖవలయముల్ నెమ్మిఁ దాల్చె.

గీ. ఆమెనిర్మలహృదయాహతాతిపాత
కమున మరుఁడు లూతాకృమిత్వమును గాంచెఁ
జలువకై కూర్పఁబడిన బిసవ్రజంబు
తదరచిత నూత్నతంతుసంతతులు గాఁగ.

గీ. చెలువపై నున్న త్రుటితరాజీవదళమ్ము
ణాళపద్మసందోహనిర్ణయము గనఁగ
నంగలావణ్యవారి నీరాకరమున
మెలఁగు కరిలీల మదనార్తి మెలఁత యొప్పె.

ఇట్లా బాలికాభరణ మదనరస విమోహితయై తదాయత్త మగు చిత్తముతో మేన నేది సోఁకినను ద్వాదాలింగనముగ నెంచు

చు, గనంబడిన దెల్లఁ ద్వదాకారపరిణతంబుగఁ దిలకించుచు, నెవరే మనుకొన్నను త్వత్కథాప్రసంగమే యని సమీపమున కేఁగుచు, నెచ్చట నేమిచెప్పు డైనను వానిమాటలపాటవమే యని చెవియొగ్గి వినుచు, నిట్లు మన్మథతాపంబున ధైర్యము సెడి యున్న యామెను సంతతము నాయండఁ జేర్చుకొని శుభనిమిత్తములఁ దెల్పి దిటవు గఱపుచు, సుశకునంబు లెఱింగించి భయము దీర్చుచు, నుపశ్రుతుల నిర్ణయించి యోదార్చుచు, ననేకవిధంబులఁ దదీయచిత్తమున కుపశాంతిఁ గల్గించుచు, నాచిత్రపటంబునం గల రూపమును ప్రతిపాంథునకుఁ, బ్రతిచిత్రకారునకుఁ, బ్రతివృద్ధునకును జూపించుచు నతం డెవ్వరో యెఱుంగుదురా యని ప్రశ్నించుచు నుండఁ గొంతకాలము గడచెను.

ఇట్లుండ నొకనాఁడు హాటకేశ్వరునిపూజారి పాతాళగణుం డను నొకవృద్ధభుజంగతాపసి యటకేతెంచి యాచిత్రపటమున నున్న రూపమును జూచి స్మృతి నభినయించుచు నాప్రియసఖి కిట్లనియె. పుత్రీ! వెనుక నొక చైత్రపూర్ణిమయందు దేవునకు విశేషముగఁ బూజసేయ బ్రహ్మకమలములకై సురలోకమున కేఁగి యందుండి భూమండలముమీఁదుగాఁ దిరిగి వచ్చుచుండ నొకానొక పర్వత సమీపమున నశోకవృక్షచ్ఛాయ నాసీనుఁడైయున్న వీనిని జూచి యుంటిని. కాని వృద్ధుండ నగుటచే సుత్సాహము లేకపోవుటవలనను బ్రయాణపు తొందరచేతను, వానివృత్తాంత మఱయనైతిని. మృగయాగతుండగు క్షోణీంద్రుఁడో, స్వైరవిహార మొనరించు విద్యాధరోత్తముఁడో, లేక పుడమి దిరుగుకుతూహలంబున నేతెంచిన దివ్యుఁడో నే నెఱుంగనని చెప్పి పోయెను.

ఆపలుకు లాలించి మదనశరావిద్ధహృదయయై యామించుబోఁడి మించినకౌతుకంబున నాపురుషు నెఱింగినట్లు, చూచినట్లు, స

వ్విధి కతం జే తెంచినట్లు తన కనకూలుఁ డైనట్లు దలంచుచు ససం భ్రమంబున నాతో నిట్లనియె.

గీ. ఏదియో యొక్కవిధమున నితని నన్నుఁ
గలుపుమూ వేగఁ బ్రియసఖీ ! కలుపకున్న
నిక్కము వచింతు వినుము యింకొక్కగడియ
యైన మనఁజాల విడతుఁ బ్రాణానిలముల.

అని పలుకుచుఁ దెలివిదప్పి శయ్యయందుఁ బడిపోయెను. అప్పుడు నే నామెనిశ్చయ మెఱింగి అయ్యో ! ఇదేమి ! ఆధారరహితమై, యచింత్యమై, యపౌరుషేయమై, యచిరోపసాధ్యమై, కడుంగడు దుష్కరమైనట్టి యిట్టిప్రయత్నమును బూనుచున్న దేమి ? నే నిప్పు డేమిచేయుదును ? ఎందుఁ బోదును ? ఏయుపాయమును బన్నుదును ? ఏదేవుని బ్రార్థింతు నని నిముషమాత్రము జింతించి స్వయం ప్రబోధితనైనె నాచిత్తమున కెట్లుతోచిన నట్లొనరింతును గాక. విధి విధాన మెట్లున్న నట్లు జరుగఁగలదని నిశ్చయించి యందుల కనేకోపాయంబు లాలోచించుచుఁ దుదకొకనిర్ణయమునకు వచ్చి దానిని నిర్వహింపఁబోయి యతిత్వరితగతిఁ దిరిగివచ్చి, సఖీ ! నీప్రతిజ్ఞ నెఱవేఱినది. నీవల్లభునితోఁ గలసికొంటివి. ముందుఁ జూడుమని పలుకు నామాటలు విని యాయబల తటుకున మోమెత్తి నిజస్వరూపము చేతొకపటంబున లిఖింపఁబడి యాపురుషరూపాంతికంబునఁ జేర్పఁబడి యుండుటఁ దిలకించి యామె నవ్వుచు నిది యేమని యడుగ నే నిట్లంటి.

దేవీ ! ఏదియో యొకవిధంబున ని న్నతనిఁ గూర్పుమని కదా నా కాదేశించితివి. ఈయుపాయంబున నీచిత్రమూర్తితో నిన్నూర్పఁ గలిగితిని. నే నిప్పుడు విద్ధవిజయుఁ డను చిత్రకారునియొద్ద కరిగి చిత్రకళానైపుణ్యము చేటపడురీతి నీప్రతిబింబమును లిఖింపఁజేసి నే

చ్చితిని. ఆపటమును దీనితోఁ గూర్చి చిత్రప్రకారమున మిమ్మిరువుర నిట్లు గలయఁజేసితిని. ఇందువలన నీతలంపు పూర్తియైనది గదా? మఱియు నా దొక చిన్నవిన్నపము గలదు. గొప్పప్రయత్నమున నైన సాధింపఁజాలని పదార్థమును తొందరపడి కోర దివురుట సమంజస మేనా? నీకోర్కె నెఱవేర్చుటకుఁ దగినప్రయత్నమును నేను దప్పక చేసెదను. అంతదనుక నీహృదయంబును దృఢపఱచుకొని వేచియుండు మని వచింప నా కామె యిట్లనియె. సరే. కానిమ్ము. ఈరీతినైన నాప్రతిజ్ఞ నెఱవేర్చి మిగుల నుపకార మొనరించితివి. చిత్రరూపముననైన నేను నామనోహరునితోఁ గూడియుండుటఁ దిలకించుచు జీవముల నిల్పికొందు నని బల్కి యాపటమును బ్రాణపదంబుగ నంతికమునఁ బెట్టుకొని యెట్లో కాలము గడపుచుండెను.

అట్లనంగ తాపదుస్సహంబున ననేకవిరహావస్థలం బడుచున్న యాయన్నుమిన్న హృదయాంధకారమును సాంద్రాంజనచ్ఛవిగల మేఘములచే దట్టముగఁ జేయుచు, ననేకవర్ణములఁ దాల్చిన నింద్రధనుస్సుచే నామెకు విచిత్రములగు కోర్కెలం గలిగించుచు, శంఖదళములవలెఁ దెల్లనైన బలాకపక్షులచే నామెకపోలములకుఁ బాండిమం బాపాదించుచు, నగ్నివలెఁ బ్రకాశించు మెఱుపులచే నామె మన్మథతాపంబు నభివృద్ధి నొనరించుచు, మధురావిరళమయూరకేకారవంబుచేఁ బంచమస్వరంబున నొప్పు నామెహుంకారమును దీర్ఘముగఁ జేయుచు, మరకతమణిప్రదీప్తులం బరగు పచ్చికబట్టులం గలిగి, స్వచ్ఛజలాపూరితంబులగు మనోజ్ఞపల్వలంబులు గలిగి, చల్లనైన దినములచే నొప్పుచు, విశాలములగు జలాశయంబులఁ బూరించుచున్నను వియోగినీమానసాశయంబుల శోషింపఁ జేయుచు, జగజ్జీవనైకహేతువయ్యును పాంథులకుఁ బ్రాణాంతకారియై మదనమిత్రమైన వర్షకాల మేతెంచెను. అప్పుడు,

చ. ధరణి మనోజ్ఞకందళయుతంబు నభం బది మేఘడంబరం
బరయనటన్మయూర మధురారవరుద్ధము లెల్ల దిక్కులున్
సరసకదంబపుష్పవన సంక్రమితంబులు శాంతవాతముల్
దొరఁగు ననంగరాగజలధుల్ జలియింప వియోగిచిత్తముల్.

అప్పు డొక్కదినంబున నామెతల్లిసన్నిధినుండి శేఖరిక యను బ్రతీహారి సరగున నేతెంచి, భర్తృదారికా! నీజనని విజయ సేయ యిచ్చుటకు వచ్చుచున్నది. ఎదురేగి స్వాగతాదివిధుల నెఱవేర్పుము. పూర్వము శ్రీదేవి నివసించుటకు జలధిమధ్యంబున నున్న వైకుంఠము నీక్షించి దాని నభిలషింప యామెమురిపెమును దీర్చుటకు జనకుండగు రత్నాకరుండు సముద్రమధ్యంబున దుర్గమాగాధవిభ్రమ ణంబులనడుమ నొకచోట నీటితుంపురులైన దూరమునుండియును స్పృశింప శక్యము గాకుండునటుల దేవతాప్రభావంబున సనమశిల్పానాభిరామంబుగ నిర్మింపఁజేసిన మాణిక్యాయతనం బొండు గలదు. దానియందుఁ జంద్రకేతుఁడను పేరం బరగు మహేశ్వరుండు ప్రతిష్ఠింపఁ బడెను. ఆదేవోత్తము నారాధించియే యాశ్రీదేవి యభీష్టసిద్ధిం బడసెను. అక్లో వానిని భక్తితో నర్చించు యువతులకోర్కులు సిద్ధించునను దలంపుననే సకలభువనవర్తినులగు ముగుదలు హృదయ వాంఛితంబులఁ బడయుటకు సర్వదా యాదేవు నారాధించుచుందురు. ఈవర్షకాలంబున నచ్చటఁ బవిత్రకోత్సవము గొప్పగా జరుగును. ఆయుత్సవంబునకు నిన్నుఁగూడ నేఁడు తోడ్కొనిపోవ మీతల్లి యిట కేతెంచుచున్నది. కావున కన్యాలంకారయోగ్యము లగు భూషణంబులఁ దాల్పుము. సత్వరము లెమ్ము. సర్వవాంఛితప్రదాతయగు శంకరుని నర్చింపుము. ఆదేవుఁడు నీకుఁ బ్రసన్నుఁడై యభీష్టములఁ దీర్చునని శేఖరిక పలుక నుదయసుందరి సంతోషముతో రహస్యముగా నాతో నిట్లనియె.

తారావలీ! అంబ నన్ను నీకులదేవతాసేవకే నియోగించుచున్నది. నాయభీష్టమును దీర్చువఱకు నేనాదేవుని బ్రతిదినము నారాధించుచుందును. వానియనుగ్రహంబు గలిగిన నీచిత్రపటముననున్న మనోహరుండు నాకు లభింపఁగలఁడని పలికి సకలసఖీపరివారముతోఁ గదలి ద్వారసమీపమున కేఁగునప్పటికే కుబ్జ వామన కిరాత కంచుకి పురంధ్రికాప్రాయ పరిజనంబుతో విజయరేఖ యటకరుదెంచెను.

అప్పుడు కృతప్రణామయగు గూఁతు నాలింగనపురస్సరముగ నక్కునం జేర్చుకొని తల్లి ముద్దాడెను. పిమ్మట విజయరేఖ యుదయసుందరితో నందుండి వెడలి సముద్రగర్భసకోణము ననుసరించి వలయాకారముగ నున్న మార్గంబున నిర్గమించి సాగరాంతరముననున్న దేవాలయమును నెదుట నీక్షించి మణిప్రాకారాంతరమున ననేకదివ్యరత్నకాంతులచే దేదీప్యమానంబుగ నున్న యాయీశ్వరాలయమును బ్రవేశించెను. అందుఁ బ్రతిష్ఠింపఁబడిన సర్వలోకేశ్వరు నారాధింప నఖిలభువనంబులనుండి యేతెంచిన పురంధ్రీగణము లహమహమికంబుగఁ ద్రోపులాడుకొనుచుఁ జేయు వారిపూజలం బడయుచున్న నయ్యంబికానాథుని దర్శించి యాయాదిదేవుని యథావిధిగ విజయరేఖ యర్చించి యుదయసుందరిచేఁ గూడ పూజానమస్కారముల నిర్వర్తింపించి పిమ్మట నందు నివసించియున్న పారాయణి యను తపస్వినిసన్నిధికిం దోడ్కొనిపోయి యామెకు నమస్కరింపఁ జేసెను. ఆతపస్వినిదీవనలం బడసిన తనూజతో విజయరేఖ వచ్చిన దారిని నిజనివాసంబున కేఁగెను. నాఁటినుండి యుదయసుందరి ప్రతిదిన మాచంద్రకళాధరు నారాధించి వచ్చువఱకు భుజింపనని నియమము చేసికొని యతిభక్తి నాదేవు నుపాసించుచుండెను.

మఱియొకనాఁడు నిత్యయాత్రానుక్రమంబుగ సకలసఖీపరివృతయై యారమణి యత్యుత్సాహంబున నమ్మహేశ్వరుని బూజింప నచ్చ

టి కతిగి పుష్పావచయమునకై యాయాయతనమందున్న బూఁదోట
కు సఖులతోఁ జనెను. సారంగికయును ఛత్రవాహిని సురాలయాంతరం
బున నొరులు జొరనిచోటి కేఁగి యందొకమూల పాదుకప్రకార
మాచిత్రపటమును గొడుగునఁ బెట్టి త్వరితగతి నేతెంచి మమ్ము
గలసికొనెను. అట్లు మేమందఱ మతిసంతోషంబునఁ బుష్పావచయం
బొనర్చుచుండఁగా నాదేవాలయమునుండి పారాయణి యుదగ్రకోపం
బున నోరోరి! మూఢ! భక్తిభంగదుష్కృతంబున నీపటమును శిఖ
గాఁ జేసి పిశాచవు గమ్మని మునినో శపించు కోలాహలము
పుట్టుట వినఁబడెను. పటము మాయమగుట జూచి యడఁగనే యుదయ
సుందరి యులికిపడి యాయందుకేపటము పోయెనని సంశయించుచు కుసు
మాపచయము మాని శరవేగంబున నటకేఁగె. నేనును నామెతోఁ
బోయితిని.

ఆదేవాలయమున నొకమూల నున్న మండపముమీఁద
నత్తపస్వి యెదురఁ గానకత్యంతభక్తియుక్తుఁడై చిత్రపటమును జేతఁ బట్టు
కొని శపింపఁబడినపురుషుఁడు నిలువఁబడియుండుట యుదయసుందరి
తిలకించి అయ్యో! దుర్గాంధకారాతి నారాధించుచున్నందులకు
నాకు మంచిప్రాయశ్చిత్తమే జరిగినది. నిత్యమును మన్మనోహరుని
చిత్రపటమునైనఁ దిలకింపకుండఁ జేసెను గదా! అని చింతించు
చున్నను డెందమున జాలిఁగొని యాతపస్వినిఁ బ్రార్థించి వానికి
శాపాంతము గలుగఁజేసెను. పిమ్మట దేవుఁడగు చంద్రచూడుని
నిరుత్సాహంబునఁ బూజించి యనాదరంబునఁ దపస్వినికి నమస్కరిం
చి సలిలసేకములేని మృణాళినివలె, సూర్యునిబాసిన పద్మినివిధంబు
న, జంద్రునివిడచిన కుముదినిగతి, వెన్నెలను వదలిన రాత్రిలీల,
యాచిత్రపటమును నెడఁబాసిన యాబాలిక మిగుల పరితాప మందు
చు, జీవితమునం దాశలేనట్లు మోము వంచుకొని త్వరితగమనంబున

నాళ లఘుగంట దొలఁగినదారియైనను నడుగడుగునకు నేను దారిఁ జూపించుచుండ నిజభవనంబున కేతెంచెను.

పిమ్మట పరిజనుల నెల్లఁ బిడఁద్రోచి నన్నుఁగూడ సంభావింపక భవనాభ్యంతరమున కఱిగి తల్పంబున శయనించెను. ఉదయమున నే ననేకవిధంబులఁ బ్రబోధించుచుండ నెట్లో ప్రాతఃకృత్యముల నిర్వర్తించెను. అప్పటినుండియును నామె సూర్యమండలముచేఁ బ్రకాశమానమగు బగళ్ళు లంగారపుంజమును వహించినట్లు శరీరమును దహించుచున్నవనియుఁ, జంద్రబింబముతో వన్నెకెక్కు రాత్రులు దృషద్గోళమును దాల్చినట్లు హృదయమును బాధించుచున్న వనియును దలంచుచు నెట్లో కాలము గడపుచుండెను.

అంత వానకారు గడచి బంధుజీవప్రబోధినియగు శరత్సమయమేతెంచుటయును నదివలెనే యామె కృశింపసాఁగెను. మయూరజాతివలె హీనస్వరయయ్యెను. మేఘసంపదవలె వెల్లఁదనము బూనెను. సూర్యునిమూర్తివలె నత్యధికమగుతాపమును వహించెను. కుసుమశర విసరాఘాతంబున, నపరిమితతాపంబునఁ బడియున్న యాయన్నులమిన్న కెన్నివిధముల శిశిరోపచారము లొనరించుచున్నను శాంతి గలుగదయ్యెను. ఇట్లు మదననిబారిం జిక్కి యామె పండువెన్నెలచే హృదయాహ్లాదకరమై, కైరవవనమునుండి ప్రసరించు శీతవాతముచే మనోహరమైన యొకనాఁటిరాత్రియందు సౌధశిఖరంబున మంచము పడకుండ తామరపాకులతోఁ గూర్పఁబడిన విశాలమగు పందిరిక్రిందఁ హంసతూలికాతల్పంబున శయనించినది. ఉదయమున లేచినపరిజను లందు రాజపుత్రిక కనంబడుటలేదని తొందరపడుచుండ నేనును మేల్కాని తొట్రుపడుచు యామేడమీఁదను క్రిందిభాగమునను, బ్రక్కగదులయందును పరికించి యామె యెందులకైన మాతృగృహమున కేఁగినదేమో యని యచ్చటను, దరుచు దరుగు

చుండుచోటులను, క్రీడాస్థలము లయందును నెంత వెదకినను నామెం
జాడ గనంబడలేదు. ఆమె నెడఁబాయుటకు నేను మిగుల వగచుచు
నిట్లని చింతించితిని.

ఓరా ! నన్ను విడచి యెన్నఁడు నెచ్చోటికిని బోవని రాజపు
త్రిక నేఁ డెం దేఁగియుండును ? బయల నిద్రించియున్న యామె త్రి
భువనమోహనాకారమును గాంచి మోహించి యెవ్వఁడైన నభశ్చ
రుం డీమె నపహరించుకొని పోలేదుగదా ? అత్యంతాద్భుత సౌందర్య
సారముగల యీయామె రూపంబువలనఁ బ్రసిద్ధి కెంత వచ్చుచున్న
దని యెంచి విద్యాధరాంగన లీమె నెందైన మరగుపఱచియుందురా!
లేకున్న నెవఁడు కోరుననభయంబున నీమె పాతాళమునుండి తోలఁ
గింపఁబడి యిచ్చట మరుగుపఱుపఁబడెనో యాభుజంగాధిపుఁ డీమె
వృత్తాంత మెట్లో తెలిసికొని యీయామెం దీసికొనిపోలేదుగదా ! నిద్రిం
చుచున్న యీయామెం గాంచి లక్ష్మియనుకొని అయ్యో ! నాపట్టి కెట్టి
యిక్కట్టు సంభవించెనని జాలింగొని సముద్రుం డీమెను నిజనివాసం
బునకుఁ దోడ్కొనిపోయి యుండఁడుగదా ! తనమనోనాయకుని నెం
దైన వెదుకనెంచి యుత్పన్నానేకసంకల్పయై యీయామె యెచ్చటికైన
దూరముగాఁ బోయెనేమో ? లేక తాను కోరినపురుషుండు కల
లోఁ గాకుండ నెదుటకు వచ్చి ప్రణయకోపంబున వెడలిపోవ
వానియందలి యనురాగంబున వెనువెంట నెచ్చటికైన నీమె పోయి
యుండునా ? అటుగాకున్న ననంగతాపమును సహింపఁజాలక నెం
దైన జలాశయంబునఁ బడి యాత్మహత్యఁ జేసికొనలేదుగదా ? లేక
ప్రాణముల నెడఁబాయ నెచ్చటనైన నొకవృక్షశాఖయం దురిఁబోసి
కొని యసువిసర్జనం బొనర్చుకొనెనేమో ?

చ. వదనకళంకమత్సరవిపక్షుఁడు చంద్రుఁడు ప్రుచ్చిలించెనో ?
తదమలవంతచంద్రికలఁ దారలు గోరి హరించియుండెనో ?

మదవతి కేశపాశతిమిరంబున లోఁ గానెనో తమిస్ర, యే
మొదవెనొ ? బైట శయ్యపయి నున్నకతంబున నీకృశాంగికిన్.

అటులఁ గాదేని,

గీ. ఇందుకిరణాంచలముల దీపించు ప్రబల
మదనదావాగ్నిఁ దరుణి భస్మంబుగాఁగ
దానిఁ గాసారశీతవాతంబు దాల్చి
దూరముగఁ గొనిపోయిండు నశోకగతిని.

ఆమెజాడ యింకెచ్చట నగపడదు. అన్యాయముగ నిప్పుడు నాకు నూహాప్రపంచమం దెందు నామెయునికి గోచరింపకున్నది. నా ప్రియసఖి లేకుండ నామెతల్లిదండ్రులయెదుటికి నేమొగము బెట్టుకొని పోదును ? ఉదయసుందరి యెచ్చటను గనిపింపలేదని యెట్లు వారితో వచింతును ? ఆమాట విన్నతోడనే దుఃఖాపన్నము లగు వారిముఖముల నే నెట్లీక్షింపఁగలను ? తల్లి విజయరేఖ పరిదేవనంబు విని నే నెట్లు ప్రాణముల నిల్పుకొనఁగలను ? ఉదయసుందరి కేది గతి య య్యెనో నాకును నదియే యగుఁగాక ! ఈవృత్తాంతమెల్ల విజయరేఖకు నాసఖి కాళిందిమూలమున నెఱింగించినమీఁదట నేమి జరుగునో ప్రచ్ఛన్నముగ నుండి తెలిసికొని పిదప నెచ్చటికైనఁ బోయెదను. త దనంతర మేది యుచితమో దానిం జేసెదనని నిశ్చయించుకొని య ట్లొనరించి యూరిబయటనున్న చండీశుని జీర్ణాయతనంబునకుం బోయి యందు వేచియుంటిని.

పిమ్మట కాళిందిసీమూలమున దుఃఖవార్త నెఱిఁగినతోడనే శిఖండతిలకుం డత్యంతచింతాకులస్వాంతుఁడై నలుగెలంకులనామెజాడ నరయుటకుఁ బరిజనులఁ బుత్తెంచెను. వా రారాజపుత్రిక నరయఁ బ్రతిగృహంబునకుఁ, బ్రతిదేవాలయమునకుఁ, బ్రతి సత్రమునకుఁ, బ్రతికరితురంగశాలకుఁ, బ్రతికన్యావిద్యాదిస్థానమునకుఁ, బ్రతివనంబు

నకుఁ, బ్రతిజలాశయంబునకు నత్యంతవేగంబునఁ బోయి యందందు
వెదకుచుండ నారాజధానియెల్ల క్షణములో వ్యాకులీభూతమయ్యెను.

గీ. వాద్యములు గీతములు మంగళోద్యమములు
కలకలలు లేక పురమెల్లఁ గానుపించె
సరసపాత్రప్రవేశ మాసన్నమైన
రమ్యరంగస్థలంబు గరంబుబోలి.

గీ. అప్పు డాహారవస్త్రంబు లాన్నపాల
యముప నొకఁడైనఁ బడయలే దనఁగవచ్చు
సిరినిఁ బాసినరీతి నాచెలువ విడచి
దుస్థితినిఁ బొందె జనమెల్ల దుఃఖమునను.

ఇట్టిపరిస్థితియం దున్న సమయంబున నామెను వెదుకఁబో
యిన పరిజనులెల్ల విఫలప్రయత్నులై వచ్చియుండుట యెఱింగి దుః
ఖించుచున్న జేనితో మంత్రిసత్తముం డిట్లనియె.

"ఆర్యా! దుఃఖింపకుము. సంసారరీతు లతివిచిత్రములు. వాం
ఛితములు స్వప్రయత్నసాధ్యములు. కార్యములు పరిజ్ఞానబంధసిద్ధము
లు. పౌరుషంబునఁ జేయరానిది యొండు లేదు. బుద్ధిబల మసాధ్య
ములఁగూడ సాధింపఁగలదు. హృదయస్థైర్యంబున దుర్దశంబులనైనఁ
గడంగొనవచ్చును. మానవునకు పొందరాని చోట్లు లేవు"
అని తత్కాలోచితభాషణంబుల నిశ్చయపూర్వకంబుగ వచించుచు
ముందొనర్పఁదగిన కృత్యముల నెఱింగించుచు నాజేనిమనంబున కిం
చుక యుపశాంతిఁ గలిగించెను.

పిమ్మట శిఖండతిలకుండు మంత్రిసత్తముని యుపదేశానుసరణి
నభీష్టసిద్ధికై కులవృద్ధులచే దేవతాపూజలు చేయించుచు, నిమిత్తజ్ఞుల
వలన నిమిత్తముల నెఱుంగుచు, శాకునికులమూలమున శకునములఁ
దెలిసికొనుచు, విదేశస్థులఁ బ్రశ్నింపఁ బరిజనుల నియోగించి, విశో

ధ నిలయంబులఁ బరీక్షింపఁ బ్రణిధివర్గము నియమించి, మిత్రస్థాన ములఁ బ్రస్థాపింప దూతలం బుచ్చి, త్రిభువనంబుల నెల్లెడలఁ బరిశీ లింపఁజేయ నెంచి నాతండ్రితో నిట్లనియె. సైన్యాధినాయకా ! రత్న మాలీ ! సకలభువనప్రచారసమర్థు లగు పన్నగభటులచే సర్వలోక ములయందు నెందును విడువకుండ మదీయాస్వామైకజీవితమును వెద కింపు మని పుత్రికావియోగవిధురితచేతస్కుఁడై పలుకు రాజునకు మనఃప్రియంబు గలుగులాగున నాతండ్రి యిట్లనియె.

దేవా ! ఉదగ్రశక్తిగలిగి దుర్గమంబుల గమించుటయందును దుష్ప్రవేశంబులఁ బ్రవేశించుటయందును, దుర్లంఘ్యంబుల దాటుట యందును, నిపుణులై ప్రపంచమం దెల్లెడల సహజప్రభావంబున సం చార మొనర్చుచు మనోవేగంబు గలిగి ప్రసిద్ధి కెక్కిన వీరభటులు గొంద అవంతకులజాతులు, గొందఱు వాసుకివంశజులు, గొందఱు తక్షకాన్వయసంభవులు, గొందఱు కర్కోటకగోత్రజులు, గొందఱు కులికసంతతిప్రభవులు, గొందఱు నీయాదిపురుషుఁడగు శంఖపాలుని వంశోద్భవులు, గొందఱు మహాపద్మసంతానప్రసూతులు, గొందఱు పద్మగోత్రసంభూతులు గలరు. ఈయెనిమిదివంశములయందును బ్రసి ద్ధులైన భుజంగమభటులును స్వామిహితంబుఁ బొంది సకలలోకంబుల యందును సదయసుందరిని వెదకుటకు సమర్థులని వచించి వారినెల్లఁ రావించి రాజుమోల నిలిపెను.

రాజు వారి నెల్లఁ బేరుపేరువరుస నాదరించుచు, వారు వెదుకవలసిన యుదయసుందరిచిత్రపటంబుల నొసంగుచు, వారి నుద్దే శించి యిట్లనియె. ఓవీరులారా ! మీ రెల్లఱుఁ ముందుగా నీసప్త పాతాళంబుల వెదుకవలయును. పిమ్మట భూలోకమున కేఁగుఁడు. అందు జంబూద్వీపంబునఁ గదంబ మహావృక్షములచే సుందర మగు మందరగిరియందు గుంజాక్షుఁడును, జంబుద్రుమంబులచే నలయు

గంధమాదనంబున నుత్పలుండును, పిప్పలవృక్షములచే బ్రకాశించు విపులమను మహీధరంబున దీపకుండును, న్యగ్రోధవృక్షములచే నొప్పు సానుమతియను నగధరంబునఁ గాలిన్గకుండును, నలుగురు వీరులును నాలుగుమహాపర్వతములయందును వెదుకవలెను. మఱియు ను నిషధమందుఁ దమాలకుండును, హేమకూటమునఁ గమలుండును, హిమాద్రియందు గువలయుండును, శ్రద్ధగా నీమూఁడుపర్వతముల యందును వెదుకవలయును. శృంగవతికిఁ బద్మకుండును, శ్వేతాచలంబునకుఁ బింగళుండును, నీలాచలంబునకు నీలరోచుండును నరుగవలె ను. మహేంద్రము, మలయపర్వతము, శక్తిమతి, సంహ్యాద్రి, వృష శైలము, వింధ్యభూధరము, పారియాత్రము, కన్యాచల మను నీయెని మిది కులపర్వతములయందునుఁ బుష్కరాదు లెనమంద్రును నన్వే షించునది. చైత్రరథంబున శిఖండకుండు, నందనంబునఁ దారాతుండు, విభ్రాజమందు విశాలుండు, ధృతియందు సితాదరుండు సంచరించుచు, నా నాలుగుమహావనంబులయందును నల్వురుభటులు వెదుకవలెను. మీఁద నరుణోదమం దొకఁడును, మానసంబున రెండవవాఁడును, సితోదమందు మూఁడవవాఁడును, మహాభద్రమందు నాల్గవ వాఁడును, నీనాలుగుజలాస్పదంబులయందును ఫణాంకుశప్రభృతులు నలుగ్గురును వెదుకవలెను. భారతక్షేత్రమున దంభోళి వరికింపవలెను. ఇలావృతంబునకు రమసికేతుం డేఁగవలెను. తక్కినవారు లంకాకాది నగరంబుల కేఁగునది. శ్రీశైల కైలాసాది భూధరములందును, జాహ్నవీ రేవాది మహానదులయందును, సర్వపరిదేశములందును, నాశయములందును, నుచితరీతుల భూలోకమునఁ దిరుగు భుజంగభటులకుఁ గమలకంతుఁడు నాయకుండై యుండవలెను.

జంబూద్వీపంబున కావలఁ గల మహాద్వీపము లారింటిలో శాకద్వీపంబున దుర్మదుండును, కుశద్వీపంబునఁ గాలాంజనుండును

క్రౌంచద్వీపంబునఁ జక్రావ్హాయుండును, శాల్మలీద్వీపంబున సరళుండును, గోమేదంబున నసీముఖుండును, బుష్కరంబునఁ దాపిచ్ఛకుండును బరికింపవలెను. అందు లవణసాగరము మొదలు స్వాదూదకసముద్ర పర్యంతము గలసప్తాంబుధులయందు నగమేద్యదణుప్రభృతి సర్వశాంతీరు లెల్లఁ దిరుగవలెను. పిమ్మట హృదయవేగుండు నాయకుండుగా నెనమండ్రు కాకోదరభటశ్రేష్ఠు లష్టదిక్పాలుర నగరంబుల సంచరింపవలెను. పిదప స్వర్లోకమున కేఁగి త్రిదశుల రాజధానుల, సిద్ధుల నగరంబుల, విద్యాధరుల పురంబుల, మిగిలిన దేవతాస్థానముల, బ్రహ్మలోకమువఱకు, మేరుపర్వతముచుట్టును, వెదకుచు సప్తోర్ధ్వలోకములు సంచరింపవలెను. ఈసేన కెల్ల నింద్రనీలుం డధిపతిగా నుండఁగలవాఁడు. అని యిట్లు పురాణకమతమునుండి బ్రహ్మలోక పర్యంతము గల బ్రహ్మాండగర్భ మెల్ల గాలించి యుదయసుందరి యెచ్చట నున్నదో తెలిసికొనవలెనని యాభుజంగవీరుల నెల్ల నుత్సాహపఱచి యతిత్వరితగతి నాశిఖండతిలకుఁడు వారిఁ బంపివేసెను.

౨౩౯ వ మజిలీ

నేను నుదయసుందరీవియోగదుఃఖమును భరించి స్వయముగా నామెప్రవృత్తి నరయఁదలంచి యామె కెట్టిగతి గలిగెనో తెలిసికొని యట్టిగతినే పొంద నిశ్చయించుకొని యిట్లని యాలోచించుకొంటిని. ఉదయసుందరి కెట్టిగతి గలిగెనో యెఱుంగకుండ ముందు నే నేమి చేయఁగలను? ఆమె యెవనిచేతనైన నపహరింపఁబడి యుండునను నను మానంబున నెచ్చటికిఁ బోదును? సీతాపహరణంబువలన స్ఫుటప్రతీతులగు రక్కసులు స్త్రీల నపహరించుటయందు సహజవ్యసనులు గదా! అట్టిరక్కసులకు నిలయమైన లంకాపురం బీసముద్రాంతర ద్వీపంబునకు సమీపముననే కలదు. కావున ముందుగ నందు వెదకి పిదప మఱొకచోటికిం బోయెదంగాక. భాగ్యవశంబున నా కచ్చట

నే యామె గనపించిన నాహృదయవాంఛిత మీడేరఁగలదు. యువ
తులకు విరాళిగొల్పు నిట్టి తరుణీరూపంబున నే నందుఁ బోయి యిం
టింటికిఁ దిరుగుచున్న యెడల నాకుఁగూడ హాని గలుగఁగలదు. కా
వున భస్మజటావల్కలాదులచేఁ గృత్రిమతాపసిత్వమును వహించి
యందుఁ జరించెదంగాక యని నిశ్చయించి యప్పుడే యట్టివేషమును
దాల్చి విమానమువలె నభంబున నతిజవంబునఁ గొనిపోఁ దగిన
పాదుకల సంపాదించి వానిం దొడిగికొని నిర్గమించి లంకాపురంబున
కేఁగితిని. పూర్వము శ్రీరామునిచేఁ బరిగృహీతమైన రణాధ్వరకుం
డంబునఁ బ్రజ్వరిల్లు ప్రతాపానలజ్వాలలవలెఁ బ్రకాశించుచున్న కనక
మయాశేష దివ్యమందిరాగారప్రాకారద్యుతికలాపంబుల దూరము
నుండియే తిలకించితిని. పిమ్మట నుదయసుందరిని వెదకుటకు నగరపరి
సరంబునకఱిగి యందు సీతామహాదేవి నివసించుటచేఁ బవిత్రవంతమై
శింశుపాతరువుమూలమునఁ బ్రసిద్ధికెక్కిన రావణనిర్మితమగు నుద్యాన
మునఁ బ్రవేశించితిని. తొల్లి బందిగమం దుంపఁబడిన సీతనేత్రములనుం
డి యజస్రము స్రవించిన కాటుక కఱటిధారలచే మలినమగుటవలన భూ
దేవి కూఁతున కబ్బినకష్టమును గాంచి దుఃఖాతిదాహదగ్ధయైనట్లు శ్యా
మలత్వమును వహించియున్న శింశుపావృక్షచ్ఛాయలం దిలకించితిని.
కుపితుఁడగు హనుమంతుని కరతలచపేటాస్ఫాలనంబున విదళితుం
డైన యక్షయకుమారుని వధ్యస్థానమందలి రక్తపాతములీల గైరిక
రాగముచే నెఱ్ఱనైన క్రీడాగిరిపరిసరంబును జూచితిని. అచ్చటకు స
మీపమున నక్షవధాస్వాదలుబ్ధుండగు హనుమంతునిచేఁ జంపఁబడిన
జంబుమాల్యాదిరాక్షససేనల యస్థిముకురంబులవలెఁ దెల్లనైన శాఖ
చేఁ జుట్టును నరుగులుగట్టఁబడిన వృక్షములం గాంచితిని. మారుతిని
బంధింప విడువఁబడిన పరుషపాశోరగగరళానల శిఖలవలన దహింపఁ
బడుటచే తృణవిటపిశూన్యమైన యింద్రజిత్తుయుద్ధభూమిని గనుంగొం

టిని. ఉదయసుందరిని వెదకుచు నే నాయారామమునం దిరుగుచుండ రామలక్ష్మణ భుజాస్త్రధారావకర్తనోచ్ఛలితమౌళివలయులగు మేఘనాథప్రభృతి రాక్షసవీరుల పాదఘట్టనములవలనను, దత్కబంధ తాండవంబువలనను సమతలంబైన ప్రదేశములు గొంచె మచ్చటచ్చట గోచరించుచుండెను. మఱియును దాశరథి కరశరాఘాతవిఘటితాయుష్యుండగు కుంభకర్ణుని కులాచలసన్నిభంబగు కళేబరము బడుటచే దృటితమై త్రికూటగిరిశిఖరశిలాఖండము పడుటవలనం బల్లమైన ప్రదేశము నీక్షించితిని. అతికుతూహలంబున నంబరమందుఁ గూడియున్న సురశిబిరము కరములనుండి యెడతెగక పడిన పారిజాత కుసుమసముదాయామోదమున నిప్పటికిని బరిమళించుచున్న రామరావణసంగ్రామ స్థలంబును గనుంగొంటిని. పిదప దశకంఠుని రాజధానిం జొచ్చితిని. అందొకచోట సంగ్రామవృత్తాంత మెఱిఁగి భయచకితురాలైన మండోదరి నూఱడింపఁ బలికిన రావణుని మాటలను నేర్చుకొని యొకపంజరమందున్న చిలుక యిట్లు పఠించుచుండెను.

గీ. రాముఁడు మురారి నిజము. సురప్రవరులు
కపిభటులు. నాదు దోర్బలగరిమ సురలు
బందెఁ బడలేదె? మురవైరి యందులేఁడె?
భయ మికేటికి నాబహిఃప్రాణధనమ.

మఱొక్కచోట రావణవధానంతరము వాని నుద్దేశించి కొందఱు సురద్వేషులు పలికిన విచారభాషణముల నింకొకచిలుక యిట్లు పఠించుచుండెను.

ఉ. హా! దశకంఠ! హా! ప్రభువ! హా! సురశాసక! హా! మహోగ్రశౌ
ర్యాదర! యెందునుంటివొ గదా? నినుఁబాసిన యిప్పురంబు వై
రాదులఁ జూడు నీమభవనాంగణఘృష్టులనైనఁ ద్రొక్కఁగా
రాదను దివ్యులిందిపుడు ప్రస్తుతిగాంతురు పూజ్యులైనదా.

వేఱొక్కచోట శూన్యాయతనమండపగర్భమందు విశ్రమించి
కై చేరిన వైదేశికనిశాచరులు రావణవధావిధానమందలి విధివైపరీ
త్యవృత్తాంతమును విచారభావంబునం జెప్పుకొనుచుండ నిట్లు వింటిని.

గీ. సేవకులుగా మెలంగిన దేవసంఘ
మమర వానరజాతియం దధిభవించి
కడకు దశకంఠుం బోరిం గూలం గలుగు టహహా!
దైవవైపరీత్యమునం గదా! తలంప.

ఇట్లు లంకాపురంబున రామరావణ మహాసంగ్రామసంబంధ
మగు వృత్తాంత మనేకవిధంబుల నెఱుంగుచు నందందుం దిరుగుచుం
టిని. అపూర్వతపస్విని సూచించెనని నాచుట్టును మూఁగు వృద్ధ
సమూహముమూలమున నైన నుదయసుందరివార్త దెలిసికొనవచ్చు
ననునాసతో నానగరమందు లోపలను, వెలుపలను, మూలమూలల
బరిభ్రమించి యెందును నామెనడిఁ దెలిసికొనఁజాలక నిరాశఁ జెం
దొంటిని. ఇంతలో యువతీరత్నాపహరణంబునం బ్రసిద్ధికెక్కిన విద్యా
ధరకుమారుల మాట జ్ఞప్తికి వచ్చుటయును వారికిఁ గ్రీడాస్పదంబు
లగు మలయాది గిరిగహ్వరములయం దామెజాడఁ దెలిసికొనవచ్చు
నని దలంచి యందుఁ బోవ గగనంబున కెగిరి యతిజవంబున నరుగు
చుంటిని.

## ౩౩౬ వ మజిలీ

ఇట్లేఁగుచుండ నొకచోఁ బ్రాంతగిరిగహ్వరంబునందు రక్షిం
పుము రక్షింపు మని పూత్కారపూర్వకంబుగ నాక్రోశించు కొ
మ్మను నాపదభరయం దగు నొకనిశాచరావనదునిఁ గనుంగొంటిని.
అకటా! బ్రాహ్మణుం డాపన్నుండై యున్నాఁడని దలంచి జాలిఁ
గొని ససంభ్రమంబునం జేరబోయి సాదరవాక్యంబుల నో
బ్రాహ్మణుఁడా! నీయాపద జెనివలన దీరునని యడుగఁ గళ్యాణీ!

నీవలననే నాబాధ తొలఁగఁగలదని వచించెను. అప్పుడు నే నోహో! నే నొనర్పఁదగిన దేమో సత్వరమ జెప్పు మందులకుఁ దగిన ప్రతీకార మొనర్చి నీబాధఁ దీర్చెదనని పలుక వాఁడు సంతోషస్వాంతుఁడై యిట్లనియె. సుందరీమణీ! నాబాధఁ దీర్చెదనని నీవు ప్రతిజ్ఞ జేసితివి గావునఁ జెప్పెద వినుము. వికసితానేక నవలతావిరళ పరిమళమిళితమై మనోజ్ఞమగు నీప్రదేశంబున నదృష్టశరీరహతకునినుండి యేతెంచిన పుష్పశిలీముఖసహస్రంబులవలన నాడెందము వగులుచున్నది. కరుణాతరంగితాంతరంగవై రక్షింప నీవె సమర్థురాల వని పలికెను.

ఆపలుకులు ములుకులవలెఁ జెవులకు సోక, ఛీ! అనంగశరపీడితుండగు నీదురాత్మునిమాటలవలన నిష్కారణము మోసపోతిని. బ్రాహ్మణుఁ డవఁడైనఁ దపస్వినులం జూచి యిట్లు మదనమోహితుం డగునా? వీఁడు నిక్కముగ బ్రాహ్మణాకృతినున్న యొకతుచ్ఛుఁడు. నే నిప్పు డేమిచేయఁదగును? కానిమ్ము. వీఁ డొనర్చిన మాయకుఁ బ్రతిగ మాయయే ప్రయోగించి యవ్వలకుఁ బోయెదంగాక యని మదిఁ దలంచి నాపైనున్న వల్కలంబునఁ గొంత విడఁజింపి మహానుభావా! దీనిం గైకొని విూఁదఁ గప్పికొనుము. అట్లొనర్చితివేని దళసరిగా నున్న యీవల్కలఖండము నీకుఁ గవచప్రాయమై కట్టెదుటి విటపికుసుమమందలి శిలీముఖమె కాకుండ నీవనకుసుమకుటీరముల నివసించియున్న మధువ్రతవితతి నెల్ల నిన్నంటకుండఁ జేయఁగలదు. పుష్పశిలీముఖబాధనుండి నిన్ను రక్షించుటకు నాకుఁ దోఁచిన యుపాయ మయ్యదియ. నీమాటల విని నే నొనర్చినప్రతిజ్ఞ నిట్లు నెరవేర్చుకొంటిని. తథ్యవచననై నాదారిని నేను బోవుచున్నానని పలికి యావల్కలశకలము వానిపైఁ బడవైచి వాఁ డవఁటో నే నొనర్చినదానికిఁ గోపించి నా కేమికీడు సేయఁదలంచునో యను భయంబెడ బేధించుచుండ నతిరయంబున నంబరంబున కెగిరి పోవుచుంటిని.

వాఁడును నిజాభిప్రాయవిరుద్ధముగ నట్లు జరుగుటకు ఫూత్కార మొనర్చుచు నేను బ్రతిన నెట్లు నెరవేర్చుకొనఁగలిగితినో నా మాటలధోరణి నెఱింగి మహాక్రోధంబున మండిపడుచు నోసీ! పాషండినీ! మృషాపాండిత్యలవదుర్విదగ్ధా! పుష్పశిలీముఖశబ్దమునకుఁ బుష్పశరుఁడగు మనోభవుండను నర్థ ముండఁగా పుష్పమందలి శిలీముఖమగు భ్రమర మని శ్లిష్టార్థవ్యాఖ్యాన మొనరించి నన్ను వంచించి పోవఁ జూచుచుంటివా? ఎందుఁ బోఁగలవు? ఇప్పుడు నన్నుఁ జూడుము. బలాత్కారముగ నిన్నుఁ బరిగ్రహించెదను. అప్పుడైన నన్నంగీకరింపకుందువా? అంగీకరింపకున్న నృశింహాఖరనఖరతీవ్రంబగు కృపాణంబున నీకుత్తుక నుత్తరించి వైచెదనని నిష్ఠురంబుగ వచించుచు నత్యంతభాసురమదభ్రదంష్ట్రాకరాళవదనంబున నొప్పు నిజభయంకరరాక్షసస్వరూపమును బూని గగనమార్గంబున నావెంటఁ బడెను.

అప్పుడు నే నతిభయంబున ముందుఁ బరువెత్తుచు నెట్లో యిచ్చటకుఁ జేరుకొని యిందుఁ గనంబడిన మహాంధకూపంబుమార్గంబున నధోభువనంబున కేఁగు దలంపున దానియందుఁ బడితిని. కాని యాపాపాత్ముండు విలపించుచున్న నన్నుఁ బట్టుకొని ప్రహరింప నెంచి యిష్టదైవమును స్మరించుకొమ్మని పల్కుచుండఁగనే నాసుకృతవిశేషంబున మీ రేతెంచి మృత్యుముఖకందరంబునుండి నన్నుద్ధరించితిరి.

నాప్రియసఖకిఁ బ్రాణప్రియమైన భవదీయాకారము చిత్రపటమునం దీక్షించినప్పుడు చిత్రకారుఁ డెవఁడైనఁ దననైపుణ్యము నిరూపించుట కట్లూహించి చిత్రించియుండెనా? లేక తనప్రభునియాకృతికి విశేషగుణంబులఁ గల్పించి లిఖించియుండెనా? కాక మఱొక చిత్రకారునితోఁ బందెమ్మువైచుకొని యపురూపపురూపమును నిర్మిం-

చియుండెనా ? అటుగాదేని యెవఁడైన నెవనికొఱకైన బుద్ధికుశలత్వ ము వినాఱ నాకిట్లు వ్రాసియుండెనా ? యని సందియమందితిని. లా వణ్యంబున మన్మథునికన్న మిన్నగాఁ బరిగ్రహింపఁబడిన రాజకుమారుని స్వరూపంబునుగాంచి విరహాతురనై యుదయసుందరి యట్టియవస్థ పాలైనదో యట్టిస్వరూపము నేఁడిందు నాకుఁ బ్రత్యక్షమయ్యెను. కాని యాయన్నులమిన్న యెక్కడ నెట్లు కాలము గడుపుకొనుచున్నదో యెఱుంగనైతి నని యనుకొని నతిదుఃఖసంభారంబునఁ గన్నులనుండి బాష్పములు విడచితిని. దేవా ! ఇదియే నావృత్తాంతము. నీవే నాప్రాణపతిని జీవితేశ్వరుండవు. మీదేశ మెద్దియో చక్రవర్తిలక్ష ణంబులఁ బొల్పొందుచున్న మీకు రాజధానియైన నగరమేపేరి య్యదియో పుణ్యపురుషుండవగు నీవు జన్మించుటకతన నేకులంబు బ వితృమంత మయ్యెనో, మాయుదయసుందరీమదనజ్వరాపహరణ మం త్రంబగు భవదీయయోగ్యనామధేయ మేమో, యెఱుంగ మిగులఁ గుతూహలపడుచుంటిని. త్రిభువనశ్రీసర్వస్వమై, మదనుని మొలకయై, శంఖపాలకుల జీవితమై, యెప్పు నాయనుంగుసఖి యెప్పు డెందున్న దో గదా ? బంగారమందు మాణిక్యవర్తివలె నిన్నెన్నఁడైనఁ గూడి భాసిల్లగలదా ? భవదీయవిరహదావాగ్నిదశ నెన్నఁడైన నామె విడచి పెట్టి సుఖించునా ? నా కెనట్టిదైన నామెను వెదకుచుఁ దిరుగు కష్టము దీఱునా ? యని బలుకుచు మాయిందగ్రనందనుని వదనముపైఁ జూడ్కులు బఱపుచు మిన్నకుండెను. రాజేంద్రుండు దన కుదయ సుందరీసంఘటనము దుష్కరమని వాడినముఖపద్మమువలన సూచిం చుచుండ, విశ్వభూతి యేది యెట్లు జరుగనున్నదో యట్లే జరుగఁగల దని బోధింపఁ దారావళి నచ్చటనే నిద్రింపవిడచి తాను నిజనివాస మునకుఁ బోయెను.

గీ. సుదతి నెఱిఁగినకతన నమ్మదరసంబు
నామెఁ గాంచక కడువిషాదాతిశయము
రెండును విరుద్ధగతిఁ బ్రసరించి వాని
నిద్రను హరింపఁగా శయనించె నతఁడు.

337 వ మజిలీ.

ఇంతలోఁ దెల్లవారెను. అతివికట కుక్కుటకుటుంబ కటురవం బున మేల్కొన్న విలాసవనవిహంగమశ్రేణుల కలకలం బతిశయింప, దేవాలయమందిరంబుల మ్రోగింపఁబడు నవసరవాద్య సమూహ ధ్వనులు చెలంగ, విబుద్ధసింధుర నియంత్రణమునకై హస్తిశాలాంతరా ళంబులకుఁ గొనిపోఁబడిన శృంఖలాక్వణత్కారరవంబు మిగులఁ, గల శంబులం బితుకఁబడుచున్న క్షీరధారల ఝూత్కారడంబరం బడరఁ, గులకాంతలు దధిమథనం బొనర్పఁ బెరుగుకుండల మధ్యంబునఁ బెట్టి వడివడిగాఁ ద్రిప్పుకవ్వముల ధరత్కారంబు నిష్పటిల్ల, నదీస్నానోప కరణంబులఁ గానక కలవరంపడు శ్రోత్రియద్విజుల కోలాహలంబు చెంపెక్కఁ, బాంధుల ప్రయాణసన్నాహ నిస్వనం బతిశయింప, రాత్రి యెల్ల మేల్కొనియుండుటచేఁ దూలుచు నిజగృహంబులకేఁగు యామికజనులనండడి మీఱ, రతిరస నిద్రాలసవిలోచనలై బిరబిర పూఁ దోటలకుఁ బరువెత్తు హేమాలాకారతరుణుల పదఘట్టనలు మితిమీఱ, నిద్రం జొక్కియున్న ప్రగల్భతర భుజంగసంఘమును మేల్కొల్పు వే శ్యాంగనల హుంకారధ్వనులు బెచ్చుపెఱుగ, నన్యకాంతాసక్తుఁడై ప్రియుం డరుగ వలవంతంబడి యతం డరుదెంచినతోడనే కలకఁ దేరి యెదురువచ్చు మానవతుల సాధువచనంబులు చెలరేగ, గృహజనుల ముదట మేల్కొల్పు పంజరస్థశారికానికరములపలుకుల శబ్దప్రబల మగుచుండ, మిథునవృత్తి నుదీర్ణములై నిద్రాంతంతోన్నిషితనంస్కా

రములైన క్రీడాశుకములకలకలం బతిశయింపఁ, బుణ్యపథానువృత్తులై హరికీర్తనలఁ బాడువృద్ధులపాటలసవ్వడి బెంపెక్కుచుఁగ, ధర్మక్రమాను లగ్నులై దేవస్తుతులఁ బఠించు మునిమాణవకోత్తముల సందడి యల రారఁ, గ్రమక్రమముగా నిద్రనుండి లేచి ప్రాతఃకృత్యంబులఁ బ్రవ ర్తించు సకలజనపదాలాపనిస్వనంబు మితిమీఱ, దిఙ్ముఖములం దతి పృథుప్రభాపటల సముదయోదయం బై శుభమయారంభసంరంభమై ప్రభాతం బతిమనోహరం బయ్యెను.

అప్పుడు దినరాజప్రవేశంబునకు జేయఁబడిన సముచిత శుభ సత్కారములలీలఁ బ్రతిగృహాంబుముంగిటను గలయంపులుజల్లి మనో హర రంగావళులు దీర్పఁబడియుండెను. సాయంకాలమున వికసించి తెల్లవాఱుసరికి తొడిమలపట్టువదలి నేలరాలియున్న మాలతీకుసుమ నికురుంబమువలన నతిమనోహరంబుగఁ బుడమియెల్ల నలంకరింపఁబడి యుండెను. మేల్కాన్న యన్నుమిన్నలవదనసరోజామోదమునకు మూఁగు మధుకరశ్రేణు లడుగడుగునకుఁ గట్టఁబడిన తోరణములవలె నలరారుచుండెను. వికసితనవకుసుమవాటికలఁ జెలంగు మాలినీలతా సీమంతసింధూరధోరణి విపంచితమహోత్సవాచారము లీల భాసి ల్లెను. క్రీడాసరోవరంబులఁ బుండరీకములు జెలఁగియుండెను. సహజ శీతలంబగు ప్రభాతమందమలయానిలంబు హృదయంగమమై యొప్పి యుండెను. కాలక్రమంబున గతించిన నిశీథినీకపాలములీలఁ దెల్లనగు హిమాంశుబింబమస్తశైలకూలంబునఁ గూలిపోయెను. అంత:—

గీ. ఉడుగణంబు విడువకుండ నిప్పటికైన
భృగుగురుప్రధానవిబుధుల నని
తీవ్రకోపమూను దినకటాక్షచ్ఛాయఁ
బుట్టె నరుణరేఖ పొడుపుగొండ.

పిమ్మటఁ బ్రభాత లక్ష్మీసింధూరతిలకంబులీల నంబరంబున నర్కబింబము పొడసూపెను.

గీ. సర్వజగదుగ్రరోగముల్ సంహరించు
సూర్యభగవానుఁ డుదయింపఁ జుక్కలనెడి
కుష్ఠురోగంపుమచ్చ లకుంఠగతిని
నంతమొందెను నంబరమందు నెల్ల.

అంత దిక్కులెల్లసహస్రకరకిరణసహస్రంబులఁ బ్రకాశించుచుండెను. జలాశయంబులఁదమ్ములు వికసించుచుండెను. నికేతనంబులఁ దల్పంబులనుండిలేచిన మానినుల కటాక్షములువిలసిల్లుచుండెను. అట్టి ప్రభాతసమయంబున వందిమాగధుల స్తోత్రపాఠంబులను మంగళ తూర్యనాదంబులను బుండరీకరాజేంద్రుండు నిద్రమేల్కాంచి శయ్యనుండి లేచి నిత్య ప్రాతఃకృత్యముల నిర్వర్తించుకొని ప్రియమిత్రుండగు కుమారకేసరిం బిలిపించి వానితో రాత్రిజరిగిన వృత్తాంతమెల్లఁ జెప్పి యుచితరీతిని దరుణేందుశేఖరు సభక్తి నిత్యానుక్రమణికంబుగ నర్చించెను. మదనమోహితుండగు నతండు రాత్రిజరిగినదియెల్లఁ గలలోనివార్తవలెఁ దలంచుచు నిజమోయుంగ వెండియుఁ దారావళిని దర్శించి యామెకుఁ జిత్రపటమును జూపించి యుదయసుందరీకథాకర్ణనసైకసౌఖ్యం బనుభవించుచు ననంగమార్గణోదగ్రవేదనాదుఃఖమును బోఁగొట్టుకొన నెంచి యాశ్వాసాయాతనవృత్తాంతము నెఱింగించిన కుమారకేసరితో భద్రదంతావళమునెక్కి విశ్వభూతిమఠమున కరిగెను. మఠద్వారప్రదేశమునందే పరిజనులనెల్ల నుండ నియమించి తాను గుమారకేసరితో విశ్వభూతిశిష్యవర్గముదారిఁ జూపుచుండ లోనికరిగి యందుచితస్థానంబున నాసీనుఁడై యుండెను. వానిరాక నెఱింగి విశ్వభూతి తారావళితో నటకేతెంచ నాతఁడాతపస్వినికిఁ బ్రణమిల్లి యాశీర్వాదములఁబడసి యామె యొసంగిన కుసుమదామమును వినయంబున గ్రహించెను. పిమ్మట విశ్వభూతి వత్సా! నేనిప్పుడొనరించుచున్న దేవపూజ ముగించుట కించుక యవశిష్టమున్నది.

దానిం దీర్చి ముహూర్తములో రాఁగలను. అంతవఱకుఁ దారావళి మీసన్నిధినుండి యభీష్టకథాప్రసంగమునఁ బ్రొద్దుపుచ్చఁగలదని వచించి లోనికఱిగెను. పిమ్మట రాజేంద్రుండు తారావళితో సగౌరవంబుగ రాత్రి సుఖముగా నిదురించితివాయని ప్రశ్నించుచు గను సన్న నామెకుఁ గుమారకేసరిం జూపి భగవతీ! ఈతఁ డెవ్వఁడో జ్ఞాపకమున్నదా ? యని యడుగుటయును నామె వానింజూచి మందహాసభాసురముఖారవిందయై దేవా! ఎఱుంగుదును. సముద్రాంతర మందలి శంకరాలయమున మా యుదయసుందరికి బ్రాణపదంబైన చిత్రపటముతో శాపోపహతుండైన మహాత్ముఁడే యీతఁడు. ఈతఁ డెప్పగిది స్వస్వరూపమునుఁబొంది మిమ్ముఁగలసికొనఁగల్గెనో యెఱుంగఁ గుతూహలపడుచుంటినని పలుక నా రాజేంద్రుఁ డావృత్తాంతమెల్ల నామూలచూడముగా నామెకుఁ దెలిపి తాంబూలకరండవాహిని చేతియందున్న యాచిత్రపటమును స్వయముగాఁ గైకొని తారావళి కందిచ్చెను.

చిత్రగతమైయున్న యుదయసుందరీ స్వరూపమును జూచిన తోడనే తారావళి విరహవ్యథాగాఢపీడనంబున నంతఃకరణయంత్రమునుండి వెల్వడుచున్నట్లు నయనద్రోణులనుండి బాష్పధారలు గారుచుండ జాలియొదవురీతి హా! ప్రియసఖీ! యుదయసుందరీ! చిరకాలమునకు నిన్ను జిత్రముననైనఁ జూడఁగంటిని. అభీష్టజనుల నెల్ల విడచి నీ వెచ్చట కాలముగడపుకొనుచుంటి వని విషాదమేదుర హృదయారవిందయై మైమఱచి చేతనున్న పటమును జారవిడచి కరయుగంబు ఫాలతలంబునఁ జేర్చుకొని మోమువంచి కన్నీరు కాల్వలై పారఁ బెద్దయెలుంగున రోదనం బొనర్పసాగెను.

అట్లు రోదనంబొనర్చుచున్న యామెంగాంచి యా రాజమార్తాండుండు మారాడఁజాలక కరుణాకటాక్షములఁ గుమారకేస

రిపైఁ బరగించుటయును నతం డెలికయభిప్రాయమెఱింగి తారావళి యిట్లని యూరడింపఁదొడంగెను. భగవతీ ! అభీష్టవస్తువియోగంబున హృదయవిదారకంబుగ విలపింపని ప్రాణి యెందును నుండఁడుగదా. అందును స్త్రీలు దుఃఖమాపుకొనఁజాలరు. ధీమంతులు చిత్తమును స్వాయత్తముగ నొనర్చుకొనవలెను. విధినియోగంబున నెప్పుడేది సంభవించినను దానినెల్ల నోర్పున ననుభవించుటయ కర్తవ్యము. సర్వతత్వవిశేషంబుల నెఱింగిన నీకు నే నేమని యుపదేశింపఁగలను! నీహృదయంబును బాధించు ప్రియబంధమును ద్రెంపివేయుము. ఉద యసుందరి నేరీతిఁ గనుంగొనవచ్చునో యాలోచించి యట్టిప్రయత్న మొనరించుటయ యిప్పుడు జేయవలసిన కృత్యమని కుమారకేసరి బోధించుచున్న సమయంబున విశ్వభూతి తారావళి యాక్రందనము విని యం దేతెంచి సాదరవాక్యంబుల నామె నోదార్చెను. వారి యనునయవాక్యంబుల నేదదేరి తారావళి విశ్వభూతియొసంగిన కమండలూదకముచే ముఖకమలసమ్మార్జనం బొనర్చుకొని, యెఱు పెక్కిన నాసాపుటంబు లదుర నీరెలుంగున నిట్లనియె. రాజచం ద్రిమా! నీయంతికమున నాప్రియసఖుంగాంచక నిముసమైన నేనిందు నివసింపఁజాలను. ఈచిత్రపటమును జూచుచున్నకొలఁది నాహృద యానుతాప మభివృద్ధిఁజెందుచుండెనని పలుకుచు విచారోద్రేకంబున నింకేమియు మాటాడఁజాలక మిన్నక గన్నీరువిడువఁదొడంగెను.

తారావళిదుఃఖమును గాంచి పుండరీకుండును దన కుదయ సుందరియందుఁగల యనురాగంబుకతన బుట్టినవిచారము నెడద నడం చుకొని దీర్ఘనిశ్వాసంబుల విడుచుచుండఁ దిలకించి, కాలోచితంబుగ విశ్వవిభూతి వాని కిట్లనియె. వత్సా ! నీవేల నట్లుండెదవు? సఖీ వియోగంబున నతిచంచలహృదయయైయున్నదియామె. చిత్రసందర్శ నంబున విచారాంబుధి మునింగియున్నది. ధీరోదాత్తుండవగు నీవు

ముందుచేయఁదగిన కృత్యమేమో యెట్లాయుదయసుందరిని గనుం గొనవలెనో, యిందుల కెవరిసహాయము గావలెనో, యెచ్చటెచ్చటి కెవరెవరిని బంపించవలెనో, యాలోచింపుము.

చ. సకలసముద్రముద్రితవిశాల ధరాతలచక్రమందునన్
బ్రకటమహాహిలోకమున స్వర్భువనంబున నెందునున్నఁ గొం
కక వెదకించి యాతరుణిఁగాంచి రయంబున నిందుఁదెచ్చి ము
ద్రికఁగతి హస్తమందుఁ గనుపీతిధరింపుము ధర్మసిద్ధికై.

మర్త్యలోకమునం దవతరించిన సుపర్ణవాహనుండనగు నీకసాధ్య మెందునులేదు. కావున సత్వరమ యిందుండిలేచి పౌర్వాహ్ణికకృత్యం బులనెల్ల నిర్వర్తించుకొనుము వేళ యతిక్రమించుచున్నది అని తారా వళిమొగంబై తారావళీ! నీ విట్లేల యింకను పరితపించెదవు. మహా రాజు స్వయముగా నామెను వెదకించుటకుఁ బ్రయత్నమొనరింపఁ గలఁడు. విధికూడ వీనికి వెఱచును. కావున నవ్విధి యనుకూలుఁడై యచిరకాలముననే మీ కాయుదయసుందరిని సమకూర్పఁగలఁడు. అని విశ్వభూతి పలుకఁ దారావళి స్వస్థచిత్తయై పూజ్యురాలవగు నీ మాటలు యథార్థములగుగాక యని వచించి రాజుతో వాని నివా సంబున కేగవలెనని దలంచియు నట్లొనర్చుట గౌరవలోపమనియెంచి విశ్వభూతి ననుసరించిపోయెను.

రాజును నిజనివాసంబున కేగి యథోచితకాల్యకృత్యంబుల నిర్వర్తించుకొనుటయం దనాకులుఁడై యున్నను గుసుమశరశిలీముఖ పరంపరాఘాతముచే డెందమునఁబడిన బెద్దగాయము తారావళినయన జలబిందువుల నీరువట్టి బాధించుచుండ నిట్లు దీర్ఘముగ విచారింపఁ దొడంగెను. అన్నా! ఆమోహనాంగి నెందుఁగనుంగొనగలను? సౌధ శిఖరంబున నిద్రించు నామెను దద్రూపమోహంబున నెవ్వఁడో యప హరించియుండును. అట్టి యువతీరత్నము నీక్షించి యెవఁడు గైకొనక

విడిచిపెట్టఁగలఁడు? నిఖిలసులక్షణలక్షితయగు నామె కళ్యాణయోగ
మున కెన్నఁడు నపాయము గలుగనేరదు. ఈబ్రహ్మాండగర్భమున
నామె యెచ్చటనున్నదో యేయుపాయంబునఁ దెలిసికొనఁగలను?
ఆమె జనకుండగు శిఖండతిలకుండు తదన్వేషణంబునకై పెక్కుమంది
దూతలం బుచ్చెనని వింటినిగదా! వా రామె నెందైనఁ గనుంగొని
పాతాళమునకుఁ దోడ్కొనిపోయినచో నాకెల్లు గోచరముకాఁగ
లదు. అట్లు నిక్కముగఁ బితృగృహంబునకుఁ గొంపోబడియున్నచోఁ
దారావళీసహాయమున్నను నా కామెలభింపఁగలదని యెట్లూహిం
తును. ఇంతకు నామె యెచ్చటనున్నదో తెలియక నేనేమిచేయఁ
గలను? ఎచ్చట వెదుకఁగలను? మనుష్యులకు నరలోకమును దాటి
పోవుటకు శక్తిలేదుగదా! యెల్లలోకములఁ దిరుగ శక్తిఁగలవారు
సురసిద్ధవిద్యాధరోరగయక్షరాక్షసులని యావాక్యాంతమందలి రా
క్షసశబ్దము స్మృతిసభినయించుచు బాగు బాగు. చక్కఁగా జ్ఞప్తి
వచ్చెను. మదీయావిక్రమైకలభ్యమిత్రుండగు మాయాబలనిశాచర
వీరుండు కలఁడుగదా? వానిచే నాయిందుముఖిని నెల్లలోకముల
యందు శోధింపవచ్చును. దీనికై యింక యలజడింబడనేమిటికని
తెలిసి నిశ్చింతుఁడై యామాయాబలుని ధ్యానించెను.

అంతలో సౌమ్యుఁడగు విప్రుని యాకారంబున మాయాబలుం
డేతెంచి దేవా! నీవెవనిని ధ్యానించితివో యతఁడే నీముందున్న
వాఁడని యెఱుంగుము. ఎందులకు నన్ను దలంచితివో యావని
సత్వరము నియోగింపుము. బ్రహ్మాండశిఖరము మొదలు పాతాళము
వఱకును దిరిగి యెట్టిదుర్ఘటకార్యమైనను క్షణములో సాధింపఁ
గలనని చేతులుజోడించుకొని నమస్కరించుచు నతనియెదుట నిలువఁ
బడియుండెను.

అంత నారాజముఖ్యుండు చిత్రగతమైయున్న యుదయసుందరీ

స్వరూపమును జూపించుచు వయస్యా! ఈయాకృతిఁగల లలనారత్నము త్రిభువనంబుల నెందున్నదో వెదకి రమ్మని యాదేశింప నానక్తంచరవీరుం డతిరయంబున నంతర్హితుండయ్యెను. వాఁడరిగిన పిదపఁ బుండరీకుండును మాయాబలుండు తప్పక యావేదండయానను గనుంగొనిరాఁగలఁడను నాశతో నాదినమును గడపెను. మఱియు నుదయసుందరియందలి గాఢానురాగంబు కతంబున నతం డంతరంగమున దశవిధవిరహావస్థలపాలగుచు నిట్లని వితర్కించుకొనెను.

మ. చలిమో వేడిమొ భూమిదాటునెడ విస్తారంబుగాఁబుట్టి పెన్
గలతన్ బెట్టఁగ నూత్నబందిగమునన్ గాఢంబుగా నాయెడన్
గల మోహంబున మన్మథాస్త్రనిహతిన్ గాయంబునుం గాంచి, గా
సిలి యాకాంత లతాంగమక్కటకటా! చేటందెనేమో గదా!

అయ్యో! అశేషశుభసంపదల కాస్పదంబగు నా నారీశిరోరత్నము నశించెనని సంశయించుట ప్రమాదముగదా?

మ. సతిపై గోర్కెఁజరించు నాహృదయ మాశ్యామాతితారుణ్యసం
భృతసర్వాంగయుతాంగజోత్సవలసద్రీతిన్ నితంబోదరా
యతవక్షోజముఖాదిసంపదలచే నాతిథ్యమున్ బొంది యం
చితలీలన్ సుఖియించుచుండ నిఁక హానింగాంచు టెట్లొప్పెడిన్.

గీ. అట్లు చిరకాల మాకోమలాంగియందుఁ
దవిలి సుఖియించు నాదు చిత్తంబదెల్లఁ
దద్వశంబయ్యె నింకెట్లు తరలఁగలదు?
ఉవిద విడనాడివచ్చుట యొదవుటెట్లు?

కావున

గీ. అరయ బ్రహ్మాండమను వార్ధి నధిమథింపఁ
గలుగు శ్రీదేవిఁబోలె నాకలికిమిన్నఁ
బడసి యురమందుదాల్చి, నే వసుధయందు
నచ్యుతుఁడనై చెలంగెద నహరహంబు.

మఱియునాదృష్టి, యనంగతాప దుస్థితింబడు విరహిణీవిధంబునఁ జరణపల్లవాస్తరణంబున నెప్పుడు పొర్లాడును ? ఎపుడు చిగిర్చినలతవలె జంఘోరుదండము నూతగొని మహానందంబునఁ బ్రసరించును ? విలాసవతియగు వేశ్యలాగున నెప్పుడు జఘనాంగణంబున నిలచియుండును ? భయాకులయైన భుజగిపోల్కి నాభీరంధ్రంబున నెప్పుడు బ్రవేశించును? విస్మయప్రచారంబున నలసటంబడిన పడతిగతి నెపుడు త్రివళిమండపము నాశ్రయించియుండును ? యౌవనవిడంబితయగు స్వైరిణీలీలఁ గురులాంధకారంబున నెపుడు సంచరించును ? రాగిణియగు సిందూరరేఖచాడ్పున సీమంతసీమ నెపుడుజేరును ? హర్షోద్రేకంబునఁ ద్రుళ్లిపడు శఫరిచందమున నెపుడు లావణ్యపయోధి నల్లెడల విహరించును ? హృదయమునకు సుఖమొనఁగూర్చు నామె మంజులాలాపములు మదీయకర్ణవివరంబున నెన్నఁడుబడును ? పర్యంతతీక్ష్ణమగు తూలికకరణి నామె దృష్టి యెప్పుడు నాయంగభిత్తికపైఁ బరిభ్రమించును ? కళ్యాణవసతియగు నామె నిధానకలశముభాతి మత్కరమం దెపుడుబడును. రత్నమాలపోలిక నవరుచిస్థానమగు మదీయకంఠము నెన్నఁడామె యాలింగనమొనర్చుకొనును? అని యీరీతి ననేకవిధంబులఁ దద్రూపభావనావిశేషంబున ననుక్షణము హృదయంబునఁబుట్టు కోర్కులచేత విశ్రాంతినెఱుంగక మన్మథపరితాపంబున నాఁడు గడపెను.

## 388 వ మజిలీ

మఱునాఁడు ప్రాతఃకాలమునఁ గృపావతియను విశ్వభూతి శిష్యురాలు రాజసముఖమున కేతెంచి జయజయధ్వానంబున వాని నాశీర్వదించుచుఁ బద్మదామం బుపాయనముగనొసంగి యుచితగౌరవ మంది రాజున కిట్లనియె. రాజచూడామణీ! నీవుమఠమునఁ దారావళిని విడచి వచ్చినపిమ్మట మానిర్బంధంబున నామె యాహ్నికవిధుల,

నెట్లో నిర్వర్తించి యుదయసుందరికొఱకు బెంగఁగొని సంతతము గన్నీరువిడచుచు నారాత్రియెల్ల గడపినది. ప్రభాతంబుననే లేచి పుష్పావచయము నెపంబునఁ గుసుమవాటికకుఁబోయెను. కాని యామె తిరిగిరాలేదు. ఉదయసుందరీవియోగదుఃఖమున నొంటరిగా నెచ్చటికిఁబోయియుండెనో యెఱుంగఁజాలక మే మామెకొఱ కందం దాదినమంతయును వెదకితిమిగాని యామెజాడ యేమియును దెలి సినదికాదు. తమతోఁగూడఁ జెప్పకయేపోవుటచేతఁ "బూర్వపరిచితుఁ డెవఁడైనఁ గనంబడి యామెను నిజనిలయంబునకు సగౌరవంబుగ నాతిథ్య మొసంగఁ దోడ్కొనిపోయి యుండవచ్చును. మాతోఁ జెప్పకయె పోవుటకుఁ దారావళి యవివేకురాలాయేమి! ఉదయ మునఁ దప్పక తిరిగిరాఁగల" దని తలంచితిమి కాని యట్లు రాలేదు. నేఁటి కామె యరిగి మూఁడుదినములైనది. ఉదయసుందరిని విడచి యున్న నిన్నుజూడఁజాలక యామెను వెదకితెచ్చుటకు వెనుకఁ దన యింటినుండి యెట్లు వెడలివచ్చినదో యట్లే యిపుడును బోయియుం డును. కావున మీరామెకొఱకు విచారింపఁబనిలేదు. ఆమెను వెదుకఁ బోవుటవలన నిసుమంతయును బ్రయోజనములేదు. ఆయన్వేషణ ప్రయాస ముదయసుందరికొఱకుఁబడుట యుక్తము. తారావళియును నుదయసుందరిని వెదుక నెల్లెడలఁ దిరుగుచుఁ దనంతట తానే రాఁగ లదు. అని యిట్లు విశ్వభూతియాదేశ మెఱింగించి తేని సమ్మతింపఁ జేసి వాని నాశీర్వదించి సంతసంబున నిజావాసంబున కరిగెను.

పిమ్మట నారాజేంద్రుండు తారావళి మాయమగుటకు విన్న దయంబందుచు నుదయసుందరీ సంస్మరణంబుమాత్రయినను మదన మూర్ఛితుండగుచు స్త్రీరత్నఫలితమగు దన యాశాకల్పలతికకు మాలలైయె చెంతనున్న కుమారకేసరి నమృతరసావసేకశుభగంబు లగు చూపుల నీక్షించుచు నిట్లనియె. మిత్రమా! తారావళి యెం

చేరియుండును? ఏమార్గంబునఁ బోయియుండును? ఆమె నిక్కముగఁ
బ్రియసఖి నీభూమండలంబున వెదకుటకే యరిగియుండునా? మార్గ
మధ్యమందెద్దైన నాపాయము సంభవింపదుగదా? ఏమి జరిగి
యుండునని యడుగుచు నంతలో నీకా యుదయసుందరి యెచ్చటఁ
గనంబడెను? ఎట్లుచూచితివి? అందేమిచేసెను? ఏమనిపలికెను? ఎచ్చ
టినుండి యేతెంచెను? ఏకులంబునఁబొడమెను? ఎచ్చటఁ దిరుగు
చున్నది? అని ప్రశ్నించుచు జెప్పినది చెప్పనట్లు, వినినది విననట్లు,
తెలిసినది తెలియనట్లు మఱలమఱల నడిగినదే యడుగుచు హృద
యానువర్తియగు కుమారకేసరివలన మాటిమాటి కావృత్తాంతమును
వినుచున్నను మరచుచు నారాజేంద్రుండు కొన్ని దినంబులు గడపెను.

మేఘములనలుపును బాపుచు నేను కూడనున్న హారిణలాంఛ
నుండు విశేషదీప్తిం గాంచి నిజకరంబుల ననంగశరాహతి నవసి
యున్న యీతని బాధింపఁగలఁడని శరత్కాలము గతించెను. నిరం
తరము నుదయసుందరీధ్యాననియతుఁడై యున్న యా రాజేంద్రుని
నియమంబునకుఁ గ్రొత్తవరిచేలయందుఁ దిరుగు క్రౌంచపక్షుల కఠిన
క్రేంకారములతో నే నండి యంతరాయము గలిగింపరా
దని హేమంతము నిష్క్రమించెను. స్మరానలదందహ్యమానుం
డగు భూమండలాఖండలునకుఁ జిత్తసంతాపశమనం బొనర్పఁదగు
పద్మకాననమందలి యువకఁ బోఁగొట్టుచు నే నుండుటఁ దగదని శిశి
రం బదృశ్యమయ్యెను. మలయగిరిశిఖరసరసీతరంగజలసంపర్కంబునఁ
జల్లనైన పిల్లవాయువును వ్యజనోపకరణంబుగ గ్రహించి యవిరళ
వకుళకుసుమకోశములందలి మధురసజలంబును నార్ద్రోపకరణంబుగఁ
బూని వికసదతివిశదసిందువారసంభృతానల్పతరపరాగంబును స్వేదా
పహారంబగు కర్పూరచూర్ణంబు డంబునవహించి, నవీనకోమలతరు
పల్లవాళినికరంబును మృదుతల్పంబుగఁ గల్పించి, సమయమునకుఁ

దగినరీతి నీ రాజేంద్రున కుపచారముల నొనరింతు నని వసంత మేతెంచెను.

మ. అతిసౌఖ్యాస్పదమౌ వసంతమునఁ జూతాంకూరమే మన్మథా
యతబాణంబయి మానినీవిమలశీలాకర్షముం జేసి, యు
ద్ధతరాగాంధులఁ జిత్తముల్ గలచి నిత్యంబున్ వియోగిన్య ను
ప్రతతిం బుచ్చుచుఁ బాంధులన్ గెడపుచున్ బాధించుముల్లోకముల్.

మఱియును

ఆ. వె. ఇంపుమీఱు నామ్రసంపదలను మించు
నవ్వసంతసమయమందుఁ గలుగు
పికరుతంబుదోచె విరహుల మదినాటు
స్మరుని బాణశల్య శబ్దమట్లు.

త్రిభువనంబుల కానందమునుగూర్చు నట్టివసంతసమయంబున మలయకామినీకర్ణపూరారవిందకోశంబులం బ్రవేశించు నుత్సాహం బున నలసి పయోధితటారామంబుల విశ్రమించుచు, తామ్రపర్ణీ తరంగడోలికల శిశువువలెనే గేరింతములుగొట్టుచుఁ గావేరీకూల లతాగృహంబులయం దతిథులవలెనే నివసించుచు, గోదావరీజలతుషా రములతోఁ బధికులవలెనే కలసికొనుచు, మృగమదమషీలిఖితంబులగు పాండ్యకపోలపత్రంబులఁ బండితులవలెనే విమర్శించుచుఁ, గుంతలీ ధమ్మిల్లవేల్లితంబులగు కుసుమమంజరుల మాలికాకారుల విధంబు న సరిఁజేయుచు, మన్మథనిధానములగు నాంధ్రసీమంతినీ స్తనకలశం బులను సిద్ధులవలెనే బయల్పెట్టుచు, పున్నాగమధురసస్వేదంబులగు మహారాష్ట్రకుటుంబినుల యూరుస్తంభంబుల మల్లురవలెనే కలయఁ గలుపుచు, పరిమళమిళితాళికవచంబులఁ జెలంగులాట లీలావతుల వళులను వీరభటులవలెనే మొగఁబ్రాకుచుఁ, గర్ణాటనారీకుచపత్ర కస్తూరికాపంకిలపథంబున మందగమనంబునందుచు త్రిలింగతరుణీ

## తారావళీ కథ.

కురుల వనశీతలచ్ఛాయల సేవించుచు సవిభ్రమాభీరభామినీముఖా మోదంబునఁ బరిమళించుచుఁ, జందనగిరిపరిసరోద్యానమండలంబునఁ జలించు గుసుమలతికలకు హస్తకాభినయనాదుల నేర్పు భరతాచార్యునివలె నలరారుచుఁ జల్లని పిల్లవాయువులు దక్షిణదిగంగనాశ్లేష మిళితకర్పూరసౌరభంబుతోఁ బ్రసరించుచుండెను.

అట్టి యుత్కృష్టవసంతసమయంబునఁ బుండరీకరాజేంద్రుండు సర్వదా యుదయసుందరినే ధ్యానించుచు మదనతాపంబునఁ బొగులుచుండెను. ఒకనాఁ డతఁడు ప్రియవయస్యుండగు కుమారకేసరిం గూడి ప్రమదావనంబున విహరించుచు నొకచో నక్షివిక్షేపంబున ముందు జూపుచు వాని కిట్లనియె. సఖా! ఆకాసారతీరంబున నీక్షింపుము.

ఉ. ఆనళినీవనంబున నితాంతము గాంతను బాసి విభ్రమా
నూనమనఃప్రవృత్తిని మనోజమహాగ్రహమేచఁగాఁ బ్రలా
పానుగతుండునై యళుఁ డహా! యదె తమ్మిదుమారమూని పె
న్దీనత శూన్యమందచటఁ ద్రిమ్మరు బంభరడింభకాళితో.

గీ. కేళికావనసీమ నీక్షింపు మదిగొ
వర్ధిత పున్నాగపుష్పపరాగమెల్ల
నరయ గంధోపలక్షోదమట్లు యువక
హృదయముల నంగజాగ్ని దీపింపఁజేయు.

గీ. మలయమారుతడోలిక నలరి మొదలు
విడచు ఘనరేణుధోరణి వెలయుచున్న
చూతమంజరి క్రకచికభాతి సహహ
విరహుల మనంబులనునెల్లఁ దరుగఁదొడఁగె.

ఇట్లు మదనోన్మాదుండై పలుకుచున్న యా రాజేంద్రుని మాటల నాలకించి కుమారకేసరి డెందంబున నిట్లు తలంచుకొనెను. ఔరా! ఈమహారాజిప్పుడు మన్మథవాతకునకుఁ బాత్రిగా నయ్యెఁడై

యుంటివనుగదా! ఇచ్చటనుండి వీనిని వేఱొక్కచోటికిఁ దీసికొని పోవుట సాధ్యముగాదు. మఱియు నిట్టిప్రదేశమును విడచిపోయిన విర హార్తుఁడగు వీని బాధ తగ్గనేరదు. కావున నిచ్చటనే యుండి వీనికిఁ గలిగిన మన్మథవ్యథ యేయుపాయంబున నివర్తింపఁబడఁ గలదో యరసెదం గాక యని ముందుజూచి ససంభ్రమంబున నేని కిట్లనియె. దేవా! అటు చూడుము. వనవీరుఁడను కిరాతరాజు వలనఁ నెచ్చటనుండియో సంపాదించికొనిరాఁబడుచు దారకుఁడు గళ్లెమును బట్టుకొని నడిపింప జీనుగట్టఁబడి, సర్వర్తురాజగు వసంతుఁడు బంపిన కానుకయట్లు, దిక్పాలురు నీవు నడచుట కిష్టపడక యొసంగిన దానివలె ననన్యభోగ్యమగుటచే దేవేంద్రునివలనఁ నొసంగఁబడిన యుపాయనమువోలె, నీకుఁ దగినవాహనముగ విధాతచేత నిర్మింపఁ బడినపోల్కి నొప్పుచుఁ బ్రిభూతవేగంబున రూపొందిన వాయువు రీతి, సాక్షాత్కరించిన మనస్సుగతి, గరుడుని రూపాంతరోత్పత్తివిధం బున నలరారుచు, సర్వాంగసుందరమై, శుభలక్షణలక్షితమై, యదృ ష్టపూర్వమగు మనోహరాకారమున మించు నాయశ్వశ్రేష్ఠమును దిలకింపుమని కుమారకేసరి పలుక నారాజేంద్రుండు విస్మయంబున నావైపు దిలకించెను.

ఇంతలో నాయశ్వముతోఁ గిరాతరాజు సమీపమున కేతెంచి రాజునకుఁ బ్రణామము లాచరించి యిట్లనియె. దేవా! నేఁడు నేను వింధ్యగిరిపరిసరారణ్యంబునఁ దిరుగుచుండ నొకచో నాయెదుట నంబర తలంబునుండి యీయశ్వరాజ మత్యంతహరితదూర్వాస్తంబంబుపై నోర బైకెత్తుకొని బడెను. అంబరమునందలి రవిరథతురఁగము సరసదూర్వాహారకాంక్షచే క్షోణితలంబున కవతరించెనో లేక యీ యద్రిశిఖరమున నవఱుఁ డెవ్వఁడైన విహరించుచుండ వాని వాహ నము ప్రమాదమునఁ గ్రిందఁబడెనో నే నెఱుంగను. కాని దాని

యద్భుతసుందరాకారమును దిలకించి విస్మయపడుచు నే నిట్లు తలఁ
చుకొంటిని. ఆహా! అసదృశాకారమున నొప్పు నీయశ్వ మెవ్వరిదై
యుండును? ఎచ్చటనుండి వచ్చినది? రవిరథతురంగముల ప్రతిమగ న
మిన్నగ దీనిని విధాత నిర్మించియుండవచ్చును. సముద్రగర్భమునుండి
వెల్వడిన యుచ్చైఃశ్రవము దీని నీక్షించి సిగ్గుపడుటచేతనే దానికి
పుడమినుండు భాగ్యము లేకపోయెను. ఇట్టి వాహనరత్నమును బరిత్య
జించి హరిణము నెక్కి దిరుగుటచేతనే సమీరణునకుఁ జంచలుఁడని
లోకంబునఁ బ్రతీతిగల్గెను. దేవతలగుఱ్ఱముకన్న నుత్కృష్టాకారమున
నొప్పు నీయశ్వము నధిరోహించుటకు మనుష్యమాత్రుం డర్హుండు
గానేరఁడు. అధిష్టించినను నడిపింపనోపఁడు. కావున దీనిని నరలోక
దేవేంద్రుండవగు నీకుఁ గానుకగా సమర్పింపఁదలంచి యశ్వశిక్షా
నిపుణుండగు దారకునిచే దీనిని బట్టించి జీనుమొదలగు పరికరంబుల
నాయత్తపరిచించి దేవరసముఖమునకుఁ దోడ్కొనివచ్చితిని. ఇప్పుడు
దేవరయే ప్రమాణమని యూరకుండెను.

అప్పుడు కుమారకేసరి, "ఆహా! రాజేంద్రుని ముఖంబును
రసాతలమునకుఁ ద్రిప్పుటకు మంచియుపాయమే దొరకెను. [illegible]
శ్వము నెపంబున వీని విరహావస్థను మరపించెదంగాక యని తలంచి
యాయశ్వము సర్వాంగములఁ బరీక్షించి రాజేంద్రున కిట్లనియె.
స్వామీ! అవధారు. అశ్వజాతులు తొమ్మిదింటియందును నుత్తమం
బగు "తోఖారా" జాతియం దియ్యది సంభవించినది. శ్రేష్టంబులగు
నశ్వలక్షణంబు లెనిమిదింటిని దాల్చియున్నది. ఎత్తు పొడవు లావు
నెన్నియంగుళములుండవలెనో యట్టి పరిమాణము గలిగియుండుటచేనే
నతియుత్కృష్టమైనది. చెవులు శాస్త్రమందుఁ జెప్పఁబడినట్లు లఘు
వులై శ్రేష్టత్వమును దెల్పుచున్నవి. కేసరత్వక్తనూరుహంబు లెట్లు
మృదువుగానున్నవో దిలకింపుము. జానుజంఘాపవంబులుఁ [illegible]

యుండుట పరికింపుము, నయనదశన స్తనంబులు స్నిగ్ధములై యుండెను. మెడ నిడుపైనది. డొక్కలు గఠినములై యున్నవి. లలాటకటిస్కంధ పృష్ఠాక్షివక్షస్థలంబులు విశాలంబులైయున్నవి. వర్ణచతుష్టయంబులో ముఖ్యమైన పాటలవర్ణంబుగలిగియున్నది. ఎచ్చట శుభావర్తము లుండవలెనో యచ్చటనే యవి చిహ్నితములై యుండెను. శంఖధ్వనిం బోలు హేషారవంబునం జెలంగియున్నది. దేవసత్వంబును, నగ్నిచ్ఛాయయును బంకజసౌరభంబును, విలాసత్వరితగమనంబును గలిగి, సప్త ప్రకృతులయందును నత్కృష్టమగు సత్వప్రకృతిచే నలరారుచున్నది. వీని యవయవలక్షణములన్నియును శ్రేష్టత్వమునే స్పష్టపరచుచున్నవి. ఇట్టి యుత్తమాశ్వము దేవర యధిరోహింపఁదగియున్నది. కావున నో దేవా! నీవత్యంతముదంబున నీయశ్వంబు నధిష్టించి యశ్వశిక్షానిపుణుండవై గతివిశేషంబుల నడిపింపుమని యాదరంబున మనవి సేయ నారాజేంద్రుండు సకౌతుకంబున దాని నధిష్టించి వివిధగతుల నడిపింపఁదొడంగెను.

ఇంతలో నతిరయంబునఁ గరభకుఁడను సేవకుఁడు రోఁజుచు యొడలెల్లఁ జెమ్మటలుగ్రమ్మ నిట్టూర్పులంబుచ్చుచుఁ బరువెత్తుకొని వచ్చి దేవా! మోసమయ్యెను. మోసమయ్యెను. ఎచ్చటనుండియో యొకదురాత్ముఁడేతెంచి ధ్వంసమొనరించుచున్నాఁడు. వాని నిగ్రహింప మే మశక్తులమైతిమి. ఉద్యానమును రక్షింపుము రక్షింపుమని భయగద్గదస్వరంబునఁ దడఁబడుచుఁ బలికెను. ఆమాటలకు విస్మయమందుచు నందున్నవారు "ఓరీ! ఎవఁడువాఁడని గద్దించి యడుగ భయకంపితుండై "వాఁడు, వాఁడు" అని వచించు సేవకునిమాటలారాజముఖ్యునకు నవ్వుబుట్టించెను.

రాజు వాని పిరికితనంబునకు లోలోన నవ్వుకొనుచు మడమలచే నాతురంగము నదలించి బరువెత్తించి కుమారకేసరి పరిభృత్యులు

కొంతరా క్షణములో నాప్రదేశమును జేరి ముందు నలువంకలఁ బరి
కించెను. అం దొక లతామండపమునుండి యింకొక లతామండపము
నకు నొకచెట్టుమీఁదనుండి యింకొకచెట్టుమీఁదకును దుముకుచు,
వనపాలుర బెదిరింపుల లెక్కగొనక యతివిక్రమంబునఁ బరిభ్రమిం
చుచు, తన చిత్తవికారమును బోఁగొట్టు హాస్యరసంబున కాస్పదంబై
దుర్జ్ఞేయప్రవృత్తియై, వికటస్వరూపమై చపలస్వభావమై, మాటి
మాటికి నాడలు గోకికొనుచు, గోధూమవర్ణముగల క్రాచుమాను
వలెఁ బుష్టభాగంబున లాంగూలము ద్రేలాడుచుండ, నెఱ్ఱని ముఖ
మును దీర్ఘదంతములును జూపరకు భీతిఁగొలుపుచుండ, దంతనిష్క
ర్షణంబున వనపాలకుల నెకసక్కెములాడుచు నటవీచరవేషముల
యందు విదూషక పాత్రమువలె, కాంతారనగరమందలి విటునిలీల,
నారామగ్రామఫలంబులకు భోక్తవిధంబున నొప్పుచు నత్యద్భుతమహా
కారభాసురమగు నొకవానరశ్రేష్ఠము గనంబడెను.

దాని నీక్షించి యారాజేంద్రుండు తదీయస్వరూపంబునకు
విస్మితుండగుచు, దాని చైతన్యప్రవృత్తి నగ్గించుచు, దానిఫలగ్రహణ
సామర్థ్యంబు నెన్నుచు తిర్యగ్జాతియందు బుట్టినను మనుష్యస్వభావ
వ్యాపారంబుల మెలంగుదానిని బొగడుచు ప్లవగజాతియందుఁ బుట్టి
నను నట్లు నిర్భయముగా రక్షకభటులనెల్ల మర్దింపఁగలిగిన దాని
సామర్థ్యంబు నభివర్ణించుచు, నిట్లు మనంబున వితర్కించుకొనెను.
ఔరా! ఎవ్వఁడైన నిజశరీరమును మరుగుపరచి యిట్టిస్వరూపంబున
విహరించుటలేదుగదా? రామాయణంబున సుగ్రీవనలనీలాంగదప్రభృ
తులు దివ్యాంశజులని వినుదుము. వారిలో నెవ్వఁడైన నిట్లుకొంచి
యుండలేదుగదా? లేక మధ్యలోకవర్తియగు నాహనుమంతుఁడే
యిందువచ్చియుండడనేమో! కానిమ్ము. ఈవానరచేష్టితంబులఁ బరి
కించి యేమిచేయవలెనో యట్లు యొనరించెదంగాక యని దలంచు
చుండ వసంతశీలుఁ డేతెంచి యిట్లనియె.

దేవా! ఈకోఁతి యెచ్చటనుండి వచ్చుచుండునోగాని ప్రతిదిన
మింతవేళకే తెంచి మమ్మెవ్వరిని లక్ష్యముసేయక నవరసాకమ్మధురంబులగు
ఫలంబులేరి కొనిపోవుచుండును. చిత్రమేమన దా [illegible] న
దినినట్లు గనంబడదు. ఆఫలంబుల నెచ్చటికిఁ గొనిపోవుచుం
డనో దీని నెట్లు నిగ్రహింపవలెనో మాకుఁ దెలియకున్నది. నేఁ డేలిన
వారు స్వయముగా నేతెంచిరి గావున జరిగిన దెల్ల మనవిచేసి
కొంటి నని పలుక నతివిస్మయావేశహృదయుండై యాతారాక్షేంద్రుం
డు దానిని స్వయముగా నిగ్రహింపఁబూనెను. అప్పుడు :—

గీ. శుభదశాపరిణతుఁడు భూభుజుండు నైన
నతఁడు రా దుర్దినమువోలె నాప్లవఁగము
తరుణరవిరక్తముఖముతోఁ దరలిపోయె
వనమునందుండి ఫలసంపదను హరించి.

గీ. చరణవిన్యాసమున దాఁకుశక్తి దెలియఁ
బూర్వదేహంబు నిగుడించి ముడుచుకొనుచు
వడిగ నడచుచు మెడఁద్రిప్పి వెడఁదకన్ను
వదిగొ యిదిగొ యనఁగ మాయమయ్యెఁ గోఁతి.

అయ్యది యుద్యానవనము ధ్వంసము గావించి [illegible] బును
యందలి ఫలంబులఁ దాను దినకుండ నేమిటికి గొనిపోవుచుండెనో
యను విస్మయంబును బొందుచు నాతారాక్షేంద్రుండు కశాఘాతంబునఁ
దురంగము నదలించి మహాక్రోధంబున నావానరముపైకి నరిగెను.
అతిజవంబునఁ బోవుచున్న దానిని బట్టుకొనుదలంపునఁ గుమారకేసరి
ప్రభృతులు దన్ననుసరించి రాజాలక నిలచియుండ నాతారాక్షేంద్రుం డే
కాకియై యాప్లవంగము వెంట మిగుల దూరము పరిగెను. అట్లు వాయు
వుకన్న వేగంబునఁ బోవు ప్లవంగమము ననుసరించి [illegible]
మేఁగుచుండ దానినోటినుండి [illegible]

మారుతునకు మార్గము జూపుగుర్తుట్లై యొప్పెను. ఒకదానికన్న నింకొకటి ముందుండవలెనను స్పర్ధచే దుముకుచున్న నగ్రిచరణద్వంద్వముతో నాయశ్వము మహావేగంబున ముందుఁ బోవుచుండెను. ఆయశ్వగమనవేగంబు నీక్షించి రాజు విస్మయమందుచు నౌరా! ఈహయరత్నము వియత్పథంబున నెగిరి యరుగుచున్నదా యేమి? ఎవ్వఁడయిన నదృశ్యరూపంబున దీనిని పైకెత్తుకొనిపోవుచుండ లేదుగదా? ఎవ్వఁడైన మాయావి దీని నావేశించి యుండి యిట్లు బరువెత్తుచుండెనేమో! లేకున్న దీని కిట్టివేగ మెట్లు గలుగఁగలదని బహువిధవితర్కవ్యాగ్రహృదయుండై ముహూర్తమాత్ర మకృతావధానుఁడై యుండెను.

అంత నొక్కయెడ ననేకతరుశకుంతకూజితారావతుములంబున వెలివిఁ బొందిన తా నొకమహారణ్యమధ్యంబునఁ దిరుగుచున్న ట్లెఱింగెను. ఎచ్చట నెందుఁ జూచినను గొండలతో నిండియున్న ప్రదేశము గాని యూరుమక్కట యుండుఁ గనంబడదయ్యెను. ఇఁక ముందుఁ బోవుట కశక్యమగురీతి నడ్డముగానుండి, యగస్త్యునివలన మోసగింపఁబడుట దెలిసి రోషమొంది పెరుగుచున్న వింధ్యనగేంద్రములీల దక్షిణదిక్కునెల్ల నాక్రమించుకొనియుండి గౌరీతపశ్చరణపంచాగ్నులచే మరిచు కరిగిపోయిన హిమాద్రివలె, హరపదస్పర్శాప్రభావంబున స్ఫటికపాండుకుష్ఠువుం బోఁగొట్టికొనిన కైలాసముగతి, వార్ధక్యంబునఁ గాంచనచ్ఛవిం బాసిన మేరువువిధంబున నొప్పుచు నదభ్రశిఖరకృతాభ్రంబగు నొక్కభూభృద్వరంబును గనుంగొనెను.

అప్పుడు రాజు విస్మయమందుచు సత్వరంబునఁ గళ్లెమును లాగిపట్టి గుఱ్ఱమును నిలిపి దాని నవరోహణం బొనరించి యలసట వాయ ఘనశీతలచ్ఛాయల నొప్పు నొకవృక్షముక్రిందకుఁ జేరెను.

# విచిత్రసమ్మేళనము

అప్పు డా పుండరీకరాజేంద్రుండు నలువైపులం దిలకించి విభ్రాంతుఁడై యిట్లు చింతించెను. అహా! ఇప్పుడు నే నేమహా రణ్యంబునఁ జిక్కుకొని యుంటిని? బ్రహ్మాండఫలక కీలకంబుగ నొప్పుచున్న యీపర్వతముపేరేమి? ఈప్రదేశమున కే నెట్లు జేరుకొంటిని? కుమారకేసరిప్రభృతిసహాయు లేమైరి? మహాజవంబు న నీతురంగము నన్నెంతదూరము దీసికొనివచ్చినది? నేను దీనివేగ లాఘవంబుల నెన్నుచు నన్నేమార్గమున నిచ్చటకుఁ దీసికొనివచ్చె నో గమనింపనైతిని. దేనిని బట్టికొన నింతదూర మేతెంచితినో యామర్కట మేమైనది? అదృశ్యభావమందిన యొకమహాభూతమది కాదుగదా? మాయావియొకం డీరూపంబున నన్నిటకు లాగికొని వచ్చెనేమో? ఇఁకముందు నన్నేమిచేయునో? ఇందు దైవము క ర్మానురూపమగు ఫల మెయ్యది నాకు సమకూర్చునో? లేకున్న విధి నా కిట్లు ప్రతికూలుఁడై యుండు టెట్లు సంభవించును? నే నిప్పు డేమి చేయవలయును? ఈతురంగము నధిష్ఠించి వెనుకకుఁ బోదు నా? ముందున కరుగుదునా? లేక యిచ్చటనే యుండి మాయమైన యాకోఁతిని వెదకుదునా? ఈయుత్తమాశ్వము నిముసములో నన్ను నగరమునకుఁ దిరుగఁ దోడ్కొని పోఁగలదు. కాని మహాద్భుతరసా స్పదం బగు నావలీముఖంబును దిరుగఁ గాంచుట యెట్లు? దగఁ గొ న్నవారును పరమధర్మార్తిభృత్తులును నితాంతశీతలస్వాదుజలంబులు గలిగి, తీరంబుల ఫలవృక్షములతో నొప్పుచుండు జలాశయంబులఁ

దరుచుగ నాశ్రయించుచుందురు. కావున నిప్పు డట్టిప్రదేశంబున కే
గోరెదంగాక. అచ్చటనైన నవ్వానచరంబు గనంబడకుండునా? మన
ప్రవృత్తియే సంతోషవిషాదంబులఁ గల్పించుచుండును. తీవ్రమగు
నెండలోఁ దిరుగుటచే నలసియున్న యీయశ్వమునకు నీరుపెట్టి సేద
దేర్చి నేనును గాలోచితకరణీయంబుల నిర్వర్తించుకొనుట తగునని
నిశ్చయించి యావృక్షచ్ఛాయనుండి లేచి మందగమనంబున నటు
నిటు దిరుగుచుండ వానికి సమీపముననే జలాశయ మున్నటుల హం
సాది జలపక్షిసందోహకూజిత నిస్వనంబు వినంబడెను. ఇందు కా
సార మున్నది రమ్మని సన్నఁజేయుచున్నటుల గాలిచే గదలుచున్న
చెట్లకొమ్మలు గనంబడెను. కమలసౌరభంబుతో స్వాగతం బొసంగు
చున్న విధంబున నెదురువచ్చు కమ్మగాలులవలన నందు జలాకరం
బుండుట నిశ్చయించి యాభూమికుం దమందానందంబున నాదిక్కు
న కరిగెను.

ఆకొండలనడుమ హిమప్రభేదమువలె చందనసంస్కారములీల
చంద్రపరిణామముగతి శీతకాలసంతానమువిధంబునత్యంతశీతలంబై,
వర్షాగమకోశమువలె సంచితాంబుసర్వస్వమై, సముద్రరూపాంతరము
పోల్కి సుస్వాదుజలమయంబై, వరుణరాజుచక్రవ్యూహములాగున
వివిధోర్మిచమూచలనదుస్తరంబై, మానససరోవరమునకుఁ దోడఁబు
ట్టువై, మహీమాతృకయందలి ఠకారమట్లు వర్తులంబై, నిరాలంబమై,
యున్నయభ్రగంగ బరువుచేఁగ్రిందఁబడిన ట్లొక్కచో బుంజీభూతమై,
ధర్మము నడంచు గలికాల మేతెంచుట యెఱింగి యందులకుఁ
ప్రతీకారమొనర్ప నేకాంతమునఁ జేరి యాలోచించు మందాకినీనదీ
త్రయంబు డంబునఁ గుండ్రముగాఁ గలసియున్నదై, సురపతికి ఫణిం
ద్రునితోఁగలిగిన వివాదముమూలమునఁ బాతాళమునుండి యూర్ధ్వ
లోకంబునకుఁ గొనిపోవ మర్త్యలోకమునకుఁ జేర్పఁబడిన యమృత

దుండనేమిటికి? కుమారకేసరిప్రభృతు లెందున్నారో గదా? నన్ను వా రెట్లనుసరించి రాఁగలరు? నాకొఱ కెచ్చట వెదుకఁగలరు? ఎందుఁ దిరుగఁగలరు? ఏమిచేయఁగలరు? తపస్విని యెచ్చోట నెట్లు వర్తించుచున్నదో! సరసదూర్వాహారమున నీతురగి పరితృప్తిం జెందినచో దీని నధిష్టించి తిరిగి పోయెదంగాక యని తలంచి యా యశ్వమున్న వంకకుఁ జూచుటయును దాని పూర్వచరణముల ముందు మెరుపుతీవయందలి పుష్పమువలె నశేషప్రదీపకళికాగుచ్ఛములీల నభంబునుండిపడిన సూర్యభగవానుని గర్భాండకమువిధంబున బ్రకాశించుచు రవి దివంబుననుండి దానికి మిగుల సొగసుగూర్చుచున్నాఁ డను నీసున ధరణికిఁగూడఁ దానుండి యందమును గల్పింతుననివచ్చినమచ్చున నొప్పుచు, నానన్నవిటపంబులు స్వచ్ఛమైన తనయందుఁ బ్రతిబింబితములై గనంబడుచుండఁ దమాలశాఖాంధకారమున మలినమైన యాశాముఖంబును బహుదూరము బ్రసరించు నిజకరప్రదీప్తిని క్షాళనమొనరించుచు, సర్వత్ర వ్యాపించుచున్న నిజతేజోరాశిచే జగమునకెల్ల నేకభూతాత్మకత్వంబు నాపాదించుచు, నత్యంతనిర్మలమై యతిమనోహరంబై ప్రకాశించుచున్న మాణిక్యమొకటి గోచరమయ్యెను.

దానింజూచి విస్మయంబందుచు నల్దిక్కులు బరిశీలించి యందెవ్వరును లేకుండుట దృఢపరచుకొని "ఆహా! ఈయపూర్వమాణిక్యమెక్కడిది? ఈచెరువుగట్టున కెట్లువచ్చినది? ఎచ్చటినుండిపడి యిట్టి దుస్థితిపాలయ్యెను! అనంతమరీచులచే నప్రతిహతములగు సహస్రకరములతో నొప్పుచున్నను రాత్రులయందుఁ గాంతివహింపఁజాలవిద్యున్మణిని నిది యతిక్రమించుచున్నది. నిర్మలత్వమునఁ గౌస్తుభమాణిక్యమును నతిశయించుచున్నది. నిష్కపటత్వంబున మునీంద్రులకును నపగతత్రాసత్వంబున సురలకును జిత్తములయందు స్పర్ధను బుట్టించు

చున్నది. దీనికాంతిచే విజితమై సిగ్గుపడి కౌస్తుభంబు హరివక్షస్థలం బున వనమాలాపగూఢమగు నసితప్రభాంధకారమున నడఁగియున్నది. చింతామణి దీని సామ్యతంబొందఁగోరి దానవ్రతంబున నభీష్టసిద్ధి యగునని యెఱింగి యర్థులకుఁ గోరినదెల్లనిచ్చు ప్రవృత్తియందున్నది. ఇతరములగు మణులు ప్రభావపరాభవభయంబునఁ గొన్ని యగాధ మగు నంభోధిమధ్యమం దడఁగియున్నవి. కొన్ని రోహణాద్రినాశ్ర యించి మీఁద మన్నుగప్పుకొని యదృశ్యములైయున్నవి. కొన్నిరసా తలమునఁ బ్రవేశించి ఫణీంద్రఫణాపంజరముల నధిష్ఠించియున్నవి. ఇట్టి యుత్కృష్టరత్నము నెవ్వఁడైన స్నానార్థమిచ్చటి కేతెంచి మరచిపోయెనేమో ? అంబరమున విమానముమీఁద సంచరించు దివ్యునిమణి యిందు జారిపడెనేమో ? ఏవన్యజీవనమైన నేపక్షియైన దీని నెటనైన నపహరించుకొనివచ్చి యిందు విడచిపోయెనేమో ? తుమ్మెదలు మూఁగు పరిమళముండుటచేతను నందందు సిందూరరేఖ లుండుటవలనను నియ్యది సౌరభ్యసంభృతాంగావయవసంగితంబగు నలంకరణమై యొకరమణీమణి విభూషణమని తలంతును. అయినను దానిందెచ్చి పరిశీలించెదంగాకయని లేవఁబోవు రాజుముందర నయ్యా శ్వఖురప్రహారవేగంబున నమ్మణి యెగిరివచ్చి పడెను.

## 340 వ మజిలీ

అయ్యశ్వము మణిస్పర్శాప్రభావంబునఁ దోడనే తురగరూప మును విడచి జటావల్కలోపవీతములు దాల్చిన తారావళి యయ్యో ను. పుండరీకుండును నట్టిపరిభావముగలమాణిక్యము దనముందుఁ బ డుటఁ దిలకించి యేమి యీయింద్రజాల మని యక్కజంపడుచు నతి కుతూహలమున నమ్మణిని గ్రహించి రూపాంతరమును విడచి క్రొత్త గానున్న దారావళిపై నిశ్చలదృష్టులం బరపి చూడసాఁగెను.

ఆమెయును స్వస్వరూపలాభమునకు ముదమందుచు నాగిరి సరోవరములవలన నిరుద్ధమధ్యమగు నామహారణ్యంబును విస్మయంబుతో నిటునటుఁ బరికించి "సాధుసాధు. దేవతలు చిరకాలమునకు నాకోరికను దీర్చి యనుగ్రహించిరి. క్రూరవనచరావతారదారుణారణ్యంబున నున్న నీకాసారతీరమునఁ ద్రిభువనలక్ష్మీసీమంతరత్న మనుచితావస్థానదుస్థితిం గాంచుచున్నదిగదా ? యని పలుకుచుఁ జేతులెత్తుకొని యతిజవంబున నాకొండ కెదురుగాఁ బరువెత్తఁదొడంగెను.

ఆమెప్రవృత్తిని దిలకించుచున్నరా జామాటలకు శంకించుకొనుచు నౌరా ! ఈమెపలుకులు నా కర్థమగుటలేదు. మణి నాయొద్దనే యున్నది. ఆమెయో కొండ కెదురుగాఁ బోవుచున్నది. అని విస్మయపడుచు నావంకకే చూచుచుండ మొదట వాని కాపర్వతముతప్ప యేమియును గనుపింపలేదు. పిమ్మట నకస్మాత్తుగా నాగిరిగర్భంబున విచిత్రనవరచనామనోహరంబగు మాణిక్యమణిమందిర మొండు గోచరమయ్యెను. అందుండి మత్తమాతంగయానము ననుకరించు విలాసగమనంబున నేతెంచుచు వెనుక రాజు చిత్రపటంబునఁ జూచిన రూపమునే పోలుచు, శశిబింబశకలముల నిర్మింపఁ బడినటులఁ, జందనము బూయఁబడినరీతి, కర్పూరము జేర్పఁబడినపోల్కి, పద్మసౌభాగ్యము నింపఁబడినగతి, యమృతమున ముంచఁబడినటుల నేత్రానంద మొసఁగు స్వరూపమున నొప్పుచు, నఖకుసుమముల శోభించు చరణపల్లవసంపదచే సౌభాగ్యభూమియందు ప్రభవించిన యభినవలతవలె నలరారుచు, రతినివాసమునకుఁ గల్పింపఁబడిన చిత్రశాలవలెనే స్నిగ్ధోరుస్తంభంబులం దాల్చి కందర్పకులాలుని కర్మశాల యటుల విశాలజఘనచక్రంబున నొప్పుచు, శృంగారరససమాసాదనకై వాతిగేంద్రవిద్యయందుఁబలె గంభీరమైన బొడ్డనుమూసతో నలరారుచు, సౌందర్యదేశాంతరంబులఁ బ్రవహించు నదివలెనే పవిత్రయుతరం

గములఁ జెలంగుచుఁ, ద్రిభువనలక్ష్మియొక్క రత్నావళివలె సువృత్త పీవరస్తనయుగళంబును మాణిక్యనాయకమణుల వహించుచు, లావణ్యసాగరతీరమువిధంబునఁ జూపుమీలచే నలరారు నెన్నుగురుఁగాంచి, తారుణ్యాభనిటువీరవృత్తిచందంబున భ్రూచాపలవలయంబువహించి, బ్రహ్మాండసరోవరమందలి పద్మినివిధంబున ముఖసరోజసుందరియై త్రిభువనమనోహరముగ విధాతచే నిర్మింపఁబడి దృష్టిదోషమునకు వెఱచి యొరులు జూడకుండున ట్లీయరణ్యాగహ్వారంబున విడువఁబడినరీతి నొప్పుచు వేడుకగాఁ బుడమిసంచరించుజలదేవతచందంబునమృణాళికాభరణయై కమలవనంబునఁ గ్రీడింప వెడలిన లక్ష్మివిధంబున కరకలితలీలాంబుజయై, చల్లగాలికి సరసీతటంబున విహరించు వనలక్ష్మివలెఁ గుసుమావతంసభాసితయై, యతివిమలకాంతిచ్ఛటలకు ధారాగృహమై, కందర్పకుసుమమునకు ఫలంబై, లావణ్యవారికి తీర్థమై, శృంగారరసమునకుఁ బాత్రమై, మదనార్తి యనువ్యాధివలనఁ దెల్లనైన చెక్కులు గలిగి తారావళి నాలింగనము జేసికొనుట కెదురువచ్చుచున్న యుదయసుందరి గనంబడెను.

ఆమెం గాంచి చమత్కారముగా శిరఃకంప మొనరించుచు నౌరా! తారావళిమాటలు యథార్థములే యైనవి. ఈమృగాక్షి నిక్కముగఁ ద్రిభువనలక్ష్మికి సీమంతరత్నమే! ఈమణిని నామెదం దాల్చెదంగాక. కుమారకేసరి చెప్పినదానికన్నఁ, జిత్రపటమునఁ జూచినదానికన్న మిన్నగ నీమోహనాంగిరూపం బొప్పియున్నది గదా!

గీ. వనజగర్భుఁడు రూపసర్వస్వ మీమె
యందు నిక్షేపముగఁ జేసె నని తలంతుఁ
గానిచోఁ గార్ముకముదాల్చి కాముఁ డేలఁ
గాచియుండంగవలయు రక్షకునిలీల.

గీ. లక్ష్మి యామెయై హారాద్యలంక్రియాతి
వైభవమునకు నన్నధీశ్వరునిఁ జేసె
నీమెఁ గన నాదుకన్నుల నెసఁగు హర్ష
జలకణంబులు ముత్తెంపుసరులు గాఁగ.

చ. లలన వినిద్రచంపకదళద్యుతియం దతిలీనమై మనో
జులసదిషుప్రహారముల శోణరుచిం గను మన్మనంబు గెం
పొలయ విచిత్రవర్ణముల నొప్పుచుఁ గాంచనభూషణంబునన్
గల తరళంబువోలెఁ గడకన్ విలసిల్లునటంచు నెంచెదన్.

ఔరా! విధివిధానము! ఔరా! కర్మపరిణతిప్రభావము! ఔరా! సంసారవైచిత్ర్యము! ఇట్టిసుందరాంగి వనవాసక్లేశ మనుభవించుచుండుటయే యిందులకుఁ దార్కాణము. ఈయరణ్యమధ్యంబున నామె యెందునిమిత్తము జేరియున్నదో తారావళి కీతురఁగీరూపమేమిటికిఁ గలిగెనో నే నీచెట్టుచాటున నుండి వీరిమాటలవలన సర్వము నెఱింగెదంగాక యని నిశ్చయించి యట్లు పొంచియుండెను.

ఉదయసుందరియును జిరకాలమునకుఁ దలవనితలంపుగాఁ బ్రియసఖిం గాంచుటవలనఁ గలిగిన మహానందంబున నెదురుగాఁ బఱువెత్తుకొని వచ్చు తారావళి నధికవేగంబునఁ గలసికొని గాఢముగా నాలింగనము జేసికొనెను. ఆమెయును విస్మయోత్సుకయై ప్రియసఖ యెదపై వ్రాలి బహువిరహదుఃఖభావమునఁ గొంతతడవు మైమఱచి యుండెను. పిదప నిరువురును బ్రాంతతరుచ్ఛాయయందుఁ గూర్చుని యుండఁ దారావళితో నుదయసుందరి తనవృత్తాంత మిట్లు చెప్పెను.

ప్రియసఖీ! నాఁడు సౌధాగ్రంబున నట్లనంగతాపమున వేఁగుచు మైమఱచి శయనించి యుండి తెలివి వచ్చునరికి నే నీసరోవరతీరంబున నుంటిని. నాయూఁదల నొక దివ్యచూడామణి యలంకరింపఁబడియుండెను. దాపున మహాదేహదారుణమైన యొకవానరము

గావుండెను. ఇంతకుఁదప్ప నా కేమియుఁ దెలియదు. పిమ్మట నే నతి భయాకులితచేతస్కనై యిట్లు విలపించితిని.

అయ్యో! నే నిప్పు డెచ్చట నుంటిని? తామరపాకులపందిరి క్రింద నేను నిద్రించుచున్న యాసౌధశిఖర మేమైనది? చేరువనే నిద్రించుచున్న తారావళి యెచ్చట నున్నది? ఉదయమునకుపూర్వమే నాసమీపమున కేతెంచి సర్వదా నన్నుఁ గనిపెట్టుకొనియుండు చెలిమికత్తియ లేమైరి? ఉదయమున లేచినతోడనే నాయభివాదనము లందికొను తల్లిదండ్రు లెం దుండిరి? ప్రభాతమంగళోపగీతగర్భితమైఁ ప్రబుద్ధపరిజనారావడంబరమై, కలకలలాడు కన్యాంతఃపుర మేమైన ది? హా! దురాపనదుం డగు విధిచే నిహతురాల నయితినిగదా! ఈయరణ్య మెక్కడిది? ఈకొండ యెక్కడిది? ఈకాసార మెక్కడిది? సమీపమం దీమర్కట మెక్కడిది? అని యడలుచు నాలుగు వైపులఁ దిలకించుచుండ మనుష్యజ్ఞానము గల ప్లవగమందుండి లేచి ముందు నిబిడతరులతాడంబరమై, నికుంజాంతరితమై, యింద్రనీలమయమై యొప్పు నీగిరిభిత్తికను నిజభుజబలంబున నాకర్షించి యీడఁ దీసెను. అందు హంసతూలికాతల్పంబుచే నలంకరింపఁబడియున్న మాణిక్యభవన మొండు గోచరించెను. దానినే నాకు వసతిగా నేర్పఱచి యవ్వలీముఖంబు మదీయచరణసంవాహనాది విహితసుఖసూచకోపచారంబులవలన నాయెడదఁ గలయలజడి నుడుపఁదొడఁగెను.

పిమ్మట నాప్రాంతోపవనమందలి తరులతాదుల పుష్పములఁ గోసి సరస్సునందలి కమలకువలయంబులఁ గ్రహించి వానినెల్ల నొక పెద్దయరఁటియాఁకులోఁ బెట్టి తెచ్చి ముందుంచి నాయడుగులు బట్టి కొనియుండెను. నేను దాని యింగిత మెఱింగి, యందుండి లేచి, యా సరోవరంబున కేఁగి, జలకమాడి, యాకోఁతి తెచ్చినపుష్పములతో నిష్టదైవంబులఁ బూజించి, తిరిగి వచ్చునరికి మాణిక్యభవనంబున న

నేక నవపక్వఫలంబులు నా కాహారమునకై సిద్ధపఱుపఁబడి యుండె
ను. వానిం దిని యాఁకలి యడంచుకొంటిని. చీఁకటి పడినతోడనే
నే నందున్న తల్పంబున శయనించియుండ నాకోఁతి ద్వారదేశంబున
నిల్చి గాపలియుండెను. ఇట్లు ప్రతిదినమును జేయుచు, ఫలాదికము
నకై బైట కేఁగునప్పు డం దితరులు ప్రవేశింపకుండ నాగిరిభిత్తిని
నిలిపియుంచి నాయునికి నితరులకు గోచరింపకుండఁ జేయుచుండును.
ఇట్టి దురంతవనగహ్వరంబునఁ బడి, దిగ్భ్రమఁ జెంది, యెందుఁ బో
వలెనో యెఱుఁగకుంటిని. మఱియు నాకోఁతియెదుట యెందైనఁ
బోవ నడుగుఁదీసి యడుగైనఁ బెట్టుటకు వీలులేదు. అతిబలసంపన్నుఁ
డగు నగపవివరుం డాశ్రయించియున్నకతంబున నీయరణ్యంబునందలి
వనజంతువు లెల్లను నిలువఁజాలక భయంబున దూరముగాఁ బాఱి
పోయినవి.

మ. వనమం దిట్లనిలార్కసత్కరసంపర్కంబు మాత్రంబె నేఁ
గనుచున్ వానరరక్ష గాసివడుచున్ గాఢాంగజాతాగ్ని పీ
డను గాసారమృణాళపద్మముల జాడన్ గొంతశాంతించుకొం
చును దైవాధికనిర్ణయంబు గనుగొంచున్నే వసింతున్ గదా.

కాని యాప్లవగపుంగవుఁ డెవ్వరో, యెందుకొఱకు నాసమ
క్షమునుండి యిట్లు సంరక్షణ మొనర్చుచున్నాఁడో, నే నిట్లిచ్చట
కు రాఁగలిగితినో, నా కేమియును దెలియదు. నేఁడు వాడుకవడువున
నీకాసారమున స్నాన మొనరించుచుఁ జూడామణిని దీసి దేవపూజకు
వేళ యతిక్రమించుచున్న దను తొందరతో దానిని చీరచెంగునఁ
జుట్టిపెట్టి వదులుగ ముడివైచితిని. పిమ్మట దేవపూజ నిర్వర్తించు
కొని త్వరితగతిఁ బోవుచు దానిమాట మఱచితిని. అమ్మణి బరువు
వలన వసనాంచలమునుండి జాఱి యెందో పడిపోయెను. ఇచ్చటఁ జే
రినపిదప నారత్నముమాట దలఁపునకు వచ్చుటయును దానిని వెదు

క దూర మరుగనక్కఱలేదుగదా యనియును నే నం బేఁగినను సా
యము వచ్చు కోఁతి నేఁ డవ్వనిచేతనో బాధింపఁబడిన ట్లతిశ్రీయం
బున నేతెంచి యలసి నిద్రించుచుండుటచేత దానిని లేవ నిచ్చగింపక
యేకాకినై యిప్పు డిచ్చటి కేతెంచితిని. ప్రియసఖి ! సంక్షేపముగా
నీవృత్తాంతముగూడఁ జెప్పుము. నన్ను విడచినదిమొదలు నేఁటివఱకు
నీ వేమిచేసితివో, యశ్వరూపమున నిచ్చట కెట్లు వచ్చితివో వచింపు
ము. నీ కిచ్చటనయిన నామనోహరుండు గనంబడనేమో చెప్పుమని
ససంభ్రమంబుగ నడుగుచున్న యుదయసుందరికి తారావళి నిజవృ
త్తాంత మిట్లు సంగ్రహముగాఁ జెప్పఁదొడంగెను.

సఖీ ! వినుము. నాఁటియుదయంబున నిద్రనుండి లేచి నిన్నుఁ
గాంచక మిగుల దుఃఖించుచు నీతల్లిదండ్రుల కీదుర్వార్తఁ దెలియఁ
జేసితిని. మీతండ్రి శిఖండతిలకుండు నిన్నన్వేషింప నెల్లలోకములకు
దూతలం బుచ్చెను. నేను స్వయముగా నిన్నన్వేషింప బయలుదేరితి
ని. ఒక్కచో నన్నొక్కరక్కసుండు జూచి మదనమోహితుండై తీసు
కొనివచ్చి నిగ్రహింపఁబూన నీహృదయనాయకునిచే సంరక్షింపఁ
బడితిని. వాని కుల గోత్ర నామ నివాసంబు లెఱింగితిని. ఆయనసఖుం
డు కుమారకేసరిని నాకుఁ జూపి వానివృత్తాంతము జెప్పి నీకుఁ బ్రా
ణపదంబయిన చిత్రపటమును గూడఁ జూపించెను. దానిని నేను చూ
చినతోడనే భవద్వియోగదుఃఖము నాకు ద్విగుణిత మయినది. నీ
యందలి యనురాగంబున వలవంతఁబడుచున్న నారాజేంద్రుని జూడఁ
జాలక యారాత్రియెట్లో వెళ్ళించి తరువాతఁ బుష్పావచయనెపంబు
న బయలుదేరి యాపురంబు విడచి నిన్ను వెదకుటకుఁ బోతిని. ఇ
మ్మాట నే ననేకగ్రామాగ్రహారపురపత్తనంబుల వెదకుచు నతివేగం
బున నంతరాళంబున నరుగుచు నొకచోట మధ్యాహ్నతరణితీవ్రాత
పంబున విహ్వలనై భ్రమభరాలసంబులగుచూపులకు ముందెల్ల నంధ

కారమై గనుపింప నెందయిన విశ్రమింపనెంచి యొకపర్వతశిఖరము
నకు దిగితిని. అం దొకముహూర్తకాలము గడపినపిమ్మట డప్పిచేఁ
బెదవు లార నీర్వట్టుకొని కందండుఁ జూపులఁ బఱపితిని. ఆకొండ
కొనయందు దూరముగా నొకమారుమూల ఘనలతాగుల్మములఁ బి
హితమై గరుడునిముక్కునుండి జాఱిపడిన యమృతభాండమునుండి
కాఱిన సుధవిధంబున మధురజలంబు గలిగి తాండవకేళీలోలుఁ డైన
బాలేందుమౌళి జటామండలినుండి తుళ్ళిపడిన గంగాంబుపటలంబు
వలె నొప్పుచు, బ్రహ్మదేవునిచేతినుండి పడిన కమండలుపాత్రమువలె
నలరారుచు, కల్పాంతవాతమువలనఁ ద్రెళ్ళిపడిన చంద్రబింబమువలెఁ
బ్రకాశమానమై, గట్టులొరయుచుఁ జిన్నచిన్నయలలతో నొప్పు జలా
శయ మొండు గనంబడెను.

దానిం గాంచి యతిహర్షంబున నచ్చోటి కేఁగి డప్పికం దీర్చు
కొన ముక్తామరీచిసంచయస్వచ్ఛమై యతిశీతలంబులగు నాజలంబులఁ
బుడిసిళ్ళం గ్రహించి కడుపునిండఁ గ్రోలితిని. ఆజలము గ్రోలినతోడ
నే నేను తొంటిరూపము విడచి యశ్వము నయితిని. నిముసమాత్ర
మచ్చట నుండి నన్ను నేఁ దలంచుకొని యిట్లు విచారించితిని.
ఔరా! ఇట్లు దేహపరివర్తన మొనరించు జలంబులమాటలు పూర్వ
ము మునులు జెప్పిన పురాణగాథల నాకర్ణించియుంటిని. అన్నా!
మందభాగ్యురాల నై డప్పిగొన్న నా కీనీర్వట్టేమిటికిఁ గనంబడవలె?
కనంబడెనుపో దీని నేమిటికి సమీపించితిని? సమీపించి వెంటనే
యిందలినీ రేమిటికిఁ ద్రాగవలెను? త్రాగినవెంటనే నోటిలోఁ జేయి
వెట్టుకొని వమన మేమిటికిఁ జేసికొననయితిని? ఆహా! విధివిధాన
మతివిచిత్రముగదా! అని యనేకరీతులఁ జింతించుచు నాకొండక్రిందఁ
బుడమిపై సరసదూర్వాప్రవాళశాద్వలం బగు తృణాస్తంబంబును
గాంచి యాఁకటిచిచ్చుఁ జల్లార్చుకొననెంచి దానిపై బొరలితిని. పై

నుండి యట్లు భూమిమీఁదం బడినతోడనే నాకుఁ బూర్వజ్ఞానము గో యినది. పిదప నే నెచ్చట నుంటినో, యెం దే గితినో, యెందెందుఁ బరిభ్రమించితినో, యెవనిచే నే నిచ్చటకుఁ దీసికొని రాఁబడితినో, యెట్లు నిజస్వరూపము నందఁగలిగితినో, నా కేమియును దెలియదు. కేవలము దైవ మనుకూలుఁ డగుటచేతనే మన మిందుఁ గలిసికొనఁ గలిగితి మని యత్యంతసంతోషమునఁ బలికి యూరకుండెను.

అప్పు డాయుదయసుందరి ప్రియసఖీ! తారావళీ! నాకొఱ కెంతకష్టపడితివి? నామనోవిషయనాయకుని యన్వయనామవసతులు నీ వెఱింగియున్నను, వానిని నీవు చూచియున్నను దైవవిధివలన ని టుల మనము వానికి దూరమై యుండవలసివచ్చెను. నామనోహరుండు మనకుఁ దిరుగఁ గనంబడునా? అయ్యో! ఎట్లగపడును? ఎపుడు గనంబడునని విలపించుచు విషాదోద్రేకంబున వివశయై పడిపో యెను. తారావళి యడలుచు హా! ప్రియసఖీ! హా! నిజవంశవైజ యంతీ! హా! కందర్పవిజయలక్ష్మీ! హా! త్రిభువనాలంకారముక్తా మణీ! ఏమిది? ఇట్లచేతనురాలవైతి వేమి? అస్తంగతమైన చంద్ర బింబమువలె జగమునంతయు నంధకారబంధురముగ నొనర్చుచుంటివి గదా? హా! హా! యెంతమోస మెంతమోస మని ప్రలపించుచు మొగముమీఁద జల్లుటకై నీళ్లనుగొనివచ్చుట కతిరయంబునఁ బరువెత్తుకొనిపోయెను.

అప్పుడు రాజు మనంబున దిగులొంది యౌరా! నే నిప్పుడు ప్రచ్ఛన్నముగా నుండుటఁ దగదు. నాయొద్దఁ గల మణి దేహపరి వర్తనవికారము బోఁగొట్టఁగలిగినప్పుడు మూర్ఛాది దోషముల నెందులకుఁ దొలఁగింపఁజాలకుండు నని తలంచి సత్వరమ లేచి చేతి యం దామాణిక్యమును బట్టుకొని యుదయసుందరిసమీపమున కేఁగి యామెహస్తమును మణిచేఁ బ్రకాశించు నిజకరంబున గట్టిగాఁ బట్టు కొనెను.

గీ. మణి శరీరము సోఁకినమాత్రముననె
మూర్ఛవిడనాడి కన్నులమూఁత విప్పి
లేచి యాలేమ కాంచెను లీలఁ దనదు
కరము గ్రహియించియున్న భూకాంతు నెదుర.

గీ. వానిని మనోధినాథుగా వనిత యెఱుఁగ
నెడద ననురాగరసమెల్ల నెసక మెసఁగె
దాని తెఱఁ గిట్టిదని చెప్పఁ దరముఁగాదు
హరిహరహిరణ్యగర్భాది సురలకైన.

గీ. నవకటాక్షబిసంబుల నువిద తృషిత
యల్లి వానిరూపామృతం బానఁ దొడఁగె
నంగజాగ్ని వాడినవాని నవనినాథుఁ
డడరి నిజసాంద్రదృష్టులఁ దడుపుచుండ.

గీ. వారి నూత్నసంయోగోత్సవప్రమోద
లోలములునైన యపాంగవిలోకనములు
గలియ నొండొంట నెదుర రాగంబు హెచ్చి
రాకపోక లొనర్చె హృద్రథ్యములను.

అప్పుడు వారు మదనశ్రమజలంబున మంగళస్నానము లొనర్చి, మణిసనాథంబగు కరంబునఁగరంబు గీలించుకొనియుండి పార్శ్వంబులం దిరుగు ద్విజోద్ఘోషంబు వేదమంత్రస్వనంబుగాఁగఁ బాణిగ్రహణోత్సవం బందిరి.

ఆసమయంబున జలోర్మిశిఖరశీకరనికరంబులును, తరులతాప్రవాళకుసుమంబులును గాలిచే వారిసమీపమునఁ బడి జలవనాధిదేవతలు వధూవరులపై నభినందించుచుఁ జల్లు సేసలవలె విలసిల్లెను. అట్టియుత్సవంబున నుదయసుందరి నెమ్మనఁ జెమ్మటలు గ్రమ్మ గగుర్పాటు లొదవ శరీరము గంపింప సిగ్గుచేఁ దలవంచుకొని మందహాస

భాసురముఖారవిందయై, యోహో! నన్ను విడచిపెట్టుఁడు. విడచిపెట్టుఁడని మృదుమధురభాషణంబులఁ బలుకుచుఁ జేయి లాఁగికొనఁ బ్రయత్నించెను. రాజోత్తముండును సహర్షుండై మందస్మితం బొనర్చుచు ననురాగ మిగురొత్త నర్మసందర్భమున నామె కిట్లనియె.

గీ. సుందరసరోజకోమలం బందియున్న
కర మిదేలను లాఁగికో గడఁగె దబల
చిరతరాపేక్ష నా కిందు దొరకె దీని
నెట్లు విడతునో చెప్పుమా యిందువదన?

ఇంతలో నబ్జినీపలాశపుటంబున నీరుగొని యతివేగంబున నేతెంచు తారావళి దూరమునుండి యారాజేంద్రు నీక్షించి యమందానందకందళితహృదయారవిందయై వారికలయిక కభినందించుచుఁ బెద్దయెలుంగున నోహో! సమస్తజగదాజీవనైకకారణులగు దేవర యేకాకియై యెచ్చటినుండి యెట్లిచ్చటి కెందుల కేతెంచితిరో యెఱుంగఁ గోరుచున్నా నని సవిస్మయోద్రేకంబునఁ బ్రశ్నించుచుఁ దాఁ దెచ్చిన నుదకంబు మంగళప్రదంబుగ వారిరువురిమీఁదఁ జలికెను. రాజును ముదమందుచు విశ్వభూతిశిష్యురాలు తనసమీపమున కేతెంచినది మొదలు జరిగిన నిజవృత్తాంతమెల్ల నామెకుఁ దెలియఁజేసెను.

## 341 వ మజిలీ.

ఇంతలో నాకసమునుండి పడిన పిడుగుచప్పుడువలెఁ గఠోరమై యసురసంహారసంరంభకుపితయగు కాత్యాయనీదారుణహుంకారమువలె భయంకరమై, యక్షవధపరిధావితుండగు పవననందనుం డొనర్చు కిలకిలారావమువలె భాసురమై, శత్రువర్గము నరుమాఱునప్పుడు భీముం డొనర్చు సింహనాదంబువలె భీకరమై, ప్రతిశబ్దితాద్రికందరగహ్వరమై, యాకులీభూతసకలజలసత్వమై, యుత్త్రాసితవనశకుంత

మై యొప్పు భయంకరహూంకార మొనర్చుచు, బ్రహ్మాండ మండలమున కెల్ల వణఁకుఁ బుట్టించుచు, నుదంచితచపేటంబున స్తలంబును బ్రద్దలుగొట్టున ట్లొప్పుచు, దిక్కుల నెల్ల లాంగూల వలయంబున నరికట్టుచున్నట్లు గనిపించుచు, రోషానలజ్వాలితములగు చూపులచేఁ బుడమిని భస్మమొనరించునట్లు దోఁచుచుఁ, బండ్లు పట పటం గొఱుకుచు, భయంకరదర్శనుండై నిద్రనుండి లేచి, తారావళి వలన నభినందింపఁబడుచు నుదయసుందరిని జేపట్టియున్న రాపట్టిని దూరమునుండియే చూచి మహాక్రోధంబున నందుండి యొకగోలాం గూలుం డతిరయంబున నారాజేంద్రుసుప్రమోల కేతెంచి వానిభుజము ను బట్టి లాగఁదొడంగెను.

అప్పుడు భయకంపితయై యుదయసుందరి యిట్లని విచారించె ను. అన్నా! దురాత్ముండగు దైవమువలన నిహతురాలనైతినిగదా. మన్మథశరవ్యాఘాతమూర్ఛితనై యీశోఁకిం యిం దున్నదనుమాట మఱచిపోతిని. చిరకాలమున కిష్టజనులఁ గలిసికొనిన సంతోషరసము న మత్తతం జెంది యిం దది నిద్రించుచుండుట యించుకయును విమ ర్శింపనైతిని. అనురాగాంధకారమునఁ జిక్కుకొని యిచ్చటి కేతెంచు నీదుష్టవనచరముజాడనైనఁ గనిపెట్టఁజాలనైతిని. అయ్యో? ప్రియ సఖీ! తారావళీ! ఇం దేమికీడు మూడనున్నదో గదా! ఏయుపా యంబున నీయాపద దాటఁగలమో సత్వర మాలోచింపుము. ఓవసుం ధరాదేవీ! చిరకాలమునుండి వీనిచేఁ బరిపాలింపఁబడుచున్న నీ విట్లు స్థిరత్వమును బూనుట సమంజసమేనా? ఓయుదధినాథా! నీతనూజ యగు లక్ష్మికితండు పతిగదా! యేమిటికిట్లు జడత్వము వహించెద వు? ఓదిక్పాలులారా! సకలదిగ్విజయం బందు వీనిచే మీనగరము లు సంరక్షింపఁబడెను. మీ రేమిటి కట్లు దూరముననుండి యూరక చూచుచుండెదరు? ఓహో! సూర్యుఁడా! తేజంబున నీవీతనికి సో

దరుఁడవు. ఇట్లు నీవేమిటి కుదాసీనుఁడవై తిరిగెదవు? మీరెల్లరు నేకమై యీదుష్టవనచరాధమునిచే హింసింపఁబడుచున్న యీజగదేకనాయకునిసమక్షమున కేతెంచి ఏనిపక్షమై యుండరేమిటి కని యుదయసుందరి యత్యంతభయాకులయై గడగడ లాడుచుండెను. అప్పు డాభూతలేంద్రుం డిట్లని వితర్కించుకొనెను.

ఔరా! వీఁడు సామర్థ్యవిహీనుఁడు. సత్వశూన్యుఁడు. వృథావచపలుఁడు. కాతరనిదర్శకుండు. ఇట్టి వీనిపై త్రిభువనశ్లాఘనీయమానవిక్రముండనగు నే నెట్లు శస్త్ర మేయఁగమకింతును? నే నూఱకున్న నీ లతాంగిభయం బుడుగనేరదు. కావున వీని నిగ్రహించెదంగాక. ఉచితప్రహారంబున వీని మూర్ఛితుం జేసి యీకొమ్మం గొనిపోవలయు నని నిశ్చయించి దక్షిణపాణి నెత్తి యాకోఁతిచెంపమీఁద గట్టిగాఁ జఱచెను.

గీ. తోడనే కోఁతిరూపంబువీడి దివ్య
పురుషదేహ మంది కిరీటభూషణాది
కమును దాల్చి విమానయానమున దివ్య
సతులు గొల్వఁగనుండి భూపతిని బొగడె.

అట్లు సాధువాదంబు లొనర్చుచు రాజున కిట్లనియె. ఓ క్షితీశతిలకా! నీయనుగ్రహంబున నేను నిజస్వరూప మందఁగలిగితిని. పోయివచ్చెదను. నానివాసమున కరుగుట కంతరాళమున నెంతవిలంబ మగునో యెఱుంగను. కావున నేఁ బోవుట కనుజ్ఞ నొసంగుము. ఓ పుండరీకరాజేంద్రా! మనుజభువనైకచక్రవర్తినీ లక్షణలక్షితయగు నీయంగనామణిని దేవేరిగాఁ బరిగ్రహించి నిజనివాసంబగు ప్రతిష్ఠాన నగరంబున కరుగుము. నీకొఱకే విధివలన సృజింపఁబడిన యీయన్నులమిన్న నింతదనుక నే నిందుఁ గాపాడుచుంటి నని పలుక నా రాజేంద్రుండు విస్మయ మందుచు నింపుగొలుపు పలుకుల వాని కిట్లనియె.

ఓవివేకచూడామణీ! నీ వెవ్వరో తెలుపుము. ఇట్టిదివ్యాకృతి ని బాసి వనచరుండవై యేమిటి కాపదపాలైతివి? ఈమృగాక్షి నం దుకొని కిందు సంరక్షించుచుఁ గష్టపడుచుంటివి? ఈమె కెందు నిమిత్త మిట్లు వనవాసదుఃఖము గలిగించితివి? నాకరప్రహారంబున నీ కెట్లు పూర్వరూప మబ్బఁగలిగెను? నాపేరును నానగరము పేరును నీ వెట్లు తెలిసికొంటివి? ఈమహాపర్వత మెయ్యది? అంభోధిసోదర యగు నీసుందరసరోవరము పే రెయ్యది? మఱియు నీమాణిక్యభవన మేమిపేరున నిర్మింపఁబడినది? అని యిట్లు ప్రశ్నించు నృపతిలకున కాదివ్యుం డిట్లనియె.

భూమీంద్రచంద్రా! చెప్పెద నాకర్ణింపుము. ఈలోకమున మేరుభూధరవప్రోపకోణమందు దివ్యభువనంబులఁ బ్రసిద్ధికెక్కిన కోశా తకి యను విద్యాధరపురం బొండు కలదు. దానికి నే నేలికను. తారాకిరీటుఁడను విద్యాధరుఁడను. అంధకవిపాటకుండగు పరమేశ్వ రుండు పాతాళంబున హాటకేశ్వరుండనఁ బ్రసిద్ధికెక్కియుండెను. వాని ని సేవింప నేను బ్రతియష్టమీచతుర్దశుల నం దేఁగుచుందును. ఒక యష్టమినాఁడు వాడుకవడువున నాదేవుని దర్శింప నటకేగి యందు భక్తాభీష్టఫలకల్పపాదపుండగు జండీశుని భక్తితో నర్చించి యాదిన మంతయు నందుఁ గడపి కృతకృత్యుఁడనై యారాత్రి నాగలోకము విడిచి పోవుచు నొకచో సముద్రాంతర్ద్వీపమందు వెన్నెలలోఁ దెల్ల ముగఁ గన్పట్టుచున్న యొక సౌధాగ్రమునఁ బచ్చనియాకుపందిరి క్రిందఁ బూసెజ్జపై బవళించియున్న యీయామె నీక్షించితిని. దూరము నుండియే యామెవదనము నీక్షించి యిట్లు వితర్కించుకొంటిని.

ఉ. అది రోలంబకదంబకావృతశిరంబై విప్పు పద్మంబొ? యు
యెయ్యది నూత్నాచమనీలిమాంకశుభగంబౌ చంద్రబింబంబొ? తె
శది నిక్కంబుగ మానినీకురుల జాలాక్రాంతమౌ మోమొకో?
అదిరా! యిట్టివిచిత్రసృష్టి విధివిఖ్యాతిన్ దగన్ గాంచెడిన్.

అట్లు ముద్దుగుమ్మయని నిశ్చయించి యనేకసురలోకనాయికోపభోగక్రీడాకృతార్థమైన మన్మనంబా త్రిభువనమోహనాకారమును గాంచినతోడనే తద్వశంవదమయ్యెను. అప్పుడు నేనిట్లుతలంచుకొంటిని. ఈబాలికాభరణ వివాహితకాదుగదా? కన్యకయేయైనను ననురాగంబునస్వయముగా వరించి వచ్చినప్పుడుగాని యీమెతలిదండ్రులొసంగినప్పుడుగాని పురుషుండు పరిగ్రహింపఁదగును. ఈమె వివాహితయేయైనచోఁ బరాంగనయై యగమ్యయగునుగదా? శిశిరోపచారపరిచయంబు గలిగియున్న నీమెను బూర్వానురాగముగల ప్రియతముని నెడఁబాసి విరహార్తిఁ బడియున్న పరాంగనఁగా భావింతునని దలంచుచు నంతలో వివేకమెడల మైమఱచితిని. వంశమర్యాదల మఱచితిని. సుకృతపథంబు మఱచితిని. గురూపదేశముల మఱచితిని. లోకప్రవృత్తుల మఱచితిని. కేవలము దురాత్ముండగు మన్మథహతకునిచేఁ బ్రేరితుండనై, దుష్కార్యాచరణపరాయణుండనై, నరకగతివలన సంజ్ఞితుండనై, యపయశోకలంకమున నభ్యనుజ్ఞాతుఁడనై, యిదియే వివేకము, యిదియే వంశమర్యాద, యిదియే సుకృతమార్గము, యిదియే గురూపదేశతత్వము, యిదియే లోకప్రవృత్తి యనిదలంచి సంసారమును సఫలంబుగఁ జేసికొందునని నిశ్చయించి నిద్రనుండి లేవకుండఁగనే యొరు లెఱుంగకుండఁ గొనిపోవ నెంచి సమీపించి ప్రవాళతల్పంబున నిద్రించునామె నెత్తుకొనివచ్చి నావిమానమునఁ బరుండఁబెట్టి యలబ్ధలాభమును గాంచినట్లు సంతసించుచు నంతరిక్షమార్గంబునఁ బోఁదొడఁగితిని. అంబరమున నున్న శశాంకబింబమును విమానమం దున్న యీమెముఖంబును మాటిమాటికిఁ జూచుచు నిట్లని దలంపసాఁగితిని.

గీ. అమలమగు నీలమణిఫలకమును బోలు
  గగనమున వెల్గు శశిబింబకమును గాంచి

తలఁచితిని నావిమానమం దలరు చెలువ
వికసితోజ్జ్వలాస్యప్రతిబింబమనుచు.

గీ. ఇందుఁ డితఁడు లతాతన్విసుందరాస్య
సంపదలకోఁడి లోఁ గలుషంబు బూని
వెన్నెలమునుంగుఁ దాల్చి ప్రచ్ఛన్నగతిని
రాత్రులఁ జరించుచుండెఁ దాఁ ద్రపవహించి.

గీ. ముజ్జగంబుల నీరూపమునకు సాటి
యైనమానిని లేదని యబ్జభవుఁడు
వ్యోమభూమిని ఖటికతో నొరులరావ
మునకు నున్నఁజుట్టినయట్లు దోఁచెను విధుండు.

ఆహా! నిద్రచే నేత్రములు మూసికొని యున్నను ఈమెముఖ సౌందర్య మెంతయొప్పిదంబుగ నున్నది? అంతస్తాపంబునఁ జివురుసెజ్జం గూడ దహించుచున్నను ఈమెశరీర మెంతలావణ్యభూయిష్టమై యున్నది! శిశిరోపచారచందనజడీకృతము నైనను ఈమెయవయవములకాంతి యెంతయద్భుతముగ నున్నది? అని యిట్లు ప్రశంసించుచు నామెయందే బుద్ధినిలిపి ముందు విమర్శింపకుండ నేను బోవుచుండ ఈపర్వతశిఖరముపైన గగనగంగాతటంబునఁ దపం బొనరించు నొకమహర్షి మీఁదుగా వానిశరీరము నొరసికొని నావిమానమఱిగినది.

అందులకుఁ గుపితుఁడై యామునీంద్రుండు క్రూరదృష్టుల నాపై బఱపుచు నోరోరీ! చపలుఁడా! నీచపలస్వభావమునకుఁ దగినఫల మతిశీఘ్రముననే యనుభవింతువుగాక. నీయవివేకమువలనఁ గలిగిన పాపంబుమూలమునఁ జపలమర్కటమవై వనపశుత్వంబు నందుమని శపించి యెదుర విమానమందున్న నబల వీక్షించి సర్వవిదుం డగు నతం డించుక ధ్యానించి సమస్తమును దెలిసికొని ససంభ్రమంబున నిట్లనియె. ఓరీ! పాపాత్మా! దుష్టబుద్ధివై స్త్రీరత్న

ము నపహరించుకొని పోవుచుంటివా! ఈరవిస్పృగమను పర్వతమూ
లంబున నున్న కువలయామోదమను సరోవరప్రాంతకాంతారముననే
యుండి యీమెను నీవే సంరక్షించుచుండుము. మఱియును మద్వచః
పరిభావంబున నాగిరిగర్భంబున మనోహరమగు మాణిక్యభవనమొండు
గలుగఁగలదు. దానియందీమెనుంచి కాపాడుచుండుము. అని వచించి
తలంపుమాత్రముననే సన్నిహితమైన యొకదివ్యమణిని గైకొని యి
య్యది సముద్రాంతంబున సుధాహరణంబునందు సంభవించిన కిరణ
కోశమను రత్నము. సకలవిషవికారమూర్ఛాంగపరివర్తనాద్యశేషా
పాయములఁ దప్పింప సమర్థమయినది. ఆపదలగు నెలవగు నీవన నివా
సంబున దీనిం బడఁగుట శ్రేయస్కరమని ప్రియముమీఱ బలుకుచుఁ
నామెకుఁ దీనిని జూడారత్నముగా నొసంగి యూఱడించెను.

అప్పుడు నేను వానిదుర్వారశాపోక్తుల విని దుర్భరదవానల
జ్వాలలం బడు వనవృక్షములట్ల తోడనే వివర్ణుడనై పరయువతీ
రత్నాపహారపాపంబునకు ఫలంబు గంటినని పశ్చాత్తాపమందుచు
నవనమితమౌళినై యామునీంద్రునకుఁ బ్రణమిల్లుచు వినయంబున
నిట్లంటిని. మహాత్మా! శాంతి వహింపుము. అజ్ఞానతిమిరంబునఁ
గన్నుఁగానక వివేకవిహీనుడనై యధర్మంబునఁ బ్రవర్తించిన నాకు
కరుణాంతరంగుడవై శాపాంతమును బ్రసాదింపుమని ప్రార్థింప నా
మునీంద్రుండు దయార్ద్రహృదయుండై తల పంకించుచు "సరే, కా
నిమ్ము. ఈయరణ్యంబున నీమెను ప్రతిష్ఠానగరాధీశ్వరుండగు పుండ
రీకరాజేంద్రుం డెప్పుడు చేపట్టి నిచెంప వాయఁగొట్టునో యాక్షణ
ముననే నీకు శాపాంతమగునని నన్ననుగ్రహించెను.

పిదప నే నామునీంద్రుని యానతి తలం దాల్చి తోడనే
కోఁతినై యిమ్మణిభవనంబున నీమెను సంరక్షించుచు భవదాగమన
మును బ్రతీక్షించి యుంటిని. నేఁటికి నాపుణ్యవశంబున నీ వేతెంచి

నాశాపదోషమును బోఁగొట్టితిని. సహస్రావర్తము రవిశృంగమనియును సరోవరము కువలయామోదమనియును మునీంద్రుని మాటలనో[illegible]ని మనవిచేసియే యుంటిని. ఈమణిమందిరము వానియాజ్ఞాసిద్ధమైనదని కూడ మనవిచేసికొనియుంటిని. ఓలోకోపకారపరాయణా! పుణ్యాత్మా! నీ వడిగినవృత్తాంత మెల్లఁ జెప్పితిని. ఇఁక నాకు సెల వొసంగుమని వచించి యారాజేంద్రు ననుమతంబు వడసి యావిద్యాధరుఁడు మింటికెగసి నిముసములో నదృశ్యుఁ డయ్యెను.

## 342 వ మజిలీ.

## పుర ప్రవేశము.

అట్లు మర్కటరూపమును విడచి నిజవృత్తాంత మెఱింగించి విద్యాధరుఁ డఱిగినసిమ్మట నారాజశేఖరుండు నల్దెసలఁ బరికించుచు నభీష్టయువతీసంగ మాభినందనపురస్సరంబుగ నిట్లని విచారింపఁ దొడంగెను. అనుకూలదైవప్రభావంబున నాప్లవంగము ననుసరించి వచ్చి నే నిచ్చో నాప్రాణేశ్వరి నత్యద్భుతంబుగఁ గలిసికొనఁ గలిగితిని. ఇష్టజనవియోగదుఃఖము దప్ప మఱొకకష్ట మేమియు నీవఱ యనుభవించియుండలేదు. ఈమహారణ్యము దిక్కులనెల్ల నాక్రమించుకొనియుండుటచేఁ బుడమిలో నీప్రదేశ మెచ్చటిదో తెలియకున్నది. ప్రతిష్ఠానసగర మేదిక్కున నెంతదూరములో నున్నదో నేనించుకయును గ్రహింపఁజాలకున్నాను. అదృష్టవశంబునఁ దారావళికూడ యిచ్చటనే యున్నది. ఆమె యంబరమునఁ దిరుగుశక్తిఁ గలిగియున్నను నబలయగుటచే సంతోషమున మైమఱచియుండెను. కావున నిప్పుడు దిక్కుల నిర్ణయింపనేరదు. జంతుసంచారశూన్యంబగు నిక్కానసంబున నేదిక్కునకుఁ బోవలెనని యడుగుటకుఁ గూడ మనుష్యుఁడెందును గోచరింపఁడు. ఈయడవి దాటిపోవుట కుపాయ మేదియును దోఁపకున్నది. ఆవిద్యాధరునికథ వినుచు మారుధోరణింబడి వాని నీ

మాట యడుగుటయే మఱచిపోతిని. అంబరమున సంచరించుచు ఖేచరు
లు సాధారణముగా భూలోకమందలి పట్టణంబుల నెల్ల నెఱింగియుం
దురు. ఆవిద్యాధరుఁ డిట్లు పోవుచు నన్నిదే నీయాటంకమునఁ జదల
నింకను నిలచియున్నాఁడేమో పరికించెదంగాక యని తలంచుచు
దిక్కోటికలో గగన మరీక్షించుచుండ సర్వోత్కృష్టసంగతమై, యేకపరి
మాణమై, యేకరూపమగు స్వరూపములతో, నుదారపక్షములతో
నొప్పు పక్షియుగళమొకటి నాకగోచరించెను. చూచుచుండఁగనే
యది పక్షిభావమును విడచి సుందరపురుషస్వరూపంబులఁ దాల్చి
గగనమునుండి భూమికి దిగి ప్రియురాలిం గూడియున్న నరేంద్రుని
దూరమునుండియే చూచి రయంబున నికటంబున కేతెంచి వారిరువు
రకు నమస్కరించెను.

మీ రెవరని యాభూపాలుని విస్మయంబున నడుగ నందొకండు
కృతాంజలియై వినయంబున నిట్లనియె. దేవా ! విశ్వోపకారాంతర
మగు కామినీరత్నమును వెదుక నాఁడు బంపఁబడిన భవదీయాదే
శానుసారుండను నేను మాయాంబుజుండను నిశాచరుఁడను. ఇతఁడు పాతా
ళనాయకుండను శిఖండమాలునకాప్తుఁడు. డంభోళియను భుజంగ
వీరుఁడు. స్వామియాదేశమున భరతవర్షంబున నిమెను వెదకుటకు
వచ్చినవాఁడు. నేను తమ యానతి పాతాళమును వనంబును
నామూలచూడగ వెదకించి యీభూలోకమున కేతెంచి తిరుగు
చుండ సౌరాష్ట్రదేశమందలి ప్రభాసతీర్థంబున నితండు నాకుఁ గని
పించెను. అందనవరతయాత్రార్థ జనసమ్మర్దంబున దుర్ద
ర్శనుండనై దర్శనమాత్రంబుననే యర్థులకోర్కెలీడేర్పఁగల శ్రీసోమ
నాధేశ్వరుని నిష్టార్థసిద్ధికై ప్రస్తుతించు సందర్భంబున మేమిరువుర
మొక్కపనిమీఁదనే తిరుగుచుంటిమఁ దెలిసికొని మిత్రులమైతిమి.
నాఁటినుండియు స్వేచ్ఛావిహారమున తమరూపము గనుచుంటిని బహుళమె

సంచరించుచు నిం దనింద్యజలశకుంతకూజితారావసూచితమై యొప్పు సరోవరము నీక్షించి యంబరంబునఁ దిరుగుచుండుటచే మేమిరువురము శ్రమఁజెందిచల్లని యీమహాసరస్తీరంబున నించుకవిశ్రమింపనెంచి మనుష్యరూపంబులఁ దాల్చి యిచ్చటికే తెంచితిమి. తోడనే భాగ్యవశంబున వధూసమేతుడవై యున్న నిన్నీక్షించి దంభోళి కెఱింగించితిని. అభీష్టవరలాభంబునఁ జెలఁగియున్న యతఁడు మిన్న తనయేలిక కన్నకూఁతురని యతండు సచించెను. మాకోరిక సిద్ధించెను. మామనోరథము ఫలించెను. వేయేల?

మ. అతిలావణ్యముచేత నింపెసఁగు నీయబ్జాక్షితోఁగూడి యు
న్నతరీతిన్ గను నిన్నుజూచి తలఁతున్ గౌరీయుతుండౌ జగ
త్పతిరీతిన్ శచితోడి యిందురిగతి నాపద్మాలయాయుక్తుఁడ
చ్యుతులీలన్ ధరణీతలేందు! మదిలో నుత్సాహమేపారఁగన్.

అనివచింపపుండరీకుండు తా నాదుర్గమారణ్యంబున నుదయసుందరిని గనుంగొనినవిధానమంతయును మాయాబలున కెఱింగించి వానికి ముదముగూర్చెను. మఱియు నాదు స్తరారణ్యమధ్యమునుండి వెడలి ప్రతిష్ఠానపురంబును జేరుకొనఁ దగుతెఱవు నిఖిలమాయాప్రయోగనిపుణుండనగు నీ వాలోచింప నలయునని యా రాజేంద్రుం డనినతోడనే యామాయాబలుం డదృశ్యుండయ్యెను.

తోడనే నిమలమణికింకిణీచక్రినాకపూరితమై స్వర్ణనిర్మాణరమ్యమై యొప్పుగులుగు విమానమొండు వారియెదుట నిలచెను. అప్పు డశరీరవాక్కు లిట్లు వినంబడెను. ఓహో! క్ష్మాపాలపుంగవా! నేను మాయాబలుండను. గగనమార్గంబున మిమ్ముఁ బ్రతిష్ఠానగరంబునకుఁ గొనిపోవ మాయచే విమానముగమారి మీయెదుట నున్నవాఁడను. దీని నధిష్ఠించినతోడనే మిమ్ము మనోవేగంబున మీనగరమునకుఁ దోడ్కొనిపోఁగలవాఁడ

నని మాయాబలుం డదృష్టమూర్తియై పలికినమాటల నాలకించి యత్యంతానందమును బొంది మనంబునఁ గలంకమునుబాసి దంభోళినందుండియే పంపివేయ నుద్దేశించి యుదయసుందరినంక జూచెను.

ఆమెయును బ్రాణేశ్వరుని యింగితమెఱింగి దంభోళివలనం దారావళి తమ బంధువుల యోగక్షేమము లెఱింగించిపిదప సత్యాదరంబున వాని కిట్లనియె. సోదరా! ఇప్పటికే జాగయ్యెను. అభీష్టసిద్ధింబడసిన నీవతిజవంబునఁ బాతాళంబున నాజనకుని సన్నిధిన కేగి మదీయశుభోదర్క మెఱింగింపుము మర్త్యలోకములోఁ దిగ్భాగవనంబులఁ బ్రసిద్ధికెక్కిన ప్రతిష్ఠానపురంబునందు నేను సతిసంతోషములో సుఖముగానుంటినని వచింపుము. తారావళి మాతోఁ బ్రతిష్ఠానపురంబున కేతెంచి యచ్చటఁ దన కిచ్చయున్న నాసన్నిధి నుండుటగాని లేక పాతాళమునకుఁ దిరిగివచ్చుటగాని జేయఁగలదని చెప్పుము. అని వచించి వని సతివినయంబున వీడ్కొల్పెను వాఁడును బంధుభావోచితంబుగ నుదయసుందరితో సంభాషించి, సంతతము నామె నేమరకుండుమని తారావళితోఁ జెప్పి యారాజేంద్రునకు వినయంబునఁ బ్రణామంబు లర్పించి విమానరూపమునున్న మాయాబలుని యనుజ్ఞఁ గైకొని యాక్షణంబుననే పవనభావం బంది యంతర్హితుం డయ్యెను.

పిమ్మట నారాజేంద్రుం డపరిమితసంతోషములోఁ దొలుత నుదయసుందరిని బిదపఁ దారావళిని నావిమానమున నెక్కించి వారి మధ్య దా నాసీనుఁ డయ్యెను. తోడనే యది యందుండి పైకి లేచి గగనమార్గంబున నిముషములోఁ బ్రతిష్ఠానగరమును జేరెను. ఆ నగరము వెలుపల నావిమానమును దిగి సమీపమున నున్న నందివృక్షశీతలచ్ఛాయ కేఁగి యందుఁ బుండరీకుండు బ్రక్కనుదయసుందరియును నెదురఁ దారావళియునుండఁ గూర్చుండెను. పిమ్మట వి

మానసరూపమును విడచి దివ్యాకృతిం బూని మాయాబలుండు కృతాంజలియై వారియెదుట నిలచి యిట్లనియె.

దేవా ! అటు చూడుము. కోల్పోయి దరుముకొనిపోయిన మన భూనాథుండు దాంగోరివతరుణీమణి నెచ్చటనో లభింప నామెం దోడ్కొని తిరిగి యేతెంచియున్నవాఁడని చెప్పికొనుచుఁ బరుగుపరుగున బరిజనులెల్ల నెదురువెడలుచున్నారు. కావున నోక్షితిపాలపుంగవా ! నన్నిందే విడచిపెట్టుము. నీవు తలంచికొనినంతనే నే నెవరికిని జెప్పకుండ త్వరితగతి నేతెంచితిని. నీనియోగంబున నెంతకాలము మసలితినో తెలియంగను. ఇందులకుఁ బ్రభునగు విభీషణుఁ డేమని తలంచుచున్నాఁడో తెలియదు. అని పలుకు వానిమాటల నాదరించి యాధాత్రీశ్వరుండు నావాంఛిత మెల్ల సమకూర్పఁగలిగిన నీకేమి పారితోషిక మొసంగగలను ? నలసినప్పుడు నాశరీరమే నీయధీన మొనరింపఁగలవాఁడ నని యత్యంత స్నేహభావంబున వచించి యారాత్రించరుని వీడ్కొల్పెను.

ఇంతలో నల్దెసలనుండి యత్యంతానందమునఁ బురజనులు గుంపులుగుంపులుగా నచ్చోటికి కరుగుదెంచసాఁగిరి. క్రమంబున మంత్రి సామంత హిత పురోహిత బృందమెల్ల నేతెంచెను. ఛత్రచామరాది రాజలాంఛనము లెల్లఁ గైకొని సకలపరివార మేతెంచెను. అందఱి కన్న ముందుగఁ గుమారకేసరి తేజసమీపమున కఱిగి వానికి నమస్కరించి జరిగినవృత్తాంతమెల్లఁ దెలిసికొనెను. పిదప నాచక్రవర్తి యెల్లవారిని దగినరీతి నాదరించి యుదయసుందరితోఁ భద్రదంతావళం బధిష్ఠించి ముందు మంగళధ్వనులు జలరేగుచుండ మహావైభవంబునఁ బురప్రవేశ మొనరించెను.

అట్లు వా రేఁగుచుండ వారిని జూచువేడ్కచే విలాసవ్యాపారములనెల్ల విసర్జించి యతిరయంబునఁ బరువెత్తుకొనివచ్చి కామినీలోకము సౌధశిఖరములయందును గవాక్షములయందును దోరణద్వార

దుఁనిచేత వివిధసత్కారంబులం బొంది యుదయసుందరి యొనర్చు తప్పులనెల్ల క్షమించుచుండుమని రాజేంద్రునితోఁజెప్పి రాజహృదయాను కూలపరివర్తనంబున నుండుమని యుదయసుందరికిం బోధించి, యుద యసుందరి కనవరతము హితంబొనర్చుచుండుమని తారావళికిఁజెప్పి తారావళి ననురాగంబున నేలుకొమ్మని కుమారకేసరిని ప్రార్థించి, వీరినందఱను రక్షించు భారము నీయందేయున్నదని వెండియు, రాజును బ్రార్థించి వారినెల్ల వీడ్కొని పాతాళంబున కేగెను.

గోపా! వినుము వైకుంఠ సభయందు గరళకంఠునిచే శప్తులైన నిందుచంద్రులే పుండరీకకుమారకేసరులై జన్మించిరి. పార్వతిశాపంబున నహల్యాతారలు పాతాళంబున ఉదయసుందరీతారావళులుగా జన్మించి భూలోకంబున కష్ట పరంపరలకులోనై పుండరీకకుమారకేసరులను వివాహమాడి మరియు ఉత్తరజజన్మంబున గంధర్వలోకంబున హంసు నకు ఉదయసుందరియే మహాశ్వేతగను చిత్రరథునకు తారావళియే కాదంబరిగను నీశ్వరీవరప్రసాదంబున జన్మించి, కాదంబరీమహాశ్వేతలు ఇంద్రచంద్రుల రూపాంతరంబునను చంద్రాపీడ పుండరీకుల వరించి వివా హమాడి సంతానముబడిసి నంతనే నారాయణవరప్రసాదంబునశాపంబు దొలఁగి యథాస్థితిం బొందుదురు. చంద్రుఁడు శాపగ్రస్తుఁడైన కతం బున నతనిభార్య రోహిణి నతని ననుసరించి పూర్వభవంబున మధుర యను పురంబున కుమారకేసరిభార్యగను ఉత్తరజన్మంబున చంద్రా పీడుని తాంబూలకరండవాహినిగనుండి రూపాంతరములనున్న భర్తను శుశ్రూషయొనర్చెను.

కం. అనిచెప్పిన విని గోపుఁడు
ఘనవిస్మయ సుప్రహర్ష కలితాత్ముండై
ప్రణుతించెఁ దపసి తపసియు
జనియెం దదనంతరావసథమున కంతన్.

# 344 వ మజిలీ.

కం॥ శ్రీపార్వతీ మనోహర!
లోపాముద్రేశ్వరేంద్ర! లోలార్క సమ
ర్చ్యాపర! విశ్వేశ్వర! కా
శీపురపరిపాల! సుష్టు శైలాశీలా!

దేవా! అవధరింపుము. మణిసిద్ధయతీంద్రుండు గోపకిశోరునితోఁ గాశీయాత్రఁ గావింపుచు గ్రమంబున చతుశ్చత్వారింశదధిక త్రిశతతమ నివాసస్థానంబుఁ జేరి నిత్యానుష్ఠానంబులఁ దీర్చుకొని భుక్తోపవిష్టుండై శిష్యుని రాకవరయుచున్నంతలో నగ్గోపాలుండు వచ్చి యయ్యవారికి నమస్కరించుచు నిట్లనియె.

శా. సామీ! కాశికి నెంతకాలమునకున్ సాగంగనో మీకటా
క్షామూల్యద్యుతిఁ జేసి లోకమున వి ఖ్యాతంబులై యెన్నియోఁ
బ్రామాణ్యంబులతో మహోత్తర కథల్ పాటించి నేవింటిఁ గా
శీ మహాత్మ్య మికిన్ వినం దలచితిన్ జెప్పంగదే యొప్పుగన్.

అనవిని గురుండు వాని సౌశీల్యంబునకు మెచ్చుకొని గోపా! లే! లెమ్ము! వేళ మిగిలినది భుజింపుము. నీవడిగిన యర్థంబులు చెప్పెద ననుటయు గోపాలుండును సాపడివచ్చి యొజ్జల పాదంబుల నొత్తుచు శుశ్రూషఁ జేయుచుండ మణిసిద్ధయతీంద్రుండు నమ్మణి విశేషంబున నంతయుఁ దెలిసికొని యిట్లనియె గోపా! నీప్రశ్న వృథాకాదు. దీన వైశ్వానర నిర్భృతి వరుణాది దిక్పాలుర ప్రభావమంతయు దెలియవచ్చెడిని వినుము.

## పింగాక్షుని కథ.

వింధ్యపర్వత ప్రాంతారణ్యంబున నొకబోయపల్లెగలదు. దాని కధినాయకుండై పింగాక్షుండను బోయదొర పరిపాలించుచుండెను. కాశికిఁ బోవు తైర్థికులామార్గంబుననే బోవుచు నీబోయపల్లె పజ్జంగల

చెఱువుసమీపమున విరాజిల్లుతింత్రిణీవృక్షములక్రింద బసచేయు నల వాటుగలదు. ఆచుట్టుపట్టుల నెందును జలాశయములేకునికి యీ మజిలీ యాత్రాపరులకు రాకపోకలయందు తప్పనిదయ్యెను. అచ్చట ముష్కరులగు కిరాతులవలన దోపుడు భయంబెక్కువగా గలిగియుండుట చేత యాత్రాపరులు పెద్దపెద్దజట్టులుగాజేరిగాని యాపల్లీదాటజాలరు అదిదాటిన సుఖముగానిక కాశిక జేరవచ్చునని సంతోషించుచుందురు.

అట్టి దారుణారణ్యమార్గం బనుసరించి యొకనాడొకభిక్షుకుండు బోవుచుండుటయును నచ్చటి శబరులుగొందరు వానిచుట్టుముట్టడించి యోరీ! నీయొద్దనున్న ముల్లె నిందు బెట్టుము లేకున్న నీతల యెగిరిపడునని రూక్షముగా బలుకసాగిరి. వారిమాటలకాబాటసారి యించుకయు వెఱువక "శబరులారా! భిక్షుకుండనగు నాయొద్ద నేముండును. ఈపులితోలు వెదురుకర్ర, లోతము, మట్టిచిప్ప, జేగురుగుడ్డలుమాత్రమే నాయొద్దగల ధనములు. దీనిం గావలసినబుచ్చుకొని యుపయోగించుకొనుడు. ఈమజిలీ వెనుకటినుండి గడుదీర్ఘమగుటచేతను నెచట నెందునుజనపదంబులు లేకుండుటచేతను భిక్షుకుదరక నామానంబున గమనాయాసంబున మిగుల తహతహం బడుచుంటిని. మీకు మంచి పుణ్యము రాగలదు. నన్ను మీపల్లెకుం గొనిపోయి యిన్ని గోక్షీరములైన ద్రావనిచ్చి పుణ్యంబు గట్టుకొనుడు" అనిబలుకుచున్న యాబైరాగిం జూచి యాయాటవికులు నవ్వుకొనుచు నిట్లనిరి. "బిచ్చగాడా! నీముచ్చటలు గడుచిత్రములుగా నున్నవే! దారులుగాచి బాటసారుల దోచుకొను మాయొద్దనేమైన గుంజులాడ బ్రయత్నించుచున్నట్లున్నది. నీమాటలనమ్మి మోసపోవువా రిందెవ్వరునులేరు. ముచ్చుల మోసగించుటకు రొక్కము జిక్కములలో బెట్టి మొలకు జుట్టుకొని యేమియు లేనట్లు నటించువారి నెందఱ మేమింతకు జూచియుండలేదు. చేత గాసైనలేకుండ బొరుగూరికి బోవువారెవ్వరైన నుం

దురా! పెక్కుమాటలు మాని నీయొద్దనున్నదేమో యిచ్చుటకుఁ బెట్టుము; లేకున్న బలవంతముగఁ బైఁబడి లాగికొందుము" అని బలికెను. మరి యొకడు మాటల వలన సొమ్మీఁడి పడునటరా! యనుచు చేతనున్న దుడ్డుకఱ్ఱతో నాజటిలుని నడినెత్తిమీఁదఁ గొట్టెను. తోడనే యయ్యతి హాహా! హా! కాశీవిశ్వేశ్వరా! యని యఱచుచు స్మృతిదప్పి నేలఁబడెను.

ఆ తెక్కలికాండ్రు వానియొద్ద నేమైన రొక్కమున్నదేమో యని వానిబట్టగా పరిశీలించిరి గాని వారికేమియు దొరకినది కాదు. వచ్చినవాఁడు చేతఁ గాసైనను బట్టుకొని రాకుండ మనల నందఱను వృథాగా శ్రమబెట్టెనని విసిగికొనుచు నాభిక్షుకుని కళేబర మామార్గమధ్యమందే పడవైచి వచ్చినదారిం బట్టి యెందేనిఁ బోయిరి. ఇంతలో పింగాక్షుండు దైవికముగా నాదారిం బోవుచు నందు మృతుండైనట్టు పడియున్న యాపారికాంక్షి నీక్షించి యక్కజంబడుచు సన్నిధికేతెంచి వాని యౌదలఁగల గాయమును గనిపెట్టి యిప్పుడే యెవ్వరో వానిఁ గొట్టిపోయిరని నిశ్చయించి యెద్దియో వేరుదెచ్చి దానిరసము నాగాయముపై బిండెను. కొంతసేపటికి నాజటిలునకు చైతన్యము గలిగినది. ఆభిల్ల పరివృఢుండు వానిసన్నిధినేయుండి తగిన యుపచారములు సేవకులచే జేయించుచుండ తెలివివచ్చి యాభిక్షుకుండు దాహము దాహమని హస్తసంజ్ఞల జేయుచు దెలియఁజేసెను. తోడనే నిర్మలోదకము తెప్పించి వానికిచ్చిరి. పిమ్మట కొంతసేపటికి స్వస్థతగలిగి లేచికూర్చుని యాపింగాక్షుంగాంచి యల్లననిట్లనియె.

మహారణ్యమధ్యంబున దోఁపుడుగాండ్రచే మర్దింపంబడి దిక్కులేక పడియున్న నన్ను నీవెవ్వఁడవో దేవునివలెవచ్చి కాపాడితివి. సమయమునకు నీవు రాకున్న నేనీపాటికా దెబ్బతో బరలోకమునకు బోవలసినదే! నాకు నీవు ప్రాణదాతవై మిక్కిలి సుకృతము గడించితివి.

నీ వృత్తాంతము విన కుతూహల పడుచున్నానని బలుకుటయు నాభిల్ల
నాయకుం డిట్లనియెను.

అయ్యా! నే నీపల్లెకు నేకమీదుండను. శబరుఁడను పింగా
క్షుండనువాఁడను. నేటి యుదయంబున నీప్రాంత కాంతారములకు మృ
గయావినోదంబున బోయి తిరిగివచ్చుచు మార్గమందు స్మృతితప్పి పడి
యున్న మిమ్ముఁజూచి యొకయోషధీ విశేషంబున మీగాయములు గుది
ర్చితిని. మీరు పునర్జీవితులగుటకు నాకెంతేని సంతోషముగా నున్నది.
మీ రెం దేగుచు నిందు వచ్చి యీవిధమున బాధపడితిరి. మిమ్ము గొ
ట్టినవా రెవ్వరని యడిగిన నాజటిలుం డిట్లనియెను.

ప్రాణదాతా! నీయవ్యాజకరుణాకటాక్షంబులు నెంతేని గొనియాడ
గలను. నీవుఁజేసిన యుపకారం బీజన్మాంతమున నెన్నఁడును మఱువఁజా
లను. నేనొక విరక్తుండను. కాశికిం బోయి యందు విశ్వనాథుని సంద
ర్శించుటకు నే నీదారిం జనుచుంటిని. వెనుకటి మజిలీయందు కొందరు
పుణ్యాత్ములు నన్నీమార్గంబున నొంటిగా బోగూడదనియు నన్నుపోయిన
దొంగలవలన నపాయము వచ్చుననియు నెంతచెప్పినను వినక దొంగలు
నన్నేమిచేయగలరు! వారివలన నాకెట్టిభయము కలుగదని విశ్వేశ్వర
సందర్శన లాలసుండనై వారిమాటలం ద్రోసిపుచ్చి వచ్చితిని. ఇచ్చటి
కిఁ జేరునరికి గొందఱు మన్నెగాండ్రువచ్చి నన్నాటంకపెట్టి నాయొద్ద నే
మియులేదని నేనెంతజెప్పినను వినక నన్నుఁ జావఁగొట్టిరి. పిదప వారేమైరో
నాకుఁ దెలియదు. నీవలన నేను బ్రతికితిని. ఇదియే నావృత్తాంతము. నే
నిప్పుడు మిగుల క్షుద్బాధా పీడితుండనై యుంటిని. తినుటకేమైన నిచ్చి
నన్ను రక్షించి కాశికిఁ బంపుము. ఆకాశీసందర్శనంబున గలుగు సుకృ
తంబున నీకర్ధ భాగమిచ్చుచున్నానని బలుకుటయును నాభిల్లపతి య
ప్పుడే కొందఱింబంపి కొన్ని ఫలంబులను గోక్షీరంబులను దెప్పించి వాని
కిచ్చెను. అఫలంబులఁ దిని యంతపాలం ద్రావినంత మునికి బలముగలుగ

గనే లేచి యాభోయద్వారంతో వానిగృహమున కేగి వానియనుమతంబున కొంతకాల మందునివసించెను. ఆజపంబున నారోగ్యము కుదిరినకొలంది మేనికి జవసత్వములు వృద్ధిపొంద సాగినవి. పిమ్మట నాయతి యొకనాడు పింగాక్షునితో యోగిమిత్రా! నీయింట నిన్నినాళ్ళు సుఖముగా గడిపి యారోగ్యవంతుడ నైతిని. ఇంక నాకు కాశికిం బోవ ననుజ్ఞ యిత్తువేయనుటయు నతండిట్లనియెను. మహాత్మా! మీరు మాగృహంబున కేతెంచుటంజేసి నేను ధన్యుడ నైతిని. నాపాపము పరిహరింపబడియెను. భవద్దర్శన మాత్రంబుననే మనస్సునందున తుచ్ఛసుఖంబులపై నసహ్యమును మోక్షముపై నపేక్షయు గలిగినవి. దుఃఖబహుళంబగు నీసంసారము నందుం బడియుండుటకు నాకిష్టము లేకున్నది. మీతో నేను కాశికిం జనుతెంతును. నన్ను వెంటందీసికొనిపోయి మోక్షమార్గంబుం జూపింపుడు యిదియే నా ప్రార్థన యనివేడికొనుటయు నాపరివ్రాజకుండల్లన నవ్వుచు నిట్లనియెను.

భిల్లతల్లజా! నీమంచిబుద్ధి కేనెంతయు సంతసించితిని. కాశికిం బోవుట యనేకజన్మ సుకృతపరిపాకంబునం గాని లభింపజాలదు. ఇందుల కొక యితిహాసము గలదాకర్ణింపుము.

### 415 వ మజిలీ. ధనంజయునికథ.

దక్షిణాపథంబున సేతుబంధ సమీపమున నొక్క గ్రామంబున ధనంజయుడను నైశ్రోత్రియుండు గలడు. అతని తండ్రి చిన్నతనమందే పరలోకమున కేగెను. వానితల్లి భర్తలేని చింత నొకమూలకుం ద్రోసి వేసి కుమారున కేలోపము రాకుండ బోషించుచు విద్యాబుద్ధులు సెప్పించి యుక్తవయస్సునందు తగిన సంబంధము దెచ్చి పెండ్లిచేసెను. ధనంజయుండు విశేష ధనవంతుండు గాకపోయినను గృహకృత్యంబుల కిబ్బంది పడకుండ నతండనుదిన ధనసమార్జనం బొనరించుచు మాతృసేవా పరతంత్రుండై మంచివాడుకలోనికివచ్చెను. వానితల్లికి చిన్ననాట నుండియు

ను కాశి కేగవలయునని యుత్సాహముండునది. ధనలోపంబున గొన్ని నాళ్ళును తీసుకొనివెళ్లువారులేక కొన్నిదినంబులును, మంచితోడు గుదిరనపుడు. బోవచ్చునను నుపేక్షచేత గొన్నినాళ్ళును వ్యాధిగ్రస్తురా లగుటంజేసి కొంతకాలము, నన్నియు సమకూరిన నప్పటి కేదియో యాటంకము చేతను ప్రయాణము నిలుపుచేయుచు నొకప్పుడు మనుమరాలి పురుటిదినంబులనియు నింకొకప్పుడు మనుమని వివాహమనియు నిట్లెప్పటి కప్పు డేదియోయొక యభ్యంతరము వచ్చుచునే యుండెను. కానియెప్పటికిని యామెకోరిక తీరినదికాదు. ఇంతలో వార్ధక్యము పెనుభూతమువలె వచ్చి మీదంబడినది. కన్నుచూపు తగ్గినది. రదనంబుల శక్తి సన్నగిల్లినది. దేహంబున వణకు బుట్టినది. శ్రోత్రేంద్రియ వ్యాపారము క్షీణించినది. ఆహారముతగ్గనది. ఒడలిలో రోగమంకురించినది. ఇట్లుండినను నా యిల్లాలికిం గాశికిపోవలె నను కుతూహలము పోలేదు. నిత్యమును కుమారునితో నాయనా! నన్నొక్కసారి గాశికింజేర్చి యొక్కమారుగంగాస్నానంబుజేయించవా! యనిదీనురాలై చెప్పుచుండునది. కుమారుడునుఅమ్మా! నీ దేహమున స్వస్థత గలుగగానే తప్పక కాశీయాత్రం జేయించెదనని ప్రత్యుత్తరం బొసంగుచుండెను. ఇంతలో వ్యాధిముదిరినది. కృతాంతకుం డెంతటి కఠిన హృదయుండో కాని యాయవ్వకోర్కె దీరకుండగనే మించి పోయినట్లు కక్షవహించినట్లు యామె ప్రాణంబుల నీడ్చించుకొని పోయెను. మృతి నొందిన జనయిత్రిం గాంచి యాకుమారుడు గాశికిబోవలయు నను నీకోర్కె దీర్పంజాలనైతినిగదా యని మిక్కిలి విచారించుచు తల్లి యపరక్రియల విధ్యుక్తంబుగ నొనరించి యామె యస్థులనైనం గంగలో గలిపి తల్లికోరికం దీర్చి కృతకృత్యుండ నగుదునని దలంచి యామె కీకస శకలంబుల సంగ్రహించి వస్త్రంబున జుట్టి పదిలముగా రాగిపెట్టెలోం బెట్టి తాళమువైచి గాశికిం బయనమై యాపెట్టె మోసికొని యొక్కరుండునుం బోయెను.

అట్లు పోయి [illegible] నెపమున నెడద
గమనాయాసంబు దీర నాగుచు నతిశీఘ్రముగా [illegible] కొన్ని
పయనంబుల నాగించెను. అందొక పల్లెలో [illegible] కూలికేర్పాటు
చేసికొని యాపెట్టె [illegible] మోయుచు [illegible] మార్గంబున ననేక
బాధలం బడుచు నెట్టకేలకు [illegible] పట్టణంబుం జేరగలి
గెను. అందొక వణిజ [illegible] యాపెట్టెను బోయి [illegible] పదా
ర్థంబులం గొనివత్తునని చెప్పి యాపెట్టెను [illegible] నుంచి పోయెను.

ఇంతలో [illegible] ధనము
న్నదని తలంచి యా ధనంజయుడు [illegible] పెట్టెతో మా
యమయ్యెను. ఆవైశ్యుండును [illegible] గొనివచ్చి
యందాశబరుని గానక తల్లి యస్థులు [illegible] వాడు పోవుట
కు దల్లడించుచు నాయస్థుల [illegible] యని పరిపరి
విధంబుల విలపించుచు వాడా పెట్టెలో ధనమున్నదని దలంచి యట్లప
హరించుకొని పోయెనని నిశ్చయించి యెట్లయినను వానిం గనిపెట్టి యా
యస్థులం దెచ్చి గంగలో కలిపి [illegible] దీర్పవలయునని తలం
చి యప్పుడే యతండు మున్ను [illegible] పల్లెకుం బ్రయా
ణమైపోయెను.

ధనంజయుం డట్లు బోయెపల్లెకు మిగుల శ్రమంబున నరిగి యందాచెం
చువాని గృహంబు జేరి వానిం జీరి నంత గురుతుపట్టి యా యాటవి
కుండు భయంపడి డాగియుండి తన భార్యకు చెప్పవలసిన విధంబంత
యును బోధించి యావలకుం బంపెను ఆ చెంచుదతయును ధనంజయుని
సన్నిధి కేతెంచి తనభర్త యింటలేడనియు మీతోగాశికినచ్చి నాటం
గోలె వాడు తిరిగి రాలేదనియు జెప్పుచు అయ్యా! మీ రిందొక్కరే
వచ్చితిరేమి? నాభర్త యేమయ్యెనని యెదురు ప్రశ్నింప దొడంగినది,

కోమటి దాని యాకార చేష్టాప్రకారంబంతయుఁ జూచి అదియసత్య మాడుచుండెనని గ్రహించి మంచిమాటలచే దానివలన వాని యునికిఁదెలిసికొన వలెనని యెంచి, యోసీ! నీమగఁ డింతపిరికివాఁడయ్యె నేమి? అంత దూరము నాతో కష్టపడి వచ్చియు కూలియైన బుచ్చుకొనక ముందు వచ్చెనేమి? నేను వానిని నాతో సహవాసంబునకు గుదుర్చుకొని తీసికొనిపోతిని గాని యాపెట్టె మోయుటకు గాదు. దానిలో నేమున్నది యెముకలు. నేను గాశికి పోవుచుంటిని గదా యని యెప్పుడో దాచి యుంచిన పెద్దల యస్థులను గంగలో వైచి రమ్మని మావాండ్రు నాకిచ్చిరి. ఎట్లయినను కాశి కేగుచుంటిని గదా వీలైనవాటిని గంగలో పారవేయుట కేమి కష్టమని నే నందుల కంగీకరించి తెచ్చితిని. వాటిని గంగలో వేసిననేమి మరియొకచోట పారవయిచిన నేమి? దానితోనే చచ్చినవారికి మోక్షము వచ్చునాయేమి? ఆపెట్టెనెచ్చటనో పారఁబోసి నే నందులకు కినియుదు నని తన భృతి నైన గొనకుండ నాతో చెప్పకుండ తిర్గివచ్చిన నీమగనికంటె బుద్ధిహీనుం డింకొకఁ డుండునా? నాతో వాఁడు మార్గములో పడిన కష్టమునకు దానికి నే నీయవలసిన కూలి నెగవేయుట పాపహేతువని దలంచి యిచ్చుటకే వచ్చితిని. వాఁడు లేకున్న నే నాసొమ్మెట్లీయ గలనని బలుకుటయు నాబోయది సొమ్మిచ్చునని భ్రమపడి అయ్యా! మీరు చాలమంచివారు. ఒకరి కష్టము మ్రింగుచుకొనువారు కారు. మీపెట్టె నా కాశీపట్టణంబులో నెవ్వరో దొంగలు ధన మందున్నదని యాసపడి నామగని సన్నిధినుండి యపహరించుకొని పోయిరట. దానికి మీ రేమిచేయుదురో యని భయము చేత నింటికి పారివచ్చిన మాట నిజము. మీ రేమందురో యని మిమ్ము జూచుటకు సిగ్గుపడుచు లోపదాగియున్నాఁడు. పోనిండు మీరీయవలసిన సొమ్ము నా కీయకూడదా యనుటయు నతండు అమ్మా! నేను ప్రమాణ్ముఁజేసి చెప్పుచున్నాను. పెట్టె పోయినందులకు నేను వానినేమియు

గినియనఁ. నన్ను వాని సమీపంబునకు దోడ్కొని పొమ్ము. వాడును నేనును లెక్క జూచుకొనకుండ సొమ్ము నీవని కొట్టిమ్ముందువని యనున యపూర్వకంబుగా పలుకుచున్న వాని మాటలయందు నమ్మకవుట్టియా చెంచెత లోనికరిగి భర్త కుమారుని గరపి వానిం దీసుకొనివచ్చి యా కోమటి యెదుటం బెట్టినది. ధనంజయుండును వాని కీయవలసిన కూలి యంతయు లెక్కించి యప్పుడే యిచ్చివేసి వానికి సంతోషము గలుగఁ జేసెను. ఇట్లాబోయవానికి గ్రామంబున నౌకరి సంపాదించి యొక్క నాఁడు ధనంజయుండు మిగుల దీనాననుఁడై వాని కిట్లనియె. స్నేహితుఁడా! నేను నిన్నొకటి యడిగెదను దాని నీవు మఱొక లాగున దలంపక నిక్కము వచింపుము. దాని కేమియు భయములేదు. కాశి లో నేను నీకిచ్చిన యస్థికల పెట్టె నెవ్వరో బరు లపహరించిరని నీభార్య చెప్పినది. గాని యామాటలు నాకేమియు నమ్మకముగా లేవు. నీవా పెట్టె నేమిచేసితివి? అందున్న యస్థులు పూయంబడి. వానిని భాగీరథీ జలంబున గలిపి మా పితౄణము దీర్చుకొను గంపెడాసతో నే నన్నికష్ట ములుపడి కాశికిం జేరితిని. తుద కాపని జేయలేకుంటిని గదా! యని హృదయతాపంబున గొట్టుకొనుచుంటిని. ఆయస్థుల నేమిసేసితివో చెప్పి యవి సిద్ధముగనున్న నాకిమ్ము. నీకు పుణ్యము రాగలదని మిక్కిలి బ్రతిమాలుచున్న నా వైశ్య కులోత్తమునితో నా చెంచెతయిట్లనియె.

అయ్యా! బుద్ధిహీనుండనై యాపాపము నేమూటగట్టుకొంటిని. యాపెట్టె యందు మిక్కిలి రొక్కముండునని దురాశపడి దాని నపహ రించిన మూఢుడను నేనే. నీకష్టమంతయు నరణ్యముల పాలు చేసిన పాపాత్ముండను నేనే. నీ వంగడి కేగి నప్పుడా పెట్టె నపహరించి మారు మూల మార్గంబున బయలుదేరి వచ్చి యీయరణ్యంబున నొకచో నామందస మూడదీసితిని. లోపల నున్న యస్థిశకలంబులఁ జూచి విభ్రాం

తుండనై చేసిన పనికి సిగ్గుపడుచు నప్పుడు చేయున దేమియులేక వాటి నందే బారవైచి యింటి కేతెంచితిని. ఇదియంతయు యథార్థము. నామాటనమ్ముము, నాపెట్టెలో యెముకముక్కలు తప్ప నికేమియు లేవు. మిమ్ములను మోసము జేసితినను మాటయే మిగిలినది నీ పాద ముల తోడని పలికెను.

అంత నాథనంజయుండు వాఁడు తనతల్లి యస్థులఁ బారవేసిన ప్రదేశము వాని నడిగి తెలిసికొని వానితో నచ్చోటికిఁబోయి వెదకిం చెను. కాని యెందును వానిజాడ గనంబడినదికాదు. వాఁడాప్రదేశము ను దైవయోగంబున సరిగా గుర్తుపట్టలేకపోయెను. చూచిన చోటులే జూచుచు వెదకిన ప్రదేశములే వెదకుచుతిరిగిన మార్గములే దిరుగుచు నీరీతి వారెంతఁ బ్రయత్నించినను గార్యములేకపోయినది. అప్పుడావై శ్యుఁడు చేయునదిలేక తల్లిఁగూర్చి పెద్దగా వగచి తన యభాగ్యత ననేక విధంబుల నిందించుకొనుచు నాకిరాతుని వదలి మగుడికాశీపురంబున కే తెంచి యందు గంగానదిం జలకమాడి విశ్వనాథుని సందర్శించుకొని యెట్టకేలకు నిజపురంబునకుఁ దిరిగిపోయెను.

వింటివా! విశ్వేశ్వరుని యాజ్ఞ లేనిదే యాకోమటి యవ్వ యస్థు లైనను గంగలో కలుప వీలుగలిగినది కాదు. నీవు కాశికిం బోనక్కర లేకుండగనే యంతకు రెండింతలు సుకృతము సంపాదించుకొనగల యవకాశమున్నది. కాశీయాత్ర పరులీమార్గంబుననే గాని బోవుట కన్యమార్గంబులేదు. ఈమజిలీ దాటుటకు వారుపడు కష్టములకు మేర లేకున్నది. ఈ మహారణ్యమందు కాశికి బోవు యాత్రికులకు తగిన సదుపాయంబులఁ గల్పించుచు, వారికి దోఁపుడుగాండ్ర వలన గలుగు చున్న బాధలు లేకుండఁ గాపాడుచుంటివేని కాశికిం బోకుండగనే సహస్ర గుణితంబగు సుకృతంబును సంపాదించుకొనవచ్చును. మఱియు మీజాతి యందు నీవంటి క్రూరకర్మ పరాఙ్ముఖుం డుండఁడు. నీపూర్వపుణ్యాం బున నీయందు సుగుణంబు లన్నియుఁ జేరినవి. నీవు కారణజన్ముండవు.

నా హితవచనంబులు పాటించి నేఁడు మొదలు జంతుహింస మాని ప్రతిదినంబును తీర్థయాత్రా పరులకు కందమూల ఫలాదు లొసంగి తృప్తులం జేయుచు సత్కరించుచుండుము. మార్గస్థులు తస్కరబాధ లొందకుండ కాపాడు చుండుము. సతతము కాశీవిశ్వనాథుని మనంబున దలంచుచుండుము దానంజేసి నీకు పుణ్యలోకంబులు గలుగఁగలవని కొన్ని మోక్షధర్మంబు లుపదేశించి యాశీర్వదించియాజటిలుండుతనదారిం బోయెను.

పింగాక్షుండును నాభిక్షుకునియుపదేశమే వేదవాక్యమట్లుపాలించి తీర్థయాత్రాపరులు నడుచు మార్గమందు గంటక పాషాణాదులం దొలంగించి నడువ యోగ్యముగా నొనరించుచు, నడనడ వారు విశ్రమించుటకు శీతలచ్ఛాయల నీను సుందర తరుబృందముల బాట కిరుప్రక్కల బెంచుచు, చలువ పందిళ్లు వేయించుచు, ఫలమూలాదుల మార్గస్థులకు భక్షింప నొసంగుచు, దధిక్షీరఘృతంబుల నుచితముగ నిచ్చుచు, శీతాంబువుల దెప్పించి పానీయంబుగ నొసంగుచు, రోగార్తుల కుపచారంబుల జేయుచు,c దస్కరులవలన బాధ లేకుండునట్లు పరిజనుల సహాయమిచ్చుచు, మిక్కిలి గౌరవించుచుండెను. అంతకుపూర్వ మా యవసథం బెంత భయంకరముగా నుండెడిదియో యిప్పుడు పింగాక్షుని సహాయము వలన నంతసంతోష జనకమైనది.

అతం డిట్లుత్తమరీతిని కాలక్షేపము సేయుచుండ క్రమంబున నతని ఖ్యాతి దేశ దేశంబుల వ్యాపించినది. భోజనాంతములను జపాంతములను వానిని నాశీర్వదించుచు వాని నామస్మరణ చేయుచుందురు. ఇట్లుండ నొక నాడతని పితృవ్యుండు తారకుఁడను శబరుండు కొందఱు లుబ్ధకుల సహాయమున మార్గంబరిగట్టి గొందఱు తీర్థవాసులాదారిం బోవుచుండ వారిపైఁబడి వారిసొత్తెల్ల దోచుకొనెను.అత్తైర్థికులునుభయవిహ్వలులై యార్తిఁజెంది కేకలువెట్టుచుండెను. పింగాక్షుండు దైవికముగానాదా

బోవుచు నయ్యార్తధ్వని నాలకించి యదరిపడి పెద్దయెలుంగున నోహో! నేను గలుగ మీకుభయంబేల యని వడవడింజని యొక్కుమ్మడి యాపాటచ్చరులపైఁ బడి ఘోరయుద్ధంబు నవారింబొనరించి దోలి యాపాంధుల నిశ్చింత సాగనంపెను. పిమ్మట పింగాక్షుండు నిజగృహమున కేతెంచి యా సంకుల సమరంబున మేనం దగిలిన గాయంబుల వలన విగతజీవుం డయ్యెను. అనేక సంవత్సరములు గాశీ యాత్రాపరులకు సపర్య లొనరించిన పుణ్యంబువలన నాపింగాక్షుండు జన్మాంతరమున ననన్య సులభం బగు దిగీశ్వరత్వంబునుం బొంది నిర్వృతినొంది బుట్టె దియే కృతివృత్తాంతము అని చెప్పి తరువాయికథ ముందుమజిలీ యం దిట్లని జెప్పదొడంగెను.

## 346 వ మజిలీ.

### శుచిష్మంతుని కథ.

పూర్వకాలంబున శివపూజా ధురంధరుండగు కర్దమ ప్రజాపతికి శుచిష్మంతుండను పుత్రుండు గలఁడు. ఆ కుమారుండుచిఱుత ప్రాయమునందు సంగడికాండ్రతో విలాసముగాఁ దిరుగుచు నచ్ఛోదంబను పెద్ద సరస్సులో నొకనాఁడు సలిలక్రీడ లొనరించుచుండెను. అందొక నక్ర మవక్ర విక్రమంబున శుచిష్మంతుని కాలొడసిపట్టిపటుగయంబున లోపల కీడ్చుకొని పోయెను. ఆయునకుం డట్లు జలంబుల మునుంగుచు సంగడి కాండ్ర నుద్దేశించి పెద్దయెలుంగున నాక్రోశించుచుఁ దనయాపద నెఱిగించి రక్షింపుడని ప్రార్థించెను. కాని తోడి వా రెవ్వరు వానికే మియు సహాయము సేయలేకపోయిరి.

పిమ్మట నామిత్రబృందమెల్ల సత్వరము కర్దముని సన్నిధికి బర తెంచి యతండు శివపూజా సమయంబున సమాధి నిష్ఠుండై యున్న తఱి సరసిలో శుచిష్మంతుని యుదంతము నుడివిపోయిరి. కాని యామహానుభావుని చిత్తంబు పరమేశ్వరాయత్తమై యుండుటచేఁ దనూజుని

యాపద నేమియు నెఱుంగ కుండెను. భక్తలోక పారిజాతుండగు నా
నీలలోహితుండు సత్వర సమర్థుండగు ప్రమథోత్తము నొక్కని కర్దమపు
త్రు సంరక్షణంబునకు నియోగించెను.

ఈశ్వరాదేశంబున నాప్రమథుండును నయ్యగాధంబగు కాసార
వారిమధ్యంబునం బడి తద్బాలఘాతుకి యగు జలచరంబును బట్టికొను
తలంపునఁ జలమూనితజ్జలంబులఁ గలియఁ దిరుగుచుతిమితిమింగిల కులం
బుల నాకులంబొనర్చుచు సకల జల జీవనముల కెల్ల నకాల ప్రళయభయ
మును సంభవింపఁ జేయుచుండెను. అంత నొక కచ్ఛప శ్రేష్ఠుండు పురు
షాకారముతో నాప్రమథుని సన్నిధి కేతెంచి నమస్కరించి వినయ విన
మితగాత్రుండై యిట్లనియెను.

మహాత్మా! ఎవ్వఁడో యొక తుచ్ఛప్రకృతి యొనరించె నని
మహాక్రోధంబుననిట్లు సర్వ జలచర సముదాయంబును నంతమొందింపఁ
దివురుట మీబోట్లకు యుక్తమేనా? ధర్మసూక్ష్మంబుల మీకన్న జడ
జీవుండ నగు నేనెక్కు డెఱుంగుదునా? కోపంబు నుపసంహరింపుఁడు. మా
కులంబుల రక్షింపుఁడు మీకు జరిగిన యపకృతికి ప్రతీకార మూహిం
పుఁడు. అందులకు మేమెల్లరము సహాయ మొనరింతు మని పలుకుటయు
నా ప్రమథుండిట్లనియెను.

ఇక్కొలనిలో విహరించుచున్న కర్దమ పుత్రుని నపహరించు
కొని పోయినయా తుచ్ఛ జలచరాధముం డెవ్వఁడో చేర్కొనుము. వాని
నాకు సత్వరము జూపింపుము. లేదేని నస్మత్క్రోధానల జ్వాలల నీకీ
లాలా వాసుల నెల్ల భస్మ మొనరింతు నని రూక్షముగా వలుకుచున్న
వానికి తాఁబేటి మేటి యిట్లనియెను. ఆర్యా! శాంతింపుడు. ఆబాలకు
నపహరించిన వాఁడెవ్వఁడో నేనెఱింగివచ్చి తమకు విన్నవించు కొనెదను.
అందులకు నాకుఁ గొంత గడువీయవలయు నని ప్రార్థించుటయు నతండు
ఓరీ! నీవెవండవో నేనెఱుఁగను. నిన్ను నమ్మి నాప్రయత్నము మానిచి విర

మించుట యుక్తముగాఁ గనుపించుట లేదు. ఈయాపద దప్పించుకొనుట కెద్దియో బూటకంబులఁ బన్నుచుంటివేమో? ఎవ్వ రెఱుంగుదురు. నీ మాటలు విశ్వసించుటకు తగిన హేతువుఁ జూపించినఁ గాని నమ్మఁజాల ననుటయు నా పురుషుం డిట్లనియె.

దేవా! నిన్ను మోసపుచ్చి నేపోయిన నేమాయెను. నే నసత్య వాదినని తెలిసిన పిమ్మట నీ కోపం బోపుట కెవ్వరు సమర్థులగుదురు? ఇప్పుడు గాకున్న నప్పుడైన నీసర్వనాశన ప్రయత్నము విడిచెదవా యేమి? నే నసత్యము లాడుట లేదు. నేను కచ్ఛప వంశ సంజాతుండను. పెద్ద కాలమునుండి యీకాసారము నాశ్రయించి యుంటిని. నీకోపినంత సహాయము చేసి నా కులంబును నీవలన నుపద్రవంబు లేకుండఁ గా పాడు కొనఁ జూచుచుంటినిఁ గాని మఱొం డెద్దియుఁగాదు. నేను తిరిగి వచ్చుపర్యంతము తీరంబున విశ్రమించియుండుము. కర్దమ పుత్రుని వృత్తాంతము విమర్శించి వత్తు ననుటయు నాప్రమథుం డిట్లనియెను.

కచ్ఛప వంశప్రవరా! నీయుదంతం బతి విచిత్రముగాఁ గనంబడుచున్నది. నీ రూపము త్రిలోకదుర్లభముగా నున్నది. నీమాటలు విన్నాణములై యొప్పుచున్నవి. నీవు కామరూపుఁడవని తోచుచున్నది. నీజన్మము కృకలాసమైనది గాకున్నను నిట్టివిశేషంబులు నీయందుండుట కెద్దియో కారణ ముండకపోవదు. నీయుదంతము పూర్ణముగా వినువఱకును నామనంబునకు శాంతియుండదు. విన నర్హమేని వక్కాణింతువే! యనుటయు నాపురుషుండు దరహసిత ముఖారవిందుఁడై యాయీశ్వరదూత కిట్లనియె.

## గంధర్వుని కథ.

శాపాంతమును బ్రసాదించిన దివ్యపురుషునితో నాపూర్వ వృత్తాంతము మఱుఁగు పెట్టిన కృతఘ్నుండ నగుదును. వినుము నేనొకగం

ధర్వకుమారుండను సుబాహుండను నభిధానమున నొప్పుచుండువాఁడను రూపయౌవన కళావిశేషంబుల ననవద్యుండనై మెలంగుచు నొకనాఁడు గొందఱ మిత్రులతో నానందమున నిష్ట గోష్ఠివినోదంబునఁ జెలంగియుండుతఱి నెచ్చటినుండి యో కలహప్రియుండగు నారదముని యచ్చటకు విచ్చేసెను. వాని గాంచి మేమెల్లరము ప్రత్యుత్థానం బొనరించి యుచితాసనంబునఁ గూర్చుండఁబెట్టి వినయంబునఁ దామెందుండి యిందు వచ్చి మమ్ముల కృతార్థులఁ జేసితిరని యడుగ నా సురముని యిట్లనియె.

గంధర్వబాలకులారా! భూలోకంబున నవిముక్త క్షేత్రంబనియు నానంద కాననంబనియుఁ బ్రసిద్ధికెక్కిన కాశీపురంబున కఱిగి యందు విశ్వనాథుండను పేరలోకంబు లేలుచున్న పరమేశ్వరుని సందర్శించి వచ్చుచుంటి నని జెప్పెను. వానిమాటలకుమాతోడివారెల్లరకక్కజంపడి మహానిచంద్రమా! ఈశ్వరుని స్వరూపమును నలుసనప్పుడు కైలాసమందు వీక్షింపఁగలుగు భవాదృశు లెచ్చట నో పుడమియందున్న గాశికిం బోవుట చిత్రముగా నున్నదికదా! అప్పురంబు మనుజులకుఁ బుణ్యతీర్థంబై యుండిన నుండుగాక! మీయట్టివారు నందలుగుటకు గారణమేమో మేమూహింపఁజాలకున్నామని యనుటయు నామునికుంజరుఁడునాలుకఁ గఱచుకొనుచు నెంతమాట! నేసకాదు. త్రిలోకములయందలి వారును గాశీక్షేత్రంబుఁజూడ నుచ్చటపడుచుందురు. బ్రహ్మావిష్ణ్వాదులెల్ల నా క్షేత్రమునుఁ దమలోకములకన్న మిన్నగఁ జూచుచుందురు, అది యట్టిద. తత్ప్రభావంబెఱింగిన మీరిట్టి శంకఁ జేయరనుటయును, వారు గాశీక్షేత్రప్రభావం బెఱింగింపుఁడని ప్రార్థించిన నాదేవముని తత్ప్రభావద్యోతకంబగు నితిహాసంబొండు చెప్పెద దానివలన మీరడిగిన యర్థంబు తేటపడగలదని యిట్లని చెప్పఁదొడంగెను.

## మహానందుని కథ.

### 347 వ మజిలీ.

భూలోకంబున గోదావరీతీరమున భానసంబను పట్టణరాజ మొండుగలదు ఆపురవరమునఁ గౌశికుఁడను విప్రుండు భార్యతోఁ గాపురమొనరించుచుండెను. అతండు పండితుఁడను పేరువొంది ధనికుండై ప్రఖ్యాతివహించియుండఁ బెద్దకాలమున కాతనికి మహానందుఁడను నందనుఁడు గలిగెను. వాఁడు జనించినవేళ యెట్టిదోగాని యేడవదినమునఁ దల్లియు రెండవమాసము రాకమున్నె దండ్రియుఁ బరలోకమున కేగిరి. మాతాపితృశూన్యుండగు వాని బంధుజనులు పెంచి పెద్దవానిం జేసిరి. అవినయ నివాసంబైన యౌవన కాలమున విషయాసక్తుండై శ్రోత్రియపుత్రుండయ్యు మాతృదోషంబున నామహానందుఁడు కులోచిత ధర్మంబుల మఱగువెట్టి క్రోడెకాండ్రింగూడి కామక్రోధ లోభ మోహమదమాత్సర్యాది దుర్గుణంబుల కాటపట్టయి వర్తించుచు పైతృకమెల్ల దుర్వినియోగము జేయుచుండెను. మరియు నతండు జారచోరపాన ద్యూత క్రియలందు దక్షుండై విద్యాశీల శౌచంబులకు దూరుండై-

ఉ॥ వాఁడల జవ్వనంబునను ♦ నాడలవాడల సంచరించుచు
న్వేడుకకాండ్రతోడ పృథి ♦ వీస్థలి నొప్పగు నాటకత్తెలం
గూడుచు నెల్లవిత్తముల ♦ గొల్లగబుచ్చుచునుండె నెంతయు
న్గూడఁగఁబెట్టు విత్తమున ♦ కున్ లయకారులు దుష్టపుత్రులే.

మఱియు నతండు,

సీ॥ ఎంతవారలనేని నింతలోపల నగ్గఁ
పఱచి పెద్దగవారి పజ్జఁదిఱుఁగుఁ
దగవుపూనిన రెండుదెగలవారికి రోస
మెక్కించి యుడుపక చిక్కువెట్టు

గుదిరినపెండ్లిండ్లు చెదరఁగొట్టుచు
వెంచి నవరింపఁ బెక్కులంచనములఁగోరు
దనమీఁదలేనిపెత్తనము వెట్టుకొని వెంబడి
నన్నిపనుల ముందముగు వెట్టు.
నొక్కతరి నెడకాదు వేరొక్కవేళ
వెచ్చకాఁడనుచు జూదరి ముచ్చటగుచు
నెన్నియేపాట్లఁబడి గణియించు నొక్క
మంతయును వెచ్చఁబెట్టు వాఁడమదినంబు.

ఇట్లు మాయావియై వర్తించుచు నాఁడొక్కనాఁడు కొందఱువే డుకకాండ్రతోఁ బాంతనిర్మల ప్రసన్నోదకాసైకత ప్రదేశంబులకు విలాస విహారమున కేగి యచ్చో నారితో విచ్చలవిడి ముచ్చటలాడుకొను చుండగా నొకవేశ్యాంగనయా మార్గమునంబున నదీజలంబులఁగొనిపోవ నే తెంచి జలపాత్రము నదిలోజారవిడచి దానికొఱకందంతు వెదకి కనుం గొనఁజాలక జాలిపుట్టునట్లు ప్రాంతమందున్న జనులంగాంచి యిట్లనియె.

పురుషపుంగవులారా! ఈనదీగర్భంబున నా జలపాత్రము హస్తం బులనుండి జారిపడియెను. దానిని వేగమ వెదకి సిరంబులఁగైకొని మద్గృ హంబున కేగకున్న మాయత్తగారు పెనుభూతమువలె నన్ను బాధింపఁ గలదు. ఆమె మాటయే యూఁతగొని నామగఁడు నన్నుఁజితుకఁగొట్టక మానఁడు. మామగారు గయ్యాళియగు భార్యనేమియు ననఁజాలక మీఁదుమిక్కిలి యామె సంతసించుటకు నన్నే చీవాట్లుపెట్టును. ప్రమా దంబున నదిలోపడిపోయిన బిందెకొఱకు నాకీదినంబున వారివలన గలుగు వెత దైవంబెఱుంగు. అదియునుంగాక నిందు బుద్ధిపూర్వకముగ జాగుచే సితినని పదపరిహారములు నాకుఁ దప్పవు. మీరెవ్వరో నేనెఱుంగను మీకుసుకృతముగాఁగలదు నాబిందె వెదకి నాకీయరే! యని ప్రార్థించు టయును నంతకముందె యామె యంగసౌందర్యంబీక్షించి పంచశరుని

తూపులకు నేపుచెడి మన్మథావస్థలం బడుచున్న మహానందు డామె మాటలనాలకించి మించిన వేగంబున నచ్చోటికిబోయి నడుము బిగించు కొని తత్పాత్రి చేజారిపడిన ప్రదేశ మెఱింగి యందు చాలవఱకు వెతకి యెట్టకేల కాబిందెను బైకిఁదీసి యామెచేతి కందిచ్చెను.

ఆమదవతి ముదితహృదయయై యాపురుషుం డొనరించిన యుప కారమునకు సంతసించుచు నాసాగసుకానింజూచి మందస్మిత సుందర ముఖారవిందయై మీమేలు నేనెన్నఁడును మరువఁజాలనని బలుకుచు బిందెతో నదీజలంబు గ్రహించి జలంబు నెడలివచ్చి యచ్చతురశ్రృంగా రవిలోకనంబుల వానిపైఁ బరఁగించుచు సుందరుఁడా! పోయి వత్తునా! నిత్తఱి నేనింకేమాత్రము జాగుచేసినని నాయత్తగారు నన్ను సాధింపఁ గలదు నామగఁడు శిక్షింపఁగలఁడు తఱియొదవునప్పుడు నీవు నాకుఁజే సిన యుపకృతికి ప్రతిఫలము జూపింపఁగలనని పలుకుటయు నతండు ముఖకమలంబు వికసింప నిట్లనియె. తరుణీమణీ! నీకృతజ్ఞత కెంతయు సంత సించితిని. నీగృహం బెచ్చట? నీకులమెయ్యది? నీమగని పేరెయ్యది? నీయ త్తమామ లెట్టివారు? నీయుదంతము నేవిన నర్హుండనని నీకు తోచినఁ జెప్పి నన్ననుగ్రహింపుమని యడుగువాని ప్రశ్నలకన్నిటికి సమాధా నము జెప్పుచు బిందిబుజముపైఁ బెట్టుకొని మెల్లగా ముందుసాఁగెను. మహానందుఁడును నామెవెంట నింటివఱకును దానుబోయిన, నితరులు తప్పు పట్టుదురనియు, తోడివారెల్ల పరిహసింతురనియు వెఱపుతో విధి లేక యామెనువిడిచి తనమిత్రుల సన్నిధికేతెంచెను. వానింజూచి తక్కి నవారు పరిహాసముచేయుచు నోహో! నీవామెతోఁ జాలసేపు ముచ్చ టించుచుంటివి నీకామె పూర్వపరిచితయా యేమి? అని యడుగుటయు వారికప్పటికెద్దియో సమాధానముఁ జెప్పెను. కొంతతడవునకు వారెవ ళ్లకువారు పోయిరి.

ఆ కనకాంగి నీక్షించి నప్పటినుండియు మహానందుని చిత్తము చిత్తజాయత్తమై దశవిధావస్థలకుఁ బాల్పడుచుండెను. మఱునాడు మహానందుడా బిత్తరియత్తవారింటికేగి దానిమగనితో మైత్రిఁ గుదుర్చుకొనెను. దానింబురస్కరించుకొని నిత్యము వానిగృహంబునకు వచ్చుచుఁ బోవుచుండెనేగాని వానికెన్నఁడును నాపద్మగంధితో ముచ్చటించుట కవకాశము గలుగకుండెను.

## ప్రియంవద కథ.

నాఁడు గోదావరీజలంబులఁ దెచ్చుటకుఁ బోయి తిరిగివచ్చుటకు మిక్కిలి జాగైనదను కారణంబున నాయంబుజాక్షిపై లేనిపోని నిందలెన్నియో మోపి యొంటిగాఁ బోనిచ్చినఁ గులంబునకేమి కళంకము దెచ్చిపెట్టునోయను భయంబున నట్లుపంపుట మానివేయుటయేగాకుండ నంతర్గృహంబున నుంచి యెన్నఁడును బైటకు రాకుండఁ గట్టుదిట్టములు జేసిరి. దానంజేసి యామెనీక్షించుటకైన మహానందునకు వీలుగలుగకుండెను.

అందులకాతఁడొక యుపాయ మాలోచించి యాయింట బనిచేయుచున్న చేటికకు కొంతరొక్కమిచ్చి దానితో పరిచయము గలిగించుకొనెను. ఆజెంత మహానందుని యభిప్రాయ మెఱింగి ముక్కుపై వ్రేలిడికొని అమ్మా! యెంతమాట! ఆబాలికామణి కడుముద్దరాలు. అత్తగారు కత్తులబోనులోబెట్టి యిట్టట్టనరాని కట్టడులం బెట్టుచున్నను సహించుకొనుచున్నది. అంతటి మంచిగుణంబులుగల యిల్లాలి నెందునునేను గనివిని యెఱుఁగను అట్టిసాధ్వి నీకు స్వాధీనమగుటఁ గలలోనిమాట నీకామెయందు గలమరులు మరలించుకొనుమని చెప్పుచుండ నాతం డిట్లనియె.

మంథరా! నీవు మంథరయంతటి దాన వగుదువు నీవు తలంచిన యాపని యనుకూలమగుట యొక వింతలోనిదికాదు. నామీఁద దయ

తప్పుటచేత నిట్టిమాట లనుచుంటివని తోఁచుచున్నది. నిన్నుఁ బర మేష్ఠి తక్కువకులంబులోఁ బుట్టించి తొలిబాముసఁ జేసినదోసంబు కారణమున నిట్టి నీచవృత్తి సంభవింపఁజేసెనేగాని నీకున్న బుద్ధికుశలతకుఁ బుడమి పరిపాలింప సమర్థురాలవని నాకొకప్పుడు తోఁచుచుండును. నాకీమాత్రి ముపకారముఁజేసిపెట్టుము. నీకు మంచి విలువగల పరిగం చుచీరఁ గొనిపెట్టెదను. నామాటలు నీకు నమ్మకము లేనియెడల నీవీ పదిమాడలు ప్రస్తుతము తీసికొనుము. కార్యసాఫల్యమైనపిదప నాయీ వీఁజూచెదవుగాక యని యామాడలామెచేతం బెట్టినయంతనే యది ముసిముసినవ్వుతో నిట్లనియె.

అయ్యా! మీ యౌదార్యము నే నెఱుంగనదియా! మీమీ యనుగ్రహంబునఁ బొట్టపోసికొనుచున్న నన్ను మీరింతగాఁ బొగడ నక్కఱలేదు. ఆయన్నులమిన్న స్వాధీనమగుట దుర్ఘటమని తలం చి యనుమానించుచుంటినేగాని మీయట్టివారి కానందము గలిగించిన యెడల నాదరిద్రము తీఱుననుసంగతి నేనెఱుంగక పోలేదు. నేనిట్టివిషయ ములయందెన్నఁడు పనిచేసినదానను గాను. ఏవిధమున నామెతో ముచ్చ టింపవలయునో నాకు బోధించిన యెడల సమయముదొరకినప్పు డామెతోఁ జెప్పివచ్చెదను. ఇంతకన్న నాకేమియును జేతకాదని పలికినది.

అందులకాసుందరుఁడు సంతసించుచు మంచిది. ఆయలనాగతో మాట్లాడవలసిన తెఱంగంతయు నేను నీకుబోధించెదను. ముందునిన్నుఁ గొన్నిసంగతులడిగెదను దానికి సమాధానమిమ్ము? ఆతొయ్యలి నెయ్య ముతో నీతో మాట్లాడుచుండునా? నిత్యమామె యేమిచేయుచుం డును. ఆమెయందు భర్తయనుకూలుఁడై యుండెనా? అత్తమామల కామెయందెట్టి యభిప్రాయమని యడుగుటయు నాచెడిపె యిట్లని యెను. బాబూ! ఆమెచాలమంచిదానివలెఁ గనంబడును. నేను నిత్యము

వారింటఁ బనిచేయుటకేగినప్పుడు పెరటిలోనాకెప్పుడు నామె యొంట
రిగా గనుపింపలేదు. ఇంటచాకిరీ యంతయు నామెయొక్కతియే చేయ
వలయును ఆమె వెనువెంట నత్తగారు దిరుగుచుఁ దప్పులుపట్టుచుం
డును. ఏమనినను దిరుగుబాటుసేయును. మగనితో రాత్రియెప్పుడేగుచు
న్నదో నేనెఱుంగఁ గాని యుదయము మొదలు చీఁకటపడువఱకును
నామెనత్తగారు బానిసలాగునఁ బనిచేయించుచునే యుండును. ఆమె
యందేమినేర మారోపించిరో గాని కొన్నిదినంబులనుండి వీధిమొగము
జూడకుండ నామెకుఁ గట్టడిచేసిరి. పొగలంతయును నామెయంతరంగం
బునఁ గనిపించుచుండ నెవ్వరితోడనుమాట్లాడక వననియతంబులఁ దీర్చు
చుండును. ఇన్నినాళ్ళనుండి వారింట నేను బనిచేయుచున్నానుగాని
యామెనవ్వు మొగము నేనెన్నఁడును జూచియెరుంగను. ఇదియె యచ్చటి
వృత్తాంతమని జెప్పినవిని యతండిట్లనియె.

ఓసీ! నీవీదినమున వారింటికేగినప్పు డాయబలామణి యొంట
రిగా నున్నప్పుడెద్దియో మిషఁబన్ని సన్నిధికేగి యామెతో "నాఁడు
గోదావరీజలంబునఁ బడిన నీబిందెను వెతకి నీకిచ్చిన పురుషుఁడు నిత్య
ముమనయింటికి వచ్చినీ క్షేమమడుగుచునే యుండెను సుమా"యని
మాత్రముచెప్పుము దానికేమిచెప్పునోవిని నాకుఁ దెలియఁజేయుము.
నీయింటికి సాయంసమయమున వెండియు వత్తునని చెప్పిపోయి తిరుగ
యథాకాలమునకు దానింటికేతెంచి దానిరాకకై వేచియుండెను.

ఆముసలిదివచ్చి యాపురుషునిఁజూచి మందహాసము సేయుచు
బాబూ! మీరుబోధించిన మాటలు తడబడుచు నామెచెవినిట్లో పడ
వేసితిని. ఆమె నామాటలువిని మొగముపైకెత్తి నన్నుచూచుచు
నీసంగతి నీకెట్లు తెలిసినది. ఎవ్వరితోడను జెప్పకుసుమీ! ఇది మావా
రెఱింగిన దప్పువట్టి ఱంపమునఁ బెట్టికోయగలరని చెప్పుచుండగనే యత్త
గారచ్చటకువచ్చినది. నాతో నామె మాట్లాడుటకవకాశము గలిగినది

కాదు. కొంతసేపటికామెయొంటరిగా నేనున్నచోటునకువచ్చి ఓసీ! నీవా సుందరునెఱుంగుదువే? మనయింటికేమిటికి నిత్యము వచ్చుచుండె?నని యడుగుటయు నేను అయ్యో! ఆబాబును నేనెత్తిపెంచినదాననే! నాయం దాయనకు చాలయభిమానము నిత్యము నాక్షేమ మరయకుండ నుండ లేదుచాలమంచివాఁడని చెప్పితిని. నామాటల కాబోఁటి తలయూచుచు నాబిందెను వెదకుట కాతఁడానాఁటెంతకష్టపడెనకొంటిని. నిర్హేతుక ముగ నాకొఱకంత శ్రమపడవలసిన పనియేముండును. నాబిందినాకిచ్చి యతండెంతేని యుపకారముఁజేసెను. లేకున్న వీరు నన్నెంతబాధించు చున్నవారో నీవయెఱుంగుదువు. ఈసారి నీకతఁడు కనిపించి నప్పుడు మీాయుపకారంబున కేనెప్పుడు గృతజ్ఞురాలనని నాపలుకులుగాఁ జెప్పు ము. అనిచెప్పి యత్తగారు బిలుచుటచేత లోనికి రిప్పునఁ బోయెను. బాబూ! నాతోనన్నిమాట లెన్నఁడును బలికియెఱుంగదు నీయందామె కభిమానమున్నట్లామె ముఖలక్షణములఁబట్టి యూకలించుకొంటిని. తరువాతకృత్యము నీవ యాలోచించుకొమ్మని పలికెను.

మహానందుఁడా చేటికమాటల కానందముఁజెందుచు నామంద యానకుఁ దనయందనురాగముగలిగి యున్నదని నిశ్చయించుకొని యొక కమ్మనప్పుడే వ్రాసి దాని. నాదూతికచేతి కందిచ్చుచు ఓసీ! ఇఁకనీవే మియు నామెతో మాటలాడవలదు. ఈచీటి నాబోటికేకాంతమున నంది చ్చి ప్రత్యుత్తరముదెమ్మని పంపుటయు నది మఱునాఁడు వేఁగుజా మున యథాప్రకారముగాఁ దనపనికిఁ బోవుదానివలెఁబోయి యాయుత్త రమిచ్చి కొంతప్రొద్దెక్కునరికిఁ బ్రత్యుత్తరముఁదెచ్చి యామహానం దున కందిచ్చెను. దాని నాతండాత్రముతో విప్పి యిట్లని చదువ దొడంగెను.

గీ॥ అత్తరాకాశి మామగారతి కఠినుఁడు
మగఁడు నంశయాత్ముండు నామఱఁదిదుష్టుఁ

దాతపెన్నెలు రాగిలాదో నీకోడ
లెపుడు దెప్పెళ్లమాట యింకేమిసేతు॥

ఇట్టి కలుషకర్ముల బోనులో నిలిచికొంటి. దీనంచేసి నాప్రేమనమ్మ చున్నది. అనియున్న పత్రస్వరూపమును జూచి తన్మయుండనై తెలివి యు బ్బుచు నాబిడ్డనికిని మరల్చి యిదియు నేమో యుత్తరమువ్రాసి మడచి యామాతకిచ్చి నీవి నామెకందిమ్ము. ఈ రెండుమూడులు గైకొనుమనిచెప్పి దానిచేతిలో నాలుగైదుముంచఁ బెట్టెను. ఆచీటి నా యంబు జాక్షి కది యందఁజేసెను. మఱియు నాఁడు నాఁడుప్రకారము మహానందుఁడు వారింటికేగి యొంటిమెట్టలెక్కి నిర్ఘోషం ప్రోక్షించుచుండ లోనినుండి వానితల్లి తొందరగా వచ్చి నాయనా! నీభార్యకెద్దియో భూతమావేశించినట్లున్నది. తలవిరియఁబోసికొని కనబడిన వారినెల్లఁ దిట్టుచుఁ గొట్టుచు గృహము తయ భీభత్సముఁ జేయుచున్నది. వేగవచ్చి ప్రతిక్రియచేయుంపుమని పలుకఁగయు నాయనమాయకుఁ ములికిపడి లోనికి పరువెత్తుకొని పోయెను. మహానందుఁడును నేనుగలుగ వెలుననేల భూతప్రేత పిశాచబ్రహ్మరాక్షసాది గణంబులెల్ల నాపేరు వినినంత మాత్రమునఁ బటాపంచలు గావలసినదే! నాగురునర్యుని కటాక్షమువలన నేనట్టి గట్టిదౌ భూతములనైన పాఱఁదోలఁగలను. మోహన స్తంభనోచ్చాటన మారణక్రియలయందు నేనాఱితేఱిన వాఁడను. భయపడకుఁడని పలుకుచు వానివెంట లోనికరిగెను.

మహానందు వచ్చినవారెల్ల భూతవైద్యుండని నమ్మియామె కావేసించియున్న గ్రహంబును బాఱదోలి యాయుపద్రవంబుడుపుమని ప్రార్థించుచు వానిని సత్వరమ యంతర్గృహంబునకుఁ దోడ్కొనిపోయి యాయుబలం జూపించిరి.

మిత్రుని యిల్లాలిబాధించు గ్రహబాధ దీర్ప నన్నింత యడుగ వలెనా! అనిపల్కుచు మహానందుఁడు లోనఁబ్రవేశించునవలకా చకోరాక్షి

మేనంగల యాభరణంబులన్నియు నూడఁదీసి యిటునటు పాఱఁజిమ్ముచు నోటవచింపరాని దుర్భాషలఁ గనంబడిన వారిం దిట్టుచు చేతికందినవస్తు వెత్తి సన్నిధింజేరఁబోవు వారినిఁగొట్టుచు నతిభయంకరాకారంబున నిల్లెల్ల గగ్గోలుచేయుచుండెను. "నీవెవ్వతవు? ఈరాకేందుముఖి నేమిటికి బాధించెదవు? నీకెద్దియైన గోరికయున్నఁ జెప్పి మాచేఁ దీర్పించుకొనుము" అనిదూరమునుండియే యాయింటఁగలవారు పలుకుచుండిరి. గాని యొక్కఁడును యామెయొద్దకుఁ బోవ సాహసించువారు లేకుండిరి.

ఆయబలయు హుమ్మని యాఁడుగఱచుచు నన్నుమీరు మరచిపోయితిరా! మీకింతకంఠకాఠరమా! రెండేండ్లనుండి తిండిలేక మలమల మాడిపోవుచున్నానే! చచ్చినవాఁడు నోటనున్న గొట్టుకొని, వాఁడేపో యెనని నన్నిట్లుపేక్షించెదరా! ఒక్కనాఁడైనను నాయుఁకలితీఱునట్లుగడ్డగట్టిన బట్టెపెరుగుతో నాపేరుజెప్పి యెవ్వనికైన భోజనముపెట్టిన పాపమునకుఁబోయినారా! నేతితోఁజేసిన యప్పములన్న నాకెంతప్రీతియో మీరెరుంగరా! అట్టివికడుపునిండ నాకెన్నఁడైనఁ బెట్టితిరా! మిమ్మందఱ నేమిచేసినను దోషములేదు. మీపైఁబడి మిమ్మందఱ విఱుచుకొని కఱకఱ నమిలివేయువఱకు నాపరితాపము చల్లారదు. అని యేమేమోబిగ్గరగా నఱచుచుఁ గన్నులెఱ్ఱజేయుచుఁ దలవిరియఁబోసికొని ముందునకు వెనుకకు నూఁగుచు హుమ్మనుచు నిటునటు గంతులువైచుచు, నేలకొరగుచుఁ బైకిలేచి యెదురనున్నవారిపై లంఘించుచు, నిటులనట్టహాస మొనరించుచుండెను. "ఆయింటి యజమాని కడగొట్టుకొడుకు రెండు సంవత్సరముల క్రిందటనే మృతిబొందియుండెను. వానికి పిన్ననాఁటినుండియు గెడ్డపెరుగు నేతియప్పములు మిక్కిలి ప్రియములు" వాఁడేయీసతి నావహించి యున్నవాఁడని యచ్చటివారెల్లరు నిరూపించి వానిం దలంచుచు గ్రుడ్లనీరు గ్రుక్కుకొనువారును వెక్కివెక్కి యేడ్చువారును నీకెట్టిగతిపట్టినదిరా! అని విలపించువారును నీవుకోరినట్లు నేనేటపెట్టుచుం

దుమని దండములు పెట్టువారునునై యా ప్రదేశమంతయు గలవరపడుచుండిరి.

ఇట్టిసమయంబున మహానందుఁడందుఁ జేరి యెల్లర దూరముగాఁ బొండని చెప్పుచు నత్తలోపతి కెదురుగాఁ దిరిగి హుంకరించుచు నేనెవ్వఁడనో యెఱుంగుదువా? నన్నుఁ దిన్నగా చూడుము! నీయాగడములు నాసన్నిధిని పనికిరావు. నీయట్టిభూతముల నేవురమారణముఁ జేసినమహానందుఁడనిగా నన్ను దెలిసికొనుము. అని పలుకుచుండఁగనే యాప్రోయాలు తటాలునలేచి వికటహాసము గావించుచు నీవెవ్వఁడవు! ప్రాణములమీఁది యాస వదలికొని యిందువచ్చితివని తోఁచుచున్నది రమ్ము నీపీచమడగింతు. నీమంత్రతంత్రములు నాయొద్ద పనికిరావు నీపనిపట్టెదఁ గాచుకొమ్మని హుమ్మని వానిపైఁబడెను. అచ్చటి వారెల్లరు బాబో! యని పెద్దయెలుంగున నచ్చటనుండి యొకరినొకరు త్రోసికొనుచు పాఱిపోయిరి.

మహానందుఁడు మంత్రవేత్తవలె "హ్రాం హ్రీం క్లీం హుం ఫట్" అను బీజాక్షరము లేవియో యుచ్చరించుచు నామె పట్టుతప్పించుకొనుటకుఁ బెనంగువాఁడువలె నాసుందరిమర్మస్థానంబులెల్ల ముట్టుచు శిరంబు మూర్కొనుచుఁ జుబుకంబుఁ బుణుకుచు, శిరోజముల నిమురుచుఁ, జెక్కిలిముద్దుఁగొనుచు, నధరంబునంటుచు, కంఠంబు దృఢాశ్లేషంబొనర్చుచు, మదనోన్మాదంబున నామె స్వాంతంబును రంజిలఁ జేయుచుండెను. ఆమెయు వానిపైఁబడి నిర్జించునది పోలెఁదదంగముల నాలింగనంబొనర్చుచు, మోముగఱచుచు, మోహావేశంబునఁ దత్సమయోచిత క్రీడల మైమఱచియుండెను. (ఆమోహనాంగిఁ నావేశించియున్నది మదనగ్రహమేగాని మఱొండెద్దియుఁగాదు వారిరువురుం గలసికొనుటకీయుపాయముంబన్ని మహానందుడు ముందుగానామె శిక్షింగించియే యుండెను.) ఇట్లువారిరువురు నొకరినొకరు జయించు నభిలాషను

ద్వంద్వయుద్ధమొనరించుచుండఁ దలుపుసందులనుండి నాయింటివారెల్లఁ దమ్ముఁజూచుచుండుట గ్రహించి, మహానందుఁడామెతో నికఁజాలును నీయుద్రేకమిఁక నుపసంహరింపుమని సాభిప్రాయముగాఁ బలికెఁబిగ్గరగా చాలు! చాలు! నీవింకను బెంకితనముఁ జేసితివేని మారణహోమంబున నిన్ను భస్మంబొనరింతు. నాప్రభావమిప్పటికైనఁ దెలిసినదా? అని చిటికెలువేయుచు నేదియో మంత్రంబుచ్చరించుచున్నట్లు పెదవులు గదల్చుచు ముమ్మారామె మొగంబున నూదెను. తోడనే యాచేడియ నేలపై కొఱగి సొమ్మసిల్లినట్లు పడియుండెను. అంత మహానందుఁడా యింటివారి నుద్దేశించి యింక భయములేదు బ్రహ్మరాక్షసుఁడీమెను వదలి పాఱిపోయెను రండు! రండు! అని పిలిచినంతనే వారెల్ల రందు గుమిగూడి నివ్వెఱపడసాఁగిరి. వారింజూచి మహానందుఁడు అబ్బా! ఎంతకష్టపెట్టినది. ఇట్టిమొండిదయ్యము నెందును గనివినియెఱుంగను. మహామంత్రవేత్తనగుటచే దీనికిఁ జిక్కక యీవలఁబడితినిఁ గాని సామాన్యుఁడైనచో నిష్కారణముగ దీనిచే నేఁడు చావవలసినదే! దీనినింతలోఁ బోనిత్తునా! మారణకర్మంబునఁ బేరులేకుండఁ జేయకుండిన గాని నాకోపము జల్లాఱదు. అనుటయు వానిమంత్రశక్తి నెల్లరును బెద్దగానగ్గింపఁ దొడంగిరి.

ఆధూర్తురాలి భర్త మహానందుని మోముపలక్షించి అయ్యో! మిత్రమా! నీముఖమంతయు నెట్లుగంట్లు పడియున్నదో? నిన్నాభూతము మిక్కుటముగా ఱక్కినట్లున్నది రక్తమెట్లు శ్రవించుచున్నదో! పాపము నేఁడు నామూలమున నీకు నిష్కారణముగా బాధగలిగినది. క్షమించుము. ఈభూతము తిరుగ నిందుఁబ్రవేశింపకుండ మార్గమాలోచింపుము. మిత్రునిరక్షింపుమని వేఁడుకొనుటయు నాడాంబికుఁడు వెండియు నిట్లనియెను.

మిత్రమా! మిత్రకార్యముదీర్చుటకు నన్నింతఁబెద్దగాఁ బొగడ వలయునా? ఆభూతము నీవు తలంచినట్లు పెఁబడి రక్కటచేతనే నాము ఖంబున నిట్లు గంట్లుఁగలిగినవి. వీనికేమి? మఱునాటికి మానగలవు.

నీయిల్లాలి నావేశించినదొక గొప్పపిశాచము. దీని నుపేక్షింప రాదు. కొన్నిదినంబు లతి నిష్ఠతో మంత్రబద్ధంజేసి యుచ్చాటనంబునఁ గాని మారణంబునఁగాని నిర్జింపవలయు నూరకున్న నిదితిరుగఁబ్రవే శించి యెల్లర బాధింపఁగలదని పలుకుటయు, నతండులికిపడి నాయందుఁ దయదలంచి యిందులకుఁదగిన ప్రతిక్రియ నీవయాలోచింపుము. మాకు లమునెల్ల రక్షింపుము. అని ప్రార్థించుటయు మహానందముఁడు శిరఃకం పంబొనర్చుచు మీకిష్టమున్నయెడల నొకటి చెప్పెద నట్లుచేయుఁడు. "నీభార్యతో కొన్నిదినంబులవఱకు నెవ్వరును మాటలాడకూడదు. ఆమె కంట నెవ్వరునుబడఁగూడదు. ఆమెనొక మాఱుమూలగదియందు బంధించి యుంచవలెను. నిత్యకృత్యములఁ దీర్చుకొనుటకుతక్క మఱె ప్పుడు నీవలకు రానీయఁగూడదు. ఆమె నిద్రాభోజనాదులకు వలయు సదుపాయంబులన్నియు నాగదియందే యేర్పఱుపవలయును. మఱియు నందుఁ బంచవర్ణముల ముగ్గులుపెట్టుట కనువగు పదార్థము లను, నిర్మలజలపూరితమగు పాత్రంబును, ధూపదీపనైవేద్యంబులకుఁ గావలసిన సంభారములను, సిద్ధపఱచి యుంచవలెను. నేనుప్రతి దినమును గొంతకాలమువఱకు సంధ్యాసమయంబులవచ్చి యాగది యందుఁ బ్రవేశించి పంచవన్నెలతో ముగ్గులువ్రాసి యందామెను గూర్చుండఁబెట్టి యిష్టదేవతలనారాధించి నామెనావేశించిన మహాభూత మును వశముజేసికొందును. నేనందు మంత్రతంత్రముల నెఱపునప్పుడా ప్రాంతముల కెవ్వరును రాఁగూడదు. అట్లేతెంచిన నాకుఁ బ్రాణసంకట ముగలుగుటయే కాక నీయింటివారికెల్ల ననర్థము రాగల" దని పలికియూ రకుండెను. అందులకు నాయింటివారెల్ల నొడంబడి యెట్లయిన నీభూత బాధ దప్పింపుమని వానిఁ బ్రార్థించిరి.

నాఁటి సంధ్యాసమయంబున వెండియు వత్తునని జెప్పి యామా యావి తనయింటికరిగి తిరుగ యథాకాలమునకు శృంగారముగా నలంకరించుకొని నొసటపైఁ గుంకుముబొట్టు దట్టముగాదిద్ది చేత నొక పేపబెత్తమును గైకొని యాయింటికే తెంచి యందామెనుంచిన గదిలోనికిపోయి తలుపు లోనబిగించుకొనియెను. అందు ముందుగా గొన్ని మంత్రతంత్రములు పైవారికి దెలియునట్లొనర్చుచుఁ బంచరంగులఁ ముగ్గులువెట్టియిష్ట దేవతారాధనముసేయుచున్నట్లు నటించి యచ్చటివారెల్ల దూరముగాఁ బోయిన నవగ్రహించి మించిన తమకంబు నిష్టోపభోగంబుల నాయింతికి సంతుష్టిఁగలుగఁజేసెను.

పిమ్మటఁ బ్రతిదినమిట్లేనాయంగనామణిం గవియుచు నింటివారికి నమ్మకము బుట్టునట్లు నటించుచు మహానందమనుభవించుచుండ యొకనాఁడాముద్దుగుమ్మ యావిటునితో నిట్లనియెను.

మనోహరా! కపటమార్గంబున నెన్నినాళ్ళు సుఖపడఁగలము మనగుట్టెట్టులైన బట్టబయలైనవో నెంతప్రమాదము సంభవింపఁగలదు. లోకమెఱుంగకుండ నీబందిగంబున నెన్నినాళ్ళిట్లుండఁగలను. మన స్వేచ్ఛకుఁదగిన యుపాయమేదైన యాలోచించి నన్నుద్ధరింపుము. నేనెట్టులైన నీదాననేకదా? నిన్నెడబాసిన నాకుబ్రతుకు నాసయెక్కడిది! నాకుపెండ్లిమగఁడువద్దు నిన్ను మనఃపూర్వకముగా బ్రేమించుచున్నాను నీవె నాభర్తవు నీవెక్కడనున్న నక్కడనుండుటయే నాయభిమతంబు నన్నెందేని నీవెంటఁదీసికొనిపొమ్ము. నిన్నువిడిచియుండఁజాలనని దీనతతోఁ బలుకుటయు, మహానందుఁడు మహానందమున దేశాంతరమునకు వచ్చుటకిచ్చగింతువా? అని యడిగిన నప్పఁడతి యందులకు సమ్మతించినది. నాఁడు మొదలామదనతి నిల్లువెడలించు నుపాయ మాఱయ

పిదప నాయిల్లాలి భూతబాధ కొన్నిదినంబులకుఁ బూర్తిగా తగ్గి పోయినది. ఇఁక మంత్రతంత్రములతోఁ బనిలేదు. భూతోచ్చాటనము జేయఁబడినదని మహానందుఁడు ప్రగల్భములు చెప్పఁబోదంగెను. వానిభూతవశ్యమును వినినవారెల్లరును వేనోళ్ళఁ బొగడఁదొడంగిరి. ఆ యింటివారెల్లరును వానిని తమపాలింటి దైవముగాఁ బ్రశంసింప సాఁగిరి.

ఆయింటికోడలికి యేకాంత వాసక్లేశము దప్పిపోయినది. ఆమె నెప్పటివలె గృహకృత్యములలో రాపాడఁ దొడంగిరి. మహానందుఁడు పూర్వపురీతి మిత్రసందర్శనమునకు వారింటికి వచ్చుచు బోవుచుండెను.

—• మహానందుని కథ. 318వ మజిలీ. •—

ఇంతట కొన్నిదినములకు ప్రియంవదతల్లికి చాలజబ్బుగానున్న దనియు గూఁతునల్లునిఁ జూడవలయు నను నపేక్షపై జీవించియున్న దనియు వెంటనే రానియెడల చూపులుదొరకుట దుర్ఘటమనియు వర్త మానము వచ్చుటయు నందులకెల్లరును విచారమునుపొంది నాఁటిసూ ర్యాస్తమయసమయమునసనే, యాదంపతులు శకటారోహణ మొనరించి ప్రయాణము సాఁగించిరి. ఆయూరికి వారేగవలసిన పురము కొన్నియా మడల దూరముననున్నది. మార్గమంత సరళమైనదికాదు. నడుమ దట్ట మైన యరణ్యప్రదేశములు దాఁటవలసియున్నవి. మార్గమున భయము లేకుండుట కిరువురు పరిచారకులఁ దోడుగాఁదీసికొని పోయిరి. మహా నందుడీ యుదుతం బెటెంగి లగిన సన్నాహముతో వారెఱుంగకుండ వారివెంట బయలుదేఱి పోయెను. బండిమీఁద ముందు శకట చోదకుండును లోపల భార్యాభర్తలును గూర్చునియుండిరి. పరిచార కులు వెనుక నడచుచుండిరి. వారట్లు చాల రాత్రివఱకు పయనము సాగించిరి.

పిమ్మట బండిలోనివారు గాఢముగ నిద్రావశులై యొడలెఱుం గకుండిరి. బండికిఁ గట్టినయెడ్లవ దలించువారులేక గడియకొకయడుగు

వైచుచు నడువఁదొడంగినవి. వెనుకవచ్చు సేవకులు నిదురమైకమున జోఁగుచు నడచుచుండిరి. అట్టిసమయమున నాకసము మేఘావృతమై యుండుటచేఁజుక్కలవెలుగైనలేకుండ నంధకార బంధురమై యొప్పెను. పరిచారకులలో నొకఁడు వెనుకయై నడచుచుండ వెనుకనుండి హఠాత్తుగా వానిమెడమీఁద వాడియైన యడిదపు వ్రేటుపడి తలను దేహమునుండి వేరుచేసినది. ఆసమయంబున వాఁడు వేసిన చావుకేక విని రెండవవాఁడు వెనుకకుఁదిరిగి భద్రా! జడుసుకొంటివాయేమి? చీఁకటిలో వెనుకఁబడితివేమి? అని వెనుకకుఁదిరిగి వానికొఱకు వెదకుచుండగా వెనుకనుండి చండగతి నిశితాసియొండు వానిమెడపైఁగూడఁబడి కుత్తుకను త్తరించెను. ఉత్తరక్షణమున నొకవ్యక్తి బండిప్రక్కకు బిరబిర నడచివచ్చెను. అప్పటికిని బండిలోనివారు గాఢనిద్రాముద్రితులై యుండిరి. బండిముందు తొట్టిలో నిద్రించు నాబండివాని నావ్యక్తి కత్తి యెత్తి యొక్కవ్రేటున నఱికివైచెను. ఆసందడికి బండిలోనిద్రబోవుచున్న దంపతులకు మెలకువ వచ్చినది. ఆబండినుండి పురుషుఁడు దిగి యదియేమియోయని యటునిటు చూచుచుండ సమీపముననున్న యాఘాతకుఁ డాపురుషుని పైఁబడి యూఁదలంబట్టి వంచుచు దుష్టుఁడా! నీయాలినావేశించిన పిశాచముగా నన్నెఱుంగుమని చేతనున్న గౌక్షేయకధార వానిమెడను త్తరించి వెంటనే బండిముందునకేగి దానికిఁగట్టఁబడియున్న యెడ్లను విప్పివేసి యందొకమూల భీతచేతస్కయై నక్కియున్న నాఁమదవతి సన్నిధికేగి యబలా! భయంపడకుము! నేనునీకుశత్రుండనుగాను మహానందుడను సత్వరము బండిదిగిరమ్ము? మనయానందమునకభ్యంతరమగు నీమగఁడు గతించెను. పరివారమును శూన్యమయ్యెను. మనమిఁక నిర్భయముగా నెందేనియుం బోవుదమురమ్ము? అని పిలుచుచుండఁగనే యామెనివ్వెఱపాటుతో బండిదిగి యాపురుషుని గౌఁగిలించుకొన్నది. మహానందుఁడపరిమితానందంబుననామెతోనిట్లనియె. నాతీ! మన

మీవేషములతో నెచ్చటికేగిన ననుమానింతురు వనము గమ్యస్థానము చేరువరకీ కాషాయాంబరముల ధరించి విరక్తులవలె మెలంగవలయునని పలుకుచుఁ దనవెంటదెచ్చిన శేగురుగుడ్డ లాపై దలి కిచ్చెను.

ఆమాటలు విని నాప్రియురాలు ప్రియా! మాతల్లి నచ్చుప్రాణము బోవుసమయమునందు మీపై నున్నవంట యామెనుజూడ వలదా! అనుటయు నామహానందుఁడు మందస్మితంబునఁ బ్రాణేశ్వరీ! నిజముగా నీతల్లికిఁ బ్రాణముమీఁదకి వచ్చినదనుకొనుచుంటివా? యీవ్రయంతయు నాచేగల్పింపఁబడిన వ్యాజము. ఆయుత్తరమునేను వ్రాయించి మీవారికిఁ బంపితిని. మీతల్లి కేమియు జబ్బులేదు. ఇంటసుఖముగా నున్నదని పలుకుటయు నావెలంది నిన్నేఁబడును నెంత మోసముపన్నితివి? నేనైన నీకపటము గ్రహింపలేక పోయితిని. సర్వము నీవేయని నమ్మియున్న నాకు మాయమ్మవినాశము కూడఁగలంప నక్కఱలేదు నన్ను నీయిష్టమువచ్చినచోటికి దీసికొనిపొమ్మని పలుకుచు నప్పుడే యోగినీవేషము వైచికొనెను. మహానందుఁడు యోగివేషము వైచుకొని యాకోకస్తని వెంటరా నా యరణ్యమును బట్టి నడివడిగా నడచిపోయెను.

గీ. మగనిఁ బంపి కొంపమాపి బంధువులను
సిగ్గుపుచ్చి తల్లి కెగ్గు వెట్టి
జనకుఁ దూరఁజేసి జారుతోఁ జని లేవ
దిగులు సేయనోప రింతులకట!.

ఉ. ఆ పెనుచీకటింబడి రయంబునఁ బోయెడువేళ వానితో
నాపె హితానులాపముల నాడదుగాని మహోగ్రమార్గయా
తాప్రపృథు ఖేదమింత యుహింపంబని పల్కదు దర్పకాస్త్ర సం
తాపితచిత్త లెన్నఁడును దక్కినబాధల నెన్నరాత్మలన్.

వ. అట్లు వారుపయనము సాగించి యుదయము జాముప్రొద్దెక్కినయనకొక కోయపల్లెఁజేర నరిగిరి. అచ్చట మహానందుఁ డమన్న

యూరిపెద్దయిల్లడిగి తెలిసికొనియచ్చటికిఁ బోయెను. ఆకోయపెద్దవీరనాయకుండను వాఁడు వారింజూచి భక్తితాత్పర్యంబుల గౌరవించుచు నందొక జట్టిగుడిసె యందు వారికి బసయేర్పరచి చేతులుజోడించి నమస్కరించుచు మహానందునితో నిట్లనియె.

మహాత్మా! మీరెవ్వరో మహాయోగులవలె నున్నారు. మా పూర్వపుణ్యము మంచిదగుటచేత నేడిందు మమ్ముఁధన్యులంజేయ నేతెంచితిరి? ఇప్పుడు మీరెందుండి యెచ్చటికిఁ బోవుచున్నారు? మీవృత్తాంతము సాంతము నా ... ప్ప యనుగ్రహింపరే! యనుటయు నతండిట్లనియెను.

పెద్దా! నీయు ద్ది ... గుణంబున కేమెంతయు సంతసించితిమి. సర్వసంగపరిత్యాగులమగు మాకొక నియామకములేదు. సర్వప్రపంచకమును మానివాసస్థానమని జెప్పనొప్పు! ఇప్పుడు మేము రామేశ్వరమునుంచి వారణాసికి గంగా పుష్కరతీర్థయాత్రకు బోవుచుంటిమి. పాపపంకిలములగు జనపదంబులఁ జొరనొల్లక ప్రకృతి రామణీయకంబునఁ బరమేశ్వరున్ స్వరూప స్వభావంబులఁ బ్రదరించు నరణ్యమార్గంబులం బట్టిపోవుచు నేఁటికిచ్చోటికి వచ్చితిమి. ఈయోగిని మాశిష్యురాలు బాల్యంబుననే పూర్వభవపుణ్యాతిరేకంబున విరక్తయై యనన్యజ భక్త్యుద్రేకంబున నన్నాశ్రయించి నావలన తత్త్వోపదేశంబును బడసి నన్ననుసరించి తిరుగుచున్నది. నీవు కడుయోగ్యుడవువలెఁ గన్పట్టుచున్నావు. నీభక్తివిశ్వాసముల కెంతయు సంతసించితిమి. మేము పుణ్యప్రాదయుండవగు నీకుటీరమున నించుక విశ్రమింప నేతెంచితిమి. నీవు కిరాతజాతియందు జన్మించినవాఁడవగుటచే నీయింటభిక్షసేయరాదు. అయిననేమి, నీయింటియావరణలో నీవిచ్చు పదార్థములతో స్వయంపాకముచేసి కొని బిక్షుగుడుచుట కంగీకరించితిమి. అందువలన యతిభిక్షాఫలము నీకు తప్పక సిద్ధింపఁగలదని పలుకుటయునాయమాయకుండుప్పొంగుచు నప్పుడే

వలయు వస్తుసంచయంబెల్ల దెచ్చి వారిముందు భక్తితోఁ బెట్టెను. అక్కమహానాయతి నారాయణస్మరణ పూర్వకంబుగా నాపదార్థముల నెల్లగ్రహించి యందొక వివిక్తప్రదేశంబున శిష్యురాలిచే వంటచేయించి యందిఱువురు తృప్తిగా భుజియించిరి. ప్రియంవదయు నలసటంబొందియుం డుటచే నందొక చోటఁబరుండి గాఢనిద్రాముద్రితయై యుండెను. మహా సాధువని నాసన్యాసిని మహాయోగియని నమ్మి యతని సన్నిధికేతెంచి యతిశిరోమణు లట్లని స్తుతించుచుఁ దనయూరిట నింకను గొన్నిదినంబు లుండవలెనని ప్రార్థించెను. కాని యావిన్నపముల కంగీకరింపలేదు. ఆరాత్రి నీయింటఁ బరుండి యుదయమునకు మున్నె మేము దేశాంతరము పోవుదుమని చెప్పి తిరుగ నారాత్రి భుక్తికిఁ గావలసిన పదార్థములు వాని నిమ్మనికోరెను.

వాఁడును మహాసంతోషంబునఁ గావలసిన పదార్థములకన్న మిన్నగాఁ దెచ్చి యొసంగెను. నాఁటిరాత్రియుఁగూడ నాయతి యాపల్లెయందే గమనశ్రమవాయుటకుఁ గడపి వారిచ్చిన పదార్థములతో మిగిలినవెల్ల మూటగట్టుకొని వారు వేకువజామున లేచి యొందేనియుం బోయిరి. కోయ దొరయిచ్చిన సామగ్రి మూఁడుదినములవఱకు సరిపోవుటవలన నొరుల పేక్ష్యములేకుండ నరణ్యమార్గంబున వారు పయనంబుల సాఁగించిరి. నాల్గవదినంబున తిరుగ భిక్షకై యెచ్చటేని జనపదంబులకుఁ జేరవల యునుగదా! అని వడివడినడచుచు నాఁటి పగలు రెండుయామముల వేళకు రామనగరమను పట్టణముఁ జేరగలిగిరి.

ఆఁకటి చిచ్చుపెచ్చుపెరిగి కడుపు దహించుచుండ నతికష్ట మున కాళ్లీడ్చుకొనుచు నాపట్టణమున నొకసత్రములోనికిఁ బోయిరి. అందొక పుణ్యాత్ముండు బిచ్చగాండ్రకెల్ల సంతర్పణ మొనరించుచుం డెను. ఎట్లయినను నాకలియడంచుకొనుట మేలని యాబిచ్చగాం డ్రతోఁ గలసి యొకమూలఁ గూర్చుండి వారిరువురు గడుపుమంటఁ జల్లార్చుకొనిరి.

పిమ్మట నాయూరుంగల బైరాగుల మఠములోనికింబోయి యందు నివసించిరి. ఎండకన్నెఱుంగకుండ సుఖముగా నింటికడనుండి కాపురముచేయుటకన్న యాచెడిపెకు మారుమొగనితో తినరానితిండి దినుచు పడరానిపాట్లుఁబడుచునుండుట సంతోషముగానున్నది. మహానందుఁడా రాత్రి రెండుజాములు దాఁటినపిదప లేచి యంతకుపూర్వము గురుతుచూచుకొనియున్న యొకసంపన్న గృహస్థునింటికి మారు మూలఁగన్నము వైచి లోనఁబ్రవేసించి కొంతధనము సంపాదించుకొని వచ్చి వేగుజామువాకమున్న యామెచ్చికంటిఁదోడ్కొని యాపురంబు విడిచి దూరమందున్న రాజదుర్గంబను మఱొకనగరము ప్రవేశించెను. మఱియు వారు మార్గమధ్యమందే బైరాగివేషములు దీసిపారవైచి పూర్వపువేషముల ధరించియుండిరి. వారాపట్టణంబున నొకసత్రములో బసజేసిరి. చౌర్యముమూలమున సంపాదించిన ధనముంముటంజేసి కొంత కాలము స్వేచ్ఛగా భుజించిరి. ఆయూరిలోవారు గొంతకాలము గౌరవ వేషములతో భార్యయు భర్తయువలెఁ గాపురము సేసిరి. మహానందుఁ డందుగల కితవులుగొందఱితో మైత్రిఁజేసెను. ఆతఁడక్షక్రీడయందారి తేఱిన వాఁడగుటంజేసి దానివలన గెలుపొందిన ధనముతోఁ గొంతకాలము కాలక్షేపముజేసెను.

## —♦ 349 వ మజిలీ. ♦—

ఒకనాఁడు మహానందుఁడు మిత్రులతో ద్యూతక్రీడాభిరతుండై యున్న సమయంబునఁ బ్రసంగవశంబున డాంబికముగా స్వర్ణయోగంబెఱుఁగుదునని చెప్పుటయు నాకితవులలో కొందరైన వానినుండి యా యోగము నెఱింగి భాగ్యము సంపాదింపవలెనను నాశగలుగుటచేఁదరు చువారు మహానందు నాశ్రయించి తిరుగుచుండిరు. ఇట్లుండ వేఱొక నాఁడు వారినిర్బంధముఁబడఁజాలక యాయోగముచేయుటకు ముందు కొంతధన మవసరము. కొన్నియమూల్యవస్తువుల సంగ్రహించి పిమ్మట

స్వర్ణాధిదేవతకుఁ బ్రీతిగా నొకమహాయజ్ఞముఁజేసి యాయజ్ఞకుండ మందలిభస్మముతో స్వర్ణము సృజింపవలయును. పిమ్మటఁగూడ గొన్ని దుష్కరక్రియ లాచరింపవలయును. స్వర్ణయోగమన్న మాటలతోనున్న దనుకొనుచుంటిరాయేమి? ఈమహాయోగ మొక మహాయోగీంద్రునిఁ బెద్దకాల మాశ్రయించి సంపాదింపఁగలిగితిని. అట్టిదానిని మీరడిగినంత తెలియఁజేయుటకు నేను లోకజ్ఞానమెఱుంగని మూఢుండ ననుకొంటిరా? అందని మ్రానిపండ్లకై యఱ్ఱులుసాఁచుటకుఁ బూనుకొనక యున్నదానితోఁ దృప్తింబొందుఁడు! పొండు! అని వారినదలించెను.

వారును తమమిత్రునకు నిక్కముగ బంగారు యోగముదెలియునని నమ్మి దురాశాపిశాచము హృదయంబున వేధించుచుండ నామహానందు నతివినయంబునఁ బ్రార్థించుచు మిత్రమా! మాకాయోగము దెలుపనక్కఱలేదు వేయిమాడల బంగారముజేసినీవ మాకిమ్ము. దానితోఁ దృప్తిఁబొందెదము. ఇందుల కెంతధనము గావలయునో? యేమిచేయవలెనో? జెప్పి మమ్మనుగ్రహింపుము. ప్రాణస్నేహితులమగు మాదారిద్ర్యముఁ బాపుమని దీనాననులై బ్రతిమాలుకొనుచున్న యక్కితవుల కా ధూర్తాగ్రేసరుం డిట్లనియె.

మిత్రులారా! మీమాటలకు నేను మొగమోటము జెందవలసి వచ్చుచున్నది. మీకోరికతీర్చివేయ జాలకున్నాను. ఏదియోమాటల సందడిని పొరబాటున నాఁడు నానోటనుండి యీమహాయోగ విషయము వెల్వడినది. మీరెంత బలవంతముజేయుదురని తెలిసిన నిక్కము నీసంగతిఁ దెలియఁజేసి యుండను. అంతవఱకు ప్రమాదమునకైన నెవ్వరిసన్నిధిని నియ్యుదంతంబు వెలిబుచ్చకుండ నతిజాగరూకతతోఁ గాలక్షేపముఁజేసికొని వచ్చితిని. దైవికముగా నిప్పుడు మీకుఁదెలియఁ జేయుటఁ జూడ నిది దైవసంకల్పమై యుండవచ్చును దైవమునుమీఱువారెవ్వరును లేరుకదా! ఈవిధంబున మీకు ధనయోగ మున్నదికాబో

లును! మంచిది. మీకునిక్కముగా నీయోగము నాచేతఁజేయించు పూన్కిఁగలిగియుండిన నేఁజెప్పినట్లు చేయుచుండుఁడు. స్వర్ణదేవతా యాగ సామగ్రికొనుటకు వేయినిష్కములు గావలయును. ఈధ నము ముందుగ సమకూర్చుకొని వచ్చినపిదపఁ దక్కినపద్ధతులన్నియు దెలియఁజేసెదనని పలుకుటయు వారుఁ గులుకుచుఁ బోయితమయాస్తు లతాకట్టుఁబెట్టి మఱిరెండుదివసంబుల కామొత్తమును మహానందుని యెదుటఁ బెట్టిరి. ఆసొమ్మంతయు మూటకట్టుకొని మందస్మిత సుందర వదనారవిందుఁడై మహానందుఁడు వారితో అబ్బా! మీపూన్కిను గొనియాడవచ్చును. మీకుఁగావలసినంత బంగారపుముద్దఁజేసి యిచ్చె దను. యీధనముతో గావలసిన సాధన సామగ్రినంతయు నేఁడే సమ కూర్చుకొందును. స్వర్ణదేవతాయజ్ఞమన్న మాటలలోనిదికాదు. దీక్ష గానొకపక్షముదివసము లాచరింపవలెను. ఇంతకష్టపడుచున్ననాకు యజ్ఞ దక్షిణతక్కువయుండరాదు. మిత్రులనుండి యెక్కువగఁ బుచ్చుకొను ట యుచితమైనపనిగాదని నేనెఱుంగుదును. కావున నీకొక వేయినిష్క ములు మాత్రము నాకు దక్షిణగా మీరు ముందు సమర్పింపవలయు ననుటయు వాండ్రించుక సంశయించుచు మిత్రమా! యీమాట మొద టనే చెప్పరాదా! అప్పుడే యేకముగా నెచ్చటనో తంటాలుబడి తేకుం దుమా! మాయాస్తులఁ దాకట్టుపై రెండువేల నిష్కంబులు కావలెనని మొదటనే ఋణదాతలఁగోరి యుందుముగదా! వెండియు మఱొక్క వే యిగావలయునన్నవారే మందురో దెలియదు. అయినను సాధ్యమై నంతతొందరగా నీవన్న మొత్తముఁగూడ సిద్ధపఱచెదము. సత్వరము యాగదీక్షకుఁబూని మమ్ముఁగృతకృత్యులం జేయుమని తొందరపెట్టు టయు నాకపటియిట్లనియె మిత్రులారా! లిప్తకుదిరినగాని నిష్ఠకుదరదను నార్యోక్తి మీరెఱుంగదనికాదు. యజ్ఞదక్షిణవిషయము యుచితజ్ఞు లగుమీకు నేనుమొదటనే జెప్పవలసియుండునని యనుకొనలేదు.

లేకున్న నప్పుడే జెప్పియుందను. ఊరక కంచిగిరుడ సేవయను సామెత వడువున వృథాయాసపడవలయునని నిరాకరించితురని నేనుదలంపనైతి ననుటయు వారింతకు నచ్చినపిదప మిన్నకుందుమా! రేపటికామొత్తము గూడ నెట్లో తెచ్చి నిూకర్పింపగలమని పలికి యవలకుంబోయిరి. మఱు నాడాబాలిశులు సన్నిహితుండగు నొకప్రభుత్వోద్యోగి నాశ్రయించి స్వర్ణయోగమున లభించినదానిలో సగనికింగూడ నొకనంతు నిచ్చెదమని నచ్చజెప్పి యప్పుడే వానిమొద్ద వేయినిష్కములు సంగ్రహించి మహా నందునకిచ్చిరి. అతండు నాండుమొదలు పదిదినములవఱకు తాను యజ్ఞ దీక్షయందుందుమననియు నక్కాలమున చిత్తమన్యథా యత్తము గాకుండ నుండుటకు దానెవ్వరితోను సంభాషింప వీలుండదనియును నటు పిమ్మటంజేయు పంచరాత్ర దీక్షకునెట్లున్నను భయములేమ గనుక నప్ప టివఱకు వారెవ్వరి నందరా వలదనియుంజెప్పి యొప్పించి యామిత్రబృం దమును సాగనంపెను.

పిదప మహానందు డంగడికిం బోయి యాపదిదినంబులకు సాధన సామగ్రినంతయు సంగ్రహించి తెచ్చి యింటంబెట్టుకొని వీధిమొగమోఱుం గకుండ నింటిలో నాప్రియురాలితో నిష్ఠగోష్ఠివినోదంబుల హాయిగాం బొద్దుపుచ్చుచుండెను.

పదియవదినంబున నొక యుచితస్థలంబున వేదికయు గుండమును నేర్పర్చి యాసన్నిధి నుండవలసిన వస్తువులెల్లం బొందుపఱచి తాను దీక్షి తుని వేసమునైచికొని పదిదినంబులనుండియు నతి నిష్ఠతో సవన తం త్రము నెరవేర్చునట్లు గనంబడుటకుం దగినయానవాళ్ళను వెలయించి యాప్రదేశమున సిద్ధాసనంబునం గూర్చునియుండెను. పదునొకండవ నాంటియుదయంబునకే యామిత్రబృందమందే తెంచి యాదీక్షితుని యపూర్వతేజోవైభవంబెల్లం దిలకించి తమపూన్కి తప్పక నెరవేఱ

గలదను దృఢచిత్తులై యందు సేయఁబడుచున్న కృత్యములన్నియుఁ జూచుచుండిరి. మహానందుఁడును వారికిఁ హస్తసంజ్ఞచేఁ గూర్చుండ నియమించి కొంతతడవెద్దియో నోటమంత్రము లుచ్చరించుచున్నట్లు నోటగొణుగుకొనుచు హోమకుండమునకుఁ బలుమాఱు ప్రదక్షిణంబు లొనరించుచుఁ జాలసేపువఱకు వారితో మాటలాడకుండెను.

మఱికొంతసేపటికి వారివంకఁ దిరిగి మిత్రులారా! చూచితిరా! మీ కోరికనీడేర్పనేనెంతశ్రద్ధాయుక్తుఁడనై యీ సవనదీక్షఁ బూర్తిఁజేసితినో! ఇఁకనైదుదినములుమాత్రము లఘుప్రక్రియలఁ జరిపినచో స్వర్ణదేవతా సవనము సమాప్తముఁ జెందఁగలదు. ఇఁక మీయిచ్చవచ్చినప్పు డిందు వచ్చిచూచి పోవచ్చును. ఈయైదుదినములలో మీరొక కార్యమును సాధింపవలసియున్నది. ఆపని విసగంటకముగానున్నను సదిచేసిన కాని స్వర్ణయోగము కాఁజాలదు. ఈయోగమున కుపకరించుఁ గొన్ని వనౌషధములు నాయొద్దఁగలవు. కొన్ని యుత్కృష్ట లతాపత్రంబులను సంగ్రహించి యుంచితిని. వీటిరసమును పదిదినములు మనుజకపాలంబున తన్మేదోమాంసరక్తంబులం గలిపి భూపుటంబు బెట్టవలయును. అయ్యుపకరణంబులను మీరీగడువులోపల సిద్ధపఱచియుంచవలయు ననుటయును వారు భయకంపితగాత్రులై మిత్రమా! నీమాటలు మాకు బోధపడకున్నవి. మేమేమిచేయవలయునో విస్పష్టముగాఁ జెప్పు మనుటయు నతండు మీరొకమనుజునిఁదెచ్చి యీదేవతకుఁ బ్రీతిగా నిందు బలియొసంగవలయును. తరువాతి కృత్యమంతయు నేన సవరించు కొందుననుటయు వారాలోకించుక చకితులై అయ్యో యిది యేమియోగము బలియిచ్చుటకు మనుజుఁడెక్కడ దొరకును. దొరికినను నిందుప్రాణముదీయనెవండు సాహసించును. ఈమాట మొదటనే జెప్పవైతివేమి? నీవలన మేమంతయును నిష్కారణము మోసపడితిమిగదా? ఈసంగతి తెలిసిన నిట్టితుచ్ఛయోగమునకుగడంగకుందుముకదా? ఈపనివలన బంగారము

మాట యొసంగనిచ్చి ప్రభుత్వమువలన మాప్రాణములమీఁదికే వచ్చెను. ఇది ఘోరపాపహేతువు. మహారాక్షస కృత్యము. మేమట్టి పని చేయఁజాలము. బంగారముఁ జేసి యిచ్చెదనని మమ్ము నమ్మించి మాయొద్ద రొక్కమునేల నిష్కముల సంగ్రహించితివి. మాసొమ్ము మా కిమ్ము. నీయోగము నీయొద్దనే యుంచుకొమ్మని పలుకుచున్నవారికి మహానందుఁ డిట్లనియె.

ఏమీ! మిమ్ము నేను మోసముఁ జేసితినా! ఈయోగమును సాధించుటకుఁ గొన్ని ప్రాథమికకార్యములఁ జేయవలసియుండునని నేను మొదటనే మీతోఁ జెప్పలేదా! అన్నిటికి మీరు సమ్మతించి యిన్ని బలవంతముగ నిప్పుడిట్లపవాదములు నేలఁగట్టి మాట్లాడెదరా? మీ రిచ్చిన సొమ్మంతయు నుండెను. హోమద్రవ్యములక్రింద నిదివరకే పూర్తిగా వెచ్చింపఁబడినది. హోమములకచ్చిన ముత్తైదువలకు యథేష్టముగా నాద్రవ్యమంతయు వినియోగించితిని. ఇదిగాక యిప్పుడు నేను పడినశ్రమకు మిగిలినది యత్యల్పము. నేను జెప్పినట్లు చేయుటకు సమ్మతించిన నిందుండుము లేకున్న మీ యిచ్చవచ్చినట్లు చేయుఁడు మానిసి బలి లేకున్న నీయోగము పూర్తికాఁజాలదని దిటవుగాఁ బలికెను. వారా మాటలు విని యొకరిమొగము లొకరుఁ జూచుకొనుచుఁ దమ యాప్తుఁడగు ప్రభుత్వోద్యోగి కీయుదంతం బెఱింగించి తదానతిఁ బ్రవర్తింప తలంపుఁగలిగి యతిరయంబున నందుండి వానిసన్నిధి కేగి యావృత్తాంతమంతయునుఁ దెలియఁజేసిరి. ఆ దురాశాపాతకుం డప్పలుకులు విని తల పంకించుచు నాయోగ మట్టి దుష్కరకార్యసాధనమునఁగాని సమకూరునది కాదుకనుకనే యెల్లరకును వీలులేకున్నది. లేకున్నఁ బ్రతివారును బంగారముఁ జేసికొనుచునే యుందురు, ఎన్ని కష్టనిష్ఠురములఁ బడకుండ బంగారుకొండ లభ్యమగునా! ఇంతప్రయత్నముఁ జేసి మీ రీపని మానుకొనుట బుద్ధిమంతుల లక్షణముకాదు. అక్కార్యముఁ గూడ

నెరవేర్చి కృతకృత్యులమగుటయే నా మతమని యుపన్యసించిన విని వారెల్లరును భయకంపితస్వరంబున నయ్యో! ప్రాణములర్పింప నెవఁడు సంసిద్ధపడును. దీని కెద్ది యుపాయమని యడిగిన నాయుద్యోగిట్లనియె.

హితులారా! కార్యసాధనమునకు వెనుకముందు లరయుట బుద్ధిహీనతయగును. మనసు దిట్టపఱచుకొని యాసమయంబున కెవని నో కపటముఁజేసి యందుఁ దీసికొనిపోయి బలవంతముగఁ జంపవలయు. నాయొద్దఁ జిరకాలమునుండి పనిచేయు దిక్కులేని పరిచారకుం డొకండు గలఁడు వాని నెద్దియో నెపంబునఁ దీసికొనిపోయి కావలయుపనియేమో దీర్చుకొనుఁడని యుపాయ మెఱింగించిన వా రెట్టకేలకు సమాధానపడిరి.

మఱొకనాఁడు మహానందు సన్నిధికేఁగి మిత్రమా! నీవు జెప్పిన పనిఁజేయుటకు మేమొక యుపాయ మాలోచించితిమి. మే మానాఁటి కిచ్చటి కొక్కమనుజునిఁ దీసికొనివత్తుము. కాని వాని బలవంతముగఁ జంప మాకెవ్వరికిని సాహసముఁ బుట్టకున్నది. ఆపని నీవె స్వయముగ నెరవేర్చుటకు నిన్ను మిక్కిలి ప్రార్థించుచుంటిమి. ఇందులకు నీవొడంబడ వలయునని నిర్బంధించుటయు నతం డోహో! ఇది మిక్కిలి వింతగా నున్నది. నీతలమీద నేదియో యున్నదన నీచేతితోనే తీసివేయుమనిన ట్లున్నది. అక్కార్యమువలన లభ్యమగు బంగారముఁ బుచ్చుకొను వారు మీరును నచుటఁ గలుగు కలుషం బనుభవించువాఁడను నేను నా? లాభముఁగోరువారు కష్టములు భరింపవలెనే గాని నాకు నికంత్ర మూలేదనిఁ బలుకుటయును వా రిట్లనిరి. ఓయీ! అందలి లాభము మాకు మాత్రమే జెందుననినీవాత్రపడనక్కరలేదు నీకుఁగూడఁ గొంత భాగమిచ్చుటకు సంసిద్ధులమై యుంటిమనిఁ జెప్పుటయు నతండు మిమ్మె వరునమ్మగలరు! ఇందులకుఁ గావలసిన పెట్టుబడియంతయును మాదియే యగుట మేము నలుసంత బంగారమైన యీయమని మీరు తగవుపెట్టిన నేనేమి చేయఁగలను, మీ రీయనెంచినదేదియో ముందుగ నాకు ము ట్టఁజెప్పవలయునని జెప్పి యందులకొక వేయి నిష్కములఁ గోరెను.

ఆమొత్తమునుకూడ వాని కిచ్చుటకు నా రంగీకరించి యథా
కాలమున కట్టులో యనుకొన్న రొక్కము వానికిచ్చి యాయుద్యోగి
పరిచారకునిం దను పని యున్నది రమ్మనుచు వెంటఁదీసికొని వచ్చి వీథితలు
పులు బిగించిరి. వారిచ్చిన విత్తము మూటలోనఁ బదిలపరచి మహానం
దుఁడు మహాసాహసముతోఁ జంద్రహాసమును బూని యాపరిచారకుఁ
డేమరిపాటున నున్న తరుణంబున వానిశిరస్సు నుత్తరించి వైచెను. ఆమృ
తకళేబరమునుండి గావలసిన యవయవములం దీసి కపాలమునం దద్దియో
రసముఁబోసి నిలువులోతున భూమిలోఁ బాతిపెట్టించెను. తక్కిన గాత్ర
భాగంబులను వేఱొకచోట పూడ్పించివైచెను. పదిదినంబులిట్లు భూపు
టంబున నుంచి పిమ్మటఁ బైకిఁదీసి యాకపాలములోనున్న ద్రవపదార్థం
బెల్ల నెన్నిమణుగుల బంగారము గావలెనో యన్నిమణుగుల తైలంబున
గలిపి దానితోఁ సమానాంశముండిలి ద్రవ్యంబును మర్దించవలయును. అట్లు
చేసినపిమ్మట నొకదినము సూర్యాస్తమయము దాఁటినంతనిచ్చిన నదియంతయు
ను మేలిమిబంగారముగా మారునని వానికి నమ్మకము బుట్టజెప్పి పంపి
వేసెను.

## మహానందుని కథ.

ఆరాత్రి యింక నీయూర నుండిన మాట చక్కఁగాదని ప్రియురాలితోఁ
జెప్పి మోసమువలనఁ దాను సంపాదించిన ధనమంతయు మూటగట్టి
యొలుకులెఱుఁగకుండ వారిరువురును బలాయితులైరి. పాపమెప్పుడును దాఁగి
యుండదుగదా? ఆఘాతుకమెట్టులో రచ్చకెక్కినది. రాజభటులనుమా
నంబున నామిత్రబృందమును బట్టికొని బందిగంబున నెట్టిరి. క్రమక్రమం
బున గుట్టెల్లబట్టబయలైనది. ప్రభుత్వోద్యోగినిఁగూడ బంధించిరి.
బంగారముగలుగుటకు బదులు మిత్రబృందమునకు భంగపాటుగలిగినది.
చావుతప్పి కన్నులొట్టవోయెనను సామెత విధమున వారి కారాభియోగ
మునుండి యీవలపడుట కృత్యాద్యవస్థయయ్యెను. మహానందుఁడు

తమ్ముమాయఁజేసి పారిపోయెనని లోలోనఁ గుందుచుండిరి. ఒరులకీ సంగతి జెప్పుకొన్న నగుబాటులగునని దొంగను శేలుకట్టినట్లు నిశ్శబ్దమున నుండిరి.

—◆ 350 వ మజిలీ ◆—

మహానందుఁ డట్లర్ధరాత్రింబున ప్రియంవదాసమేతముగా బెక్కు దూరము నడచిపోవుచుండ మార్గమధ్యమందు గొందరు పాటచ్చరు లెదురునడి వారియొద్దగల ధనమెల్లఁ గొల్లగొట్టికొని పోయిరి.

గీ॥ అట్లువిత్తమెల్ల నపహరింపగ వా
రప్పు డేమిసేయునదియు లేక
జీవితావశేషులై విచారంబులఁ
డెల్లనార నొక్కపల్లెఁ జేరి.

మఱియు వారందుండి గ్రామంబున పూర్వపుణ్యావిశేషంబున గాశీపట్టణంబుఁ జేరుకొనియెను. అది నిగూఢనివాసంబున కుచితప్రదేశ మని యందుస్థిరనివాసమేర్పరుచుకొని మహానందుఁడు ప్రియంవదతోఁ గాపురము జేయుచుండెను.

సీ. శైవుఁడై కొన్నాళ్ళు సంచారమొనరించు
గుమ్మరు స్మార్తుఁడై కొన్నినాళ్లు
వైష్ణవుండై కొన్నివారము ల్జరియించు
గొన్నాళ్లు ద్వైతంబుఁగూర్చి తిరుగుఁ
గొన్నినాళ్లెరిగి కైకొను బౌద్ధమతము
గీర్తించుఁగొన్నినాళ్లు శాక్తేయమతము
గాపాలికంబు చక్కనిదను గొన్నాళ్లు
వాదించు గొంతచార్వాకమతము

గీ॥ తద్దదను కూలవేషముల్దాల్చి యాతఁ
డందు మిక్కిలి ధనలాభ మెనగ మెసఁగు

నదియె శ్రేష్ఠతమంబని యఖిలసభల
వాదమొనరించు సత్యనిష్ఠమతి యగుచు॥

ఇట్లు ధనసమార్జనాకాంక్షుండై యనేక వేషంబులు వేయుచు భాగీరథీతీరంబున యాత్రికులవలన.

ఉ॥ వెరసి సాటివారు వెఱ ♦ హాసము చేయుదురంచు నెంచగా
నేరక పర్వకాలముల ♦ నీచపు వుల్కసుఁడైన నిచ్చినన్
సైరిభ సౌరభేయతిల ♦ సైంధవతల్పము భూగ్రిదానము
ల్వారమతిన్ గ్రహించు ధన ♦ సంగ్రహ తత్పరుఁడై యతండిలన్.

మఱియు నతండు ప్రతిదినముగా వేగుజామున నిద్రమేల్కని గంగాతటంబున కేగి తత్పవిత్ర జలంబుల కృతస్నాతుండై తీరంబునకేతెంచి సిద్ధాసనంబున మహాతపశ్శాలివలె జపముజేసికొనుచుఁ జూపరుల కమితభక్తి జనియించునట్లు గన్పట్టుచుండును. ఒక్కొక్కప్పుడెవ్వరేని వానిగాంచి నమస్కరించి యేమైన సమర్పింపఁ దలఁచుఁ జూపినప్పుడు నిష్కామునివలె నటించుచు స్వీకరింపకుండును. ధనవంతులెవ్వరైన వచ్చి తానుతలచి కొనినదానికన్న నెక్కుడిగా నిత్తురని తోచినప్పుడు వారిబలవంతముచేత నాదానము నట్టిట్టు లంగీకరించుచుంటినని వారి నమ్మించుచుండును. వానియాకార నటనా స్వభావంబులదిలకించి పలువురుఁ వానిని నిష్కాముఁడనియు నపరోక్షజ్ఞానియనియు విశ్వేశ్వరావతారమనియును పెద్దగా నుతించుచుండిరి. కాని వానివేషము డాంబికమనియు నతండుమిక్కిలి నీచస్వభావుండనియు నెవ్వరును తెలిసికొనలేకపోయిరి.

నిత్యమును వానికిఁ బ్రదక్షిణములొనర్చువారును సాష్టాంగదండప్రణామంబులర్పించువారును, మ్రొక్కులు చెల్లించువారును నుపహారంబులఁ జేయువారును, స్తోత్రములఁ బఠించువారును, యథాశక్తిని కానుకల వానిముందుంచి పోవువారునునై వాని నాగంగాతటంబున దేవుని వలెఁ బూజసేయుచుండిరి. ఉదయము మొదలు మధ్యాహ్నము వఱకు

జాములు దాటినదనుకనట్లుండి పిమ్మట నిజనివాసంబున కేతెంచి వాఁడు తెచ్చినదెల్ల ప్రియుండవదకిచ్చి భుజించి నాయిందిందరవేణితో గేళీవిలాసముగాఁ గాలము బుచ్చుచుండును. ఇట్లు పెక్కువత్సరము లేయపాయమునులేకుండ గతించినవి. క్రమంబున వారికిరువురు పుత్రులుద్భవించిరి. వారును ధండ్రిని దుర్గుణంబుల నించుకయు దీసిపోవక వానికిదగిన తనయులనిపించుకొను చుండిరి.

ఇట్లుండ నొక్కనాఁటి ప్రాతఃకాలంబున గంగాతటంబున నాడుకరీతి నుచితాసనంబున ఘనాకర్ణణంబున కాత్మీయ మాయామాగురంబులఁ బన్ని మహానందుఁడున్న సమయంబున నొక చండాలుండు బహుధనాఢ్యుండు తీర్థయాత్రాప్రసంగమున కాశికేతెంచి భాగీరథీపవిత్రాంబువుల జలకమాడి యార్ద్రవసనంబులతోఁ దటంబుజేరి యిటునటుఁజూచి పెద్దయెలుంగున నిట్లనియె. బ్రాహ్మణోత్తములారా! “నేను చండాలజాతియందు జన్మించినవాఁడను ఉత్తమబ్రాహ్మణునకు కోరినంత బంగారముఁదానముజేయుచున్నాను. నన్ననుగ్రహించి దయచేయుఁడు” అని మాటిమాటికిఁగనంబడిన వారినెల్లనడుగుచుండనందున్న విప్రులెల్లరు మాలవానివలన దానంబు బట్టుట మహాపాపహేతువని యుపన్యసించుకొనుచుఁ దొలంగిపోయిరి. మహానందుఁడొక్కఁడు మాత్రము జలింపని మనంబున గపటసమాధినుండెను. వానిసన్నిధి కాపుల్కసుండరిగి చేతులుజోడించుకొని మహాత్మా! నాపితరుల యాత్మశాంతికి నేనిచ్చుదానంబుఁ బ్రతిగ్రహించి నన్ను ధన్యుఁజేయుడని ప్రార్థించుటయు నామాయావి యల్లన గన్నులు విచ్చిచూచి వానియుదంతంబెఱింగియు నెఱుంగనట్లడిగి వానిచే వెండియుం జెప్పించి యత్యుగ్ర జన్మాఘముండు వాని కిట్లనియె.

ఓరీ! సమలోష్టకాంచనులై శిలోంఛవృత్తిఁగాలంబు గడపుచున్న మాఁబోటియోగులు ధనమునకాశించి నీచదానంబులఁ బరిగ్రహింతురా!

వారి బాధపడలేక యిల్లువిడచి క్షేత్రములకుఁబోవుట మానివేసెను. ఇట్లుకొన్ని దినంబులావారణాశీ పురంబున గాలంబుగడపి యిఁకనందున్న నాయూరి బాడబులవలన దనకు ముప్పురాగలదనియెంచి యొకనాఁడు భార్యాపుత్రుల వెంటబెట్టుకొని యర్ధరాత్రంబున నా యూరునిడిచి పారిపోయెను.

క॥ చూచినవారెల్లను ప
న్నేచిన కోపమున స్రుక్కువేయందొడఁగం
జూచి యతండాకరాత్రికి
దాచినవిత్తంబుఁ గొంత తలిగొంచి వెసన్.

క॥ పురివెడలి చనియెడుగర్వ మ
సరణిన్నడిరేయినప్డుఁ జనుఁగొందరు త
స్కరు లెదురునడిరి యమకిం
కర సదృశాకృతుల వెలయఁగా వారలకున్.

అట్లెదురైన తస్కరులసంపరిఁగనుంగొని బ్రాహ్మణుండు ఆయ్యో! పక్కుబాధలనుగడించిన విత్తమెల్ల నీరిపాల్వడును కాబోలు! నన్నురక్షింప దిక్కెవ్వరని యోచించుచుండ నాతస్కరులు వారియొద్ద గల ధనమంతయును దోచుకొనుటయేగాకుండ గుహారముల ఝుళిపించుచు నలువురిం డెగటార్చ నుంకించు సమయంబున అతస్కరులచేత తనకు మృత్యువులిప్పనని గ్రహించి తానుజేసిన దుష్కార్యక్రియలకుపశ్చాత్తప్తుండై చిత్తంబు గాశీనన్నైనా నుసుఁదుం దు నిల్పి భక్తితాత్పర్యంబుల హా!విశ్వేశ్వర !గంగాధర!శంకర! బాలమృగాంకవర్ణ!ఫాలనేత్ర!మురహార! చండీకేశ! భూతేశ! భూతపతి మృత్యుంజయ! మహాదేవ! శంభూ ! నీలకంఠ! దేవదేవ నమస్తేనమః

చ॥ అని తలపోయుచున్నతఱి నగ్గడివాంగలుచేరి వానినిం
గనికరమింతలేక వెసగాలుని వీటికి మేటివిందుగా

ధముఖ్యా! నారదుండీకథనెల్లఁ దెల్లముగ మాకుఁజెప్పి వెండియు నిట్లని యెను. వింటిరా! వారణాసీ విశేషము ఎట్టిపాపకర్ముండైనను తత్పుర నివాస మాత్రముననే పరమపవిత్రుండై మోక్షలక్ష్మిని జేరగలుగును. అట్టికాశీప్రభావంబు వర్ణింప నిలింపగురునికైన నలవిగాదు. అనిపలుకు చున్న యాదేవముని పలుకులకలరి యాగంధర్వకుమారులు వారణాసిని మిగుల కొనియాడిరి. నేనుమాత్ర మందుల కంగీకరింపక ప్రతివాదము సేయనారంభించి మహానందునకు మోక్షమబ్బుట కాశీనివాస విశేషంబు వలన గాదనియు సంతతంబును విశ్వేశ్వరుని నారాధించినవిశేషంబునగలిగెనని వాసరముసింద్రునితో స్పష్టముగా వాదించితిని. అందులకా దేవమౌని మిగుల విసుగుజెందుచు ఓరీ! నీవందరికన్న నెక్కుడు తెలిసినవానివలె మితి మీరి నాతో వాదించుచుంటివి. మామాటల కెదురాడ సర్వసుపర్వసందోహమును భయంపడుదురుగాని నీకిసుమంతయు సంశయము లేక పోయెను. కాశియందు పెద్దకాలము నివసించియుండుట నిశ్చయంబున తత్ప్రభావంబుననే యామహానందుఁ డంతపతితుండైనను సంతతంబున విశ్వనాథుఁదలంచు భాగ్యంబబ్బెను. లేకున్న వేటకానికట్టి బుద్ధిపుట్టునా! దీనికంతయును నమ్మహాక్షేత్ర ప్రభావంబని యిప్పటికైనఁ దెలిసికొనుము. కూపస్థకూర్మంబువలె ధర్మమార్గంబుల నెఱుంగక నోటికివచ్చినట్లెల్ల వదరుచుంటివి. కాశీక్షేత్రంబును నిందించిన మహాపాతకంబున నింకమీదనీవు భూలోకంబున కచ్ఛపజన్మంబు నందగలవని కఠినముగా నన్ను శపించెను.

ఆమాటవిని నాహృదయంబు వేయిశకలములైనది. ఎక్కడలేని పశ్చాత్తాపము నన్నావేసించినది. పూజ్యుఁడగు నమ్ముని ప్రవరునితో వాగ్వాదమొనరించినతప్పు నాకు వెంటనే గోచరమైనది. ఏమిచేయుటకు నేమనుటకును మనంబున దెలియక రక్షింపవేయుని యతని యడుగుదమ్ముల వ్రాలితిని. కొంతసేపటికా మునితల్లజుఁడు శాంతించి యడుగులంబడియున్న నన్ను లేవనెత్తుచు కుమారా! తెమ్ము కాశీక్షేత్రప్రభా

వంబును నీసడించిన నీపై నాకెన్నఁడులేని యలుకఁగలిగినది. నామాట కన్యథాత్వంబు గలుగనేరదు. విధివిధానమిట్లుండ నేనేమిచేయుటకును గర్తలుకారు. నాపలుకులు తెరంగున నీకు కచ్ఛపజన్మంబు తప్పనిదై నను కొలఁదిదినములలోనే నీవున్న సరోవరంబున నీశ్వరదూతి పాదఘూతంబువలన శాపాంతమయ్యెడు. విచారింపక పొమ్మని బల్కి యామునీంద్రుఁడు యథేచ్ఛావిహారంబున నొందేనిబోయెను. హతభాగ్యుండనగునేను దోషివాని యనునయంబున నించుక ధైర్యంబవలంబించి విచారంబు మొగంబునఁదోప నట్టికేలకు మన్నిలయంబునకేగి నాభంగపాటు నాతల్లిదండ్రుల కెఱింగించితిని. వారు నాకై మిగుల విచారించిరి. శాపాంతమున కనేకసాధనము లాలోచింప సాగిరి. శివపూజాపరుండగు కర్దమ మునినిల్లని యాశ్రమ పరిసరంబునందలి కాసారంబున నున్న శ్రేయస్కరమని తలంచి యందు కచ్ఛపజన్మంబున ననుభవించుటకు శాపాంతమున ప్రియమధునిని నందు దెచ్చుటకు తగునుపాయము దామాలోచించెదమనియుఁ జెప్పి నన్నుపిలిపించి కలిపిరి. నేనును విధి నిబద్ధుండనై యానాటనే కచ్ఛపమునై యిందు వర్తించుచుంటిని. నేఁడు కర్దమకుమారు నన్వేషించు నిమిత్తము మీరిందే తెచ్చిన కతంబున నాపాపంబు రూపుమాపి యథాస్థితిం బొందితిని. ఇదియే నావృత్తాంతము. మునికుమారుండేమయ్యెనో నేనెఱుంగను. అనుజ్ఞయిచ్చెదరేని వానిని న్వేషించి తమకోపినంత సహాయము జేయగలవాఁడనని మృదుమధుర వాగ్గుంభనల నాప్రియమధుని మనంబున కానందంబు గలిగించెను.

## —♦ 351 వ మజిలీ. ప్రియమధుని కథ ♦—

ఇంతలో నాగంధర్వకుమారుని జననీజనకుల వోచ్చటునకు వచ్చి నిజస్వరూపంబున బొడగట్టియున్న నందనునిగాంచి యానందమేదుర హృదయపుండరీకులై చేరువనున్న యీశ్వరదూతి పాదపల్లవంబులకు ప్రణమిల్లుచు పుత్రికుని జేరదీసికొని యిట్లనిరి. ప్రియమధోత్తమా! మీకటా

క్షుంబువలన మాకుమారుని దారుణశాపంబు దీరినది. కృతార్థులమైతిమి. వీనింద్రోడ్కొని మాపురంబున కేగుట కనుజ్ఞయొసంగదవే? అని ప్రార్థించిన నాప్రమథుం డిట్లనియె.

ఓరా! యెంత మోసము! కర్దమపుత్రుని నపహరించిన దుష్టజంతువు నెఱింగించెదనని మీతనయుండు నాతో ప్రతినపట్టియున్నాడు. వాని యునికిఁ దెలియజేయువఱకు వీని నొక్కనిముసమైన గదలనీయనని యాశివకింకరుఁడు సుబాహుని చేయిపట్టుకొనెను. సుబాహుని జనకుండు ప్రమథునకి కైమోడ్పు లొసంగుచు పుణ్యమూర్తీ! కర్దమపుత్రుని యాగడ నాతనూజుండెఱుంగడని నేఁజెప్పఁగలను. అట్టివాని నిందు నిర్బంధించిన నేమిచేయగలఁడు. వానివృత్తాంతము నాకించుక దెలియును. శాంతించిన నదియెల్లఁ దెల్లముగా మీకు వివరించుకొందును. మా కుమారుని నిర్దోషిని క్షమించి విడిచిపెట్టఁగలందులకు ప్రార్థించుచున్నానని వినయముదోప పల్కనాగంధర్వపతి కాపశుపతి దూతయాత్రంబున నావృత్తాంతంబెల్ల సవిస్తరముగా జెప్పుమనుటయు నతండతని కిట్లనియె.

ఆర్యా! నాతనయునికి గచ్ఛపజన్మం బొదవిననాటఁగోలె వాని శాపాంతమునకై వెరవాలోచించి యొకనాఁడు వారణాశికిం జని యందు విశ్వనాథునిగూర్చి పెద్దయుం బ్రొద్దు భక్తితత్పరుండనై తపంబొనరించితిని. భక్తసులభుండగు నమ్మహాదేవుండు నాకు ప్రసన్నుఁడై వరము కోరుమనిన నేనాదేవోత్తమునికి సాష్టాంగదండ ప్రణామంబులాచరించి దేవదేవా! నారదునివలన శపింపబడిన నాతనయునకు శీఘ్రము శాపాంతమగునట్లు వరంబొసంగుమని ప్రార్థించిన నాపినాకాణి నాకిట్లనియెను. గంధర్వచూడామణీ! ప్రమథుని పాదఘాతంబునంగదా! వానికి శాపాంతమగునట్లు నారదమహర్షి నిరూపించెను. దానికినేనొక్క యుపాయం బెఱింగించెద నట్లొనర్పుమని నాకు దానినిబోధించి యాదేవుండ తర్హితుండయ్యెను.

విశ్వేశ్వరా దేశంబున నేను కామరూపంబున మహానక్రంబనై యాసరోవరంబున కర్దమపుత్రు రాకకై నిరీక్షించియుంటిని. అబ్బాలకుం డెట్టకేలకు కాసారమునకేతెంచి మిత్రులతో జలవిహారంబొనరించు నప్పుడు తటాలున వాని పాదంబు గబళించి క్రిందుగ జలాధిదేవత సన్నిధికిం దోడ్కొనిపోయి యప్పగించి వచ్చితిని. అఖండ తపోదీక్షయం దుండి తనయుని పాటుజింతించినను దెలిసికొనసేరని కర్దముని మహాను భావత్వంబున కలిగి యమ్మహాదేవుండు వానితనూజుని సంరక్షింప మి మ్మని[illegible]ను. దానంబున నా శాపము బాపుకొనఁగలిగితిని. నాయ భీప్సితంబీడేరెను. కర్దమతనూజునిట్టి జలాధిదేవత సన్నిధిఁజేర్చి వచ్చు నఱదాఁకే నేను మొసలిరూపంబు నొందుట యీశ్వరుని యాదేశముకావున పిమ్మట నాబాలకుండేమయ్యెనో నేనెఱుంగను. వానిక్షేమంబెఱింగి దోడ్కొనివచ్చుటకు దేవరయే కర్తలు. పరమేశ్వరుని యనుమతంబున నేనొనర్చినపనికి నీయయ్య క్షమించి నాకు శలవొసంగుఁడని ప్రార్థిం చిన నలకగిరీశుపకింకరుండు గంధర్వపతితో వానితనూజుం జేగుటకు సమ్మతించెను.

అంత సుబాహువు తనదేశంబునకుబోవుట కనుమతింపక ప్రాణ దాతయగు నీపనిసత్తముని ప్రాపున నెఱవేఱు పర్యంతము నేను మీవెంట రావలెను. నానిమిత్తమై కర్దమపుత్రుని నాపవలంద్రోయుటచే కావున నీపిత్రుసఖోత్తమునింగూడ దదన్వేష ణంబున శ్రమపెట్టవలయుట పాడిగాదు. మునిపుత్రుని యుదంతం బెఱిం గించి చేయఁదగిన సహాయము నీకును నేను మొదటనే యిమ్మ హానుభావునితోఁ బలికితిని. అతఁడు మాయొద్ద జెప్పుటకన్న మిన్నయగు దోషంబున్నదా! మీవలన నామునికుమారుని యుదంతంబించుకఁ దెలి యవచ్చెనుగదా! ఆజలాధిదేవతనే ప్రార్థించి యక్కుమారునిదెచ్చి వీని కప్పగింపవలెను నేను రావలసినని పలుకు తనయునకేమియుం బదు లుఁజెప్పజాలకే యాగంధర్వపతి తనలోకంబున కేగెను.

సుబాహుండును ప్రమథునిం జేరి ప్రాణదాతా! నాతండ్రి మహా గ్రాహరూపంబున మునిపుత్రుని జలాధిదేవత సన్నిధికిం జేర్చితినని జెప్పెను గదా! వానియునికి నెఱుంగుటకుం దొలుత జలదేవత నెలవునుం దెలిసికొన వలసియున్నది. ఆమె యీజలమధ్య మందెందో యుండవలెను నేనిందు మునింగి యామెజాడ నరసివచ్చెదను. మీరు తీరంబుననించుక విశ్రమించి యుండుండని చెప్ప వాని నొప్పించి యాకాసార మధ్యంబున కేగి యందు మునింగెను.

—♦ 352 వ మజిలీ. జలాధిదేవతకథ ♦—

తీరంబుననున్న ప్రమథుండు కర్తవ్యం బెఱుంగకయుని మేషదృష్టుల నక్కాసారమంతటను పరీక్షింపసాగెను. తన్మధ్యంబున వానికొకయద్భుత శతపత్రముం బొడగట్టెను. అయ్యది దివ్యతేజంబున దిశలం బ్రకాశించుచుండెను. ఆపద్మంబొకక్షణములోం బూర్తిగ వికసించి యద్భుత సౌరభ్యంబు నల్దిశల వ్యాపింపం జేయుచు నుత్తరక్షణంబున ముకుళించుకొని పోవుచుండెను. వికసించుసమయంబున తత్సౌరభ్యానీతంబులై సహస్ర సంఖ్యాకంబులగు నిందిందిరములా తామరసముం దెసం బఱుగువెట్టుచుండును. ముకుళించునపు డాక్రోశించుచుం బైకెగురుచుండును. అట్టి విచిత్రశతపత్ర సందర్శనంబున నా ప్రమథుండు నిర్వేజంబుడుచు తటాలున లేచి యాప్రాంతమునకేగి దాని నిదానించిం చూచుచు నిట్లని వితర్కించెను.

ఔరా! ఇట్టియద్భుతం బెన్నడును కనివిని యెఱుంగము. పద్మంబు పద్మబాంధవుని యుదయాస్తమయంబుల ననుసరించి వికసించుటయు ముకుళించుటయు నెఱుంగుదుముగాని యిట్లు క్షణక్షణమునకు మారుచుండుట యబ్బురముగదా! ఇంతకుముందీపద్మం బిక్కడనియుండుం దుం నేనెఱుంగను. ఇది యింద్రజాలమువలె నున్నది. దీనిం బరీక్షించెదంగాక యని యదియున్నవైపునకుబోయి పరికింప యదృశ్యమయ్యెను.

దానికతండు మఱియు వెఱఁగొందుచు వెనుకకు దిరిగి కొంతదూరమేగి గ్రిమ్మరఁజూడ నాపుష్పంబు యనాపద్రికావము దృగ్గోచరమైనది. తోడ నే దానిసమీపమునకేగి పరికింప మాయమైనది. ఇట్లాతఁడు పలుమాయ దాని యదృశ్యకరణము తెలిసి[illegible] నిష్ఫలప్రయత్నుండయ్యెను. తుదకాతఁడేమిచేయుటకును దోచక నుంచిని చందమున కలవరపడుచు నిటునటు దిరుగుచుండెను. ఇంతలో [illegible] ముందు నీటమునింగిన గంధ ర్వకుమారుఁడు తీరమున నొక్కెడ నిసుకనవచ్చి పడుటఁగాంచి మిగులనా త్రముతో వానిసన్నిధికిఁబోయి [illegible] యుపచారముతో గూర్చుండఁబెట్టి యించుక సేదదీర్చిన పిమ్మట వానిక్షేమంబడిగెను. ఆగంధర్వకుమా రుఁడు వేడి నిట్టూర్పువిడచుచు [illegible] నాప్రియమునితో నిట్ల నియెను.

ఆర్యా! నేనిట్లు నీటమునింగి మదీయజలస్తంభన నైపుణ్యం బున ధైర్యముతో కాసార గర్భంబు నలుమూలలు విమర్శించుచుండ నొకదండ నొకయద్భుత తేజంబు [illegible]టయు సందులకాత్మనే వె ఱఁగందుచు నావైపునకుఁబోయితిని. అచ్చట నీక్షింప నాకొక సోపాన మార్గము గోచరించినది. దానివెంటఁ గొంతదూరమరుగునంత ముందొక సుందరహర్మ్యంబు నేత్రపర్వమొనరించినది. అతిసాహసంబున నాప్రా సాద సమీపంబునకు బోయిచూడ నందెవ్వరును లేరు. ద్వారములన్నియు తెఱచియుండుటచేతఁ దిన్నగా సౌధోపరిభాగంబునకు నిరాటంకముగా బోవఁగలిగితిని. అచ్చటఁగూడ నాకెవ్వరునుఁ గనంబడలేదు. ఆయున్నత ప్రాసాదోపరిభాగంబునుండి నలుమూలలు క్రిందుకువిమర్శింపఁ జేరువ నున్న గృహనిష్కుటమధ్యంబున కొందఱు నీలవేణులు విహరించు చు న్నట్లు గనంబడినది. తోడనే మేడదిగి నేనాయుద్యానవనంబుఁ బ్రవేసిం చితిని. పూపొదరిండ్ల మాటునపొంచియుండి యాయండజ [illegible]నల నీక్షించితిని శతసంఖ్యాకులగు చెలిమికత్తెలు పరివేష్టించియుండ నొక

సుబాహుండును ప్రమథునిఁజేరి ప్రాణదాతా! నాతండ్రి మహా గ్రాహరూపంబున మునిపుత్రుని జలాధిదేవత సన్నిధికిఁ జేర్చితినని జెప్పెను గదా! వానియునికి నెఱుంగుటకుఁదొలుత జలదేవత నెలవునుఁ దెలిసికొన వలసియున్నది. ఆమె యీజలమధ్య మందెందో యుండవలెను నేనిందు మునింగి యామెజాడ నరసివచ్చెదను. మీరు తీరంబుననించుక విశ్రమించి యుండుఁడని చెప్ప వాని నొప్పించి యాకాసార మధ్యంబునకేగి యందు మునింగెను.

—♦ 352 వ మజిలీ. జలాధిదేవతకథ ♦—

తీరంబుననున్న ప్రమథుఁడు కర్తవ్యం బెఱుంగకయని మేషదృష్టుల నక్కాసారమంతటను పరీక్షింపసాగెను. తన్మధ్యంబున వానికొకయద్భుత శతపత్రముఁబొడఁగట్టెను. అయ్యది దివ్యతేజంబున దిశలఁ బ్రకాశించు చుండెను. ఆపద్మంబొకక్షణములోఁ బూర్తిగ వికసించి యద్భుత సౌర భ్యంబు నల్దిశల వ్యాపింపఁజేయుచు నుత్తరక్షణంబున ముకుళించుకొని పోవుచుండెను. వికసించుసమయంబున తత్సౌరభ్యానీతంబులై సహస్ర సంఖ్యాకంబులగు నిదిందిరములా తామరసముఁ దెసఁ బరుగువెట్టుచుం డును. ముకుళించునపు డాక్రోశించుచుఁబై కెగురుచుండును. అట్టి విచిత్రశతపత్ర సందర్శనంబున కా ప్రమథుండు నివ్వెఱంబడుచు తటా లున లేచి యాప్రాంతమునకేగి దాని నిదానించిఁ చూచుచు నిట్లని వితర్కించెను.

ఔరా! ఇట్టియద్భుతం బెన్నడును కనివిని యెఱుంగము. పద్మం బు పద్మబాంధవుని యుదయాస్తమయంబుల ననుసరించి వికసించుటయు ముకుళించుటయు నెఱుంగుదుముగాని యిట్లు క్షణక్షణమునకు మారు చుండుట యబ్బురముగదా! ఇంతకుముందీపద్మం బిక్కొలనియందుం డుట నేనెఱుంగను. ఇది యిందజాలమువలె నున్నది. దీనింబరీక్షించె దంగాక యని యదియున్నవైపునకుబోయి పరికింప యదృశ్యమయ్యెను.

దానికతండు మఱియు వెఱఁగొందుచు వెనుకకు దిరిగి కొంతదూరమేగి గ్రిమ్మరఁజూడ నాపుష్పంబు యథాప్రకారము దృగ్గోచరమైనది. తోడనే దానిసమీపమున కేగి పరికింప మాయమైనది. ఇట్లాతఁడు పలుమారు దాని యదృశ్యకరణము తెలిసికొనుటకై విఫలప్రయత్నుండయ్యెను. తుద కాతఁడేమిచేయుటకుం దోచక మంచుని చందమున కలవరపడుచు నిటునటు దిరుగుచుండెను. ఇంతలో నాతనిముందు నీటమునింగిన గంధర్వకుమారుఁడు తీరమున నొక్కవిసరునవచ్చి పడుటఁగాంచి మిగులనాత్రముతో వానిసన్నిధికింబోయి లేవనెత్తి యంకంబున గూర్చుండబెట్టి యిుచుక సేదదీరిన పిమ్మట వానివృత్తాంతం బడిగెను. ఆగంధర్వకుమారుఁడు వేడి నిట్టూర్పువిడచుచు వినయంబున నాప్రిమధుగతో నిట్లనియెను.

ఆర్యా! నేనట్లు నీటమునింగి మదీయజలస్తంభన నైపుణ్యాంబున ధైర్యముతో కాసార గర్భంబు నలుమూలలు [illegible]ండ నొకదండ నొకయద్భుత తేజంబు [illegible]సూపుట[illegible] అఱఁగందుచు నావైపునకుఁబోయితిని. అందొకటి మార్గముగోచరించినది. దానివెంటఁ గొంతదూర సుందరహార్మ్యంబు నేత్రపర్వ మొనరించినది. సాద సమీపంబునకు బోయిచూడ నం [illegible] తెఱచియుండుటచేఁ దిన్నగా సౌధో[illegible] బోవఁగలిగితిని. అచ్చటఁగూడ నా[illegible] ప్రాసాదోపరిభాగంబునుండి వ[illegible] నున్న గృహనిష్కుటమధ్యంబు[illegible] న్నట్లు గనంబడినది. తోడనే [illegible] చితిని. పూపొదరిండ్ల మాటు[illegible] నీక్షించితిని శతసంఖ్యాకులగు

సుందరాంగి విలాసముగా నాయుద్యాన వనవిహారం బొనరించుచున్నది. అందొక దివ్యసరోవరము గలదు. దానియందు మిగుల నక్కజము గొలుపు పద్మములనేకములు ప్రకాశించుచుండెను. ఆనారీమండలమున కధికారిణియగు ముద్దుగుమ్మ తోడివారి నుద్దేశించి చెలులారా! ముని తనయుని సంరక్షింపఁ దగుదునని వచ్చి యిక్కాసారంబు గగ్గోలుపఱచిన ప్రమథునికి గర్వభంగమగుటకు నేనుచెప్పినట్లు చేసితిరా! అని యడిగి నది. అంతనందొకసుందరి ముందునకువచ్చి "అమ్మా! నీయాజ్ఞననుసరించి యిందలిదర్మమొకటిలేసి యాకాసారంబున నునిచి వానికి నివ్వెఱపా టును గళవళమును జనింపఁజేసితిని వాడింకను గాసారతీరంబుననే దీని తెలియంగలయలేక మందునివలెఁ దిరుగుచున్నాఁడు వనవిహారసమ యంబైన దని నేనింత మగుడివచ్చితిని. ఆపద్మము నట్లే దృశ్యాదృశ్య మగునట్లచ్చటనే యుంచివచ్చితిని" అని చెప్పెను. అప్పుడు వారిరువు రకు నిట్టిసంవాదముఁ జరిగెను.

యజమానురాలు—వేయేండ్లు తపంబొనరించినను దానిమర్మంబె ఱుఁగ వానితరంబగునా?

చెలి—దూరమందున్నప్పుడు దివ్యతేజంబున బ్రకాశించుచు సన్నిధికేతెంచిన నదృశ్యమై తామరపాకువలెఁదోచు దానినెఱుంగనొరుల కెట్లు శక్యమగును? సూర్యకిరణములతో నిమిత్తములేకుండ నీయాజ్ఞాబ లంబున నాపద్మము క్షణములో వికసించుటయు దిరుగముకుళించుట యును పరమాద్భుతముగా దోచకమానదు.

ఇంకొకతె—దేవీ! ఆపద్మమర్మం బెఱుంగి యతండు దానింబట్టు కొనిన నేమిజరుగును.

యజ—అట్లెన్నడును జరుగనేరదు. ఆమర్మమెవరికిఁ దెలి యగలదు?

ఒకతె—కాకతాళీయముగ దామరపాకునలె దోచినదాని నెవ్వ
డైనఁ బట్టుకొన్నచో నేమగును?

యజ—అట్లు మఱియొకరి హార్యల్యంబున నెవ్వరికేని యావ
ద్ద్రవ్యంబు దొరకినటు సంభవించెనేని నట్టివానివలన పరిభవము సంభవింపఁ
గలదు.

ఒకతె—(భయముతో) అట్లా?

యజ—(నిసుగుతో) ఆ సంశయమంతయు చెప్పనేల? ఇంక నన నీవి
షారము జాలించుము నేఁడు గ్రామనంబున నేమో భీతిగానున్నది సత్వరము
పోవుదముగా కని దిగులుపడిన ముగంబుతో శాలమునకుఁబోవ
నమకట్టెను. ఆనంతరమునఁ జెలికత్తెయలందఱు భీతహృదయులై నడ
చుచుండిరి. నేనును గనంబడకుండ వారివెనుక నాప్రాసాద సమీపమున
కేగితిని. పిమ్మట వారందఱును శాలములోనికిఁబోయి ద్వారముల
న్నియు మూసివేసిరి. నేనును చేయునదిలేక కొంతసేపు స్వస్థతా మూఢుండనై
యాప్రాంతమందలి తరుచ్ఛాయఁ గూర్చుండియుంటిని.

ఇంతలో నొకమాలిసవ్యక్తి యాప్రాసాదసమీపంబునకు
వచ్చి నన్నుఁజూచి నివ్వెఱఁబడుచు నిలువంబడి యెవ్వరు నీవని
గద్దించిపలికెను. నేనును మిక్కిలి సాహసముదెచ్చుకొని లేచి మెల్లన
వానిసమీపంబునకేగి యిట్లంటిని. అయ్యా! నేనొక గంధర్వకుమారుం
డను కొండకకార్యసిద్ధికై కొని విధినియోగంబున నేనిందే తెంచితిని.
ముందు చేయఁదగిన కృత్యము దోపక యిందుఁ గూర్చుంటి నని సంగ్ర
హముగా నాయుదంతము కొంతమఱుగు పఱచి చెప్పుచు మఱియు
నిట్లంటిని.

నేను—ఆర్యా! ఈసౌధమెవ్వరిది? ఇందు నివసించియున్న వారె
వ్వరు? మీరెందుండి యిచ్చటకు వచ్చుచుంటిరి? మీరుండు ప్రదేశ
మెచ్చట?

నూతనవ్యక్తి—ఇయ్యది జలాధిదేవతా సౌధము. ఇందామె నూర్వుర చెలికత్తెలతో నివసించియున్నది. నేను సరిత్పతి కింకరుండను. వినూపాంథుండను వాఁడను మీముందు తావిచ్చుటికి శతయోజనంబుల దూరంబున మహార్ణవమధ్యంబున నున్నది. మాయేలిక పంపున నేనీ జలాధిదేవత సన్నిధి కొకసందర్భంబున వచ్చితిని.

నేను—ఈజలాధిదేవతకు నొడయుండెవ్వఁడు? ఈమె చరిత్రంబు విన కుతూహలంబగుచున్నది విశదముగ జెప్పెదవే?

నూతనవ్యక్తి—జలాధిదేవతకు సరిత్పతి యొడయుండని యెఱుంగవా నేమి? వారు సముద్రమధ్యంబునను నింకొక కాసారమధ్యంబునను నివాసము లేర్పరచుకొని సర్వజల ప్రపంచ పరిపాలనం బొనరించుచున్నారు. ఇచ్చగలిగినప్పు డెప్పుడైన నీయిరువురును గలసికొనుచుందురు.

నేను—అయ్యో! నాయజ్ఞానంబునకు క్షమింతువుగాక. వీరికి సంతానమేమైనం గలదా?

నూతనవ్యక్తి—ప్రియస్వరయను నాడుబిడ్డయొక్కతెమాత్రము వీరికిఁగలదు. ఆమెనేఁడు నవయౌవనంబునఁ జెన్నుమీరియున్నది. దానికి తగినవరుని సమకూర్చుటకు మాయేలిక తొందరపడుచున్నాఁడు

నేను—అట్టివాఁడెందైన లభించెనా?

నూతనవ్యక్తి—ఈమధ్య నొకమునికుమారుని రూపయౌవన విరాజితుని మాయేలికసాని యెట్లో సమకూర్చి భర్తసన్నిధికిఁ బంపినది. యాపసుచును వానికిచ్చి యుద్వాహంబు సేయుటకు తలంచుచున్నారు. ఆసందర్భంబున నే నిందునచ్చితిని. ముందెట్లుజరుగునో యెవ్వరుచెప్పగలరు. నేనిందు మసలరాదు. అనిచెప్పి యాకింకరుఁడు సౌధద్వారసన్నిధికేగి యెద్దియో కీలుత్రిప్పెను. తోడనే యాద్వారంబు తెఱచుకొన నతండు లోనికేగెను. వివృతమైయున్న యాద్వారము వెంబడి నేనును

తంజికట్టుక నీసన్నిధానమునకువచ్చి చేరఁగలిగితిని. కర్దమమునిపుత్రుండు సరిత్పతీ సదనంబున సుఖంబున నున్నట్లుఁ దెలిసినదిగదా! పిమ్మట చేయవలసిన కృత్యమునకు దేవరయే కర్తలని యూరకుండెను.

—• 353 మజిలీ. •—

అంత నాపద్మముఖుఁడు తానింతకుముందుఁ జూచుచుండిన పద్మంబును స్మరణకుఁదెచ్చుకొనుచు దానికిలెక్కించిన కతంబున నమ్మగువను నిర్జింపగలననను ధైర్యముతో గంధర్వకుమారుని వెంటఁగొని యాపుష్పంబున్నపైపునకు బిరబిర నడచిపోయెను. పద్మము యథాప్రకారమచట ప్రత్యక్షమయ్యెను. దానింజూచి యుత్సాహముతో గంధర్వకుమారా! నీవింతడనుక జెప్పిన మాయాపద్మంబల్లదిగో చూడుము దీని నెజంబెఱుంగఁజాలక నేనింత పర్యంతము తహతహం బడుచుంటిని దీనిమర్మంబు నీవలనఁగొంతఁ దెలియవచ్చినది. కావున నింక శంకలేదు. దూరమందుండుటచే మనకిప్పుడది గోచరించుచున్నదిగాని సన్నిధికేగినతోడనే మాయమగుచుండును. మనవద్దాని సన్నిధికేగి పద్మముకొఱకుగాక తామరపాకుకొఱకు ప్రయత్నింపవలయునుగదా? అని పలుకుచు వారిరువురు నాపద్మముదాపున కేగినతోడనే యది యథాప్రకార మదృశ్యమైనది.

అంత నాపద్మముఖుండు విమర్శింపఁ దామరపాకు గనంబడినది. దానిని నిలువుగొక్కమారుగనే దాకుటయును నాపుండరీక మొకయద్భుతపర్యంకముగా మారి చక్రమువలె పరిభ్రమించుచు నాయిరువురఁబైకెక్కించుకొని క్షణములో దివ్యయానమువలె యెందోఁబోయినది. ఆయాశ్చర్యదృశ్యమున కచ్చెరువందుచు నాపర్యంకంబుమీద నాసీనులై వారుండిరి. ఇంతలో నయ్యది జలాధిదేవత సౌధోపరిభాగంబున నొక గదియందుజేరి నిలచినది.

వారిరువురు విస్మయావేశహృదయులై పర్యంకంబుడిగి నలుమూలలు పరికించుచుండ నొకవేదండయాన వారున్నగదిలోనికివచ్చెను.

యాదేశంబు వసువున నొకయద్భుత పద్మయంత్రము నిర్మాణంబుఁజేయించి యానీరంబుల నునిచితిమి. అదిదూరమునుండి చూచిన వింత కాంతులవెదజల్లు పద్మంబువలె గనిపించును. అది యందున్న పర్యంతము పత్రినిమేలనోన్మీలనంబులు క్షణక్షణంబులై యుండి యక్కజము గొల్పుచుండును. సన్నిధికేతెంచినతోడనే యదృశ్యమగుచు తామర పాకువలె నీటిపై దేలి యాడును. ఆపత్రింబును చేతితో దాకిన నది యొక దివ్యపర్యంకంబై యట్టివారిని నాయంతఃగృహంబునకుఁ దోడ్కొనివచ్చి యదృశ్యమగును. ఇట్టిపద్మయంత్రంబమ్మహాదేవుని యనుమతంబున నిర్మించి యందుంచితిమి. ఆయంత్రసహాయమున నమ్మునికుమారుం డిందు విచ్చేయుటకు శివునియాజ్ఞయనిఁ పలంచితిమి. అది యట్లుజరుగక యొకగంధర్వపతి యక్కుమారుని యీశ్వరప్రేరణంబున నిందు దోడ్కొనివచ్చి నాకప్పగించిపోయెను. వాని నాక్షణమ నాభర్తసన్నిదికిఁ బంపితిని. ఈశ్వరుఁడు పద్మయంత్రమేమిటికి నిర్మింపఁజేసెనో తెలియము. కర్దమపుత్రుఁడు తన్నుమోసముఁజేసి యిందుఁజేర్చుటకుఁగినియుచు సబ్బాలికామణిని పరిగ్రహించుట కిష్టపడుటలేదవి యింతకు ముందే నాభర్త నాకువర్తమానముఁ బంపెను. ఇదియే జరిగిన వృత్తాంతము. ఇందు మాతప్పేమిగలదో మీరె నిర్ణయించ సమర్థులని యూరకున్న దానిమాటల కాపత్రిమథుఁడు నివ్వెఱఁ జెందుచు నిట్లనియె.

మానినీశిరోమణీ ! ఆపద్మయంత్రంబు నీశ్వరుఁడు మేమిందు నమ్ముటకు మీచే నిర్మింపఁజేసెను. దాని యాధారంబుననే మేమిప్పుడేతెంచి మునికుమారునిఁ దోడ్కొని పోవఁగోరుచుంటిమి. ఈశ్వరుఁడు మీతనూజాతకతఁడు తగినవరుండని నిరూపించి వాని మీకుఁజూపించుట కిందుఁబంపెఁగాని వానికనని యనుమతిబులేకుండ నీజలమధ్యంబునఁ బెండ్లిసేయుమని పంపియుండలేదు. సత్వరమ వానినిందుఁ దెప్పించి మాకప్పగించనియెడల ముప్పురాగలదని నమ్ముఁడు జాగుచేసిన నీశ్వరా

గ్రహంబునకు పాత్రులయ్యెదరు. అనిలుకు వానిమాటల కెదురాడ నోడి యాకుమారునికుమారుని తోడ్కొని సత్వరము వచ్చునట్లు సరిత్పతి సన్నిధి కిరుపురు పరిచారికల నప్పుడే యామె పంపినది.

పిమ్మటఁ గొంతసేపటికి సలిలాధ్యక్షునిం దు కర్దమముని తనూజునితో నవ్వోటి కతిరయంబునఁ జనుదెంచి జరిగినకథయెల్లఁ దెల్లముగ వారివలన నెఱింగి దయదముఁ బ్రీతిహాలాహారియైయున్న ప్రియుని వాని సన్నిధినున్న గంధర్వకుమారుని గాంచి వినయంబుఁదోప నమస్కరించి యిట్లనియె. దేవ ప్రమాణానా! ఇందు మాతప్పేమియులేదు. ఇందు మాలీయాగనుచ్చెనని యతని నిందించితిమి. గాని మచ్చాంతద్దియుఁ గాదు. ఈశ్వరాదేశంబున నేకతాడ నెప్వరోపుదురు! వీని నిదే గై కొని పితృసన్నిధికిఁ జేర్చుఁడు సేమచేసియనక్షతపడ క్షమింపుఁడు. యీకుమారుండు నాతనూజ నొల్లకున్న వాఁడు వీనినే గాని యింకొక పురుషుని వివాహమాడుటకు మాతనయ యిష్టపడకున్నది. ఎట్లుపరిణమించునో యీశ్వరునకే తెలియవలయునని పలుకుచు నమ్మునికుమారుని ప్రియుని కప్పగించెను. అంతనాను నానరుజాలయమునుండి యవ్వల కేగుట కుపాయంబెట్టుంగక నాయునాధునిఁ కిట్లనియె.

ఆర్యా! నీవినయమునకును యీశ్వరునియందలి భక్తి తాత్పర్యంబునకును మేమెంతేని సంతసించితిమి. ఈవిబ్రాహ్మణుని నల్లునిగాఁ బడయఁ దలంపుగల నీవుసేనినిలగినట్లు వీశ్వాలుపకునికి యనుచితముకాదా! వీని మనంబునకు సంతోషముఁ గలుగఁజేయుట నీకు తగినపనియని యనుట తోడనే యాజలాధినాయకుండు తనయవివేకంబునకు పశ్చాత్తాపముఁ జూపుచు నప్పుడే యబ్బాలకుని నూత్నాంబరాభరణ భూషితుంజేసి విలువగల కానుకలెన్నేని సమర్పించి ప్రియుని గంధర్వకుమారుని నర్హా కీతి సత్కరించి గొండొక మకరంబుఁ బిలిపించి దానిపై వారిముప్పురఁ గాసారతీరంబునకు సురక్షితంబుగాఁ జేర్పించెను.

## 354 వ మజిలీ శుచిష్మంతుని కథ.

తీరముఁ జేరినతోడనే ప్రముఘసంఘ గంధర్వకుమారుని వానిలోకంబునకుఁ బంపివేసి యామునికుమారునితో నీవిఁక నీయింటికిం బోయి మీజనకుని సందర్శింపుమని బోధించి విశ్వనాథుని యాదేశంబున నింతదనుక నుసలవలసివచ్చెనని పలుకుచు నిజనివాసంబునకుం బోయెను.

శుచిష్మంతుఁడును జరిగిన వృత్తాంతమునకెల్ల మిగుల నబ్బురంబడుచుఁ దనకు దుష్టగ్రాహంబువలనం గదా యిట్టిపాటు సంభవించెనను క్రోధంబునఁ బాశబద్ధంబగుఁ దన్మకరంబును నీడ్చుకొనిఁ దండ్రిసన్నిధికిం బోయిఁ నమస్కరించెను. ఆమహానుభావుఁడు నప్పుడే ప్రణిధానావసానంబగుటయు నేత్రోన్మీలనంబొనర్చి

సీ. గ్రాహదంష్ట్రాగ్రటంకకాంఘ్రిభాగమ్ములఁ
కందిన జఘనభాగంబుతోడ
నుదకబిందుకలాప ముట్టి యుట్టిపడంగఁ
గరిమొప్పు ముద్దుకూఁకట్లతోడ
నరుణాంచలంబులై యరవిందగర్భ స
ద్మములఁ బోలు విలోచనములతోడ
బహుళయాతాయాత పరిపాటిఁ బోలెల్ల
గలువంపునిట్టూర్పుగాడ్పుతోడ

గీ. సంభ్రమంబున నచ్చోటనుండి వెడలి
మేటిమకరంబు సందిటఁ దార్చిపట్టి
వచ్చి తనకట్టెదుర నున్న వానిఁ బుత్త్రుఁ
గాంచె దుర్దమతేజుండు కణ్వమునుఁడు.

అట్లుగాంచి వానివలన జరిగిన వృత్తాంతమంతయు నెఱింగి యీశ్వరానుగ్రహంబునకు సంతసించి యక్కుమారుని లాలించి యేదోషము నెఱుంగని యామకరంబును విడిచిపుచ్చెను.

లును మొదలగు భయంబులు పుట్టకుండఁ గాపాడుచుండును. అనిచెప్పి మణిసిద్ధుండు వానితోఁగూడ తరువాయి మజిలీచేరి యందుకాల్యకరణీయంబులఁ దీర్చుకొని కాశీవిశ్వేశ్వరుంగూర్చి చేసిన తపఃఫలప్రభావ ద్యోతకంబగు నొకనితిహాసమిట్లని చెప్పందొడంగెను.

355 వ మజిలీ.

—♦ విశ్వాసరుని కథ. ♦—

తొల్లి శాండిల్యగోత్రంబున విశ్వాసరుండను బ్రాహ్మణోత్తముండు కలఁడు. అతఁడు చిన్ననాటనుండియు విశ్వేశ్వరునియందు భక్తిగలిగి శివభక్తులలో నుత్తముండని ప్రఖ్యాతినొందెను. మఱియు నతండు గురుశుశ్రూషఁ నొనర్చుఁ కాలములయందు నగ్నినారాధించుచు వేదాధ్యయనంబు గావించుచుండెను. క్రమంబున వేదముల సాంగముగానేర్చి శాస్త్రములయందసమానమైన పాండిత్యము సంపాదించి వేదార్థావబోధముఁ జక్కగాజేసికొని బ్రహ్మచర్యాశ్రమ ధర్మంబుల నింతేనియుం దప్పక నెరవేర్చుచు నొకనాఁడొంటరిగాఁ గూర్చుని యిట్లని వితర్కించుకొనెను.

మనుజునకు చతురాశ్రమంబులలో నిహపరసాధకమగు నాశ్రమమెయ్యది? ఇఁకముందు నేనే యాశ్రమంబునం బ్రవేశింతు? బ్రహ్మచర్యంబున నధ్యయనాదులును, గార్హస్థ్యంబున నగ్న్యాధానాదులును, వానప్రస్థంబున నరణ్యావాసాదులును, సన్న్యాసాశ్రమంబున శ్రవణాదులును, ధర్మంబులై నొకదానినొకటి నిరసించుచున్నవి కదా! నాకుఁజూడ గృహస్థాశ్రమంబు నన్నియాశ్రమంబులకు నాధారభూతమై యిహపరసౌఖ్యదాయకంబై గన్పట్టుచున్నది. ఏమన పరదార పరిత్యాగంబున నాత్మదార పరితోషంబున బ్రహ్మచర్య ధర్మంబును, రాగద్వేషకామక్రోధాదుల వర్జనంబున వానప్రస్థ ధర్మంబును దేవమనుష్య పితృయజ్ఞంబుల, సత్యశౌచాహింసాది నియమంబుల వలనను యత్యాశ్రమధర్మంబును గలిగి గృహస్థునియందఖిలాశ్రమ ధర్మంబులు వర్తిం

లును మొదలగు భయంబులు పుట్టకుండఁ గాపాడుచుండును. అనిచెప్పి మణిసిద్ధుండు వానితోఁగూడ తరువాయి మజిలీచేరి యందుకాల్యకరణీయంబులఁ దీర్చుకొని కాశీవిశ్వేశ్వరుంగూర్చి చేసిన తపఃఫలప్రభావ ద్యోతకంబగు నొకనితిహాసమిట్లని చెప్పందొడంగెను.

355 వ మజిలీ.

—♦ విశ్వానరుని కథ. ♦ —

తొల్లి శాండిల్యగోత్రంబున విశ్వానరుండను బ్రాహ్మణోత్తముండు కలఁడు. అతఁడు చిన్ననాటనుండియు విశ్వేశ్వరునియందు భక్తిగలిగి శివభక్తులలో నుత్తముఁడని ప్రఖ్యాతినొందెను. మఱియు నతండు గురుశుశ్రూషఁ నొనర్చిఁ కాలములయందు నగ్నినారాధించుచు వేదాధ్యయనంబు గావించుచుండెను. క్రమంబున వేదముల సాంగముగానేర్చి శాస్త్రములయందు దసమానమైన పాండిత్యము సంపాదించి వేదార్థావబోధముఁ జక్కగాజేసికొని బ్రహ్మచర్యాశ్రమ ధర్మంబుల నింతేనియుం దప్పక నెరవేర్చుచు నొకనాఁడొంటరిగాఁ గూర్చుని యిట్లని వితర్కించుకొనెను.

మనుజునకు చతురాశ్రమంబులలో నిహపరసాధకమగు నాశ్రమ మెయ్యది? ఇఁకముందు నేనే యాశ్రమంబునం బ్రవేశింతు? బ్రహ్మచర్యంబున నధ్యయనాదులును, గార్హస్థ్యంబున నగ్న్యాధానాదులును, వానప్రస్థంబున నరణ్యావాసాదులును, సన్యాసాశ్రమంబున శ్రవణాదులును, ధర్మంబులై నొకదానికొకటి మించి యొప్పుచున్నవి కదా! నాకుఁజూడ గృహస్థాశ్రమంబు సన్నియాశ్రమంబులకు నాధారభూతమై యిహపరసౌఖ్యదాయకంబై గన్పట్టుచున్నది. ఏమన పరదార పరిత్యాగంబున నాత్మదార పరితోషంబున బ్రహ్మచర్య ధర్మంబును, రాగద్వేషకామక్రోధాదుల వర్జనంబున వానప్రస్థ ధర్మంబును దేవమనుష్య పితృయజ్ఞంబుల, సత్యశౌచాహింసాది నియమంబుల వలనను యత్యాశ్రమధర్మంబును గలిగి గృహస్థునియందఖిలాశ్రమ ధర్మంబులు వర్తిం

సనకసురీశుల నెంతయు నతిశయిల్ల
సాంగమగు వేదమంతయుఁ జదువఁ బట్టె

గృహపతి నామంబునం బొప్పు నా బాలకుండు రూపమున మనోహరుండై బాల్యముననే శాస్త్రపరిశ్రమ చేయుచు శుక్లపక్ష శర్వరీకాంతుండు పోలె దినదినాభివృద్ధిం గాంచుచు నచిరకాలముననే సమస్త విద్యలందును బ్రసిద్ధుండయ్యెను. ఇట్లుండ నొకనాఁడు యదృచ్ఛాగతుండై నారదమహర్షి వారిగృహమునకేతెంచి వారిచే సత్కృతుండై గృహపతియను బాలకు నీక్షించి చేరందీసికొని యుత్సంగమునం జేర్చుచు హస్తరేఖలం బరీక్షించి సాముద్రిక శాస్త్రంబునం జెప్పిన శుభలక్షణంబులెల్ల గలవన్నియు నీకుమారుని యందు సంపన్నంబులై యున్నవనియు తల్లిదండ్రుల కెఱింగించుచును యిన్నిసుగుణంబులుగలిగి యున్నను వీనికి దంభోళి కారణంబున గండమున్నదనిచెప్పి యెందేనిం బోయెను.

అతని నిపాతదారుణంబైన యమ్మునిమాటలు విని దంపతులు భయంపడి హాహాకారంబు సేయుచు బహుప్రకారంబుల విలపించుచుండ నాబాలుండు చేరఁ జనుదెంచి వారిశోకంబుపసంహరించి కాశీవిశ్వేశ్వరు ననుగ్రహంబున మృత్యువు నన్నేమియుఁ జేయలేదని వారికి ధైర్యంబుఁ జెప్పి మఱియు నిట్లనియె.

మ॥ వినుఁడీ నాదు ప్రతిజ్ఞ మీరు హృదయోద్వేగంబు వర్జించి యో
జనయిత్రీజనకుల్! గురుల్! భవదనుజ్ఞ [illegible] చేపట్టి యేఁ
జని కాశీపతి విశ్వనాయకు మృడుం జంద్రార్ధచూడావతంసుని
మృత్యుంజయు నాశ్రయించి విగతాసుం జేసెదన్ మృత్యువున్

అనిన విని యద్దంపతులు నామాటకు సంతసించి వల్లెయని విశ్వనాథుని కరుణాకటాక్షంబులం [illegible] నమ్మని దీవించుచు నానొక శుభముహూర్తంబునఁ [illegible] కాశీపురంబునకు [illegible] బంపిరి.

గృహపతియు కాశికిం బోయి యొక్క పుణ్యాశ్రమంబున విశ్వేశ్వరలింగ స్థాపనంబొనర్చి తత్సమీపంబున నద్దయుం బెద్దగాఁ దపం

గృహపతియు నీశ్వరానుగ్రహంబున నపమృత్యువుం జయించి మృత్యుంజయుని మెప్పించి దిక్పతిత్వంబునంది మహాసంతోషంబున మగుడ నిజనివాసంబున కేతెంచి జననీజనకుల కావృత్తాంతమంతయుం జెప్పి యానందమొందఁజేసెను. ఆతండే వైశ్వానరుఁడను పేర నాగ్నేయ దిక్కున కధిపతియై యుండె. అనిచెప్పిన నగ్గోపాలుండు సంతసించి గురువరా! కపోతపక్షులు తిర్యగ్జంతువులు కదా! గృహస్థాశ్రమమున నవి యెట్లతిథిం దృప్తిఁజేసి ముక్తినొందెనో? నాకథ చెప్పుమని ప్రార్థించిన మణిసిద్ధుండిట్లు చెప్పఁదొడంగెను.

## —♦ 357 మజిలీ కపోతపక్షుల కథ. ♦—

గోపా! వినుము పూర్వకాలంబున నొక మహారణ్యమధ్యంబున నొక్క శాల్మలీవృక్షము గలదు అత్తరువరంబు శాఖాసమూహములచే దిగంతరముల నావరించి గొప్ప స్కంధముతో నొప్పుచు పక్షుల కా శ్రయ్యతిశయించి యుండెను. మఱియు నత్తరువు సంలభముగా జనుల కారోహించుటకు శక్యముగానిదగుట ఘాతుకులవలనఁ దమ కపాయంబు రాదని తలంచి శాఖాంతరములందును కోటరోదరములందును నానాశకున తతులు గూండ్లు కట్టుకొని హాయిగా సుఖించుచున్నవి. అందురెండు కపోతపక్షులు జాతిపులుగులతోఁ జుట్టుపిల్లలతోఁ గాపురముచేయుచుండెను.

అంతనొకనాఁడొక కిరాతుండు కఠినమైన యవయవములతో నల్లని దృష్టులుగల్గి కృతాంతుని యపరావతారమో యన పక్షికులము పాలిటి మారియై వేటతమకంబున నయ్యరణ్యమున నలుదెగ్గియు, జిగురుఁగింజెలను పట్టియు, నుండ బద్దముకొట్టియు వేరువేరు ఫలమువలె పెక్కురకముల పిట్టలం బట్టి చంపియును చంపకయును చిక్కములోఁ జేర్చి తృప్తినొందకదురాశ నందందు తిరుగాడుచుండెను. అట్టి సమయమున నన్నంతవేగ వాతోద్ధూతమై జీమూతసంఘంబుఁ బొక్కపెట్టుచుఁ పుడమి యుట్టట్టుగదలఁ గర్జించుచు నాకసమంతయు నావరించి పెళుక్కురను మెఱు

నాథా! పూర్వభవంబున మనమెట్టి పాపకృత్యములఁ జేసియుంటిమో దానికతంబున మనమిట్టిపక్షిజాతి యుంటిమి. దైవనిర్ణయమునకు మనమేమిచేయఁగలము! కాఁగలది కాకమానదు.

ఉ॥ ఎవ్వనిఁ బొల్లిజన్మమున • నీకి(?)యబాధలు వెట్టి బిట్టుగా
నొవ్వఁగఁజేసి నామెకో! వి • నోదముతోఁ గనుఁగొంచునెంతయుం
గ్రొవ్వునఁ దక్షలంబిప్పుడు • గూర్చి భరింపకపోదు పాపముల్
నవ్వుచుఁ జేయుచుండుదురు • నాథ విచారమువద్దు నీకునే.

మ॥ ఎటునెంతెన్నొకొన్ని పోషకము లెంచుఁ దుఃఖమున్నాని వి
స్ఫుట పూర్వార్జితకర్మముల్ సతతమున్ వ్యక్తంబులై యుండునో
ఘటనాచాతురిఁ బ్రేరణఁగొట్టుము బలాత్కారంబుగా వాని స
ద్ఘోటకుండోదోషాక్కానివచ్చి దాపి గుడిపించు దైవ మన్నాళ్ళాగిన్.

ఇందుకై నీవు వగవంబనిలేదు మనము ధర్మపథంబున ప్రవర్తించిన నిహంబున కీర్తియు పరంబున సుఖమును గలుగును. నాథా! యీ నాప్రార్థన నంగీకరించి మనచెట్టునీడకు శీతవాతభయంబున నొకయభ్యాగతుఁడు వచ్చి పడియుండెను. వానింజూడుఁడు. వాఁడు మనకు సహజశత్రుఁడైనను యభ్యాగతుండును యార్తుండును నగుటం జేసి వానికి నీమోఁ సహాయముఁ జేసి జన్మంబు సార్థకంబుఁ జేసి కొనుము. గృహస్థధర్మములలోనెల్ల నుత్తమమైన ధర్మము యతిదభ్యాగతులఁ బూజించుటయే యని పెద్దలుఁ జెప్పుదురని విని నాకపోతంబు చెట్టుకొమ్మనుండి నొక్కగంతున నేఁకివచ్చి తన పెంటింజూచి మిగుల వాపోవదొడంగెను.

అంత నాకపోతియు ప్రియవాక్యంబుల ప్రియుని దుఃఖోపశాంతుఁజేసి యభ్యాగతుని పూజించుటకు ప్రోత్సహించెను. కపోతంబును తనప్రియురాలి విజ్ఞానంబునకు సంతసించి నాబోయవానిజేరఁజని తన జాతింజెప్పి యిట్లనియెను. ఓమహాభాగా! నిన్ను జూడ నాకు జాలివొడముచున్నది. నీవు మాయింటి కతిథివైతివి. నీయభీష్టమెసంగుటయే

నాకర్తవ్యము. నీకేమికావలయునో తెలుపుమనిన నాకిరాతుఁడు నొంచి
చుక చలితుఁడై తెలివితెచ్చుకొని తనశీతుబాధ పోగొట్టుమని కోరినంత
నాకపోత మాచెట్టుననున్న యెండుకట్టియలను పత్రంబులనేరి చెట్టు
క్రింద ప్రోగువెట్టి సమీప పల్లెకేగి మండుచున్న కాష్ఠంబొకటి నోట
గఱచుకొనివచ్చి చితుకుల ప్రోవునంటగిలించి తనరెండురెక్కలచేతను
చితిని ప్రజ్వలింపఁజేసి దాన వానిశీతుబాధఁ బోగట్టెను. అంత నాకిరా
తుఁడు శీతుబాధ బోగొట్టినట్టు నాకు తినుటకేమైననిచ్చి తనయాఁకలిం
దీర్ప ప్రార్థించుటయు నందులకా కపోతము చేయునదిలేక తల
వాల్చి వానికిట్లనియె అనఘా! మేముపక్షులము మాజీవనమెట్టి జీవ
నమో! తినుటకు మిగిల్చి కూడబెట్టుకొనుట మాయాచారముకాదు.
యెటుల నీయాఁకలిందీర్పఁగలనని యోచించు ప్రియునితోఁ గపోతి యిట్ల
నియె. నాథా! మీకీవగపేటికి నేను గలిగియుండ మీకేమిలోపము?
నన్నిజిక్కంబునుండి విడిచిపుచ్చుము నామే నీయతిథికి నాహారంబుగా
నిచ్చెదను. దాన నతండు తృప్తిఁజెందు. త్వరపడుఁడని బోధించిన నాక
పోతంబు కటకటంబడుచు వడివడింజని యయ్యగ్నికి వలగొని వానికి
నాశరీరమర్పించెదనని నుడువుచు నయ్యగ్నింబడెను. అదిచూచి నాకోయ
విభ్రాంతుఁడై కొంతవడికి నిశ్చేష్టితుఁడై యుండెను. పదంబడి తనపాప
కృత్యంబునకును పిట్టల సాహసంబునకును తలపోసి పశ్చాత్తప్తుఁడై లేచి
వలలోనున్న పులుగులనెల్ల విడిచిపుచ్చి నేదుమొదలు నిరాహారుండనై
ఘోరకృత్యములచేయుట మానగలవాడనని శపథముఁజేసి శాంతుడై
నుండుసంత బోయచేవిడువబడిన నాకపోతియు భర్తందలంచుకొనుచు
నయ్యగ్నికి ప్రదక్షిణముఁజేసి యందుపడెను. అంతనాపక్షియుగ్మంబు
దివ్యశరీరములందాల్చి విమానారూఢులై గంధర్వులు గొలువ నుత్తమ
లోకంబుల నొందెను. అనిచెప్పిన సంతోషించు శిష్యునితోఁగూడ తద
నంతరావసథము జేరెను.

## 359 వ మజిలీ.

ఈయుపవసథంబున మణిసిద్ధ యతీంద్రుఁడు కాల్యకరణీయంబులఁ దీర్చుకుని, శిష్యునిరాక నరయుచున్నంత, నగ్గోపాలుఁడు వాడుకరీతి నూరిలోనికరిగి తిరిగివచ్చి, గురువరునకు నమస్కరించుచు నిట్లనియె. స్వామీ! మీయనుగ్రహాతిశయంబున నే నెన్నియో ధర్మంబుల వింటిని మన మక్కాశీపట్టణంబునకు హటాహుటీ నడకలఁబోయిన నెప్పు టికిఁజేరగలమని కాశీసందర్శనోత్సుకుండై పలుకు శిష్యునిజూచి గోపా! నీయభీప్సితంబు వదువున వేగముగా ప్రయాణమైపోయిన ఱెండుదివసం బులలో మనమాపట్టణంబు జూచుభాగ్యము కలుగఁగలదు. నీవుపోయి భుజించిరమ్ము అనుటయు వాఁడును భుజించివచ్చిన, వారిరువురు నట గదిలి యతిజవంబున మఱుసటిదినము సంధ్యాకాలమునకు యేకోనషష్ట్య ధికత్రిశత ,తమ నివాసస్థానంబు జేరిరి. వారందారేయి గడపి మఱునాఁటి వేగుజామునలేచి కాల్యకరణీయంబుల దీర్చుకుని, గోపుఁడు కావడిమూ పునఁబూనిదోడరా నయ్యతిచంద్రుఁడు ప్రణవాక్షర జపంబుఁజేసికొనుచు కాశీనగర సందర్శన వ్యగ్రచిత్తుఁడై మనంబునగల తొందరగమనంబున గాన్పింప నాటి మధ్యాహ్నకాలమునకు సకలకైవల్య కల్యాణజన్మనిల యంబగు నావారణాసి పురంబున ప్రవేశించిరి.

## 360 వ మజిలీ.

### —♦ కాశీపురప్రవేశము ♦—

మణిసిద్ధయతీంద్రుఁడు కాశీమహిమ నంతయు నంతకుమున్న మణిప్రభావంబున నెఱిగి యుండుట, నొరులసహాయములేకయే యందలి తీర్థవిశేషంబుల నరయుచు మణికర్ణికాఘట్టము జేరనరిగిరి, గోపా! కాశీమహిమంబు వింటివా! పంచక్రోశవైశాల్యంబుగల యీక్షేత్ర ముత్తరవాహినియగు గంగాతీరంబున నున్నది. ఇందు విశ్వనాధుండు ముఖ్యదేవుఁడు బిందుమాధవస్వామి క్షేత్రపాలకుండు, భైరవుండు

## కాశీపురప్రవేశము

పురరక్షకుండు, అన్నపూర్ణ విశాలాక్షియను పేరులంబరగియున్న దేవియే ముఖ్యశక్తి, డుంఢిమొదలగు వారావరణ దేవతలు. ఇచ్చణి కర్ణిక తీర్థముఖ్యము. మఱియు ననేక కోటిలింగములును మహాశక్తులును గలిగియున్నది. ఇది ముక్తిస్థానము. అని చెప్పుచు మఱియు నిట్లనియె.
గోపా!

సీ. పసిఁడికుండలచేతఁ బ్రభఁగాంచియలరారు
　　నదియె విశ్వేశుని యాలయంబు,
ఆపచ్చిక గోపురోద్దీపితం బగునది
　　యన్నపూర్ణాదేవి యున్నతావు,
పొడవైన కంబముల్కడఁ జూడఁబడునది
　　బిందుమాధవదేవు మందిరంబు,
రమణీయమణిశేఖరములచే నొప్పారు
　　నదియె డుంఢీశుని సదనరత్న,
గీ. మల్లదియె చూడు ముందు గాన్పించునదియె
　దండపాణి వసించు సుందరగృహంబు
　కాంచనగిరి తలారి యకాలభైర
　వుని నికేతన మదియె కేతనము గలఁది.

సీ. మణికర్ణికాతీర్థ మణియియ్యదే చూఁడు
　　మధికపుణ్య ప్రదం బదియె కాశి
సత్యంబునకు హరిశ్చంద్రుండు మును వల్ల
　　కాఁడుగాచినయట్టి ఘట్టమదిగో
పరమేష్ఠి యతినిష్ఠఁ బదియశ్వమేధముల్
　　లాచరించిన ఘట్టమదె కనుము
కేదారఘట్ట మాదిగ్రాఁద నున్నదియె శ్రే
　　ష్ఠంబగు ఘట్టంబదియే పవిత్ర

గీ. మదియె హనుమంతు ఘట్ట మయ్యదియె చక్ర
పుష్కరిణిజ్ఞానవాపి యామూలనొప్పు
నది తదద్భుత మహిమ నెల్లపుడు సురలు
బొగడుదురు ముక్తిమంటపంబున వసించి.

ఇమ్మణికర్ణి కాతీర్థంబునం గావించిన స్నానదాన జపహోమ తర్పణాదు లక్షయమోక్షఫలంబు లొసంగు. సాంఖ్యయోగాదినియమంబులీ తీర్థస్నానంబునుం బోలనేరవు. ఇప్పురంబు దర్శించినంతనె తులాపురుష ప్రదాన ఫలంబు గలుగును. భగీరథానీతంబై మందాకినీనది యిమ్మణికర్ణిక మీఁదుగా నుత్తరవాహినియై యిప్పురోపకంఠంబునం బ్రవహించుచున్నది. తన్మాహాత్మ్యంబగ్గింప సురాసురులకైన శక్యంబు గాదు. వినుము.

సీ. జహ్నుకన్యాస్నాన సంకల్పమును బోల
దఖిల శాస్త్రాగ మాధ్యయనపుణ్య
మమరస్రవంతీ సమాలోకనము మనో
వాక్కాయ కృతపాప భంజనంబు
గంగామహానిమ్నగా తీర వాసంబు
గలుగ దీశ్వర కృపా కలనఁగాని
భాగీరథీ కణాప్లావ మాత్ర లభించు
బ్రహ్మ విజ్ఞాన సంభవఫలంబు,
గీ. నిరతిశయ దుష్కృత క్రియానిరత నరత
తులకు నీకలియుగంబునఁ గలుష దమన
మునకు సాధన మమరనదిని జలంబు
దక్క నేలోక్క దిక్కు వెదకినలేదు.
క. మది నిచ్చలేక ముట్టిన
వదలక దహియించునట్టి వహ్నిక్రియనీ

## కాశీపురప్రవేశము.

నది యిచ్చలేక మునిఁగిన
విదళించున్ ఘోరకలుష వితతుల నెల్లన్.

క. సరిరావు వారణాసీ
పురిమరణము నొందవచ్చు పుణ్యములో దు
ష్కరదాన తపోధ్యయనా
ధ్వర విజ్ఞానార్చనాది ధర్మములెల్లన్.

అని మఱియు ననేక ప్రకారంబులఁ గాశీగంగా ప్రభావంబు వర్ణించుచు నా రాతీర్థంబున కృతావగాహులై యంగంబులుప్పొంగ విశ్వనాథు దర్శించి యానందబాష్పంబుల నద్దేవున కభిషేకంబు విధ్యుక్తముగ గావించి సంపూర్ణమనోరథంబుతో నన్నపూర్ణాదేవి నారాధించి వటుక భైరవాదులఁ భజించి మఱియు నందుగల శివమూర్తులను దర్శించి సాయంసంధ్యాకాలంబున కొక మఠంబుజేరి యందునివసించిరి. ఇట్లనుదినంబు గంగాస్నానము, నిత్యయాత్రయు, విశ్వేశ్వరార్చనాది కృత్యంబులను నెరవేర్చుకొని దేహరక్షణార్థమై భిక్షాటనంబుచేయుచు నాత్మచింతనంబున పరమానంద సాగరంబున దేలియాడుచుండెను. అగ్గోపాలుండును భక్త్యతిరేకంబున నాయోగివర్యునకు సపర్యలొనర్చుచు ప్రసన్నమార్గంబు నందియుండెను.

గీ. గుణమునెరజూపి బాలునకును బ్రియమున
మందుత్రాగించి జడిమంబుమాన్పు కరణి
కథలనుచు జెప్పి నీతియుక్తముగ జనులఁ
గృతమతులజేయుటయె మదీప్సితవిధంబు.

చ. గిరితనయా మనోరమణ! కిన్నరసిద్ధపిశాచ సాధ్యభా
స్వరముఖదేవయోని పరివార! కనద్రజతాచలేంద్ర మం
దిర! పురుహూతముఖ్యసురదివ్యకిరీటమణి ప్రభాలస
చ్చరణ! సురాపగాలలితచారుకపర్ద! కృపాపయోనిధీ!

## కాశీమజిలీకథలు—పండ్రెండవభాగము.

క. మంగళము శైలజామిళి
తాంగనకుం దారహీరహారోపమకు
భ్రూంగుణకున్ గోరాట్సుతు
రంగునకున్ సత్కృపాంతరంగున కెలమిన్.

క. నీగురు కృప నీద్వాదశ
భాగము రచియించినాఁడ భావన మతి నో
యోగినుత! చేయు మీకృతి
నాగగనమణేందు తారమై వెలయుంగన్.

గద్య.

ఇది శ్రీమద్విశ్వనాథసదనుకంపా సంపాదిత కవితావిచిత్రాత్రేయ
ముని సుత్రామగోత్ర పవిత్ర మధిరకులకలశ జలనిధి రాకాకు
ముదమిత్ర లక్ష్మీనారాయణపౌత్ర కొండయార్యపుత్ర సోమి
దేవీగర్భశుక్తి ముక్తాఫల సుకవి జనవిధేయ సుబ్బనదీక్షిత
నామధేయ రచితంబగు కాశీయాత్రాచరిత్ర మను
మహాప్రబంధంబునందు పండ్రెండవ భాగము
సర్వము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

విశ్వనాథార్పణమస్తు.



